THE INTERNATIONAL BESTSELLER

# డబ్బు - మనస్తత్వం

The Psychology of Money

NOW IN TELUGU



ఐశ్వర్యం, ప్రలోభం, ఆనందాలకు
కాలాతీతమైన పాఠాలు

మోర్గాన్ హౌసెల్

"ప్రతి ఒక్కరూ ఒక ప్రతి సొంతం చేసుకోవాలి"
—జేమ్స్ క్లియర్
న్యూయార్క్ టైమ్స్ అత్యధిక అమ్మకాలు గల 'ఆటామిక్ హ్యాబిట్స్' రచయిత



# డబ్బు - మనస్తత్వం

ఐశ్వర్యం, ప్రలోభం, ఆనందాలకు
కాలాతీతమైన పాఠాలు

*The* Psychology *of* Money

NOW IN
TELUGU


మోర్గాన్ హౌసెల్





జైకో పబ్లిషింగ్ హౌస్

అహమ్మదాబాద్ బెంగుళూర్ భోపాల్ చెన్నై
ఢిల్లీ హైదరాబాద్ కోల్‌కత్తా లక్నో ముంబై

నాకు నేర్పించిన నా తలిదండ్రులకు

నన్ను నడిపించే గ్రేషేన్ కు

నాకు ప్రేరణ కలిగించే మైల్స్, రీస్ లకు

# విషయసూచిక

అందరూ ఏం చెయ్యాలో తెలియక బుర్ర గోక్కుంటున్న
సమయంలో మామూలు పనులు చెయ్యగలిగినవాడే మేధావి

– నెపోలియన్

ఈ ప్రపంచమంతా ప్రత్యక్షంగా కనబడే వస్తువులతో నిండి ఉన్నది.
కానీ, ఎవరూ ఎన్నడూ గమనించిన పాపాన పోరు.

– షెర్లాక్ హోమ్స్

## ప్రస్తావన

# భువిలో మహోన్నత ప్రదర్శన

కాలేజీలో చదువుకునే రోజుల్లో లాస్ఏంజిల్స్‌లో ఒక మంచి హోటల్‌లో నౌకరుగా పనిచేస్తూ గడిపాను.

సాంకేతిక నిర్వాహకులు ఒకరు తరచూ అక్కడకు వస్తూ ఉండేవారు. ఆయన మహా మేధావి. 20- 30 సంవత్సరాల మధ్య ఉన్నప్పుడే ఆయన వైఫైలో ఒక ముఖ్య పరికరం నిర్మాణం చేసి దానిని పేటెంట్ చేసుకున్నారు. ఆయన చాలా కంపెనీలు ప్రారంభించి తర్వాత వాటిని అమ్మేశారు. ఆయన సఫలత అంత ఇంత అని చెప్పటానికి వీలు కాదు.

ఆయనకు డబ్బుతో కూడా వ్యవహారం ఉండేది. ఆ వ్యవహారంలో ఆయన నిత్యము అనుక్షణం భయంతోనూ, పసిపిల్లల మూర్ఖత్వంతోనూ వ్యవహరించేవారు. ఆయన తనతోపాటు ఎప్పుడూ నూరు డాలర్ నోట్ల కట్టలు తీసుకు వెళుతూ ఉండేవారు. ఆ నోట్లకట్టలు కొన్ని అంగుళాల మందం ఉండేవి. అది చూడాలి అనుకున్నవారికి, ఆయన తన సంపదను గురించి బాహాటంగా బిగ్గరగా ఆత్మస్తుతి చేసుకునేవారు. అనుకోని వారికి కూడా ఆయన వాటిని ప్రదర్శించేవారు. ఆ సమయంలో ఆయన త్రాగి ఉండేవారు, ఏ కారణమూ లేకుండానే పేలుతూ ఉండేవారు.

ఒకనాడు ఆయన నా సహోద్యోగులు ఒకరికి కొన్ని వేల డాలర్ల సొమ్ము ఇచ్చి, “ఈ వీధిలో అవతల ఉన్న నగల దుకాణానికి వెళ్లి వెయ్యి డాలర్ల బంగారు నాణేలు తీసుకురా,” అన్నారు.

ఒక గంట తర్వాత ఆ బంగారు నాణేలు చేతిలో పట్టుకుని ఆ సంస్థ సాంకేతిక నిర్వాహకులు ఆయన స్నేహితులు పసిఫిక్ మహాసముద్రం, ఒడ్డున ఉన్న ఒక ఘట్టం చేరుకున్నారు. ఇప్పుడు వాళ్లు ఆ నాణేలు సముద్రంలోకి

కప్పగంతులు వేయిస్తూ విసిరారు. ఎవరి నాణ్యం ఎక్కువ దూరం పోయిందో అని వాళ్ళు పరాచకాలు ఆడుకున్నారు.

కొన్ని రోజుల తర్వాత ఆయన హోటల్ రెస్టారెంట్‌లో ఒక లైట్ పగులగొట్టారు. హోటల్ మేనేజర్ ఆ లైట్ విలువ ఐదువందల డాలర్లు అని దాని ఖరీదు ఆయన చెల్లించాలని చెప్పారు.

“నీకు ఐదువందల డాలర్లు కావాలా?” ఆ సాంకేతిక నిర్వాహకులు నమ్మలేనట్టుగా అడిగారు. జేబులోనుంచి ఒక కట్ట నోట్లు తీసి ఆ మేనేజర్ చేతికి ఇస్తూ,” ఇవిగో ఐదువేల డాలర్లు. ఇప్పుడు నా ఎదుట నుంచి తప్పుకో. మరి ఎన్నడూ నన్ను ఇలా అవమాన పరచకండి.” అన్నారు.

ఈ ప్రవర్తన ఎంతకాలం ఇలా సాగుతుందా అని మీరు ఆశ్చర్య పడవచ్చు. ‘ఎంతో కాలం సాగదు’ అనేది దానికి సమాధానం. ఆయన దివాలా తీశారని నేను కొంతకాలం తర్వాత విన్నాను.

ఈ పుస్తకం పూర్వపక్షం ఏమిటంటే డబ్బుతో సక్రమంగా వ్యవహరించాలి అంటే కొద్దిగా తెలివితేటలు, బహుళంగా ప్రవర్తన అవసరం. ప్రవర్తన నేర్పటం అనేది - ఎంతో తెలివి తేటలు ఉన్నవారికి కూడా - చాలా దుస్సాధ్యమైన విషయం.

ఎంత మేధావి అయినా తమ ఆవేశాల మీద నియంత్రణ లేకపోతే ఆర్థిక దుస్థితి కలగటం సహజం. దీనికి విపర్యయం కూడా వాస్తవమే. ఆర్థిక శాస్త్రంలో ప్రవేశం లేని సామాన్యులు కూడా ధనవంతులు కావచ్చు. ఇక్కడ వారి తెలివితేటలతో సంబంధం లేదు. కావలసిన ప్రవర్తనలో కొన్ని మెలకువలు. అంతే.

---

వికీపీడియాలో నా అభిమాన ప్రారంభ వాక్యాలు:” రోనాల్డ్ జేమ్స్ రీడ్ అమెరికన్ ఉదార దాతలు, పెట్టుబడిదారులు, కాపలాదారు, పెట్రోల్ బంక్ అటెండెంట్.”

రోనాల్డ్ రీడ్ వెర్మాంట్ గ్రామీణ వాతావరణంలో పుట్టారు. ఆ కుటుంబంలో మొట్టమొదటి పట్టభద్రుడు ఆయనే. ఇక్కడ విశేషం ఏమిటంటే ప్రతిరోజు స్కూలుకు

ఆయన మరొకరి సహాయంతో వెళ్లేవారు. ఆయనకు స్వంతగా రవాణా సౌకర్యం లేదు.

ఆయనను గురించి తెలిసిన వారికి రొనాల్డ్ రీడ్ గురించి చెప్పటానికి అంతకుమించి ఏమీ లేదు. ఆయన జీవితం చాలామంది లాగానే చాలా సగటు జీవితం

ఇరవై ఐదు సంవత్సరాల కాలం రీడ్ ఒక పెట్రోల్ బంక్‌లో కార్లు రిపేరు చేసేవారు. 17 సంవత్సరాల కాలం జెసి పెన్నీ సంస్థలో నేల ఊడ్చేవారు. 38 సంవత్సరాల వయసులో ఆయన 12 వేల డాలర్లకు ఒక రెండు పడక గదుల ఇల్లు కొనుక్కున్నారు. అప్పటినుంచి జీవితాంతం ఆయన అందులోనే నివసించారు. 50 సంవత్సరాల వయసులో ఆయనకు సతీ వియోగం కలిగింది. ఆ తర్వాత ఆయన మళ్లీ పెళ్లి చేసుకోలేదు. కట్టెలు కొట్టడమే ఆయన అభిమాన జ్ఞాపకం అని ఒక మిత్రుడు జ్ఞాపకాలు నెమరు వేసుకున్నారు.

92 సంవత్సరాల వయసులో రీడ్ 2014లో గతించారు. అప్పుడే విధేయుడైన ఆ గ్రామీణ కాపలాదారు అంతర్జాతీయ వార్తలలోకి ఎక్కారు.

2014లో 2,813,503 అమెరికన్లు మరణించారు. మరణించినప్పుడు వారిలో 4వేల లోపు మందికి మాత్రమే 8 మిలియన్ డాలర్ల ఆస్తి ఉన్నది. రోనాల్డ్ రీడ్ వారిలో ఒకరు.

మాజీ కాపలాదారు తన వీలునామాలో 2 మిలియన్ తన సవతి బిడ్డలకు, ఆరు మిలియన్ డాలర్లకు పైగా స్థానిక ఆస్పత్రికి గ్రంథాలయాలకు దానం చేశారు.

రీడ్‌ను గురించి తెలిసినవారు అవాక్కయ్యారు. ఆయనకు అంత డబ్బు ఎక్కడి నుంచి వచ్చింది?

అందులో రహస్యం ఏమీ లేదని తర్వాత తెలిసింది. ఆయన ఏ లాటరీలు గెలవలేదు. వారసత్వపు సొమ్ము పొందలేదు. రీడ్ తనకు సాధ్యమైనంత పొదుపు చేశారు. డబ్బును మంచి స్టాక్స్‌లో పెట్టుబడి పెట్టారు. ఆ చిన్న చిన్న మొత్తాలు ఎనిమిది మిలియన్ డాలర్లకు మించి ఎదిగిన దాకా ఆయన దశాబ్దాల తరబడి వేచి ఉన్నారు.

అదీ విషయం. కాపలాదారు నుంచి లోకోపకారికి దాక.

రొనాల్డ్ మరికొన్ని నెలలకు మరణిస్తారనగా రిచర్డ్ అనే మరొక వ్యక్తి వార్తల్లోకి ఎక్కారు.

రొనాల్డ్ రీడ్‌కు లేనివి అన్ని రిచర్డ్ ఫస్కోన్ కు ఉన్నాయి. ఆయన హార్వర్డ్‌లో MBA చదువుకున్నారు. మెరిల్ లించ్ (Merrill lynch) సంస్థలో ఎగ్జిక్యూటివ్‌గా పనిచేశారు. ఆర్థిక రంగంలో అత్యంత సఫలమైన ఉద్యోగంతో ఆయన లోకోపకారం చేయటానికి తన 40వ ఏటనే ఉద్యోగం నుంచి విరమించుకున్నారు. మెరిల్ లించ్ (Merrill lynch) సంస్థ మాజీ సీఈవో డేవిడ్ కొమాన్స్కీ, ఫస్కోన్ "వ్యాపార దక్షత, నాయకత్వ లక్షణాలు, సమగ్రమైన తీర్మాణాలు వ్యక్తిగత నిజాయితీ,' ప్రశంసించారు.[1] 'క్రైయిన్ బిజినెస్ మ్యాగజైన్' ఆయనను '40 లోపు 40' సఫలమైన వ్యాపారవేత్తగా, ఎంపిక చేసింది.[2]

కానీ - బంగారు నాణేలతో కప్పుగంతులు వేయించిన సాంకేతిక నిర్వాహకులలాగా - అంతా పచ్చి బద్దలు అయింది.

2000 సంవత్సరం మధ్యలో ఫస్కోన్ గ్రీన్విచ్ (కనెక్టి కట్)లో ఉన్న తన 18 వేల చదరపు అడుగుల ఇల్లు విశాలం చేయించటానికి భారీగా అప్పు తీసుకున్నారు. ఆ ఇంట్లో 11 బాత్రూములు, రెండు ఎలివేటర్లు, రెండు స్విమ్మింగ్ పూల్‌లు, 7 గరాజులు, ఉన్నాయి. ఆ ఇంటిని పోషించడానికి నేలకు 90 వేల డాలర్లుపైన కావాలి.

అప్పుడు 2008 ఆర్థిక సంక్షోభం ఉరిమింది.

ఆ సంక్షోభం ఆర్థికంగా ప్రతి ఒక్కరిని దెబ్బతీసింది. అది ఫస్కోన్‌ను మన్ను కరిపించింది. విపరీతమైన అప్పులు, అవసరానికి ఆదుకోని ఆస్తులు ఆయనను దివాలా తీయించాయి. 2008లో దివాలా కేసు విచారిస్తున్న జడ్జితో ఆయన, 'ప్రస్తుతం నాకు ఏ విధంగానూ రాబడి లేదు' అని చెప్పినట్టు వార్త.

మొదట పామ్ బీచ్‌లో ఉన్న ఆయన ఇల్లు అమ్మకం అయింది.

2014 లో గ్రీన్విచ్ భవనం వంతు అయింది.

రోనాల్డ్ రీడ్ తన సంపదను లోకోపకారం కోసం దానం చేయటానికి, 5

నెలల ముందర, రిచర్డ్ ఫస్కోన్ భవనం వేలం అయింది. ఆ భవనంలో ఇండోర్ స్విమ్మింగ్ పూల్ మీద డ్యాన్స్ చేస్తూ, భోజనం చేస్తూ చుట్టూ ఊరంతా చూసి ఇంత ఆనందం ఇంకెక్కడా ఉండదు అని అతిధులు ఆప్యాయంగా స్మరించే వారు. ఆ భవనం అసలు విలువ కంటే 75 శాతం తక్కువకు అమ్ముడు పోయిందని బీమా సంస్థ వారి అంచనా.[3]

రొనాల్డ్ రీడ్ సహనశీలి. రిచర్డ్ ఫస్ట్ కోన్ ఆశపోతు. వారిద్దరి మధ్య విద్యలోనూ అనుభవంలోను ఉన్న తేడాని రూపుమాపటానికి ఆ ఒక్కటి చాలు.

ఇక్కడ రొనాల్డ్ రీడ్ లాగా ఉండాలి, రిచర్డ్ లాగా ఉండకూడదు అని పాఠం – అది చెడ్డసలహా కాకపోవచ్చు – చెప్పటం కాదు.

ఆర్థిక రంగంలో ఈ కథలు ఎంత అద్వితీయము అన్నది సమ్మోహన కరమైన విషయం.

ఏ కాలేజీ విద్య లేకుండా, శిక్షణ లేకుండా, తగిన నేపథ్యం లేకుండా, అనుభవం లేకుండా, అండగా ఎవరూ లేని వ్యక్తి మహత్తరమైన చదువు, అంతకంటే మహత్తరమైన శిక్షణ, సర్వోత్తమమైన పరిచయాలు ఉన్న వ్యక్తినిమించి ఎలా, మరి ఏ ఇతర రంగంలో వ్యవహరించి రాణించగలరు?

నా మనసుకు ఏమీ తోచటం లేదు.

హార్వర్డ్‌లో శిక్షణ పొందిన శస్త్రచికిత్సకులకంటే రొనాల్డ్ రీడ్ గుండెమార్పిడి మెరుగ్గా చేస్తారని ఊహించడంకూడా అసంభవం. ఉత్తమ శిక్షణ పొందిన వాస్తుశిల్పులకంటే ఆయన మేలైన ఆకాశహర్మ్యం డిజైన్ చేస్తారనుకోవడం కూడా అటువంటిదే. ప్రపంచంలో అత్యుత్తమ న్యూక్లియర్ ఇంజనీర్స్ కంటే ఒక కాపలాదారు మెరుగుగా పనిచేస్తారు అనుకోవటం అనూహ్యం.

కానీ పెట్టుబడి వ్యాపారంలో ఈ కథలు జరుగుతాయి.

రొనాల్డ్ రీడ్, రిచర్డ్ ఫస్కోన్ సహజీవనం చేసారు అనేది యదార్థం. దానిని రెండు విధాలుగా వివరించవచ్చు. తెలివితేటలు ప్రయత్నంతో సంబంధం లేకుండా ఆర్థిక ఫలితాలు అదృష్టంకొద్దీ కలుగుతాయి అనేది ఒకటి. అది కొంతవరకు నిజమే. ఈ విషయాన్ని ఈ పుస్తకంలో మరింత వివరంగా

చర్చించుకుందాం. ఆర్థిక సఫలత కఠినమైన విజ్ఞానశాస్త్రం కాదు (ఇది సామాన్యంగా వ్యవహారంలో ఉన్న ఆలోచన అని నా ఉద్దేశ్యం) అనేది రెండవ వివరణ. ఇది ఒక మృదువైన నైపుణ్యం. ఇక్కడ మీరు ఎలా మీకు ఏమి తెలుసు అనే దానికంటే మీరు ఎలా ప్రవర్తిస్తారు అనేది ముఖ్యపాత్ర వహిస్తుంది.

ఈ మృదు నైపుణ్యాన్ని నేను డబ్బు మనస్తత్వం అంటాను. డబ్బు విషయంలో మీ సాంకేతిక విజ్ఞానం కంటే ఈ మృదు నైపుణ్యం ముఖ్యపాత్ర వహిస్తుంది అని చెప్పి మిమ్మల్ని ఒప్పించటానికి ఈ పుస్తకంలో నేను చిన్న చిన్న కథల ద్వారా ప్రయత్నించాను. అందరూ ప్రతి ఒక్కరూ - రొనాల్డ్ రీడ్ నుంచి రిచర్డ్ ఫస్కోన్ వరకూ, వారిద్దరి మధ్యన ఉన్న అందరూ కూడా - మేలైన ఆర్థిక నిర్ణయాలు చేయటానికి సహాయపడేలాగా చేస్తాను.

ఈ మృదువైన నైపుణ్యాలకు ఎవరు విలువని ఇవ్వటం లేదని గ్రహించాను.

ఆర్థిక శాస్త్రం గణిత ఆధారమైన రంగంగా బ్రహ్మాండంగా వివరించ బడుతుంది. అక్కడ మీ దగ్గర ఉన్న దత్తాంశాలు ఒక సూత్రంలో ఇముడ్చుతారు. ఆ సూత్రం ఏం చేయాలో మీకు చెప్తుంది. అంటే అలా చేయగానే అంతా సవ్యంగా ఉంటుందని అపేక్ష.

వ్యక్తిగత ఆర్థిక వ్యవహారాలలో ఈ సూత్రం పని చేస్తుంది. అక్కడ అవసరాలకు ఆరు నెలలకు సరిపడా నిధులు సేకరించి ఉంచాలని మీకు చెప్తారు. అంతేకాక మీ జీవితంలో పది శాతం పొదుపు చేయాలి అని కూడా చెబుతారు.

పెట్టుబడి వ్యాపారంలో కూడా అది సబబే. అక్కడ మనం వడ్డీ రేట్ల విలువలకు మధ్య ఉన్న చారిత్రక సంబంధాలు తెలుసుకొని వ్యవహరిస్తాం.

సొంత సంస్థాపరమైన ఆర్థిక వ్యవహారాల్లో కూడా ఇది యదార్థమే. సంస్థ ముఖ్య ఆర్థిక అధికారి మూలధనం విలువ ఎంతో కచ్చితంగా వెల కట్టగలరు.

వీటన్నిటిలో ఏదీతప్పూ కాదు చెడూ కాదు. ఏమి చేయాలో తెలిసినంత మాత్రాన, అది చేయటానికి ప్రయత్నించేటప్పుడు మీ తలలో ఏమి జరుగుతున్నదో దానిని గురించి ఏమిచెయ్యాలో మాత్రం తెలియదు.

---

మీకు ఇష్టం ఉన్నా లేకపోయినా రెండు విషయాలు మాత్రం – ఆరోగ్యము, డబ్బు – ప్రతి ఒక్కరిమీదా తమ ప్రభావం చూపుతాయి.

ఆరోగ్య సంరక్షణ పరిశ్రమ ఆధునిక విజ్ఞాన శాస్త్రం ఘన విజయమని చెప్పవచ్చు. ప్రపంచమంతటా ఆయుర్దాయం పెరుగుతూ ఉండటమే ఇందుకు నిదర్శనం. విజ్ఞానశాస్త్ర ఆవిష్కరణలు వైద్యుల పురాతన భావాలను మార్చివేసి మానవ శరీరం పని చేసే విధానాన్ని ప్రత్యక్షంగా చూపించాయి. ఆ కారణంగా ప్రస్తుతం ప్రతి ఒక్కరూ పూర్వం కంటే ఆరోగ్యంగా ఉన్నారు.

డబ్బు పరిశ్రమ – పెట్టుబడి, వ్యక్తిగత ఆర్థిక వ్యవహారం, వ్యాపార పథకాలు – ఆ కథ వేరు.

గత రెండు దశాబ్దాలలో ఆర్థికశాస్త్రం ఉత్తమ విశ్వవిద్యాలయాల నుంచి అత్యంత నిపుణులైన మేధావులను ఆకర్షించింది. ఒక దశాబ్దం పూర్వం ఫైనాన్షియల్ ఇంజనీరింగ్ అన్నిటికంటే ఆకర్షణీయమైన విభాగంగా పేరు పొందింది. దానివల్ల మనము మెరుగైన పెట్టుబడిదారులము అయినామని ఏమైనా నిదర్శనం ఉన్నదా?

నాకు ఏమీ కనిపించలేదు.

సామూహికంగా తప్పులు ఒప్పులు చేస్తూ గడిచిన కాలంలో వ్యవసాయదారులుగా, నిపుణులైన ప్లంబర్‌గా, వికాసం సాధించిన రసాయనిక శాస్త్రవేత్తలుగా మనం పురోగతి సాధించాము. అదే తప్పటడుగులతో మనము వ్యక్తిగత ఆర్థిక విధానం మెరుగుపరచటం ఎలాగో నేర్చుకుందామా? మనము అప్పుల్లో మునిగి తేలటం తగ్గుతుందా? పొదుపు చేసి ఆదా చేయడంలో అవకాశాలు మెరుగుపడతాయా? విశ్రాంత జీవితానికి సిద్ధంగా గలమా? మన ఆనందానికి డబ్బు ఏమి చేస్తుందో ఏమి చెబుతుందో మనకు నికరంగా తెలుసునా?

తగిన రుజువు నాకు ఎక్కడా కనబడటం లేదు.

నాకు తోచిన ముఖ్య కారణం ఒకటే: డబ్బును గురించి మన ఆలోచనలు బోధనలు అన్ని భౌతిక శాస్త్రం (నిబంధనలు, సూత్రాలు) లాగా ఉంటాయి మానసిక శాస్త్రం (భావావేశాలు, సూక్ష్మ భేదాలు) లాగా ఉండవు.

నా ఉద్దేశ్యంలో అది ఎంత సమ్మోహనకరమైనదంత ముఖ్యమైనది.

డబ్బు ప్రతి చోట ఉన్నది. అది మనలను ఆడిస్తుంది, భ్రమపెడుతుంది. దాని గురించి ప్రతి ఒక్కరి ఆలోచనలు వేరుగా ఉంటాయి. జీవితంలో ముఖ్య విషయాలను సాహసం, ఆత్మవిశ్వాసం, ఆనందం గురించి మనకు పాఠాలు చెబుతోంది. మనుషుల ప్రవర్తనను వివరించటానికి డబ్బును మించిన భూతద్దం వేరే దొరకదు అంటే ఆశ్చర్యం లేదు. మహోన్నత ప్రదర్శనలో అది ఒకటి.

డబ్బు మనస్తత్వం గురించి నేను ఒక దశాబ్దంగా రాస్తూ ఉన్నాను. తద్వారా ఆ విషయంలో ఉన్న అవగాహన రూపుదిద్దుకున్నది. ఆర్థిక విషయాల గురించి నేను 2008 నుంచి రాయటం మొదలు పెట్టాను. అప్పుడే ఆర్థిక సంక్షోభం మొదలైంది. గత 80 సంవత్సరాల్లో ఇది అతి ఘోరమైన ఆర్థిక మాంద్యం..

ఏమి జరుగుతుందో రాయాలంటే, ఏమి జరుగుతుందో తెలుసుకోవాలనుకున్నాను. కానీ ఆ ఆర్థిక సంక్షోభం తర్వాత నాకు తెలిసిన మొదటి విషయం ఏమిటంటే ఏం జరిగిందో ఎందుకు జరిగిందో ఎవరికీ సరిగ్గా తెలియదని. ఇక దానిని గురించి ఏమి చేయాలో ఎలా తెలుస్తుంది? ప్రతి ఒక్క వివరణకు దానికి సరితూగే ప్రతి వాదన ఉన్నది.

ఒక వంతెన కూలిపోయింది అంటే అది అందుకు కారణం ఏమిటో ఇంజనీర్లు నిర్వహించగలరు. ఎందుకంటే ఒక వస్తువు మీద కొంత ఒత్తిడి కలిగిస్తే ఆ వస్తువు విరిగిపోతుందన్న సూత్రం ఉన్నది. ఫిజిక్స్‌లో వాదప్రతివాదాలకు అవకాశం లేదు. అది కొన్ని సూత్రాలను అనుసరించి నడుస్తుంది. కానీ ఆర్థికశాస్త్రం విషయం వేరు. అది మనుషుల మనస్తత్వాలను అనుసరించి నడుస్తుంది. అక్కడ నా ప్రవర్తన నాకు సవ్యంగానే తోచవచ్చు. మీకు మాత్రం అది వెర్రితనంగా కనిపించవచ్చు.

ఆర్థిక సంక్షోభాన్ని గురించి నేను అధ్యయనం చేసి రాస్తున్న కొద్దీ అది మానసిక శాస్త్రము చరిత్ర ద్వారా అర్థం చేసుకోవచ్చునని ఆర్థిక శాస్త్రం ద్వారా మాత్రం కాదని గ్రహించాను.

మనుష్యులు ఎందుకు అప్పుల్లో మునిగిపోతారో అర్థం చేసుకోవటానికి మీరు వడ్డీ రేట్లు అధ్యయనం చేయనవసరంలేదు. మీరు ఆశపోతుతనం, భయం, ఆశావాదం చరిత్రలు చదవాలి. పెట్టుబడిదారులు విపణి వీధి బోర్లా పడి ఉన్నప్పుడు ఎందుకు అమ్ముతారు తెలుసుకోవాలంటే భవిష్యత్తులో ఆశించిన లాభాలను గురించి చదవక్కరలేదు. వారిని చూసి మీ పెట్టుబడులు వారి భవిష్యత్తుని ధ్వంసం చేయబోతున్నయ్యా అనే క్షోభను గురించి ఆలోచిస్తే చాలు.

"చరిత్ర ఎన్నటికీ పునరావృతం కాదు. మనిషి మాత్రమే పునరావృత్తం చేస్తాడు." అన్న వోల్టేర్ వాక్కు నాకు చాలా అభిమానం అయిన వాక్యం. ధనంతో మన ప్రవర్తనకు అది పూర్తిగా అమలు అవుతుంది.

డబ్బుతో వ్యవహరించేటప్పుడు మనుష్యుల దుష్ప్రవర్తనకు పొరపాట్లు మూఢనమ్మకాలు కారణాలు ఉన్నాయి వీటిలో ముఖ్యమైన 20 అంశాలను గురించి నేను 2018లో ఒక నివేదిక వ్రాశాను. దాని పేరే డబ్బు –మనస్తత్వం (The Psychology of Money). ఆ నివేదిక మిలియన్ కు పైగా మనుషులు చదివారు. ఈ పుస్తకం ఆ విషయం మీదనే మరింత గాఢమైన అధ్యయనం. ఆ నివేదికలోని కొన్ని భాగాలు ఈ మార్పులు చేర్పులు లేకుండా ఈ పుస్తకంలో కనబడతాయి.

ఇప్పుడు మీ చేతిలో 20 అధ్యాయాలు ఉన్నాయి. ప్రతి ఒక్క అధ్యాయము జనం మనస్తత్వంలో అతిముఖ్యమైన కవళికలను (కంటికి కనబడినంత సులభం కాని కవళికలు వర్ణిస్తుంది అని నా అభిప్రాయం. అధ్యాయాలు అన్నీ సామాన్య సిద్ధాంతం చుట్టూ తిరుగుతాయి. కానీ ప్రతి ఒక్కటి స్వయం సిద్ధం. దేనికి అది విడివిడిగా చదువుకోవచ్చు.

ఇదేమీ పెద్ద పుస్తకం కాదు. మీకు స్వాగతం. పాఠకులలో చాలామందికి వారు చదవటం ప్రారంభించిన పుస్తకాన్ని పూర్తి చేయకుండానే విడిచిపెడతారు. ఎందుకంటే ఒక విషయం చెప్పటానికి 300 పేజీల వివరణ అనవసరం. మీరు విసుగెత్తి విడిచిపెట్టే సుదీర్ఘ వివరణకంటే నేను 20 సంగ్రహ అంశాలు వివరిస్తాను. చదవటం మీరు పూర్తి చేస్తారని నా ఆశ.

పదండి బయలుదేరుదాం.

# 1.
# ఎవరూ వెర్రివాళ్ళు కారు

---

ధనంతో మీ అనుభవాలు ఈ ప్రపంచంలో
జరిగిన సంఘటనలలో 0.00000001%
ఉండవచ్చు. కాని ఈ ప్రపంచం
మీ ఆలోచనలలో 80 శాతానికి అనుగుణంగానే
నడుస్తుంది.

---

మీకు ఒక సమస్య గురించి చెబుతాను. డబ్బుతో మీరు ఎలా బయట వ్యవహరిస్తున్నారనే విషయంలో మీకు ఆహ్లాదకరమైన అనుభూతి కలగవచ్చు. అంతేకాక ఇతరులు వారి డబ్బుతో ఏమి చేస్తారనే విషయంలో మీ తీర్మానాలు తగ్గవచ్చు.

డబ్బుతో మనుషులు వెర్రిపనులు చేస్తారు. కానీ ఎవరికీ వెర్రి లేదు.

ఇదీ విషయం. వివిధ తరతరాల మనుషులు వేరు వేరు ఆదాయాలు, వేరు వేరు విలువలు ఉన్న వేరు వేరు తల్లిదండ్రుల పెంపకంలో పెరిగిన వారు ఉన్నారు. వాళ్ళందరూ వేరే ప్రపంచంలో విభిన్న ప్రదేశాలకు చెందినవారు, వేరు ఆర్థిక పరిస్థితులలో జన్మించినవారు, వారి ఉద్యోగానుభవాలు భిన్నంగా ఉంటాయని చెప్పనక్కరలేదు. దానితోపాటు వారికి కలిగే ప్రేరణలు, అదృష్టాలు కూడా వేరువేరుగా ఉంటాయి. ఈ నేపథ్యంలో వారు నేర్చుకునే పాఠాలు భిన్నంగా ఉంటాయని చెప్పనక్కరలేదు.

ఈ ప్రపంచంలో ప్రతి ఒక్కరి అనుభవము అద్వితీయమైనదే. ఎవరో చెబితే విన్నదానికంటే మీ ప్రత్యక్ష అనుభవం ఎక్కువ బలీయమైనది. కనుక మనమందరము – మీరు నేను, ప్రతి ఒక్కరు – డబ్బు విషయంలో ప్రత్యేకమైన అభిప్రాయాలకు కట్టుబడి ఉన్నాం. ఒకరి అభిప్రాయాలకు మరొకరి అభిప్రాయాలకు హస్తిమశకాంతరం ఉండవచ్చు. మీకు తలతిక్క గా కనిపించేది నాకు సవ్యంగానే తోస్తుంది.

పేదరికంలో పెరిగిన వ్యక్తి సాహసాన్ని గురించి, ప్రతిఫలాన్ని గురించి ఒక విధంగా ఆలోచిస్తారు. అది సంపన్నుడైన బ్యాంకు అధికారి కొడుకు ఎంత ఆలోచించినా అతనికి అంతుపట్టదు.

ద్రవ్యోల్బణంలో పెరిగిన వ్యక్తి అనుభవాలకు, స్థిరమైన ఆర్థిక వాతావరణంలో పెరిగిన వ్యక్తి అనుభవాలకు సంబంధం ఉండదు.

ఆర్థిక మాంద్యంలో సర్వస్వము కోల్పోయిన స్టాక్ బ్రోకర్ అనుభవాన్ని 1990 నాటి స్టార్ట్ మార్కెట్ సూర్యరశ్మిలో ఆనందిస్తున్న వ్యక్తి ఊహించను కూడా ఊహించలేరు.

ఊహ తెలిసిన తర్వాత 30 సంవత్సరాలలో ఆర్థిక మాంద్యం అంటే ఏమిటో ఎరగని ఆస్ట్రేలియన్ వ్యక్తి అనుభవం అమెరికన్ పౌరుడి అనుభవానికి పూర్తిగా భిన్నం.

అలా ఎన్నయినా చెప్పుకుంటూ పోవచ్చు. ఈ అనుభవాల జాబితాకు అంతం లేదు.

డబ్బును గురించి నాకు తెలియనిది మీకు తెలుసు. దీనికి విపర్యయం కూడా నిజమే. నా నమ్మకాలు, లక్ష్యాలు, ఆపేక్షలు జీవితంలో మీ నమ్మకాలు ఆపేక్షలు, లక్ష్యాలకు పూర్తిగా భిన్నం. ఇది మన ఇద్దరిలో ఒకరికంటే మరొకరం తెలివిగలవాళ్ళయినందువల్ల కాదు.ఒకరు ఎరిగిన సమాచారం ఎదుటి వారి సమాచారం కంటే మేలైనదిగా ఉండటం కాదు. కేవలం మన విభిన్న జీవితాలే ఇందుకు కారణం. మన జీవితాలు పూర్తిగా బలీయమైన విభిన్న అనుభవాలతో రూపుదిద్దుకున్నాయి – అదే కారణం.

డబ్బుతో మీ వ్యక్తిగత అనుభవాలు ఈ ప్రపంచంలో జరిగిన వాటిలో 0.00000001% ఉండవచ్చు. కానీ ఈ ప్రపంచమంతా మీ ఆలోచనలలో 80% అనుసరించుతూ నడుస్తుంది. కనుక ద్రవ్యోల్బణం ఎందుకు కలుగుతుంది, మీ డబ్బును ఎలా పెట్టుబడి పెట్టాలి, వేటిని ముఖ్యమైన విషయాలుగా పరిగణించాలి, స్టాక్ మార్కెట్‌లో మీరు ఎంత వరకు సాహసించ వచ్చు, వగైరా వగైరా అనే విషయం మీద సమానమైన తెలివితేటలుగల ఇద్దరు పూర్తిగా వ్యతిరేక భావాలతో ఉండవచ్చు.

ఫ్రెడరిక్ లూయిస్ అలెన్ 1930లో అమెరికా (1930s America) అనే పుస్తకం రచించారు.అందులో ఆయన "ది గ్రేట్ డిప్రెషన్" లక్షలాది అమెరికన్ల మీద – వారి అంతరంగాలలో – వారి జీవితాంతం మరువలేని మచ్చ వేసింది." అని వ్రాశారు. కానీ అది ఒక అనుభవం కాదు. అనుభవాల పరంపర. 25 సంవత్సరాల తర్వాత అధ్యక్ష పదవికి పోటీ చేస్తున్న జాన్ ఎఫ్ కెనడీని ఒక

పత్రికా విలేఖరి 'ది గ్రేట్ డిప్రెషన్'ను గురించి ఆయన జ్ఞాపకాలు చెప్పమన్నారు. కెన్నెడీ అన్నారు:

> డిప్రెషన్‌ను గురించి నాకు ప్రత్యక్షజ్ఞానం అంటూ ఏమీ లేదు. మా కుటుంబం ప్రపంచంలోనే సుసంపన్నమైన కుటుంబాలలో ఒకటి. ఆనాడు మా కుటుంబం విలువ ఎప్పటికన్నా అత్యధికం. మాకు పెద్ద పెద్ద ఇళ్లు ఉండేవి. చాలా మంది నౌకర్లు చాకర్లు ఉండేవారు. అందరి కంటే అధికంగా మేము ప్రయాణాలు చేసే వాళ్ళం. అప్పుడు ప్రత్యక్షంగా నాకు తెలిసిన ఒకే ఒక్క విషయం ఏమిటంటే, మా నాన్న అదనంగా కొంతమంది తోటమాలులను నియమించారు. అది కేవలం వారికి జీవనాధారం కలిగించటానికి నామమాత్రంగా ఒక ఉద్యోగం ఇవ్వటమే. అవసరం కొద్దీ కాదు. హార్వర్డ్ లో దానిని గురించి చదివేటంత వరకు నాకు ది గ్రేట్ డిప్రెషన్ గురించి ఏమీ తెలియదనే చెప్పాలి.

1960 ఎన్నికలలో అదే ముఖ్యాంశం. ఈ దేశ ఆర్థికవ్యవస్థను, కిందటి తరంలో జరిగిన మహత్తరమైన ఆర్థిక సంఘటనను గురించి ఏమీ తెలియని వ్యక్తి చేతుల్లో పెట్టటం ఎలా? ఆ సమస్యను జాన్ ఎఫ్ కెన్నెడీ తన రెండవ ప్రపంచ యుద్ధం అనుభవాలతో పలువిధాల అధిగమించారు. క్రిందటి తరానికి అదే అత్యంత భావావేశ పూరితమైన అనుభవం. ఆ అనుభవం కెన్నెడీ ప్రత్యర్థి హ్యూబర్ట్ హంఫ్రీలో లోపించింది.

ఎవరైనా సరే ఎంత విస్తృతంగా చదివినా ఎంత విశాల మనస్తత్వంతో ఉన్నా, భయం, అనిశ్చితి కలిగించే శక్తిని పునఃసృష్టి చేయలేరు.

మహా సంక్షోభం (The Great Depression) సమయంలో సర్వస్వం కోల్పోవటం అంటే ఎలా ఉంటుందో నేను చదవవచ్చు. కానీ ఆ మహా సంక్షోభం ప్రత్యక్షంగా అనుభవించిన వారికి కలిగిన భావావేశ గాయాలు నాకు ఉండవు. ఆనాటి మహాసంక్షోభంలో జీవించిన వ్యక్తి ఈ నాడు స్టాక్ మార్కెట్లలో స్టాక్స్ కొనే విషయంలో నిర్లక్ష్యం చూసి అర్థం చేసుకోలేకపోవచ్చు. ప్రపంచాన్ని చూడటంలో మన దృష్టి భిన్నంగా ఉంటుంది.

స్టాక్ మార్కెట్ ఎలా పతనమైందో విశాలమైన కాగితాలమీద చరిత్రాత్మకంగా రేఖాచిత్రంతో చూపించవచ్చు. కానీ ఇంటికి వచ్చి పిల్లల్నిచూసి వారి జీవితాలను ధ్వంసంచేసే తప్పుచేశామా అనే అనుభూతి ఆ రేఖాచిత్రంలో ఉండదు. చరిత్ర చదివితే మనకు ఏదో అర్థమైన అనుభూతి కలుగుతుంది. ఆ పరిస్థితులలో జీవించి పరిస్థితుల ప్రభావాలు వ్యక్తిగతంగా అనుభవించి అనుభూతి చెంది ఉండకపోతే మీకు అందులోని వాస్తవం అర్థంకాదు. తత్కారణంగా మీ ప్రవర్తనలో మార్పు ఏమీ రాదు.

ఈ ప్రపంచం ఎలా నడుస్తుందో మనకు తెలుసునని మనమందరము అనుకుంటాం. కానీ మనమందరమూ అందులో ఒక అణుమాత్రం అనుభవం మాత్రమే అనుభూతి చెందాము.

పెట్టుబడిదారులు మైఖేల్ బాత్నిక్ అంటారు: “కొన్ని పాఠాలు అర్థం చేసుకునే ముందర వాటిని అనుభవించి తీరాలి.” ఆ వాస్తవం మన అందరికీ వర్తిస్తుంది.

---

2006లో నేషనల్ బ్యూరో ఆఫ్ ఎకనామిక్ రీసెర్చ్‌కి చెందిన ఆర్థిక శాస్త్రవేత్తలు ఉల్రిక్ మల్మెండియర్, స్టీఫాన్ నగేల్ గత 50 సంవత్సరాల కాలంలో కొనుగోలుదారుల ఆర్థిక స్థితిని గురించి సర్వేక్షణ చేశారు. అమెరికన్లు తమ డబ్బుతో ఎలా వ్యవహరిస్తారనే విషయాన్ని గురించి వివరమైన అవలోకనం.[4]

శాస్త్ర ప్రకారం మనుష్యులు తమ లక్ష్యాలకు ఆనాటి పెట్టుబడి అవకాశాల లక్షణాలు పరిశీలించి పెట్టుబడి నిర్ణయాలు చేయాలి.

కానీ మనుషులు ఆ పని చెయ్యరు.

జీవితాంతం చేయబోయే పెట్టుబడులు పెట్టుబడిదారుల స్వీయ అనుభవాలమీద – అందులోనూ తమ యుక్తవయసు చేరిన తొలి నాళ్ళలో – భారంగా ఆధారపడి ఉన్నాయని ఆర్థిక శాస్త్రవేత్తలు కనుక్కున్నారు.

ఆర్థిక మాంద్యం విపరీతంగా ఉన్నప్పుడు మీరు పెరుగుతూ ఉంటే ఆ తరువాత కాలంలో మీరు మీ డబ్బు బాండ్స్‌లో – ఆర్థిక మాంద్యం తక్కువగా ఉన్న సమయంలో పెరిగిన వారి కంటే – తక్కువ పెట్టుబడి పెడతారు. మీరు

ఎదుగుతున్న కాలంలో స్టాక్ మార్కెట్ దృఢంగా ఉండి ఉంటే తరువాత కాలంలో మీరు స్టాక్ మార్కెట్ లో - స్టాక్ మార్కెట్ నీరసంగా ఉన్న రోజుల్లో ఎదిగిన వారి కంటే - ఎక్కువ పెట్టుబడి పెట్టే అవకాశాలు మిక్కుటం.

"పెట్టుబడి పెట్టడంలో ఒక్కొక్కరి సాహసం చేసే సమ్మతి వ్యక్తిగత చరిత్ర మీద ఆధారపడి ఉంటుందని కనుక్కున్నాము." అంటారు ఆ ఆర్థిక శాస్త్రవేత్తలు.

ఇక్కడ తెలివి తేటలు, చదువుసంధ్యలు, కుతర్కం ఎందుకు పనికిరావు. కేవలం మీరు ఎప్పుడు పుట్టారు ఎక్కడ పుట్టారు అనే పరిస్థితుల ప్రభావం, ద్వారా మీ అదృష్టం.

2019లో ఫైనాన్షియల్ టైమ్స్ పత్రిక ప్రసిద్ధిచెందిన బాండ్ మేనేజర్ బిల్ గ్రాస్ ను ఇంటర్వ్యూ చేసింది. "ఒక దశాబ్దం పూర్వం కానీ తర్వాత గాని పుట్టి ఉంటే తను ప్రస్తుతం వున్న స్థితిలో ఉండేవారు కాదు అని గ్రాస్ ఒప్పుకుంటారు" అని ఆ ఇంటర్వ్యూ సంగ్రహ సమాచారం. గ్రాస్ తన ఉద్యోగ వృత్తి చేపట్టినప్పుడు వడ్డీరేట్లు బాగా తగ్గిపోయాయి. కారణంగా బాండ్ విలువలు బాగా పెరిగి పోయాయి అటువంటి సంఘటన మీకు ఎదురయ్యే అవకాశాలను ఏమీ చెయ్యదు కానీ ఆ అవకాశాలు ఎదురైనప్పుడు మీ ఆలోచన ఎలా ఉందనేది ముఖ్యం. గ్రాస్ కు సంబంధించినంతవరకు బాండ్స్ అంటే డబ్బు తయారుచేసే యంత్రాల వంటివి. అదే ఆర్థిక మాంద్యంలో పెరిగి ఆ కష్టాలు భరించిన ఆయన తండ్రి అదే బాండ్స్‌ని డబ్బు మింగివేసే యంత్రాలుగా చూసేవారు.

డబ్బు విషయంలో మనుషుల అనుభవాలు చాలా భిన్నంగా ఉంటాయి. దాదాపు అన్నీ ఒకటేనని మీరు అనుకునే పరిస్థితుల్లో కూడా ఈ వ్యత్యాసం గాఢంగా ఉంటుంది.

ఉదాహరణకు స్టాక్స్ గమనించండి. మీరు 1970లో పుట్టి ఉంటే S & P 500 దాదాపు పదిరెట్లు పెరిగింది - మీరు ఎదిగి 20 సంవత్సరాలు చేరుకునేసరికి. అది కళ్ళు బైర్లు కమ్మించే ఎదుగుదల. మీరు 1950 లో పుట్టి ఉంటే మీరు ఎదిగి 20 సంవత్సరాలు చేరేసరికి మార్కెట్ ముందుకు వెనకకు, ఎక్కడికీ కదల్లేదు. పుట్టిన సంవత్సరం కారణంగా వేరువేరుగా ఉన్న రెండు బృందాలలో వ్యక్తులు స్టాక్ మార్కెట్ ను గురించి పూర్తిగా భిన్నాభిప్రాయాలతో జీవిస్తారు.

మీరు ఎదుగుతున్న వయసులో స్టాక్స్ ప్రవర్తన

జననం 1950 - జననం 1970

13 సంవత్సరాల వయసు 1 దగ్గర మొదలవుతుంది




వయసు

లేకపోతే ద్రవ్యోల్బణం గమనించండి. మీరు అమెరికాలో 1960ల్లో పుట్టి ఉంటే మీరు ఎదుగుతూ ఇరవై సంవత్సరాల వయసు చేరేసరికి – మీరు అప్పుడే ఎదుగుతున్నారు. ఆర్థిక వ్యవస్థ ఎలా పనిచేస్తుందో ప్రాథమిక జ్ఞానం గడిస్తున్నారు – ధరలు మూడు రెట్లు పెరిగి పోయాయి. గ్యాస్ లైన్ లు, జీతాలు అంతకుముందు కంటే చాలా తగ్గుముఖం పట్టాయి. అదే మీరు 1990 లో పుట్టి ఉంటే ద్రవ్యోల్బణం చాలా తక్కువ స్థాయిలో ఉన్నది. దానిని గురించి మీకు ఆలోచన కూడా కలిగి ఉండకపోవచ్చు.

మీరు ఎదుగుతూ మూడవ దశకంలోకి ప్రవేశిస్తున్న కాలంలో ధరలమీద ద్రవ్యోల్బణం ప్రభావం.

జననం 1960 – జననం 1990

13 సంవత్సరాల వయసు 1 దగ్గర మొదలవుతుంది




వయస్సు

2009 నవంబర్లో దేశవ్యాప్తంగా అమెరికాలో నిరుద్యోగ పరిస్థితి 10 శాతం. అదే 16 - 19 సంవత్సరాల మధ్య హైస్కూల్ డిప్లమా లేని ఆఫ్రికన్-అమెరికన్ పురుషులు 49 శాతం. కాలేజీ డిగ్రీ ఉండి, 45 సంవత్సరాలు దాటిన కాకేసియన్ స్త్రీల నిరుద్యోగ పరిస్థితి 4%.

రెండవ ప్రపంచయుద్ధ కాలంలో జర్మనీ జపాన్ దేశాల్లో స్టాక్ మార్కెట్లు తుడిచిపెట్టుకుపోయాయి. ఆ ప్రాంతాలు అన్నీ పూర్తిగా బాంబులతో ధ్వంసం అయిపోయాయి. యుద్ధం తరువాత జర్మనీ వ్యవసాయ క్షేత్రాలు దేశ ప్రజలకు రోజుకు వెయ్యి కేలరీల శక్తినిచ్చే ఆహారం మాత్రమే ఉత్పత్తి చేయగలిగాయి. ఈ పరిస్థితిని అమెరికాతో పోల్చి చూడండి. అక్కడ 1941 నుంచి 1945లో మధ్య స్టాక్ మార్కెట్ రెండింతలకుమించి పెరిగింది. ఆర్థిక వ్యవస్థ అంతకు పూర్వం రెండు దశాబ్దాలకంటే ఎంతో దృఢంగా ఉన్నది.

ఈ బృందాలలో సభ్యులు తమ జీవితాంతం ద్రవ్యోల్బణాన్ని గురించి, స్టాక్ మార్కెట్ ని గురించి, నిరుద్యోగ సమస్యను గురించి, సమగ్రంగా డబ్బును గురించి, అదే విధంగా ఆలోచిస్తూ కొనసాగేవారని ఎవరూ ఆశించ కూడదు.

ఆర్థిక సమాచారానికి వారు అదేవిధంగా స్పందించాలనికూడా ఎవరూ ఆశించకూడదు. వారు ఆనాటి ప్రేరణతోనే ప్రభావితులై ఉండాలని ఎవరూ ఆశించకూడదు వారు అదే సలహాదారులను ఇప్పుడు కూడా నమ్మాలని కూడా ఎవరూ ఆశించకూడదు.

ఏది ముఖ్యమైన విషయమో, ఏది విలువైనదో కాదో, తర్వాత ఏమి జరగబోతుందో, ముందుకి నడవటానికి ఉత్తమమైన మార్గం ఏదో, ఈ విషయాల మీద వారు ఇతరులతో అంగీకరిస్తారని ఎవరూ ఆశించకూడదు.

డబ్బు విషయంలో వారి ఆలోచనలు మరో ప్రపంచంలో రూపు దిద్దుకున్నాయి. అటువంటి పరిస్థితిలో ఒకరి దృష్టిలో డబ్బును గురించిన అభిప్రాయం విపరీతంగా అనిపించినప్పుడు అదే అభిప్రాయం, మరొకరి దృష్టిలో అత్యంత సవ్యం కావచ్చు.

ఫాక్స్కాన్ (Foxconn) అని తైవానీస్ ఎలక్ట్రానిక్ కంపెనీ ఉన్నది. కొన్ని సంవత్సరాల క్రితం న్యూయార్క్ టైమ్స్ పత్రిక ఆ సంస్థలో పని వారి పరిస్థితులను గురించి ఒక వ్యాసం రాసింది. పరిస్థితులు చాలా ఘోరంగా ఉన్నాయి. ఆ కథ

చదివిన పాఠకులు కలవరంతో తలకిందులు అయ్యారు. కానీ అందులో పనిచేసే చైనీస్ కార్మికుడి మేనల్లుడు అమోఘంగా స్పందించాడు. వ్యాఖ్యల విభాగంలో అతను వ్రాసిన లేఖ:

> అమెరికన్లు 'స్వెట్ షాప్స్' అని పిలిచే సంస్థలలో మా ఆంటీ చాలా సంవత్సరాలు పని చేసింది. అది చాలా కష్టమైన పని. సుదీర్ఘకాలం పనిచేయాలి. వేతనం చాలాతక్కువ. పరిసర పరిస్థితులు చాలా తీవ్రంగా ఉంటాయి. ఈ ఫ్యాక్టరీలో పని చేయక ముందు మా ఆంటీ ఏమి చేసేదో తెలుసా. ఆమె ఒక వేశ్య.
>
> ఆమె పూర్వాశ్రమంతో పోలిస్తే, 'స్వెట్ షాప్'లో పనిచేయటం చాలా మెరుగైన మేలైన పరిస్థితి అని నా ఉద్దేశ్యం. ఆంటీ కొద్ది పెన్నీల కోసం అనేక మంది పురుషులకు తన శరీరాన్ని అమ్ముకోవటం కంటే దుష్టుడైన పెట్టుబడి దారుడి దగ్గర డాలర్లు సంపాదించటానికి శ్రమించడం మేలని నా దృఢ అభిప్రాయం.
>
> అందుకే అమెరికన్ల ఆలోచనా విధానం చూస్తే నాకు మంట పుడుతుంది. పశ్చిమ ప్రపంచంలో ఉన్న అవకాశాలు మాకు లేవు. మా ప్రభుత్వం స్థితిగతులు వేరు. ఈ దేశం వేరు. కర్మాగారంలో పని చేయటం అంటే కండలు కరిగే పని, సందేహం లేదు. కానీ అంతకంటే మేలుగా ఉండవచ్చునా? బహుశా కేవలం అమెరికన్ ఉద్యోగాలతో మాత్రమే పోలిస్తే అది సాధ్యమేమో.

ఇది చదివిన తరువాత ఏమనాలో నాకు తెలియదు. నాలో ఒక అంశ భీకరంగా పోరాడాలి అంటుంది మరొక అంశ సరిగా అర్థం చేసుకోవడానికి ప్రయత్నించుతూ ఉంటుంది. కానీ భిన్నమైన అనుభవాలు అదే విషయం మీద విపరీతంగా భిన్నమైన అభిప్రాయాలకు దారితీస్తాయానటానికి ఇది ఒక పెద్ద ఉదాహరణ. ఇది నలుపు–తెలుపు అంత సులువుగా ఉండదు.

డబ్బు విషయంలో మనుషులు చేసే ప్రతి ఒక్క నిర్ణయము సబబుగానే తోస్తుంది. ఎందుకంటే ఆ సమయంలో అందుబాటులో ఉన్న సమాచారాన్నిబట్టి తమ ప్రపంచాన్ని గురించి తమ దృక్పథం ఆధారంగా నిర్ణయం చేస్తారు.

కానీ వారికి అందిన సమాచారం సరైన సమాచారం కాకపోవచ్చు. అసంపూర్తి సమాచారం కావచ్చు. లెక్కలు వేయటంలో వారు సమర్థులు కాకపోవచ్చు. అమ్మకందారుల వ్యూహాలు వారిని సమ్మోహనపరిచి మోసపుచ్చవచ్చు. వారు ఏమి చేస్తున్నారో వారికి తెలియక పోవచ్చు. తాము చేస్తున్న పనుల వల్ల తమకు కలగబోయే ఫలితాలు ఏమిటో వారికి అవగాహన లేక పోవచ్చు. మరి వారు సక్రమంగా వ్యవహరించేది ఎప్పుడూ?

ఒక వ్యక్తి చేసే ఆర్థికనిర్ణయాలు ప్రతి ఒకటి ఆక్షణంలో సబబుగానే కనిపిస్తాయి. ఆ సమయానికి అవసరమైన నిబంధనలన్నీ సవ్యంగానే తోస్తాయి. తాము ఏమి చేస్తున్నారో, ఆ పని ఎందుకు చేస్తున్నారో వారు తమకు తామే కథగా చెప్పుకుంటారు. ఆ కథ వారి అనుభవాల రూపకల్పన.

ఉదాహరణకు లాటరీ టికెట్లు తీసుకోండి.

అమెరికన్లు సినిమాలు, వీడియో గేమ్స్, సంగీతం, ఆటల పోటీలు, పుస్తకాలు అన్నిటి మొత్తంమీద ఖర్చు చేసే దానికంటే లాటరీ టికెట్ల మీద ఎక్కువ ఖర్చు చేస్తారు.

వాటిని కొనేది ఎవరు? వాటిని కొనేవాళ్ళు దాదాపు అందరూ పేదవాళ్లే.

అమెరికాలో అత్యంత తక్కువ ఆదాయం ఉన్న కుటుంబాలు సగటున సంవత్సరానికి 412 డాలర్లు లాటరీ టిక్కెట్లు మీద ఖర్చు చేస్తారు. లాటరీ టికెట్‌ల మీద ధనవంతులైన వారు చేసే ఖర్చుకు ఇది నాలుగు రెట్లు. అత్యవసర పరిస్థితుల్లో 400 డాలర్లు సమకూర్చగలవారు అమెరికాలో 60 శాతం మాత్రమే. అంటే లాటరీ టికెట్ ల మీద సంవత్సరానికి నాలుగు వందల డాలర్లు ఖర్చు చేసేవారే అత్యవసర పరిస్థితుల్లో నాలుగు వందల డాలర్లు సమకూర్చుకో లేరన్నమాట. నూటికి కోటికి కలిగే అవకాశాల మీద తమ భద్రతా వ్యవస్థను తగలేస్తున్నారన్నమాట.

నా మట్టుకు నాకు అది వేలంవెర్రి అనిపిస్తుంది. బహుశా మీకు కూడా అలాగే అనిపించవచ్చు. కానీ నేను అధమాధమ ఆదాయం వచ్చే వర్గంలో లేను. బహుశా మీరు కూడా ఆ తెగకు చెందినవారు కారని నా ఆశ. కనుక చెప్పుకోదగిన రాబడి లేనివారు లాటరీ టికెట్లు కొనటంలో వారి తర్కం ఏమిటో మనకు అర్థం కాదు.

కొంచెం శ్రమ పడితే ఆ ఆలోచనా విధానాన్ని ఇలా ఊహించవచ్చు.

> మనం నెలనెలా వచ్చే జీతాల మీదనే బతుకుతున్నాం. ఇందులో పొదుపు చేయటం అనేది అసాధ్యం   అసంభవం. ఇంతకంటే పెద్ద జీతాలు వచ్చే అవకాశాలు కూడా మనకు అందుబాటులో లేవు. మంచి విహారయాత్రలు, కార్లు, ఆరోగ్య బీమా, భద్రమైన పరిసరాల్లో ఇల్లు ఇవన్నీ మనకు అందుబాటులో లేవు. నడ్డి విరిగే అప్పులు చేయకుండా మన పిల్లలను కాలేజీలో చదివించలేము. ఆర్థిక శాస్త్ర గ్రంథాలు తిరగవేసే మీలాంటి పెద్దలకు అందరికీ ఇప్పుడు ఉండి ఉండాలి, లేదా వచ్చే అవకాశాలు మెండుగా ఉండాలి. మాకు రెంటిలో ఏదీ లేదు. మీ హక్కుగా మీరు భావించే మీకు ఉన్న సంపద ఏనాటికైనా మాకు కూడా కలగాలంటే మా జీవితాల్లో ఆ ఆశను, అవకాశాన్ని చూపించేది లాటరీ టికెట్ ఒక్కటే. మేము ఒక స్వప్నాన్ని కొనటానికి ప్రయత్నిస్తున్నాం. మీకు అర్థం కాదు. ఎందుకంటే మీరు ఆ కలలోనే జీవిస్తున్నారు. అందుచేతనే మీకంటే మేము ఎక్కువ లాటరీ టికెట్లు కొంటాం.

ఈ హేతువాదం మీరు ఒప్పుకోనక్కర్లేదు. కానీ చేతిలో డబ్బులు లేనప్పుడు లాటరీ టికెట్ కొనడం శోచనీయం. కానీ లోటో టికెట్ల అమ్మకం ఎందుకు కొనసాగుతూ ఉంటుందో నాకు అర్థం అవుతుందనుకుంటాను.

ఆ భావన – నువ్వు చేసే పని వెర్రితనంగా ఉన్నది. కానీ నువ్వు ఆ పని ఎందుకు చేస్తున్నావో నేను అర్థం చేసుకోగలను అనుకుంటాను – అనేక ఆర్థిక నిర్ణయాల మూలం ఆ భావనలోనే ఉన్నది.

కాగితాల మీద అంకెలుచూసి ఆర్థిక నిర్ణయాలు చేసే వాళ్ళు బహుకొద్దిమంది. ఆ నిర్ణయాలు సాధారణంగా డిన్నర్ టేబుల్ దగ్గరగాని కంపెనీ సమావేశంలోగాని జరుగుతాయి. వ్యక్తిగత చరిత్ర, ఈ ప్రపంచాన్ని గురించిన మీ అభిప్రాయము, అహంభావము, గర్వము, అమ్మకాల పన్నాగాలు, అందుకు ప్రలోభాలు అన్నీ కలిసి మీకు ఉపయోగపడే ఒక కథనంగా అక్కడ రూపు దిద్దుకుంటాయి.

---

ఈ విషయం అందరికీ కొత్త. అందుచేతనే డబ్బు విషయంలో నిర్ణయాలు కష్టతరం ఉంటాయి. అందుకే ఎంత దుష్ప్రవర్తన కూడా బయట పడుతుంది.

డబ్బు ఈ ప్రపంచంలో చాలాకాలంగా చలామణి అవుతున్నది. లిడియా (ప్రస్తుతం టర్కీ దేశంలో ఒక ప్రాంతం) రాజు అల్యాట్టే క్రీ.శ. పూర్వం 300 సంవత్సరంలో అధికారికంగా మారక ద్రవ్యాన్ని ప్రవేశపెట్టారని చరిత్ర. ధన సంబంధమైన నిర్ణయాలకు - పొదుపు, పెట్టుబడి - పునాదులు ఇంకా పసిప్రాయంలోనే ఉన్నాయి.

ఉద్యోగ విరమణ ఉదాహరణగా తీసుకోండి. 2018 సంవత్సరం చివర్లో యునైటెడ్ స్టేట్స్ ఆఫ్ అమెరికా లో 27 ట్రిలియన్, డాలర్లు రిటైర్మెంట్ అకౌంట్‌లో ఉన్నాయి. సగటు పెట్టుబడిదారుడు పెట్టుబడికి మూలం అదే.[5]

కానీ ఉద్యోగ విరమణ అనే భావం మాత్రం రెండు తరాలకు వెనక లేదు.

రెండవ ప్రపంచ యుద్ధం పూర్వం అమెరికన్లు చనిపోయేదాకా పనిచేస్తూనే ఉండేవారు. అందరూ అదే ఆశించారు. అదే యదార్థం. 1947 సంవత్సరం దాకా 65 సంవత్సరాల వయస్సు దాటినవారు కార్మిక శ్రేణిలో 50 శాతం పైగా ఉండేవారు.

కార్మిక శ్రేణిలో 65 సంవత్సరాలు దాటిన వారి భాగస్వామ్యం



సామాజిక భద్రత ఈ పరిస్థితిని మార్చటానికి ప్రయత్నించింది. కానీ మొదట్లో వారి ప్రయత్నాలు సవ్యమైన పింఛనుకు దరిదాపుల్లో ఎక్కడా లేవు. 1940లో ఇడా మే ఫుల్లర్ సామాజిక భద్రత చెక్కుకు కేవలం 22.54 డాలర్లు మాత్రమే వచ్చాయి (ద్రవ్యోల్బణం కారణంగా ఆనాడు 416 డాలర్ల విలువ అది). 1980 తర్వాత సామాజిక భద్రత సంస్థ వేతనాలు నెలకు వెయ్యి డాలర్లు దాటాయి. 65 సంవత్సరాలు దాటిన అమెరికన్లలో నాలుగోవంతుకు పైగా 1960 తర్వాతి సంవత్సరాలలో కూడా పేదరికంలో నివసించారని జనాభా లెక్కల విభాగం అంచనా.

"ప్రతి ఒక్కరికి రహస్యంగా ఒక పెన్షన్ ఉన్నది." అని ఆనాడు విస్తృతంగా వ్యాపించి ఉన్న నమ్మకం. కానీ ఇది విపరీతమైన అతిశయోక్తి. ఎంప్లాయి బెనిఫిట్ రీసెర్చ్ ఇన్స్టిట్యూట్ వారు అంటారు: "1975లో కూడా 65 సంవత్సరాలు దాటిన వారిలో నాలుగో వంతువారికి మాత్రమే పెన్షన్ ఉండేది." ఆ అల్పసంఖ్యాక వర్గంలో కూడా 15 శాతం గృహస్థులకు మాత్రమే పెన్షన్ రాబడి ఉండేది.

ఉద్యోగం విరమించాలనే కోరిక ఉన్నా ఆ పని చేయలేని అశక్తత గురించి 1955లో న్యూయార్క్‌టైమ్స్ ఒక వ్యాసం రాసింది. "పాత కాలపు నానుడి ఒకటి ఈనాటికి అనుగుణంగా మార్చి: ప్రతి ఒక్కరూ ఉద్యోగ విరమణ గురించి మాట్లాడతారు. కానీ దాన్ని కార్యరూపంలో పెట్టేవాళ్ళు మాత్రం చాలా అరుదు".[6]

ప్రతి ఒక్కరూ గౌరవప్రదమైన ఉద్యోగ విరమణకు అర్హులే, ప్రతి ఒక్కరికి లభించాలి అనే భావన 1980 దాటిన తర్వాత కాని, దృఢమైన స్థానం పొందలేదు. అప్పటినుంచి మర్యాదగా ఉద్యోగ విరమణ చేయటం అంటే అందరూ పొదుపు చేసి ఉంటారు, సొమ్మును పెట్టుబడి పెడతారు అని ఆశించ బడింది.

ఈ భావన ఎంత అధునాతనమైనదో నన్ను చెప్పనివ్వండి: 401 (k) పథకం - అమెరికా ఉద్యోగ విరమణ పొదుపుకు వెన్నెముక -1978 వరకు నామమాత్రంగా కూడా లేదు. 1998 వరకు Roth IRA పుట్టనుకూడా పుట్టలేదు. అదే ఒక మనిషి అయి ఉంటే తాగటానికి అర్హమైన వయసు చేరీచేరకుండా ఉండేది.

ఉద్యోగ విరమణతర్వాత మనకు అవసరమైన డబ్బు పొదుపు చేయడంలోనూ, దానిని పెట్టుబడి పెట్టడంలోనూ చాలామందికి తెలియదంటే

ఆశ్చర్య పడకూడదు. మనకు తలతిక్క అలాంటిది ఏమీ లేదు. మనము అప్పుడే పుట్టిన పసికూనవంటి వారం.

కాలేజీ విద్యకు కూడా ఇదే వర్తిస్తుంది. 1940 లో 25 సంవత్సరాల వయస్సు దాటిన వారిలో కాలేజీ పట్టభద్రులైన వారు 20 మందిలో ఒకరు ఉండటం పెద్ద విషయం. అదే 2015 లో నలుగురిలో ఒకరు కాలేజీ పట్టభద్రులు ఉన్నారు.[7] ఆ మధ్యలో ద్రవ్యోల్బణం కారణంగా కాలేజీ ట్యూషన్ ఫీజు నాలుగు రెట్లు మించిపోయింది.[8] సమాజానికి అంత విలువైనది, అంత ముఖ్యమైనది సమాజాన్ని ఎందుకు దెబ్బతీసింది? ఆ కారణంగానే గత 20 సంవత్సరాలలో విద్యార్థుల కోసం చేసే రుణాల విషయంలో జనం అన్నీ తప్పుడు నిర్ణయాలు తీసుకున్నారు. ఇక్కడ నేర్చుకోవడానికి తగిన అనుభవం కూడా లోపించింది. మనకు ఇప్పుడే రెక్కలు వస్తున్నాయి.

ఇండెక్స్ ఫండ్స్ పరిస్థితి కూడా అంతే. వాటి వయస్సు 50 సంవత్సరాలు కూడా లేదు. హెడ్జ్ ఫండ్స్ వయస్సు ఇంకా 25 సంవత్సరాలుకూడా దాటలేదు. కొనుగోలుదారుల అప్పు - తాకట్లు, క్రెడిట్ కార్డులు, కార్లమీద అప్పులు - కూడా రెండవ ప్రపంచయుద్ధం ముగిసిన దాకా వ్యాపించి లేదు. GI Bill తర్వాతనే లక్షలాది అమెరికన్లకు అప్పు చేసే వసతి కలిగింది.

10 వేల సంవత్సరాల క్రితం కుక్కలు ఇంట్లో మనుషులలాగానే వ్యవహరించేవి. ఈనాటికి కూడా తమ పూర్వీకుల ప్రవర్తనలు కొన్ని అవి ఇంకా అనుసరిస్తూనే ఉన్నాయి. ఆధునిక ఆర్థిక వ్యవస్థలో మన అనుభవం 20 - 50 సంవత్సరాల మధ్య ఉంటుంది. మనం అంతా మనకు తెలుసుననే మనస్తత్వంలో ఉన్నాం.

భావావేశాలకు యదార్థాలకు మధ్య నలిగిపోయే విషయానికి ఇదే సమస్య. కనుక మనము డబ్బుతో చేయవలసిన పని ఎప్పుడో కానీ సవ్యంగా చేయకపోవటానికి కారణం ఇదే.

మనమంతా డబ్బుతో తిక్కగా వ్యవహరిస్తాం. ఈ ఆట మనకు కొత్త కావడమే ఇందుకు కారణం. మీకు తలతిక్కగా తోచేది నాకు చాలా సమయోచితంగా తోస్తుంది. కానీ ఇక్కడ ఎవరికీ తలతిక్క లేదు. ఆ క్షణాల్లో మన అనుభవాలను అనుసరించి మనం చేసే నిర్ణయాలు సవ్యంగానే తోస్తాయి.

ఇప్పుడు ఇక్కడ బిల్ గేట్స్ ఎలా సంపన్నులయ్యారనే కథ మీకు చెప్తాను.

# 2.
# అదృష్టం, సాహసం

---

ఏదీ కంటికి కనిపించినంత
మంచీ కాదు, చెడూ కాదు.

---

అదృష్టము, సాహసము తోబుట్టువులు. మానవ ప్రయత్నంతోకాక జీవితంలో సంభవించే ఫలితాలన్నిటికీ అవి రెండే అసలైన కారణాలు.

అటువంటిదే మరొక భావన న్యూయార్క్ యూనివర్సిటీ ప్రొఫెసర్ స్కాట్ గాలావే ప్రతిపాదించారు. "ఏదీ కంటికి కనపడినంత మంచిదీ కాదు చెడూ కాదు." మనది కానీయండి ఎదుటివారిది కానివ్వండి సఫలతను తీర్మానం చేసేటప్పుడు ఈ ప్రతిపాదనను గుర్తుంచుకోవటం చాలా ముఖ్యం.

---

ప్రపంచంలో ఆనాడు కంప్యూటర్ ఉన్న స్కూల్ బిల్ గేట్ హాజరైన స్కూలు ఒక్కటే.

సియాటెల్ పరిసరాలలో ఉన్న లేక్ సైడ్ స్కూల్‌కు కంప్యూటర్ ఎలా వచ్చింది అనేది ఒక విచిత్రమైన కథ.

బిల్ దగల్ రెండవ ప్రపంచయుద్ధంలో నౌకాచోదకులు. యుద్ధం ముగిసిన తరువాత ఆయన హైస్కూల్లో లెక్కల, సైన్స్ అధ్యాపకులుగా చేరారు. "వాస్తవ ప్రపంచంలో అనుభవం లేకుండా పుస్తకాలు ఎన్ని చదివినా సరిపోదని ఆయన నమ్మకం. అంతేకాక కాలేజీకి వెళ్లేసరికి కంప్యూటర్ గురించి కొంత తెలుసుకోవాలనే విషయం ఆయన గ్రహించారు." మైక్రోసాఫ్ట్ సహ వ్యవస్థాపకులు కీర్తి శేషులు పాల్ అలెన్ జ్ఞాపకాలు నెమరువేశారు.

లేక్ సైడ్ స్కూల్ మదర్స్ క్లబ్ ఒకటి ఉన్నది. ఆ క్లబ్బు సంవత్సరాంతంలో పాత వస్తువులన్నీ అమ్మకం చేసి సుమారుగా మూడు వేల డాలర్లు గడించారు. 1968లో దగల్ ఆ మూడు వేల డాలర్లతో టెలీ టైప్ మోడల్ 30 కంప్యూటర్ లీజ్ చేయవలసిందిగా వారిని అభ్యర్థించారు. ఆ కంప్యూటర్ టైం షేర్ చేయటానికి అనువుగా జనరల్ ఎలక్ట్రిక్ మెయిన్ ఫ్రేమ్ కంప్యూటర్ కు హుకప్ వున్నది.

"టైం షేరింగ్ అనే ఆలోచనే 1965లోనే కలిగింది." బిల్ గేట్స్ తర్వాత అన్నారు. "అప్పుడు ఎవరో చాలా దూరదృష్టితో ఉన్నారు." ఎనిమిదవ తరగతిలో ఉన్న బిల్ గేట్స్‌కు ఆ కంప్యూటర్ అందుబాటులోకి వచ్చింది. అప్పటికి దాదాపు ఏ యూనివర్సిటీ లోనూ అటువంటి కంప్యూటర్ ఎక్కడా లేదు. కానీ, బిల్ గేట్స్ కు ఆ కంప్యూటర్ చాలలేదు.

1968లో బిల్ గేట్స్ తన క్లాస్ మేట్ పాల్ అలెన్ ను కలుసుకున్నప్పుడు ఆయన వయస్సు 13 సంవత్సరాలు. స్కూల్‌లో ఉన్న కంప్యూటర్ అంటే కూడా చాలా వెర్రి వ్యామోహం ఉండేది. ఇద్దరూ ఒకరికొకరు సరిపోయారు.

లేక్ సైడ్ స్కూల్ లో కంప్యూటర్ మామూలు బోధనా కార్యక్రమంలో లేదు. అది ఒక ప్రత్యేక అధ్యయన కార్యక్రమం. తమ విశ్రాంతి సమయంలో బిల్, పాల్ ఇష్టం వచ్చినట్లు ఆ కంప్యూటర్ తో ఆటలు ఆడేవారు. అందులో వారి సృజనాత్మకత విజృంభించేది. స్కూలు ముగిసిన తరువాత, రాత్రి ఎంతో పొద్దుపోయిన తర్వాత కూడా, వారాంతాల్లోనూ వారు దానితో ఆటలాడుకునే వారు. త్వరలోనే వాళ్ళు ఇద్దరూ కంప్యూటర్ అనుభవజ్ఞులుగా ఆరితేరారు. రాత్రులు కంప్యూటర్తో కుస్తీ పడుతున్నప్పుడు ఒకసారి గేట్స్ ఫార్చ్యూన్ మ్యాగజైన్ ఒకటి, అలెన్‌కు చూపించి" ఒక ఫార్చ్యూన్ 500 కంపెనీ నడిపితే ఎలా ఉంటుందంటావు?" అని అడిగినట్లు పాల్ గుర్తు చేసుకుంటారు. తనకు ఆ విషయం ఏమీ తెలియదు అన్నాడు అలెన్. "ఏదో ఒక నాడు మనకు ఒక సొంత కంప్యూటర్ కంపెనీ ఉండొచ్చు." అన్నారు బిల్ గేట్స్. ఈనాడు మైక్రోసాఫ్ట్ విలువ ట్రిలియన్ డాలర్లు మించి ఉంటుంది.

ఇక్కడ చిన్న గణిత అభ్యాసం.

ఐక్యరాజ్యసమితి అంచనా ప్రకారం 1968లో హైస్కూల్ వయసున్న వారు సుమారుగా 303 మిలియన్ ఉన్నారు.

వారిలో 18 మిలియన్ యునైటెడ్ స్టేట్స్ లో నివసించుచున్నారు.

సుమారుగా 270,000 మంది వాషింగ్టన్ రాష్ట్రంలో ఉన్నారు.

ఒక లక్షకు పైగా సియాటిల్ ప్రాంతంలో ఉన్నారు.

వారిలో కేవలం 300 మంది లేక్ సైడ్ స్కూల్‌లో ఉన్నారు.

303 మిలియన్లతో ప్రారంభించి 300 తో ముగిసింది.

ధన సహాయము, దూరదృష్టి ఉండి కంప్యూటర్ కొనగలిగిన స్కూలులో చదివే అవకాశం మిలియన్‌లో ఒకరికి ఉండవచ్చు. అదృష్టవంతులే అటువంటి స్కూలు హాజరు కాగలరు. బిల్ గేట్స్ అటువంటి అదృష్టవంతులలో ఒకరు.

దీని భావం ఏమిటో చెప్పటంలో బిల్‌గేట్స్ వెనకాడరు. ఆనాడు లేక్ సైడ్ స్కూల్ లేకపోతే ఈనాడు మైక్రోసాఫ్ట్ వుండేది కాదు అన్నారు ఆయన 2005వ సంవత్సరంలో పట్టభద్రులు అవుతున్న విద్యార్థులతో ప్రసంగిస్తూ.

గేట్స్ మహా తెలివైన వ్యక్తి. అంతకుమించి కష్టపడి పనిచేస్తారు. కౌమార వయసులోనే కంప్యూటర్లను గురించి ఆయన దూరదృష్టి అనుభవజ్ఞులైన కంప్యూటర్ నిర్వాహకుల ఊహకు అందనంత దూరంలో ఉన్నది. దానికి తోడు లేక్ సైడ్ స్కూలుకు వెళ్లడం ద్వారా ఆయనకు మిలియన్‌లో ఒకరికి లభించే శుభారంభం లభించింది.

ఇప్పుడు గేట్స్ మిత్రులు కెంట్ ఇవాన్స్‌ను గురించి చెప్తాను. ఆయనకు అదృష్టానికి తోబుట్టువు సాహసం మహాశక్తివంతమైన అనుభవం కలిగించింది.

మైక్రోసాఫ్ట్ ఘనవిజయాలవల్ల బిల్ గేట్స్, పాల్ అలెన్ పేర్లు ప్రతి ఒక్కరికి పరిచితం అయ్యాయి. అక్కడే లేక్ సైడ్ స్కూల్ లో ఈ గ్రూపుకు చెందిన మరొక మేధావి ఉన్నాడు.

కెంట్ ఇవాన్స్, బిల్ గేట్స్ ఎనిమిదవ తరగతిలో అత్యంత సన్నిహితులైన స్నేహితులయ్యారు. గేట్స్ దృష్టిలో కెంట్ తమ తరగతిలో అందరినీ మించిన విద్యార్థి.

ఇద్దరూ ఫోన్లో అంతులేకుండా మాట్లాడుకుంటూ ఉండేవారు. అని ఇన్ సైడ్ బిల్స్ బ్రెయిన్ అనే డాక్యుమెంటరీలో గేట్స్ జ్ఞాపకం చేసుకుంటారు."నాకు ఇంకా కెంట్ ఫోన్ నెంబర్ గుర్తు ఉన్నది. "525-7851" అంటారు గేట్స్.

కంప్యూటర్లో కెంట్ నైపుణ్యం గేట్స్, అలెన్ నైపుణ్యంతో సరితూగుతుంది. అప్పుడు లేక్ సైడ్ స్కూల్ అన్ని క్లాసుల కార్యక్రమం తయారుచేయటానికి చాలా

అవస్థ పడుతూ ఉండేది. వందలకొద్దీ విద్యార్థులు, దానికి తగినట్లుగా క్లాసు పీరియడ్స్. ఇందులో ఒక దానికి ఒకటి అడ్డుపడకుండా పీరియడ్స్ నడవాలి. స్కూల్ యాజమాన్యం ఈ సమస్య పరిష్కరించడానికి ఒక కంప్యూటర్ ప్రోగ్రామ్ తయారు చేసే బాధ్యత బిల్, కెంట్ లకు – ఏ విధంగా చూసినా ఆ నాటికి వారు ఇద్దరూ చిన్నవారే – అప్పగించింది. ఆ ప్రోగ్రాం పని చేసింది!

పాల్ అలెన్ లాగా కాకుండా కెంట్ వాణిజ్య మనస్తత్వంలో, అంతులేని తృష్ణలో బిల్‌ను పోలుతాడు. "కెంట్ దగ్గర ఎప్పుడూ లాయర్ల బ్రీఫ్కేస్ వంటిది పెద్ద బ్రీఫ్కేస్ ఉండేది." గేట్స్ గుర్తు చేసుకుంటారు." మేము ఎప్పుడూ రాబోయే ఐదు సంవత్సరాలలో ఏమి చేయాలా అని ఆలోచించి పథకాలు వేస్తూ ఉండేవాళ్ళం. మనము సి ఈ ఓ లు కావాలా! మనము ఎటువంటి ప్రభావం చూపించగలం? మనం సేనలో జనరల్స్‌గా అవటానికి ప్రయత్నించాలా? రాయబారులుగా తయారవడానికి ప్రయత్నించాలా?" ఏది ఏమైనా సరే, ఏమి చేసినా తామిద్దరూ కలిసి చేయాలి అని నిశ్చయించుకున్నారు బిల్, కెంట్.

కెంట్‌తో తన స్నేహం స్మరించిన తరువాత గేట్స్ మౌనం వహిస్తారు.

"మేము ఇద్దరమూ కలిసి పనిచేసే వాళ్ళం. ఇద్దరమూ కలిసే కాలేజీకి వెళ్ళి ఉండేవాళ్ళం." గేట్స్, అలెన్‌లతో బాటు కెంట్ మైక్రోసాఫ్ట్‌లో వ్యవస్థాపక భాగస్వామి అయి ఉండేవారు.

కానీ అది అలా జరగలేదు. హైస్కూల్ నుంచి దాటకముందే కెంట్ ఒక పర్వతారోహణ సాహసంలో ప్రమాదంలో చనిపోయాడు.

ప్రతి సంవత్సరము యునైటెడ్ స్టేట్స్‌లో పర్వతారోహణ ప్రమాదాలలో సుమారు మూడు డజన్ల మరణాలు జరుగుతాయి.[9] హైస్కూలు సమయంలో పర్వతారోహణ ప్రమాదంలో మరణించడం అనేది మిలియన్లో ఒకటి కావచ్చు.

లేక్ సైడ్ స్కూలులో చేరటం ద్వారా నూటికి కోటికి కలిగే అదృష్టం బిల్‌గేట్స్‌ను వరించింది. కెంట్ కు నూటికి కోటికి కలిగే సాహస ప్రమాదం కలిగింది. దానితో గేట్స్‌తో కలిసి అతను సాధించదలచుకున్న కార్యక్రమం అసంపూర్తిగానే మిగిలిపోయింది. అదే శక్తి అదే పరిమాణంలో భిన్న ధ్రువాలగా పనిచేసింది.

మానవ ప్రయత్నం కాక ప్రతి ఒక్క ఫలితము వెనక ఉన్న వాస్తవాలు ఈ రెండే - అదృష్టము, సాహసము. అవి రెండూ ఒకేలాగా దర్శనమిస్తాయి. ఒక దానిని నమ్మి మరొక దాన్ని చిన్నచూపు చూడటం అసాధ్యం. ఒక దానిని నమ్మితే రెండవదాన్ని తగువిధంగా ఆదరించాలి. అవి రెండూ జరుగుతాయి ఈ ప్రపంచంలో. ఈ చర్యలన్నిటికీ నూటికి నూరు శాతం ప్రతిఫలం కలగడం అనేది అసాధ్యం, అసంభవం. అంటే ఈ ప్రపంచం చాలా క్లిష్టమైనది. వాటి రెండిటి వెనక ప్రచోదన శక్తి ఒక్కటే. ఈ క్రీడలో మీరు ఏకైక వ్యక్తి. మీ చుట్టూ 7 బిలియన్ ప్రజల నిరంతరం చలించే అంతులేని విభాగాలు ఉన్నాయి. కనుక మీప్రమేయం లేకుండా ప్రమాదవశాత్తు జరిగే చర్యలు అనేకానేకం ఉంటాయి. వాటి వల్ల కలిగే ఫలితాలు మీ అధీనంలో లేవు, ఉండబోవు.

రెండూ కొలమానానికి అందేవి కావు. వాటిని అంగీకరించడం కూడా చాలా కష్టసాధ్యమైన పని. కనుక అవి సాధారణంగా ఉపేక్షించ బడతాయి. ప్రతి ఒక్క బిల్‌గేట్‌కు  సరితూగే కెంట్ ఇవాన్స్ ఉంటారు! అదే నైపుణ్యం అదే ప్రతిభ అదే ప్రేరణ. కానీ సోపానపటంలో రెండవ వ్యక్తిని పాము మింగేసింది.

అదృష్టాన్ని, సాహసాన్ని మీరు సమానంగా ఆదరిస్తే వ్యక్తుల ఆర్థిక విజయాలు  మీవి కానియ్యండి, ఇతరులవి కానియ్యండి - తీర్మానం చేసేటప్పుడు కంటికి కనిపించినంత మంచీ, చెడూ అందులో ఏవీ లేవని మీరు గ్రహిస్తారు.

---

రాబర్ట్ శిల్లర్ ఏకనామిక్స్ లో నోబెల్ బహుమతి పొందారు. కొన్ని సంవత్సరాల క్రితం నేను "పెట్టుబడిలో మేము మాకు తెలియనిది మీరు ఏమి తెలుసుకోవాలను కుంటున్నారు?" అని ప్రశ్నించాను.

"సత్ఫలితాలలో అదృష్టం పాత్ర ఎంతవరకు అని తెలుసుకోవాలని ఉన్నది." అని ఆయన సమాధానం.

ఆ సమాధానం నాకు చాలా నచ్చింది. ఆర్థిక విషయాలలో అదృష్టం పాత్ర వహించదని ఎవరూ అనుకోరు. అదృష్టాన్ని కొలవటం కష్టసాధ్యం. అదృష్టం కొద్దీ విజయం సాధించారు అంటే జనాల్ని అవమాన పరిచినట్లు అవుతుంది.

కనుక సాధారణంగా సత్ఫలితాలలో అదృష్టం పాత్రను ఉపేక్షించటం సర్వసాధారణ మయింది.

"ఈ ప్రపంచంలో కొన్ని కోట్లాది పెట్టుబడిదారులు ఉన్నారు. అదృష్టం లేకుండా వాళ్ళల్లో పది మంది బిలియనీర్లు అయితీరుతారని మీరు ఘంటాపథంగా చెప్పగలరా?" కానీ నేను అడిగితే, మీరు "తప్పకుండా" అంటారు. అప్పుడే నేను "వారెవరో చెప్పగలరా?" అని అడిగితే మీరు తిరోగమించటం సామాన్యం.

ఇతరులను గురించి చెప్పేటప్పుడు వాళ్ళ సఫలత అంతా అదృష్టం కొద్దీ కలిగింది – అది సాధ్యమేనని మనకు తెలిసినా కూడా – అని మీరంటే మీరు అసూయాపరులుగాను, సంకుచిత మనస్కులుగాను దర్శనమిస్తారు. మిమ్మల్ని గురించి మీరు తీర్మానం చేసేటప్పుడు మీ సఫలత అంతా అదృష్టంవల్లనే నని చెప్పుకోవటానికి మనసొప్పదు. ఆ ఆలోచన మనల్ని నిర్వీర్యులను చేస్తుంది.

సోదరుల మధ్య ఎత్తు-బరువుల కంటే ఆదాయాలు ఎక్కువ సామ్యం కలిగి ఉంటాయని ఆర్థిక శాస్త్రవేత్త భాస్కర్ మజుందార్ చూపించారు. మీరు సంపన్నులై పొడగరిగా ఉంటే మీ సోదరులు, ఎత్తు సంగతి ఎలా ఉన్నా, సంపదలో మిమ్మల్ని పోలి ఉంటారు. ఈ విషయం మన అందరికీ ఎవరూ చెప్పకుండానే తెలుస్తుంది అనుకుంటాను. మీ విద్యార్జన నాణ్యత తద్వారా మీకు కలగబోయే అవకాశాలు చాలావరకు మీ తల్లిదండ్రుల సామాజిక ఆర్థిక అంతస్తు మీద ఆధారపడి ఉంటాయి. నాకు ఎవరైనా ఇద్దరు సంపన్నులైన సోదరులను చూపించండి. ఈ అధ్యయనంలో విషయాలు వాళ్లకు వర్తించవని చెప్పే ఇద్దరు వ్యక్తులను మీకు చూపిస్తాను.

వైఫల్యం – దివాలా తియ్యటం దగ్గరనుంచి వ్యక్తిగతంగా లక్ష్యం చేరలేకపోవటం వరకు ఏదైనా కావచ్చు – కూడా ఇదే విధంగా దుస్థితి పాలైంది.

విఫలమైన వ్యాపారాలు కష్టించి ప్రయత్నించలేదా? నష్టపోయిన పెట్టుబడులన్నీ ముందు ఆలోచన లేకుండా చేసినవేనా? రోడ్డున పడ్డ వృత్తులు, ఉద్యోగాలు కేవలం బద్ధకం వల్లనేనా? అవును. కానీ కొన్ని సందర్భాలలో మాత్రమే.

ఎంతవరకు? అది తెలుసుకోవటం కష్టం. ప్రతిప్రయత్నంలోనూ సఫలతకు అవకాశాలు నూటికి నూరుపాళ్లు ఉండవు. ఆ సమీకరణలో మీరు దురదృష్టం తొక్కారు అంటే అప్పుడే సాహసం జరిగిందని అర్థం. ఈ వైఫల్యంలో సచేతనమైన నిర్ణయం ఎంత, ఆలోచనా రహితమైన సాహసం ఎంత అని ఆలోచిస్తే దానికి సమాధానం దొరకడం చాలా కష్టం. చాలా క్లిష్టం, అయోమయం అవుతుంది. అదృష్టం ఎలా కలిసి వచ్చిందో తెలియనట్లే ఇది కూడా తెలియదు.

నేను ఒక స్టాకు కొన్నాననుకోండి. ఐదు సంవత్సరాల తర్వాతకూడా అది అటూఇటూ కదలలేదు. ఆలోచిస్తే మొదట అది కొనటంలోనే నా నిర్ణయం తప్పయి ఉండవచ్చు. అది 80 శాతం లాభం సమకూర్చే అవకాశం ఉన్నదని నేను సరైన నిర్ణయమే చేసి ఉండవచ్చు. కానీ దురదృష్టవశాత్తు నేను ఆ 20 శాతం వైఫల్యం విభాగంలో ఇరుక్కుపోయాను. ఏది ఏమిటో నేను తెలుసుకునేది ఎలా? పొరపాటు చేశానా? లేకపోతే సాహసంవల్ల కలిగిన ఫలితం అనుభవిస్తున్నానా?

మనము చేసిన నిర్ణయాలు సరయినవా కావా అని తెలుసుకోవటానికి సంఖ్యాశాస్త్రం అనుసరించి లెక్కలు వేయవచ్చు. కానీ ఈ వాస్తవ ప్రపంచంలో దైనందిన చర్యలలో మనము ఆ పని చెయ్యం. అది చాలా కష్టమైన పని. మనకు సులభమైన కథలే నచ్చుతాయి. అవే మనలను తప్పుదోవ పట్టిస్తాయి.

ఎవరో ఒకరు విఫలమయితే మామూలుగా అది చెడు నిర్ణయంగా కొట్టిపారేస్తాం. అదే మన ప్రయత్నం విఫలం అవుతే దాన్ని ఫలించని సాహసం కింద పరిగణిస్తాం. మీ వైఫల్యాలను గురించి మాట్లాడేటప్పుడు నేను సరళమైన కార్య కారణాల కథకోసం వెతుకుతాను. కానీ అప్పుడు మీ మనసులో ఏమున్నదో నాకు తెలియదు. "మీ ప్రయత్నం ఫలించలేదు. అంటే మీ నిర్ణయం సరిగా లేదన్న మాట." అనేది నాకు వెంటనే తోచే ఆలోచన. కానీ నన్ను గురించీ నేను విశ్లేషించేటప్పుడు నిర్ణయాలను సమర్థిస్తూ సాహసం మూలంగానే దుష్ఫలితాలు కలిగాయని పెద్ద కథ చెప్తాను.

సరైన నిర్ణయాలు చేసినా దురదృష్టంలో పడిపోయిన పెట్టుబడిదారులను గురించి ఫోర్బ్స్ మ్యాగజైన్ ముఖపత్రం పట్టించుకోదు. సఫలత సాధించిన

సంపన్నులైన పెట్టుబడిదారులను, ఎంత గుడ్డిగా నిర్ణయాలు చేసినా అదృష్టం వరించిన పెట్టుబడిదారులను ఆ పత్రిక ముఖపత్రం ఆదరిస్తుంది. ఇద్దరూ ఒకే నాణాన్ని ఎగరవేశారు. ఒకరికి బొమ్మ పడితే మరొకరిది బొరుసు అయింది అంతే.

ఇందులో ఉన్న ప్రమాదం ఏమిటంటే డబ్బుతో వ్యవహారంలో ఏది ఫలిస్తుంది, ఏది ఫలించదు అని తెలుసుకోవడానికి, నేర్చుకోవడానికి ప్రయత్నం చేస్తున్నాం.

పెట్టుబడిలో ఎటువంటి వ్యూహాలు ఫలిస్తాయి? ఏవి ఫలించవు?

వ్యాపారానికి ఏ వ్యూహాలు సఫలం అవుతాయి? ఏవి విఫలం అవుతాయి?

కానీ ధనికులం అవటం ఎలా? పేదరికాన్ని తప్పించుకోవడం ఎలా?

బయటి ప్రపంచంలో జరిగే సఫలతలు, వైఫల్యాలు గమనించి, “ఆమె చేసినట్టు చేయండి. ఆయన చేసినట్టు చేయకండి.” అని చెప్పుకుంటూ వాటిలో నుంచి పాఠాలు నేర్చుకోవడానికి ప్రయత్నిస్తాము.

వెనక ఒక మంత్రదండం ఉంటే, వీటిలో పునరావృతం అయ్యేలాగా చేయగలిగిన చర్యలు ఎన్ని లేదా ఫలితాలను అటోఇటో చేస్తూ సాహసం, అదృష్టం మీద ఆధారపడి ఉండేవి ఎన్ని అని స్థిరంగా నిర్ణయించుకునే వీలవుతుంది. దురదృష్టవశాత్తు మనదగ్గర ఆ మంత్రదండం లేదు. మన మెదళ్లకు అనాయాసమైన సమాధానాలు కావాలి. తర్జనభర్జనలుచేసి నటించే ఓపిక వాటికి లేదు. కనక మనం ఏమి చేయాలి, ఏమి చేయకూడదు అని తెలుసుకోవటం చాలా కష్టసాధ్యమైన పని.

ఇక్కడ మీకు ఇంకొక కథ చెప్తాను. ఆయన కూడా బిల్ గేట్స్ లాగానే అనూహ్యమైన సఫలత సాధించారు. కానీ అందుకు అదృష్టమా నేర్పరితనమా, ఏది కారణం అని చెప్పటం చాలా కష్టం.

---

కార్నీలియస్ వాండర్ బిల్ట్ తన రైల్ రోడ్డు వ్యాపారం విస్తరింపచేయడానికి వరుసగా కొన్ని లావాదేవీలు/ ఒప్పందాలు జరిపారు.

ఆయన సలహాదారులు ఒకరు దగ్గరగా చేరి ఆయన చేసిన ప్రతి ఒక్క ఒప్పందమూ నియమాలను ఉల్లంఘిస్తున్నదని చెవిలో చెప్పారు.

"వెర్రి నా తండ్రి జాన్," వాండర్ బిల్ట్ అన్నారు, "న్యూయార్క్ రాష్ట్రం నిబంధనలు అన్నీ పాటిస్తే రైల్ రోడ్డు వ్యాపారం నడుస్తుందనుకుంటున్నావా?"[10]

అది చదివినప్పుడు నాకు కలిగిన మొట్టమొదటి ఆలోచన: "ఆ వైఖరి వల్లనే ఆయన అంత సఫలత సాధించగలిగారు." వాండర్ బిల్ట్ కాలంలో రైలు రోడ్లకు ప్రభుత్వ నిబంధనల విభాగం లేదు. ఆయన "లేకపోతే పోయింది" అని తన దారిన ముందుకుసాగారు.

వాండర్ బిల్ట్ అఖండ విజయం సాధించారు. ఆయన కనుక ఆయన నిబంధనల ఉల్లంఘున - అపఖ్యాతి పాలైన ఆయన సఫలతకు కీలకం - యోగ్యమైన వివేచనగా అవలోకించాలనే వ్యామోహం కలుగుతుంది. ఆయన తన దూరదృష్టితో తన దారికి ఏది అడ్డు రాకుండా చూసుకున్నారు.

ఆ విశ్లేషణ ఎంత ప్రమాదకరమైనది? తెలిసి చేసే ఘోరమైన తప్పిదాన్ని వ్యాపార వ్యూహంగా స్వస్థచిత్తంలో ఉన్నవారు ఎవరు కలలో కూడా సమర్థించరు, సలహా ఇవ్వరు. వాండర్ బిల్ట్ కథ విభిన్నమైన మలుపు తిరగడం మీరు సులువుగా ఊహించవచ్చు. కోర్టు ఆర్డర్ ద్వారా ఆ అక్రమ వ్యాపారస్తుడి యువసంస్థ పతనమైంది.

ఇక్కడ మనకు ఒక సమస్య ఎదురవుతుంది.

న్యాయానికి విరుద్ధంగా ప్రవర్తించినందుకు మీరు వాండర్ బిల్ట్‌ను ఎంతైనా ప్రస్తుతించ వచ్చు. అదే పని చేసిన ఎన్రాన్ ను మీరు ఎంత గాఢంగా విమర్శించారో మీకే తెలుసు. న్యాయదేవత ఆజానుబాహువులను తప్పించుకునేందుకు ప్రయత్నించినందుకు ఒకరి అదృష్టం కలిసివచ్చింది మరొకరికి దురదృష్టం ఎదురైంది.

జాన్ డి రాక్ ఫెల్లర్ ఇదే కోవలోకి వస్తారు. ఆయన నిబంధన ఉల్లంఘునను - ఆయన సంస్థ ఒక మామూలుదొంగ కంటే ఏమి మెరుగుకాదని ఒక జడ్జి ఒకసారి అన్నారు - చరిత్రకారులు వ్యాపార దక్షతగా చిత్రించారు. కావచ్చు

కాకపోవచ్చు. "బూజుపట్టిన నిబంధనలను మీ ఊహాకల్పనకు అడ్డు రానివ్వలేదు." అన్న పొగడ్త నుంచి "మీరు నేరం చేశారా?" అనే స్థితికి ఎప్పుడు మారుతుంది? "రాక్‌ఫెల్లర్ ఒక మహా మేధావి. ఆయనను చూసి నేర్చుకోండి." అని చెప్పటం "రాక్‌ఫెల్లర్ ఒక నేరస్తుడు. ఆయన వ్యాపార వైఫల్యాలనుంచి నేర్చుకోండి." అని చెప్పాలి అంటే ఆయన కథ ఎంతవరకు మారాలి? దాదాపు ఏమీ మారనక్కర్లేదు అనే చెప్పవచ్చు.

"చట్టాన్ని లెక్క చేసేదేమిటి?" వాండర్ బిల్ట్ ఒకసారి అన్నారు. "నాకు ఆమాత్రం హక్కు లేదా?" ఉన్నది. అది పని చేసింది కూడా. ఇష్టం ఫలితం పూర్తిగా వేరుగా ఉన్నా కూడా అవే తుదిపలుకులు కావటం సులువుగా ఊహించ వచ్చు. ధైర్యానికి, ఆలోచనారహితమైన సాహసానికి మధ్య దూరం చాలా తక్కువ. సాహసానికి, అదృష్టానికి తగిన మర్యాద ఇవ్వకపోతే ఈ రెండింటి మధ్య దూరం అదృశ్యమైపోతుంది.

బెంజమిన్ గ్రాహం ప్రఖ్యాతి చెందిన పెట్టుబడిదారులలో ఒకరు. విలువల మీద పెట్టుబడి (Value investing) కి ఆయనను పితృతుల్యులుగా పరిగణిస్తారు. వారెన్ బుఫేకు తొలిరోజులలో ఆయన ఉపదేశకులు. బెంజమిన్ గ్రాహం లెక్కకందనంత GEICO స్టాక్‌కు స్వంతదారులు. ఆయన సఫలతకు మూలకారణం ఆ స్టాక్స్. ఆయన తన పుస్తకాలలో రాసిన సూత్రాలన్నిటినీ అధిగమించి ఆ స్టాక్స్ ఆయనకు లాభాలు తెచ్చిపెట్టాయి. ఆయనకు దానివెనక రహస్యం తెలియదు. ఇక్కడ ధైర్యానికీ, ఆలోచనా రహితమైన పెట్టుబడికీ మధ్య దూరమెంత? నాకు తెలియదు. GEICO తన అదృష్టాన్ని గురించి గ్రాహం, "అనుకోకుండా కలిగిన అదృష్టం, అత్యంత సూక్ష్మబుద్ధితో చేసిన నిర్ణయం, దీన్ని వేరువేరుగా గుర్తించగలమా?" అంటారు.

2006లో యాహూ కంపెనీని అమ్మితే బిలియన్ డాలర్లకు కొంటామని ఆఫర్ వచ్చింది. మార్క్ జూకర్ బర్గ్ ఆ ఆఫర్ తిరస్కరించారు. అందుకు మనము ఆయనను ఒక మహామేధావి అనుకోవచ్చు. ఆయన భవిష్యత్తులోకి తొంగి చూడగలిగారు కనుకనే తన నిర్ణయాన్ని మార్చుకోలేదు. మైక్రోసాఫ్ట్ నుంచి వచ్చిన ఆ కొనుగోలు వ్యవహారాన్ని తిరస్కరించినందుకు చాలామంది యాహూను

నిశితంగా విమర్శిస్తారు. "అంత మంచి ఆఫర్ వచ్చినప్పుడు ఆ మూర్ఖులు దానిని సొమ్ము చేసుకొని ఉండవలసింది." వ్యాపారం నడిపే వారికి ఇందులో కనిపించే నీతి ఏమిటి? నాకు తెలియదు. ఎందుకంటే సాహసము, అదృష్టము వేరు చేసి చూడటం చాలా కష్టం.

ఇందుకు చాలా ఉదాహరణలు ఉన్నాయి.

లివరేజ్ కారణంగా లెక్కలేనన్ని అదృష్టాలు, దురదృష్టాలు సంభవించాయి.

ఉత్తమోత్తములు, అధమాధములు అయిన మేనేజర్లు కూడా తమ ఉద్యోగులను సాధ్యమైనంత గట్టిగా తోలుతారు.

"కొనుగోలుదారు చెప్పేది ఎప్పుడూ సబబే." ఇంకా "వారికి ఏం కావాలో కొనుగోలుదారులకు తెలియదు." అనే నానుడులు రెండూ వాణిజ్య వివేచనగానే అంగీకారమవుతాయి.

"రక్తం పరవళ్లు తొక్కించే సాహసం." "అనాలోచితమైన మూర్ఖత్వం," రెండింటికీ మధ్య రేఖ ఎంత వెడల్పుగా ఉంటుందో వెనుదిరిగి చూస్తేనే తెలుస్తుంది.

సాహసము, అదృష్టము రెండు తోడు దొంగలు.

ఈ సమస్య పరిష్కారం అంత సులభం కాదు. ఏది అదృష్టము, ఏది నైపుణ్యం, ఏది సాహసం అనేది గుర్తించటం చాలా కష్టసాధ్యమైన విషయమే. డబ్బుతో వ్యవహరించేటప్పుడు ఉత్తమమైన మార్గము తెలుసుకోవడంలో ఎదురయ్యే అతి పెద్దసమస్య ఇదే.

కానీ మీకు మేలైనదారి చూపటానికి రెండువిషయాలు సహాయపడతాయి.

**మీరు ఎవరిని స్తుతించి, ఎవరిని ఆరాధిస్తున్నారో గమనించండి. మీరు ఎవరిని హీనంగా చూసి వారిలా కాకూడదు అనుకుంటున్నారో వారిని గమనించండి.**

ఫలితాలు అన్నీ నూటికి నూరుపాళ్ళు ప్రయత్నాల మీద, నిర్ణయాల మీద ఆధారపడి ఉంటాయి అనుకుంటూ ఉంటే జాగ్రత్త పడండి. నాకు కుమారుడు పుట్టాక అతనికి ఒక ఉత్తరం రాశాను. అందులో ఒక భాగం:

విద్యను ప్రోత్సహించే కుటుంబాల్లో కొందరు పుడతారు. మిగిలినవారు అందుకు విరుద్ధంగా ఉంటారు. కొందరు దినదినాభివృద్ధి చెందుతున్న ఆర్థిక వాతావరణంలో, వ్యవస్థాపన ప్రోత్సహించే కుటుంబాల్లో జన్మిస్తారు. మరికొందరు యుద్ధంలోనూ క్షామంలోనూ పుడతారు. నువ్వు సఫలత పొందాలనీ, అది నువ్వు సాధించాలనీ నా కోరిక. కానీ ఒక విషయం గుర్తుంచుకో. సఫలత అంతా కష్టపడి పని చేసినంత మాత్రాన లభించదు. అలాగే కేవలం బద్ధకం వల్ల పేదరికం అంటుకోదు. మనుషులను - నీతో సహా - విలువ కట్టే టప్పుడు ఈ విషయం గుర్తుంచుకో.

## కనుక కొందరు ప్రత్యేక వ్యక్తులను, కొన్ని యదార్థ సంఘటనలు పట్టుకు వేలాడకండి. మీ దృష్టి విస్తరింప చేయండి.

ఒక ప్రత్యేక వ్యక్తిని గురించి అధ్యయనం చేయటం చాలా ప్రమాదకరమైన విషయం. ఎందుకంటే మనము అతిశయమైన ఉదాహరణ మాత్రమే - బిలియనీర్లు, సీఈవోలు, లేకపోతే వార్తలలో దర్శనమిచ్చే ఘోరాతిఘోరమైన వైఫల్యాలు - తీసుకుంటాం. ఆ అతిశయమైన ఉదాహరణలు అన్నివైపులనుంచి అతి క్లిష్టంగా ఉంటాయి. వాటిని ఇతర సందర్భాలకు ఉదాహరణలు చెయ్యటం అసమంజసం. ఎందుకంటే ఆ ఉదాహరణలు సామాన్య జీవితానికి చెందినవి కాదు. అక్కడ ఫలితం ఎంత అతీతం గా ఉంటే అది మీ జీవితంలో అమలు పరచడానికి అంత తక్కువగా ఉపయోగ పడుతుంది. ఎందుకంటే ఆ ఫలితం ఊహాతీతమైన అదృష్టం లేదా సాహసంవల్ల కలిగి ఉండవచ్చు.

విస్తారంగా ఉన్న సఫలతలు వైఫల్యాలు గమనిస్తే మీకు ఆచరణయోగ్యమైన ఉదాహరణలు దొరుకుతాయి. ఆ క్రమం ఎంత సామాన్యమైనదయితే మీ జీవితంలో అంత ఆచరణయోగ్యం అవుతుంది. వారెన్ బుఫే పెట్టుబడి విజయాలను అనుకరించటం కష్టసాధ్యమైన పని. ఆయన విజయాలు ఊహాతీతమైనవి. అందులో అదృష్టం పాళ్ళు ఆశించిన దానికన్నా చాలా ఎక్కువ ఉండవచ్చు. అదృష్టాన్ని నమ్ముకుని ఒకరిని అనుకరించటం నమ్మదగిన పనికాదు. సమయాన్ని తమ ఆధీనంలో ఉంచుకొని జీవితంలో ఆనందంగా ఉండేవారు చాలామంది తలపడతారు. వారిని అనుసరించటంవల్ల ఎంతోకొంత సాధించ వచ్చు. (ఈ విషయం మనము ఏడవ అధ్యాయంలో వివరంగా చూస్తాం).

ఫ్రెడరిక్ లూయిస్ అలెన్ నా అభిమాన చరిత్రకారులు. ఆయన ఉద్యోగ జీవితం అంతా సామాన్య అమెరికన్ పౌరుడి జీవితం - వారు ఎలా జీవించారు, వారి ఎలా మారారు, జీవనోపాధి జీవనోపాధి కోసం వారు ఏమి చేశారు, డిన్నర్‌కు వారు ఏమి తిన్నారు, వగైరా వగైరా - విశ్లేషిస్తూ గడిపారు. వార్తలలో ప్రాముఖ్యత సాధించిన వారిని అధ్యయనం చేయటం చేయటం కంటే, ఇటువంటి విస్తారమైన సమాజ అధ్యయనంలో మనకు ఉచితమైన పాఠాలు దొరుకుతాయి.

---

బిల్‌గేట్స్ ఒకసారి అన్నారు: సఫలత ఒక పనికిరాని ఆచార్యులు. తెలివితేటలు గల వారిని, వారు విఫలం కాలేరు అని అధి బుజ్జగించి జో కొడుతుంది.

అంతా చాలా సవ్యంగా నడుస్తూ ఉన్నప్పుడు, అది మీరు అనుకున్నంత సవ్యంగా లేదని గ్రహించండి. మీరు అప్రతిహతులు ఏమీ కారు. మీకు అదృష్టం కొద్దీ సఫలత కలిగింది అని మీరు అంటే అప్పుడు మీరు అదృష్టం తోబుట్టువు సాహసం నమ్మాలి. ఎందుకంటే సాహసం కూడా మీ కథను అంత త్వరగాను సఫలం చేయగలదు.

అటునుంచి చూసినా కూడా ఇదే సత్యం.

వైఫల్యం కూడా ఒక పనికిమాలిన ఆచార్యులే. సాహసంవల్ల కలిగే కఠిన వాస్తవాలు పంచుకుంటే, కొన్నిసార్లు తెలివైన వాళ్లు కూడా తమ నిర్ణయాలు ఘోరంగా ఉన్నాయనుకునే స్థితికి తీసుకువస్తుంది. వైఫల్యంతో వ్యవహరించేటప్పుడు ఒక వ్యూహం అనుసరించాలి. ఒకచోట పెట్టిన పెట్టుబడి మరొకచోట మీరు ఎంచుకున్న లక్ష్యం ఫలించకపోతే అందువల్ల మీరు కూలిపోకుండా ఉండేట్లు జీవితాన్ని ఏర్పాటు చేసుకోవాలి. అప్పుడు మీరు పరిస్థితులు అనుకూలంగా మారే వరకు మీరు ఆట ఆడుతూనే ఉండవచ్చు.

మన ఉద్యోగవిజయాలలో అదృష్టం నిర్వహించే పాత్రను ఎంత గుర్తిస్తామో, సాహసం పాత్రను కూడా అలాగే గుర్తించి మన నిర్ణయాలు విఫలమైనప్పుడు మనలను మనం క్షమించుకొని అర్థంచేసుకోవడానికి అవకాశం కల్పించుకోవాలి.

ఏదీ కంటికి కనిపించినంత మంచి కాదు, చెడు కాదు.

ఇప్పుడు తమ అదృష్టాన్ని పూర్తిగా పరీక్షించిన ఇద్దరు వ్యక్తుల కథలు చూద్దాం.

జాన్ గార్డ్ (The Vanguard) వ్యవస్థాపకులు జాన్ బొగుల్ 2019 లో గతించారు. ఒకసారి ఆయన డబ్బును గురించి ఒక కథ చెప్పారు. సాధారణంగా మనము తగినంతగా ఆలోచించని ఒక విషయాన్ని ఆ కథ వెలుగులోకి తీసుకు వస్తుంది.

షెల్టర్ ఐలాండ్ మీద ఒక బిలియనీర్ ఒక పార్టీ ఇస్తున్నారు. అప్పుడు, కుర్ట్ వోనెగుట్ తన మిత్రులు జోసెఫ్ హెల్లర్ తో అన్నారు: అత్యంత ప్రభావ ప్రజాభిమానం సాధించిన 'క్యాచ్ 22' నవల ద్వారా హెల్లర్ సంపాదించిన దానికంటే, తమకు ఆతిధ్యం ఇస్తున్న హెడ్జ్ ఫండ్ మేనేజర్ గారు ఒక్క రోజులో ఎక్కువ సంపాదించారని దాని సారాంశం. "నిజమే. నా దగ్గర ఒకటి ఉన్నది. అది మాత్రం ఆయనకు 'చాలినంత' ఎన్నటికీ దొరకదు" హెల్లర్ స్పందన.

'చాలినంత'. సరళమైన ఆ పదంలోని ప్రతిభ చూసి నేను అవాక్కయ్యాను. అందుకు రెండు కారణాలు ఉన్నాయి:

ఎందుకంటే మొదటిది నాకు జీవితంలో ఎంతో లభించింది. రెండోది జోసెఫ్ హెల్లర్ చెప్పింది అక్షరాలా యదార్థం.

మన సమాజంలో అత్యవసరమైన వస్తువు 'చాలినంత' అంటే అర్థం ఏమిటో – మనలో అత్యంత ధనికులకూ, అతి ఉన్నత అధికారులకూ కూడా – దానికి అంతం ఎక్కడో ఎవరికీ తెలియ దనుకుంటాను.

దాని తెలివితేటలు, శక్తి అటువంటివి.

'చాలినంత' లేకపోతే కలిగే ప్రమాదాలు, అవి మనకు ఏమి బోధిస్తాయి అనటానికి రెండు ఉదాహరణలు చెప్తాను.

---

రజత్ గుప్త కోల్కతాలో పుట్టాడు. కిశోర ప్రాయంలో అనాథ అయినాడు. సాధారణంగా జనం మూడవ దశలో జీవితం ప్రారంభించిన అదృష్టవంతులను గురించి మాట్లాడతారు. గుప్తా ఒక బేస్ బాల్ స్టేడియం కూడా చూడలేదు. ఆ స్థితి నుంచి ఆయన సాధించినది అనూహ్యం. అద్వితీయం.

అయిదవ దశకంలో సగం దూరం చేరేసరికి గుప్తా మెక్కిన్సే సంస్థలో సీఈఓ అయ్యారు. మెక్కిన్సే ప్రపంచంలోనే అత్యంత ప్రఖ్యాతి చెందిన (సలహా, సంప్రదింపుల ) సంస్థ. 2007లో ఆయన ఉద్యోగం విరమించి ఐక్యరాజ్యసమితి ప్రపంచ ఆర్థిక వ్యవస్థలో పాత్ర నిర్వహించడానికి ఉద్యుక్తు లయ్యారు. లోకోపకారం కార్యక్రమంలో ఆయన బిల్ గేట్స్‌తో చేయి కలిపారు. అయిదు ప్రజాబాహుళ్య సంస్థలలో ఆయన డైరెక్టర్‌గా వ్యవహరించారు. కోల్కత్తా మురికి వాడల నుంచి గుప్తా అత్యంత అరుదైన వ్యాపారవేత్తగా ఎదిగారు.

ఆ సఫలతతోనే ఆయనకు అపారమైన సంపద వచ్చింది. 2008 నాటికి గుప్తా గారి విలువ సుమారుగా నూరు మిలియన్ డాలర్లుగా అంచనా వేయబడింది.[11] చాలామందికి అది ఊహించటానికి కూడా అందనంత సంపద. ఆ సంపద మీద సంవత్సరానికి 5 శాతం ఆదాయం వచ్చినా కూడా అది గంటకు ఆరు వందల డాలర్ల లెక్కన తేలుతూ ఉంటుంది. అది రోజుకు 24 గంటలు అలా ప్రవహిస్తూనే ఉంటుంది.

ఆయన తన జీవితంలో తలుచుకున్నది ఏదైనా చేయగలస్థితికి చేరారు.

ఏది ఏమైనా ఆయన కేవలం ఒక మిలియనీర్‌గా మిగిలి పోదలుచుకోలేదు. బిలియనీర్ కావాలని ఆయన కోరిక. తప్పకుండా ఎలాగైనా సరే బిలియనీర్ కావాలి అనేది ఆయన దృఢమైన కోరిక.

గోల్డ్ మన్ శాక్స్ కంపెనీలో గుప్తా ఒక డైరెక్టర్. ఆయన చుట్టూ ప్రపంచంలో అత్యంత ధనికులైన పెట్టుబడిదారులు పరివేష్టించి ఉండేవారు. వారిలో ఒక పెట్టుబడిదారుడు గుప్తాను ఈ విధంగా వర్ణించారు: “ఆ ప్రత్యేక సమితిలో ఉండాలని ఆయన కోరిక అనుకుంటాను. అది బిలియనీర్ల సమితి. గోల్డ్ మన్ అయితే వందలాది మిలియనీర్ల సమితి. అవునా?”[12]

నిజమే. గుప్తా గారు ఒక లాభసాటి అయిన వ్యవహారం కనుక్కున్నారు.

2008 లో గోల్డ్ మన్ శాక్స్ ఆర్థిక దుస్థితికి లోనయింది. అప్పుడు ఆ సంస్థను ఆ దుస్థితి నుంచి బయట పడేయటానికి వారేన్ బుఫే 5 బిలియన్ డాలర్లు పెట్టుబడి పెట్టడానికి పథకం వేశారు. ఆ విషయం ప్రజాబాహుళ్యానికి తెలియక మునుపే గోల్డ్ మన్ డైరెక్టర్‌గా గుప్త గారికి తెలిసింది. అది చాలా విలువైన సమాచారం. గోల్డ్ మన్ సంస్థ ప్రాణాపాయస్థితిలో ఉన్నది. బుఫే సమయానుకూలమైన పెట్టుబడి సంస్థ స్టాక్స్ విలువను విపరీతంగా పెంచుతుంది.

జరగబోయే వ్యాపార వ్యవహారానికి కేవలం 16 సెకండ్ల తర్వాత ఆయనను గోల్డ్ మన్ బోర్డు మీటింగ్ కు పిలిచారు. ఫోను పెట్టిన వెంటనే, ఆయన రాజ్ రాజరత్నం అనే హెడ్జ్ ఫండ్ మేనేజర్ కు ఫోన్ చేసి చేశారు. ఆ కాల్ రికార్డ్ చేయబడలేదు. కానీ రాజరత్నం వెంటనే 175,000 గోల్డ్ మన్ శాక్స్ షేర్లు కొన్నారు. కనుక ఆ సెల్ ఫోన్ కాల్ లో సంభాషణ ఏమిటో మీరు ఊహించగలరు. అది జరిగిన కొన్ని గంటల తరువాత బుఫే - గోల్డ్ మన్ వ్యాపార ఒడంబడిక బహిరంగంగా ప్రకటించబడింది. గోల్డ్ మన్ శాక్స్ స్టాకు విలువ పెరిగి పోయింది. రాజరత్నం క్షణాల్లో మిలియన్ డాలర్లు సంపాదించారు.

జరిగిన భాగవతానికి అది ఒక ఉదాహరణ. గుప్తాగారి ఆంతరంగిక సమాచారం వల్ల 18 మిలియన్ డాలర్ల లాభాలు వచ్చాయని స్టాక్ ఎక్స్ఛేంజ్ అంతరంగ అధిపతుల పంచనా.

అది సునాయాసంగా లభించిన ధనం. న్యాయస్థానానికి అంతకంటే సులువైన కేసు.

లోపాయకారీగా వ్యాపారం జరిపినందుకు గుప్తా, రాజరత్నం ఇద్దరు జైలుకు వెళ్లారు. వారి పరపతి, ఉద్యోగాలు తిరుగులేకుండా ధ్వంసం అయిపోయాయి.

ఇప్పుడు బెర్నీ మెడాఫ్‌ను గమనించండి. ఆయన నేరం నలుగురికి తెలిసినదే. చార్లెస్ పాంజి తరువాత ఆయనతో సమానమైన పన్నాగాలు పన్నటంలో మెడాఫ్ ప్రఖ్యాతి చెందారు. మెడాఫ్ పెట్టుబడిదారులను దాదాపు రెండుదశాబ్దాలపాటు

దోచుకుతిన్నాడు. అప్పుడు ఆయన వ్యవహారం బయటపడింది. గుప్త బండారం బయట పడిన రెండు వారాలకు మెడాఫ్ రహస్యం బయట పడటం వ్యంగ్యం.

ఇక్కడ గుప్తా లాగానే మెడాఫ్ కూడా మోసగాడు అనే విషయం ఉపేక్షించ బడింది. పాంజీ పథకంతోనే మెడాఫ్ వెలుగులోకి వచ్చారు. అంతకుముందు ఆయన సక్రమంగా వ్యాపారం చేసి ఆశించని విజయాలు సాధించారు.

మెడాఫ్ మార్కెట్ నిర్మించగల సమర్థుడు. ఆయన స్టాక్స్ అమ్మేవారిని, కొనేవారిని జత కూరుస్తారు. అదే ఆయన ముఖ్యవ్యాపకం. అందులో ఆయన అత్యంత సమర్థుడు. మెడాఫ్ మార్కెట్ నిర్మించే సంస్థను గురించి 1992 లో వాల్ స్ట్రీట్ జర్నల్ ఇలా రాసింది:

> బెర్నార్డ్ ఎల్ మెడాఫ్ ఇన్వెస్ట్ మెంట్ సెక్యూరిటీస్ పేరున ఆయన చాలా లాభసాటి అయిన సంస్థను స్థాపించారు. ఆ సంస్థ స్టాక్ ఎక్స్ఛేంజ్ నుంచి భారీ మోతాదులో వ్యాపారం చేస్తోంది. మెడాఫ్ సంస్థ రోజుకు 740 మిలియన్ డాలర్ల వ్యాపారం చేస్తోంది. న్యూయార్క్ స్టాక్ ఎక్స్ఛేంజ్ దినసరి వ్యాపారంలో అది 9 శాతం అవుతుంది. మెడాఫ్ సంస్థ స్టాక్ అమ్మకాలు, కొనుగోళ్లు అత్యంత వేగంగా అతి చవకగా నిర్వహిస్తుంది. వాస్తవానికి తమ కొనుగోలుదారుల ఆర్డర్లు చేపట్టి వ్యవహరించినందుకు ఇతర బ్రోకరేజ్ సంస్థలకు ఒక్కొక్క షేర్‌కి ఒక పెన్నీ చొప్పున చెల్లిస్తుంది. వ్యాపారంలో ఆ వేగం వల్ల అమ్మకాలు కొనుగోలు ధరల మార్పులవల్ల ఆ సంస్థ విపరీతమైన లాభాలు గడిస్తున్నది.

అక్కడ జరుగుతున్న మోసం తెలియని వార్తావిలేఖరి వ్రాస్తున్న వ్యాసం కాదు ఇది. మెడాఫ్ మార్కెట్ నిర్మాణం వ్యాపారం చాలా రుజుమార్గంలో నడిచింది. ఆ సంస్థలో పనిచేసిన ఒక ఉద్యోగి మెడాఫ్ వ్యాపారం సంవత్సరానికి 25 నుంచి 50 మిలియన్ డాలర్ల వరకు సంపాదించిందని చెప్తారు.

న్యాయ సమ్మతంగా మోసం లేకుండా బెర్నీ మెడాఫ్ చేసిన వ్యాపారం విపరీతమైన విజయం సాధించింది. అది ఆయనను న్యాయసమ్మతంగా అత్యంత ధనికుడిని చేసింది.

అయినా కూడా మోసమే చేశాడు ఆయన.

గుప్తాను, మేడాఫ్ ను అడగవలసిన ప్రశ్న: వందలకొద్ది మిలియన్ల డాలర్లు సంపద ఉండి కూడా వారికి ఇంకా ఇంకా కావాలనే అత్యాస ఎందుకు కలిగింది? అందుకోసం వారు ఇంకా ఇంకా సంపాదించే ప్రయత్నంలో అన్నిటినీ మించిన సాహసం ఎందుకు చేశారు?

బ్రతుకుతెరువు లేక అవస్థ పడేవారు చేసే నేరం ఒకవైపు. ఒక నైజీరియన్ స్కాన్ ఆర్టిస్టు న్యూయార్క్ టైమ్స్‌తో అన్నాడు: ఇతరులను బాధ పెట్టినందుకు తనకు దోషిగా ఫీలవుతున్నానని చెప్పాడాయన కానీ "పేదరికం ఆ బాధ అనుభవించనియ్యదు" అని కూడా చెప్పాడు.[13]

గుప్తా, మెడాఫ్ అనుసరించింది మరొక మార్గం. వాళ్లకు అంత ఉన్నది: అనూహ్యమైన సంపద, పరపతి, ఆధిపత్యం, స్వేచ్ఛ అన్నీ ఉన్నాయి. కానీ ఇంకా ఇంకా కావాలి అనే ఆశతో వాళ్ళు దానిని అంతటిని తోసిపుచ్చారు.

'చాలినంత' అంటే ఎంత అనే గ్రహింపు వాళ్లకు లేకపోయింది.

ఇవి అత్యంత అతిశయమైన ఉదాహరణలు. కానీ నేరాలు చెయ్యకుండానే ఇటువంటి ప్రవర్తన జరిగే అవకాశాలు ఉన్నాయి.

లాంగ్ టర్మ్ క్యాపిటల్ మేనేజ్మెంట్ సంస్థ ఫండ్స్ మేనేజ్ చేస్తోంది. వాళ్ల ఉద్యోగులు అందరూ వ్యాపారులే. అందరూ మిలియన్ల కొద్ది డాలర్ల సంపన్నులు. వారి సంపద అంతా వారి సొంత ఫండ్స్ లోనే పెట్టుబడి పెట్టి ఉంటుంది. అప్పుడు ఇంకా ఇంకా సంపాదించాలనే ఆశతో వాళ్లు అనుకోని రిస్క్ తీసుకున్నారు. చివరికి అంతా నష్టపోయారు. ఇది 1998 లో ఆర్థికస్థితి అత్యంత దృఢంగా ఉన్నప్పుడు, స్టాక్ మార్కెట్లు ఉధృతంగా ముందుకు దూసుకు వెళుతున్నప్పుడు జరిగిన ఉదంతం. ఆ తరవాత వారెన్ బుఫే అంటారు:

> వాళ్ల దగ్గర లేనిది, వారికి అవసరం లేనిది అయిన డబ్బు సంపాదించటానికి వాళ్లకు ఉన్నది వాళ్లకు అవసరమైనది అయిన సొమ్ము అంతా పెట్టుబడి పెట్టి చేశారు. అది మూర్ఖత్వం. చెప్పరాని మూర్ఖత్వం. మీకు అవసరంలేని దానికోసం మీకు అత్యంత అవసరమైనదంతా పెట్టుబడి పెట్టి రిస్కు తీసుకోవడం ఏమాత్రం విచక్షణాజ్ఞానం కాదు.

మీకు అవసరమైనది మీకు ఉన్నది. మీకు అనవసరమైనదానికోసం, మీకు లేనిదాని కోసం రిస్క్ చేసి పెట్టుబడి పెట్టడం అకారణం.

ఆ విషయం కళ్లకు కట్టినట్టు ఎదురుగా కనబడుతున్నది. కానీ అదే ఉపేక్షించబడుతున్నది.

గుప్తా, మెడాఫ్ లాగా నూరు మిలియన్ డాలర్ల సంపద మనలో ఎవరికో చాలా చాలా కొద్దిమందికి ఉంటుంది. కానీ ఈ పుస్తకం చదివేవారిలో చెప్పుకోదగిన శాతం జీవితంలో ఎప్పుడో ఒకప్పుడు మంచిసొమ్ము సంపాదించి అవసరాలన్నీ తీరటానికి, ఆ తర్వాత అంతకు మించిన కోరికలు తీరటానికి తగినంత సంపన్నులు అవుతారు.

అటువంటి వారిలో మీరు కూడా ఒకరైతే కొన్ని విషయాలు గుర్తుంచుకోండి.

## 1. మీ లక్ష్యం ముందుకు కదలకుండా నిశ్చలంగా పట్టి ఉంచగలగటమే అత్యంత కఠినమైన ఆర్థిక నైపుణ్యం.

కానీ ఇది అత్యంత ముఖ్యమైన విషయం. ఫలితాలతోపాటు మీ అపేక్ష కూడా పెరుగుతూ ఉంటే ఇంకా ఇంకా సంపాదించడానికి శ్రమ పడటంలో అర్థం లేదు. ఎందుకంటే అంత శ్రమపడి ఆశించినది సంపాదించిన తరువాత మళ్ళీ మీకు అదే అనుభూతి కలుగుతుంది. సంపద, అధికారశక్తి, పరువు ప్రతిష్టలు ఇంకా ఇంకా కావాలి అనే ఆశ మన సంతృప్తిని అధిగమించి అది చాలా ప్రమాదకారి అవుతుంది. అప్పుడు ఒక అడుగు ముందుకు వేస్తే లక్ష్యం రెండడుగులు ముందుకు వేస్తుంది. అప్పుడు మీరు వెనక పడుతున్నారన్న అనుభూతి కలుగుతుంది. ఆ లక్ష్యం అందుకోవాలి అంటే ఇంకా ఇంకా అధికమైన రిస్కులు తీసుకోవాలి.

ఆధునిక పెట్టుబడిదారీ వ్యవస్థ రెండు విషయాలలో అగ్రగామి: సంపద సృష్టించటంలోనూ, అసూయను పెంచి పోషించటంలోనూ. అవి రెండూ బహుశా చేతిలో చెయ్యేసి నడుస్తాయి. మీతోటి వారినందరినీ అధిగమించడమే ఆ చెమటోడ్చటానికి ఇంధనం అవుతుంది. చాలును అనే భావన లేకపోతే జీవితంలో సంతోషం కరువవుతుంది. ఫలితాలలో నుంచి అపేక్షలను తీసివేయగా మిగిలినదే ఆనందం అంటారు.

## 2. సామాజికంగా ఒకరితో ఒకరు పోల్చుకోవటమే ఇక్కడ పెద్దసమస్య.

సంవత్సరానికి ఐదు లక్షల డాలర్లు సంపాదించే ప్రొఫెషనల్ బాస్కెట్ బాల్ ప్లేయర్ ని తీసుకోండి. ఎటువైపు నుంచి చూసినా ఆయన ధనవంతుడు అనటంలో సందేహం లేదు. ఇప్పుడు ఆయన మైక్ ట్రౌట్ ఆడుతున్న టీం లోనే ఆడుతున్నాడనుకోండి. ఆయనకు అంటే ట్రౌట్ కు 12 సంవత్సరాలకు 430 మిలియన్ డాలర్ల కాంట్రాక్టు ఉన్నది. ఆయనతో పోలిస్తే మన బాస్కెట్బాల్ క్రీడాకారుడు నిరుపేద కిందనే లెక్క. ఇప్పుడు మైక్ ట్రౌట్‌ను గురించి ఆలోచించండి. సంవత్సరానికి 36 మిలియన్ డాలర్లు అంటే పిచ్చెక్కించే మొత్తం. అదే అందరికంటే ఎక్కువ జీతాలు సంపాదించే పదిమంది హెడ్జ్ ఫండ్ మేనేజర్లలో ఒకరు కావాలంటే 2018 లో మీరు సంవత్సరానికి కనీసం 340 మిలియన్ డాలర్లు సంపాదించాలి.[14] బహుశా ట్రౌట్ వంటి వ్యక్తులు తమ ఆదాయాన్ని పైన చెప్పిన ఆదాయంతో పోల్చి చూస్తారనుకుంటాను. ఇక్కడ సంవత్సరానికి 340 మిలియన్ డాలర్లు సంపాదించే హెడ్జ్ ఫండ్ మేనేజర్ సంవత్సరానికి కనీసం 770 మిలియన్ డాలర్లు సంపాదించే ఐదుగురు హెడ్జ్ ఫండ్ మేనేజర్లతో తనను పోల్చుకుంటారు. శిఖరాగ్రాన ఉన్న ప్రజలు తమ వంతుకు వారు వారెన్ బుఫే (2018లో ఆయన వ్యక్తిగత సంపద 3.5 బిలియన్ డాలర్లు పెరిగింది) వంటి వ్యక్తులతో పోల్చుకుంటారు. బహుశా ఇటువంటి వ్యక్తులు జెఫ్ బెజోస్ (ఆయన విలువ 2018లో 24 బిలియన్ డాలర్లు పెరిగింది. అంటే ప్రతి నిమిషానికి ఆయన సంపాదించేది "ధనికుడైన" బాస్కెట్ బాల్ క్రీడాకారుడు సంవత్సరం మొత్తం సంపాదించే దానికంటే ఎక్కువ) వంటి వారి వైపు చూస్తారనుకుంటాను.

ఇక్కడ గమనించవలసింది ఏమిటంటే సామాజికంగా ఒకరితో ఒకరు పోల్చుకుంటూ ఉంటే ఆ పోలిక ఎన్నటికీ ఆగదు. అది ఎవరికీ అందదు. అంటే అది ఎన్నటికీ జయించి సాధించగలిగిన ప్రయత్నం కాదు. అది జయించటానికి పోరాడకుండా ఉండటమే ఏకైక మార్గం. మీకు కూడా చాలినంత ఉన్నది (మీ ఇరుగుపొరుగు వారి కంటే తక్కువ ఉన్నా) అని అంగీకరించడమే ఉత్తమ మార్గం.

నా మిత్రుడు ఒకరు ప్రతి సంవత్సరము లాస్ వేగాస్ పర్యటన చేసి వస్తారు. ఒక సంవత్సరం ఆయన ఒక డీలర్ను అడిగారు: అక్కడ మీరు ఏమి

ఆటలు ఆడతారు? ఏ క్యాసినోలో ఆడతారు? "లాస్ వేగాస్ క్యాసినోలో గెలవాలి అంటే అక్కడ ప్రవేశించిన మరుక్షణమే నిష్క్రమించడమే ఉత్తమ మార్గం" అని ఆ డీలర్ అతి సీరియస్‌గా సమాధానం చెప్పారు.

పొరుగు వారితో సరితూగాలి అనే ప్రయత్నం కూడా సరిగ్గా ఇటువంటిదే.

## 3. "చాలినంత" అంటే తక్కువేమీ కాదు.

"చాలినంత" అనే భావం సంప్రదాయవాదంలాగా తోచవచ్చు. అంటే అవకాశాలను, సంభావ్య శక్తులను గాలికి వదిలివేసిన భావన కలగవచ్చు.

కానీ అది నాకు సబబుగా తోచదు.

"చాలినంత" అంటే, ఇంకా ఇంకా ఎంతటికీ తనివితీరని అత్యాశ మిమ్మల్ని చింతాక్రాంతులను చేస్తుందని గ్రహించటం.

మీరు ఎంత ఆహారం తినగలరో తెలుసుకోవటానికి కడుపులో నొప్పి వచ్చినదాకా తినటం ఒక్కటే మార్గం. ప్రయత్నించే వాళ్ళు చాలా అరుదు. ఎందుకంటే దీన్ని సుఖంగా అనుభవించటంకంటే వాంతి చేసుకోవటం కష్టమైనపని, బాధాకరమైన పని. వ్యాపారంలోనూ, పెట్టుబడిలోనూ ఇదే తర్కం ఎందుకు వర్తించదో తెలియదు. చాలామంది దివాలా తీసి నెత్తిన చెంగు పడినప్పుడే ఈ ప్రయత్నాలు మానుతారు. ఉద్యోగంలో నడుంవిరిగి కిందపడిపోయేదాకా పనిచేయటంవంటి అమాయకత్వం కావచ్చు ఇది. మీకు అలివిగాని పెట్టుబడికూడా అటువంటిదే. ఈ దండానికి ఆ చివర రజత్ గుప్తా, బెర్నీ మెడాఫ్ వంటి వ్యక్తులు ఉంటారు. తర్వాత ఏమవుతుంది అని పట్టించుకోకుండా, వాళ్ళు ప్రతి ఒక్క డాలరు దొంగిలించటానికి ప్రయత్నిస్తారు.

ఏది ఏమైనా ఒక డాలరు వస్తుందంటే కాదనలేని అశక్తత ఏదో ఒకనాడు మీకు పట్టుకుంటుంది.

## 4. సంభావ్య ఆదాయం ఎంత ఉన్నా సరే ముట్టుకోకూడని వస్తువులు చాలా ఉన్నాయి.

జైలునుంచి విడుదల అయిన తరువాత రజత్ గుప్తా న్యూయార్క్ టైమ్స్ తో తను ఒక గుణపాఠం నేర్చుకున్నాను అని చెప్పారు:

> దేనితోనూ అతిగా బంధం పెంచుకోకండి - మీ ప్రతిష్ఠ, మీ విజయాలు వగైరా ఏవైనా సరే. వాటిని గురించి నేను ఇప్పుడు ఆలోచిస్తున్నాను. ఏమవుతుంది? ఈ సంఘటన నా పరువు ప్రతిష్ఠలను అన్యాయంగా ధ్వంసం చేసింది. నేను నా పరువు ప్రతిష్ఠలను అంటిపెట్టుకొని ఉంటే అప్పుడు ఈ భావన నన్ను బాధ పెడుతుంది.

అనుభవపూర్వకంగా ఆయన నేర్చుకున్నవాటిలో ఇది అధమాధమమైన గుణపాఠం. తన పరువు ప్రతిష్ఠలు మంటగలిశాయని ఆయనకు తెలుసు. ఎలాగైనా సరే వాటిని తిరిగి సంపాదించాలని ఆయన ఆరాటం. కనుకనే ఆయన తనను తాను సమర్థించుకుంటూ తృప్తి చెందుతున్నారు.

పరువు ప్రతిష్ఠలు అమూల్యమైనవి.

స్వేచ్ఛా స్వాతంత్ర్యాలు అమూల్యమైనవి.

కుటుంబము, మిత్రులు అమూల్యం.

మీకు ఆప్తులైన వారు మిమ్మల్ని ప్రేమించటం అమూల్యం.

అసలైన ఆనందం అమూల్యం.

వీటినన్నిటినీ భద్రంగా కాపాడుకోవాలంటే వాటికి హానిచేసే రిస్క్ తీసుకోవటం ఎప్పుడు, ఎక్కడ ఆపాలో తెలుసుకోవటమే కీలకం. మీకు “చాలినంత” అంటే ఎంతో తెలుసుకోవటమే ముఖ్యం.

“చాలినంత” సంపాదించటానికి, సాధించడానికి అవసరమైన సాధనం చాలా చాలా సరళం అనేదే శుభవార్త. వీటిని ధ్వంసం చేసే రిస్కులు తీసుకోవాల్సిన అవసరం లేదు. తర్వాతి అధ్యాయం అదే.

# 4.

# అబ్బుర పరిచే చక్రవృద్ధి

వారెన్ బుఫే 84.5 బిలియన్ డాలర్ల ఆస్తిలో 81.5 బిలియన్ డాలర్లు ఆయన 65వ పుట్టినరోజు తర్వాత వచ్చాయి. అటువంటి అసంగత సంఘటనలతో వ్యవహరించే శక్తి మన మనసులకు లేదు.

ఒక రంగంలో పాఠాలు మనకు అందుకు సంబంధించిన రంగాలను గురించి ముఖ్యమైన పాఠాలు నేర్పగలవు. మంచు యుగాల బిలియన్ సంవత్సరాల సుదీర్ఘ చరిత్ర తీసుకోండి. మన డబ్బును పెంచడాన్ని గురించి అవి ఏమి చెబుతున్నాయో చూద్దాం.

---

ఈ భూమిని గురించి మన విజ్ఞానం వయస్సు మీరనుకున్న దానికంటే తక్కువ. ఈ ప్రపంచం పనిచేసే విధానం తెలుసుకోవాలంటే భూమి ఉపరితలాన్ని డ్రిల్లింగ్ చేసి లోపలికి వెళ్లాలి. ఇటీవలిదాకా ఇది మనకు సాధ్యం కాలేదు. మనము మన గ్రహాన్ని గురించి కొన్ని ప్రాథమిక లక్షణాలు తెలుసుకోవటానికి కొన్ని వందల సంవత్సరాల పూర్వమే ఐజాక్ న్యూటన్ నక్షత్రాల కదలికలను లెక్క వేశారు.

ఈ భూమి అనేక పర్యాయాలు మంచుతో కప్పబడి పోయింది. శాస్త్రవేత్తలు ఈ విషయాన్ని 19వ శతాబ్దం దాకా అంగీకరించలేదు.[15] అపరిమితంగా ఉన్న సాక్ష్యాధారాల వల్ల వాళ్ళు అందుకు విరుద్ధంగా వాదించలేకపోయారు. అంతకుముందు గడ్డకట్టుకుపోయిన ప్రపంచం వేలిముద్రలు ప్రపంచమంతటా విస్తరించి ఉన్నాయి. యాదృచ్ఛికంగా చాలాచోట్ల విసిరేసినట్లు పడిఉన్న గండ శిలలు, పలుచని పొరలుగా మిగిలిపోయిన శిలాశయ్యలు. అక్కడ ఒక్కటి కాదు ఐదు మంచుయుగాలు ఉండేవని స్పష్టంగా రుజువయింది. అన్నీ లెక్కలకు, కొలతలకు అందుబాటులో ఉన్నాయి.

ఉపగ్రహాన్ని గడ్డకట్టడానికి, దానిని మళ్ళీ కొత్తగా కరిగించడానికి, కరిగిన దానిని మళ్ళీ గడ్డకట్టించడానికి అవసరమయ్యే శక్తి ఊహించడానికి కూడా అలవి కాదు. ఈ ఆవృత్తాలను భూమి మీద కలిగిస్తున్న ఆ శక్తి ఏమిటి? అది ఈ గ్రహంమీద అత్యంత బలీయమైన శక్తి అయి ఉండాలి.

ఆ మాట నిజం. కానీ అది అందరూ ఆశించినది మాత్రం కాదు.

మంచుయుగాలు ఎందుకు సంభవించాయనే విషయంమీద చాలా సిద్ధాంతాలు ఉన్నాయి. అఖండమైన వాటి భూగర్భశాస్త్ర ప్రభావం తెలియజెప్పటానికి ఆ సిద్ధాంతాలుకూడా బ్రహ్మాండంగా రూపొందాయి. పర్వత శ్రేణులు పైకి వచ్చినందువల్ల భూమిమీద గాలుల దిశ మారిపోయింది. తద్వారా వాతావరణం మారిపోయిందనేది ఒక సిద్ధాంతం. మరొక సిద్ధాంతం ప్రకారం మంచు మాత్రమే సహజస్థితి అనీ మధ్యలో కలిగిన అగ్నిపర్వత విస్ఫోటనంవల్ల భూమి వేడి ఎక్కిందనీ.

కానీ మంచుయుగాలు ఒకదాని తర్వాత ఒకటి రావటం పోవటం ఈ సిద్ధాంతాలు ఏవీ విపులీకరించలేక పోయాయి. పర్వత శ్రేణులు పెరగటం, అగ్నిపర్వతాల విస్ఫోటనం ఒక మంచుయుగాన్ని సమర్థించవచ్చు. కానీ ఒకదాని తర్వాత ఒకటిగా వచ్చిన ఐదు మంచుయుగాలను ఈ సిద్ధాంతాలు ఏవీ సమర్థించలేవు.

ఇరవయ్యో శతాబ్దం మొదట్లో మీలుటిన్ మిలాంకోవిచ్ అన్న సైబీరియన్ శాస్త్రవేత్త ఇతరగ్రహాలతో భూమి స్థావరం ఎక్కడ ఉన్నదో అధ్యయనంచేసి మంచుయుగాలను గురించి ఒక సిద్ధాంతం ప్రతిపాదించారు. అది నిర్దిష్టమైన సిద్ధాంతమని అందరికీ తెలుసు. సూర్య చంద్రుల ఆకర్షణశక్తి భూమిచలనాన్ని ప్రభావితం చేస్తుంది. భూమి కొద్దిగా సూర్యుడి దిశగా వంగి ఉంటుంది. ఈ చంక్రమణంలో – అది కొన్ని వేలసంవత్సరాల కాలం కావచ్చు – భూమి ఉత్తర దక్షిణ అర్ధగోళాలు మామూలుకంటే కొంచెం ఎక్కువ తక్కువలుగా సూర్య ధార్మిక శక్తి పొందుతాయి.

అక్కడే తమాషా మొదలవుతుంది.

భూమి అర్ధగోళాలు సూర్యుడివైపు వంగటంవల్ల విపరీతమైన శీతాకాల పరిస్థితులు ఏర్పడ్డాయనీ, అందువల్ల భూమి అంతా మంచుముద్దగా మారిపోయిందనీ మిలాంకోవిచ్ తొలి సిద్ధాంతం. వ్లాదిమిర్ కొప్పెన్ అనే రష్యన్ వాతావరణ శాస్త్రవేత్త మిలాంకోవిచ్ సిద్ధాంతం క్షుణ్ణంగా పరిశీలించి అందులో సమ్మోహనకరమైన సూక్ష్మం కనుక్కున్నారు.

సుమారుగా చల్లగా ఉండే గ్రీష్మకాలమ్ - చలితో గడ్డకట్టించే శీతాకాలం కాదు - ఆ మంచు యుగాలకు కారణం.

గ్రీష్మ ఋతువులో క్రితం సంవత్సరం మంచు కరిగిపోయేటంత వేడి లేకపోతే, అక్కడ మిగిలిపోయిన మంచు రాబోయే శీతాకాలంలో మరింత మంచు పేరుకోవటానికి మూలకారణమవుతుంది. అప్పుడు తర్వాతి వేసవిలో మరికొంత మంచు మిగిలిపోతుంది. తర్వాత వచ్చే శీతాకాలంలో మంచు మరింత గడ్డ కట్టటం ఇంకా సులభతరమవుతుంది. నిరంతరం ఉండే ఈ మంచు సూర్యకిరణాలను ప్రతిఫలిస్తుంది. అందువల్ల భూమి ఇంకా ఇంకా చల్లబడుతుంది. అందువల్ల మంచుపడటం ఇంకా పెరుగుతుంది. ఈ ఆవృత్తం ఇలా కొనసాగుతూనే ఉంటుంది. కొన్ని వందల సంవత్సరాలలో రుతుక్రమంలో పడే మంచు ఖండాంతర హిమవత్ ఆచ్ఛాదనంగా మారిపోతుంది. అప్పుడు మన పరుగులు మొదలవుతాయి.

విపర్యయంగా కూడా ఇదే జరుగుతుంది. సూర్యరశ్మి ఎక్కువగా పడేట్లు భూమి వంగితే సూర్యరశ్మి మంచును కరిగిస్తుంది. తర్వాత సంవత్సరాలలో సూర్యరశ్మి ప్రతిఫలించటం తగ్గుతుంది. అందువల్ల ఉష్ణోగ్రత పెరుగుతుంది. ఆ కారణంగా ఆ పై సంవత్సరం మంచు పడటం తగ్గుతుంది. ఆ ప్రక్రియ అలా కొనసాగుతుంది. అదీ ఆవృత్తం.

పరిస్థితులలో కలిగే చిన్నమార్పులవల్ల ఎంతబృహత్ పరిమాణాలు కలుగుతాయా అన్నదే ఇక్కడ ఆశ్చర్యకరమైన విషయం. చల్లని వేసవిలో మిగిలిపోయిన సన్నని మంచుపొర - ఆ సమయంలో దానిని గురించి ఎవరూ ఆలోచించరు - వల్ల భూమి (భూగోళశాస్త్ర రీత్యా కనురెప్పపాటులో) - అంతా మైళ్ళకొద్దీ మంచులో మునిగిపోతుంది. "ఈ మంచు పొరలు ఏర్పడటానికి అక్కడ మిగిలిపోయి ఉన్న మంచు కారణం కాదు. ఉన్నకొద్ది మంచు కలకాలం అలాగే ఉంటుంది అన్న వాస్తవమే అందుకు మూలం" అంటారు గ్లేషియాలజిస్ట్ గ్వెన్ శుల్జ్.

మంచు యుగాలనుంచీ ఉద్భవించే వాస్తవం ఏమిటంటే, అద్భుతమైన ఫలితాలు సాధించటానికి అద్భుతమైన శక్తి అవసరం లేదు.

కొన్ని రసాయనాలలో – కొంచెం అభివృద్ధి తర్వాతి వృద్ధికి ఇంధనంగా పనిచేస్తుంది – ఆరంభ దశలో చాలా అల్పమైన మూలకం ఊహాతీతమైన ఫలితాలకు దారితీస్తుంది. అక్కడ తర్కం ఎందుకూ పనికిరాదు. అది తర్కానికి ఎంత అతీతమంటే, సాధ్యాసాధ్యాలు మీరు చాలా తక్కువగా అంచనా వేస్తారు.

డబ్బుతో కూడా అదే తీరు.

---

వారెన్ బఫే తన సంపద ఎలా నిర్మించారనే విషయం మీద రెండువేలకు పైగా పుస్తకాలు ఉన్నాయి. వాటిలో చాలాపుస్తకాలు అద్భుతంగా ఉంటాయి. కానీ అతి సరళమైన వాస్తవాన్ని చాలా కొద్ది పుస్తకాలు మాత్రమే శ్రద్ధ వహించి చెప్పాయి. బఫే మంచి పెట్టుబడిదారులనటంలో సందేహం లేదు. కానీ ఆయన సంపద అంతా కేవలం అందువల్ల కలగలేదు. ఆయన చిన్నతనంనుంచి కూడా మంచి పెట్టుబడిదారులే కావటమే అందుకు మూలం.

నేను ఈ విషయం వ్రాస్తున్నప్పుడు వారెన్ బఫే ఆస్తిపాస్తులు మొత్తం 84.5 బిలియన్ డాలర్లు. అందులో 84.2 బిలియన్ డాలర్లు ఆయన 50 వ పుట్టిన రోజు తరువాత సంపాదించినవి. 81.5 బిలియన్ డాలర్లు ఆయన ఏడవ దశకం మధ్యలో ఉన్నప్పుడు సామాజిక భద్రతకు అర్హులయిన తరువాత వచ్చినవి.

వారెన్ బఫే అసాధారణమైన పెట్టుబడిదారులు. కానీ ఆయన సఫలత కు అంతటికి పెట్టుబడిలో ఆయన నైపుణ్యమే మూల కారణమంటే మనము ఒక కీలకమైన అంశాన్ని విస్మరిస్తున్నామన్నమాట. దాదాపు 75 సంవత్సరాల కాలం ఆయన అసాధారణమైన పెట్టుబడిదారులుగా కొనసాగారు అన్నదే ఆయన అద్వితీయ విజయానికి కీలకం. ఆయన తన పెట్టుబడులు నాలుగవ దశకంలో ప్రారంభించిన ఏడవ దశకంలో ముగించినట్లయితే ఆయన ఎవరికీ తెలిసే వారు కాదు.

ఇక్కడ ఒక చిన్న ఆలోచనా ప్రయోగం చెయ్యండి.

బఫే 10 సంవత్సరాల వయసులోనే సీరియస్‌గా పెట్టుబడి

మొదలుపెట్టారు. ఆయనకు 30 ఏళ్ళు వచ్చేసరికి సుమారు ఒక బిలియన్ డాలర్లు కూడబెట్టారు. ద్రవ్యోల్బణంతో సర్దుబాటు చేస్తే అది 9.3 మిలియన్ డాలర్లకు సమానం అవుతుంది.[16]

ఆయన తన కిశోరప్రాయము, మూడవ దశకము ఈ ప్రపంచాన్ని పరిశోధిస్తూ తన అనురక్తి ఏమిటో కనుక్కుంటూ ఉన్నట్లయితే ఆయన ఆస్తి మొత్తం సుమారు 25 వేల డాలర్లు మాత్రమే అయితే?

లేకపోతే ఇలా చూద్దాం.

ఆయన ప్రతిసంవత్సరము అసాధారణమైన (సాలీనా 22%) లాభాలు గడించారు. కానీ ఆయన పెట్టుబడి వ్యాపారం నుంచి అరవయ్యో ఏట నిష్క్రమించారు. గాల్ఫ్ ఆడారు. మనవళ్లు మనవరాళ్లతో సరదాగా కాలక్షేపం చేశారు అనుకుందాం.

అప్పుడు ఆయన ఆస్తిపాస్తుల విలువ ఈనాడు ఎంత ఉంటుంది?

84.5 బిలియన్ డాలర్లు మాత్రం కాదు.

అది కేవలం 11.9 మిలియన్ డాలర్లు మాత్రమే పై ఉండేది.

ఆయన అసలు ఆస్తిలో 99.9% తక్కువ.

ఎదుగుతున్న వయసులో ఆయన స్థాపించిన ఆర్థిక పునాదులు, వృద్ధాప్యంలో కూడా ఆయన కొనసాగించిన దీర్ఘకాల పెట్టుబడి వ్యాపారము ఆయన ఆర్థిక విజయానికి మూలస్తంభాలు.

పెట్టుబడిలో ఆయన నిపుణులే. కానీ దాని వెనుక దాగి ఉన్న రహస్యం సమయం.

చక్రవృద్ధి జరిగేది ఆ మార్గంలోనే.

ఈ విషయాన్ని మరొక కోణంలో ఆలోచించండి. బుఫే చరిత్రలోనే అత్యంత ధనికులైన పెట్టుబడిదారు. కానీ సాలీనా లాభాలు పరిగణిస్తే ఆయన అత్యంత ప్రతిభావంతులైన పెట్టుబడిదారులు మాత్రం కాదు.

రినైజాన్స్ టెక్నాలజీస్ లో హెడ్జ్ ఫండ్స్ అధిపతి జిమ్ సైమన్స్. ఆయన 1988 నుంచి సాలీనా 66% చక్రవృద్ధి సంపాదించారు. ఈ రికార్డుకు దరిదాపుల్లో

ఎవరూ రాలేరు. వారెన్ బఫే సాలీనా 22% వంతున సంపాదించినట్లు ఇంతకు ముందే మనం చూశాం. జిమ్ సైమన్స్ సంపాదనలో ఇది మూడవవంతు.

ఇది రాస్తున్న సమయంలో సైమన్ ఆస్తిపాస్తుల విలువ 21 బిలియన్ డాలర్లు. మనము వ్యవహరిస్తున్న సంఖ్యతో పోలిస్తే ఇది ఎంత అపహాస్యంగా ఉంటుందో నాకు తెలుసు. సైమన్స్ సంపద బఫే సంపద కంటే 75 శాతం తక్కువ.

సైమన్స్ అంత మేలైన పెట్టుబడిదారులైతే, ఈ వ్యత్యాసం ఎందుకు వచ్చింది? ఎందుకంటే 50-57 వచ్చిందాకా సైమన్స్ తన పెట్టుబడి వ్యాపారం మొదలు పెట్టలేదు. చక్రవృద్ధికి బఫేకు లభించిన సమయంలో సగంకూడా సైమన్స్‌కు లభించలేదు. బఫే తన సంపద కూడబెట్టటానికి వినియోగించిన సమయం సైమన్స్ కు కూడా లభించి ఉంటే - గట్టిగా ఊపిరి పీల్చండి -63 క్వింతిలియన్, 900 క్వాడ్రిలియన్, 781 ట్రిలియన్, 780 బిలియన్, 748 మిలియన్ 160000 డాలర్లు అయి ఉండేది.

ఇవన్నీ అసంభవమైన పరిహాసాస్పదమైన సంఖ్యలు. ఇక్కడ తెలుసు కోవలసిన విషయం ఏమిటంటే అభివృద్ధిలో చిరుమార్పులుగా కనిపించే అంకెలు పరిహాసాస్పదమైన అసంభావ్య సంఖ్యలుగా రూపొందుతాయి. మనము ఏదైనా ఒక ఘనమైన సంఘటన లేదా విషయం ఎలా జరిగింది అని అధ్యయనం చేస్తున్నప్పుడు - మంచుయుగం ఎందుకు ఏర్పడింది, వారెన్ బఫే అంత ధనవంతులు ఎందుకు అయ్యారు - ఆ విజయం వెనుక ఉన్న కీలక అంశాలను మనము ఉపేక్షిస్తాం.

మొట్టమొదటిసారిగా చక్రవడ్డీ టేబుల్ చూసినప్పుడు - లేకపోతే, 30వ యేట కాకుండా 20వ యేటనే పొదుపు చేయటం మొదలు పెడితే, మీరు ఎంత సంపాదించగలరో చెబితే - తమ జీవితాలు మారిపోయాయని చాలామంది చెప్పటం విన్నాను. కానీ, బహుశా అది జరగలేదు. కేవలం వాళ్లకు ఆశ్చర్యం మాత్రమే కలిగింది. ఎందుకంటే వాళ్ళు చూసిన సంఖ్యలు వాళ్ళ మనసుకు సాధ్యంగా తోచలేదు. సరళరేఖలో ఆలోచిస్తే ఏం జరగబోతుందో ఊహించడం సాధ్యం. కానీ అదే ఘాతీయ మార్గంలో ఊహించటం అసాధ్యం.

8+8+8+8+8+8+8+8+8 ఎంత అవుతుందో నోటిలెక్కన చెప్పమంటే మీరు కొన్ని సెకండ్లలో సమాధానం చెప్పగలరు (72!). అదే 8x8x8x8x8x8x8x8x8 ఎంత అవుతుందో నోటి లెక్కన చెప్పమంటే మీరు గుడ్లు తేల వేస్తారు (సమాధానం 134,217,728).

1950 వ దశకంలో IBM 3.5 మెగా బైట్ హార్డ్ డ్రైవ్ తయారు చేసింది. 1960 ల నాటికి అదే కొన్ని డజన్ మెగాబైట్లుగా ఎదిగింది. 1970 నాటికి వించేస్టర్ డ్రైవ్ 70 మెగా బైట్లు సాధించింది. ఆ తర్వాత డ్రైవ్ లు పరిమాణంలో క్రమంగా చిన్నవి అయ్యాయి వాటి సామర్థ్యం క్రమంగా పెరిగింది. 1990 ల నాటికి ఒక సాధారణ PC 200 – 500 మెగా బైట్ల సామర్థ్యం కలిగి ఉన్నది.

ఆ తర్వాత? దశదిశలా విస్ఫోటనం జరిగింది.

1999 – యాపిల్ సంస్థ iMac 6 గిగా బైట్ హార్డ్ డ్రైవ్ తో వచ్చింది.

2003 – Power Mac 120 గిగా బైట్ లతో వచ్చింది.

2006 – iMac 250 గిగా బైట్లు

2011 – మొదటి టెర్రా బైట్ డ్రైవ్

2017 – 60 టెర్రా బైట్ హార్డ్ డ్రైవ్‌లు

2019 – 100 టెర్రా బైట్ హార్డ్ డ్రైవ్‌లు

అంతా కలిపి చూడండి. 1950 నుంచి 1990 వరకూ 296 మెగా బైట్లు సాధించాం. 1990 నుంచి ఈనాటికీ 100 మిలియన్ మెగా బైట్లు సాధించాం.

మీరు సాంకేతిక ఆశావాదులైతే, 1950 దశకంలో ఆచారణాత్మకంగా సమాచారం నిలవ 1000 రెట్లు పెరుగుతుందని అంచనా వేశేవారు. సాధ్యాసాధ్యాలన్నీ ఆలోచిస్తే 10000 రెట్లు అవుతుందనే వారేమో. నా జీవిత కాలంలో 30 మిలియన్ రెట్లు పెరుగుతుందని చెప్పేవారు అరుదు. కానీ జరిగిన యదార్థం అదీ.

చక్రవృద్ధి సహజ జ్ఞానానికి విపర్యయంగా నడుస్తుంది. కనుక దానిశక్తి మనలో అత్యంత వివేచనాపరులు కూడా ఉపేక్షిస్తారు. 2004లో బిల్ గేట్స్ Gmail ని విమర్శించారు. ఎవరికైనా ఒక గిగాబైట్ స్టోరేజ్ ఎందుకు అవసరమవుతుందనేది ఆయన ప్రశ్న. స్టీవెన్ లెవీ వ్రాశారు: "అత్యాధునిక సాంకేతికతలో జీవిస్తూ కూడా, స్టోరేజ్ అనేది పరిమితంగా ఉపయోగించవలసిన

వస్తువు అన్న పాత భావనకు ఆయన అంటుకు పోయి ఉన్నారు." వస్తువులు, విషయాలు ఎంత వేగంగా అభివృద్ధి చెందుతాయనే ఆలోచన మీరు అలవరుచుకోలేరు.

చక్రవృద్ధి సహజజ్ఞానం కాదు. కనుక దాని సంభావ్యశక్తిని మనము ఉపేక్షిస్తే, సమస్యలు పరిష్కరించడానికి ఇతర మార్గాలు వెతుకుతాం. ఇదే ఇందులో ఉన్న ప్రమాదం. మనము అతిగా ఆలోచించడం లేదు. కానీ చక్రవృద్ధిలో ఉన్న సంభావ్యశక్తిని పరిగణించడానికి ఒక్క అడుగు వెనక్కివేసి ఆలోచించం.

బుఫే సఫలతను గురించి రాసిన రెండువేల పుస్తకాలలో ఏ ఒక్కటీ "ఆయన 75 సంవత్సరాల నుంచి పెట్టుబడి పెడుతూ ఉన్నారు" అనే శీర్షికతో వెలువడలేదు. కానీ ఆయన విజయాలకు ముఖ్య కారణం అదేనని మనకు తెలుసు. అది సహజజ్ఞానం కాదు కనుక అందులో తలదూర్చడం మీకు కష్టమైన పనవుతుంది.

ఆర్థిక అభివృద్ధి ఆవృత్తాలు, వ్యాపార వ్యూహాలు, ఇంకా అనేక విషయాల మీద చాలా పుస్తకాలు ఉన్నాయి కానీ అన్నిటికంటే ముఖ్యమైన శక్తివంతమైన పుస్తకం "నోరు మూయండి, కాచుకొని కూర్చోండి" అన్న పేరున రావాలి. అది దీర్ఘకాలిక ఆర్థిక అభివృద్ధిని సూచించే పట్టిక. ఒక పేజ్ మాత్రమే ఉంటుంది.

నిరాశ కలిగించే వ్యాపారాలకు, హానికరమైన వ్యూహాలకు, సఫలమైన పెట్టుబడి ప్రయత్నాలకు అన్నిటికీ చక్రవృద్ధి సహజజ్ఞానం కాకపోవటమే కారణమని ఇక్కడ నేర్చుకోవలసిన ఆచరణాత్మకమైన పాఠం.

పెట్టుబడులమీద వీలైనంత ఎక్కువ లాభాలు గడించాలనే ప్రయత్నాన్ని తప్పుబట్టలేం. ధనసంపాదనకు అదే ఉత్తమ మార్గమని తోస్తుంది.

మంచి పెట్టుబడి అంటే అత్యధిక లాభాలు మాత్రమే కాదు. అత్యధిక లాభాలనేవి ప్రతిరోజూ జరిగే సంఘటనలు కావు. చెప్పుకోదగిన లాభాలు నిరంతరమూ వస్తూనే ఉండే పెట్టుబడులు మంచి పెట్టుబడులు. దీర్ఘకాలంలో ఆ లాభాలు రావటం కొనసాగుతూనే ఉంటుంది. అప్పుడే చక్రవృద్ధి స్వైరవిహారం చేస్తుంది.

ఇందుకు విపర్యయం – అత్యధిక లాభాలు, నిత్యమూ జరిగేవికావు – విషాదాలకు దారి తీస్తుంది. అవి చెప్పటానికి తర్వాతి అధ్యాయం కావాలి.

# 5.
# సంపన్నులు కావటం సంపన్నులుగా ఉండటం

---

మంచి పెట్టుబడి అంటే మంచి నిర్ణయం
చెయ్యటం ఒక్కటే కాదు. వరసగా తప్పులు
చెయ్యకుండా ఉండటం

---

ధనికులు కావటానికి సవాలక్ష మార్గాలు ఉన్నాయి. అది ఎలా సాధించాలో చెప్పటానికి కావలసినన్ని పుస్తకాలు ఉన్నాయి.

కానీ ధనికులుగా ఉండటానికి మాత్రం ఒకటే మార్గం ఉన్నది: పొదుపు, మానసిక రుగ్మతల సమ్మేళనం.

తగినంతగా మనం చర్చించనిది ఈ విషయాన్నే.

ఇక్కడ ఇద్దరు పెట్టుబడిదారుల కథతో మొదలు పెడదాం. వారు ఒకరిని గురించి మరొకరికి తెలియదు. కానీ సుమారు ఒక శతాబ్దం క్రితం వారిద్దరూ ఒక ఆసక్తికరమైన మార్గంలో కలుసుకున్నారు.

---

తన తరంలో జెస్సీ లివర్ మోర్ అందరినీ మించిన స్టాక్ మార్కెట్ వ్యాపారి. ఆయన 1877లో పుట్టారు. మిగిలిన వాళ్లకు అలాకూడా చేయవచ్చునని తెలిసే లోపల ఆయన స్టాక్ మార్కెట్లో క్రయవిక్రయ వ్యాపారస్తులుగా స్థిరపడ్డారు. ఆయన 30 వ సంవత్సరం చేరుకునేసరికి నూరు మిలియన్ డాలర్ల (ద్రవ్యోల్బణానికి తగిన సర్దుబాటుతో) విలువగల అస్తి సాధించారు.

1929 నాటికి లివర్ మోర్ ప్రపంచంలోనే అత్యంత ప్రఖ్యాతి చెందిన పెట్టుబడిదారుగా ప్రసిద్ధికెక్కారు. ఆ సంవత్సరం స్టాక్ మార్కెట్ కుప్పకూలిపోయింది, దానితో ఘనాతి ఘనమైన ఆర్థిక సంక్షోభం ఏర్పడింది. అది చరిత్రలో ఆయన ఖ్యాతిని శాశ్వతంగా ముద్ర వేసింది.

1929 అక్టోబర్‌లో ఒక్క వారంలో స్టాక్ మార్కెట్ విలువలో మూడోవంతు తుడిచిపెట్టుకుపోయింది. ఆ వారం రోజులే తరువాత బ్లాక్ మండే, బ్లాక్ ట్యూస్ డే, బ్లాక్ థర్స్ డే, గా పేరు పొందాయి.

అక్టోబర్ 29న లివర్ లివర్ మోర్ ఇంటికి తిరిగి వచ్చినప్పుడు ఆయన భార్య దరోథీ అంతా సర్వనాశనం అయిందనే ఊహించింది. వాల్ స్ట్రీట్

ఊహాగానాలు చేసేవారు ఆత్మహత్యలు చేసుకుంటున్నారన్న వార్త న్యూయార్క్‌లో వ్యాపించిన సాగింది. ఆమె, పిల్లలు జెస్సికి తలుపు దగ్గర కన్నీళ్లతో స్వాగతం పలికారు. ఆమె తల్లి భయాందోళనలతో తలకిందులవుతూ మరొక రూమ్‌లో తలుపులు మూసి కూర్చున్నది.

ఏమి జరుగుతున్నదో గ్రహించేలోపల జెస్సీ కొద్ది క్షణాల పాటు (ఆత్మ కథ రచయిత టామ్ రూబితన్ చెప్పిన కథనం) తికమక పడ్డారు.

అప్పుడు ఆయన తన కుటుంబానికి అసలు విషయం చెప్పారు. మేధా, అదృష్టాల కలయికతో ఆయన స్టాక్ మార్కెట్‌ని తలకిందులు చేశారు. స్టాక్స్ విలువలు పడిపోతాయని ఆయన పందెం కాశారు.

"అంటే మనకు ఏమీ నష్టం కలగలేదా?" ఆయన భార్య దరోథీ అడిగింది.

"లేదు ప్రియా! ఇవాళ అన్నింటిని మించిన ఉత్తమమైన వ్యాపారం చేశాను. మనకు కావలసినంత సంపద ఉన్నది. మనము ఏది తలుచుకుంటే అది చేయవచ్చు." జేసీ అన్నారు.

దరోథీ తల్లిదగ్గరికి పరిగెత్తి ఆమెను సముదాయించింది.

ఒక్కరోజులో జెస్సి లివర్ మోర్ సుమారు మూడు బిలియన్ డాలర్లకు పైగా సంపాదించాడు.

స్టాక్ మార్కెట్ చరిత్రలోనే అత్యంత ప్రమాదకరమైన నెలలో ఆయన ప్రపంచంలోని అత్యంత ధనికులలో ఒకరుగా ఎదిగారు.

ఇక్కడ లివర్ మోర్ కుటుంబం ఊహాతీతమైన తమ విజయాలను ఆనందిస్తూ ఉంటే మరొక వ్యక్తి న్యూ యార్క్ వీధులలో దిక్కుతోచక తిరుగు తున్నాడు.

అబ్రహామ్ జర్మన్ స్కీ మల్టీ మిలియన్ డాలర్ల సంపద కలిగిన రియల్ ఎస్టేట్ వ్యాపారి. 1920వ దశాబ్దంలో ఆయన తన అదృష్టాన్ని అందలం ఎక్కించారు. ఆర్థిక వ్యవస్థ అనూహ్యంగా అభివృద్ధి చెందుతున్న సమయంలో సకల ఫలితాలు సాధించిన న్యూయార్క్ వాసులు అందరూ చేసినపనే ఆయన కూడా చేశారు. రోజురోజుకూ పెరిగిపోతున్న స్టాక్ మార్కెట్‌లో విపరీతంగా పెట్టుబడి పెట్టారు.

1929 అక్టోబర్ 26న న్యూయార్క్ టైమ్స్ రెండు పారాగ్రాఫులలో ఒక విషాదకరమైన వ్యాసం ప్రచురించింది:

> శ్రీమతి అబ్రహామ్ జర్మన్స్కీ నిన్న ఉదయం 225 బ్రాడ్వేలో నివసించే న్యాయవాది బెర్నార్డ్ హెచ్ స్టాండ్ లర్‌ను తన భర్త గురువారం ఉదయంనుంచి కనబడటం లేదని, ఆయనని వెతికి పట్టుకోవటంలో సహాయం చేయమని అడిగింది. జెర్మన్స్కీ 50 సంవత్సరాల వయస్సు ఉన్న రియల్ ఎస్టేట్ ఆపరేటర్. ఆయన స్టాక్ మార్కెట్లో చాలా భారీగా పెట్టుబడి పెట్టారని సాండ్లర్ కథనం.
>
> గురువారం సాయంత్రం తన భర్తను ఒక స్నేహితులు వాల్ స్ట్రీట్ లో స్టాక్ ఎక్స్చేంజ్ దగ్గర చూసినట్లు శ్రీమతి జెర్మన్స్కీ తనకు చెప్పింది అని సాండ్లర్ అన్నారు. తన భర్త రోడ్డు పక్కన బ్రాడ్వే దిశగా నడుస్తూ చేతిలో ఒక స్టిక్కర్ టేప్ ముక్కలు ముక్కలుగా చీల్చి దారిపొడుగునా పోస్తున్నారని ఆయన తనకు చెప్పినట్లు ఆమె చెప్పారు.

మనకు తెలిసినంతవరకూ అదే అబ్రహామ్ జర్మన్ స్కీ అంతిమ దర్శనం.

ఇక్కడే మనకు ఆ వ్యత్యాసం దర్శనమిస్తుంది.

1929 అక్టోబర్ పతనం జెస్సి లివర్ను ప్రపంచంలో అత్యధిక ధనికులలో ఒకరిని గా నిలబెట్టింది. అది అబ్రహామ్ జర్మన్స్కీని సర్వనాశనం చేసింది. బహుశా ఆయన ప్రాణం కూడా తీసిదేమో.

ముందుకు వెళితే ఈ కథలు మళ్ళీ దారిలో కలుసుకుంటాయి.

1929 ఉద్ధృతం తర్వాత లివర్ మోర్ పెల్లుబికిన ఉత్సాహం ఆత్మవిశ్వాసంతో ఇంకా ఇంకా పెద్దపెద్ద పందేలు కాయటం మొదలుపెట్టారు. అన్నీ ఆయన తల దాటిపోయాయి. అప్పుల్లో మునిగిపోయారు. చివరికి స్టాక్ మార్కెట్లో సర్వస్వం నష్టపోయారు.

కుప్పకూలిపోయి అవమానంతో ఆయన 1933 లో రెండు రోజుల పాటు కంటికి కనిపించకుండా పోయారు. ఆయన భార్య ఆయనను వెతకటానికి బయలుదేరింది. “1100 పార్క్ ఏవేన్యూలో నివసించే జెస్సీ లివర్ మోర్ స్టాక్ మార్కెట్ ఆపరేటర్ నిన్న సాయంత్రం 3 గంటల నుంచీ కనబడటం లేదు.” 1933లో న్యూయార్క్ టైమ్స్ ప్రచురించింది.

ఆయన తిరిగి వచ్చారు. కానీ ఆయన మార్గం అంతకు మునుపే నిర్ణయం అయిపోయి ఉన్నది. చివరికి ఆయన తన ప్రాణం తనే తీసుకున్నారు.

సమయము సందర్భము వేరు. కానీ జర్మన్ స్కీ, లివర్ మోర్ ఇద్దరిలోనూ ఒక గుణం సామాన్యంగా దర్శనమిస్తుంది. వాళ్ళ ఇద్దరికీ ధనికులు కావడం ఎలాగో బాగా తెలుసు. కానీ ధనికులుగా ఉండటం ఎంతమాత్రం తెలియదు.

మిమ్మల్ని మీరు సంపన్నులుగా పరిగణించక పోవచ్చు. పై కథలో నేర్చుకున్న గుణపాఠం అందరికీ అన్ని ఆదాయవర్గాల వారికి వర్తిస్తుంది.

డబ్బు సంపాదించడం ఒక ఎత్తు.

ఆ సంపాదించినదాన్ని కాపాడుకోవడం మరొక ఎత్తు.

---

డబ్బు విషయంలో సఫలత ఒక్క మాటలో చెప్పాలంటే 'బ్రతుకు తెరువు'.

బహిరంగంగా స్టాక్స్ క్రయ విక్రయాలు జరిపితే ఈ స్థాయికి చేరిన సంస్థలలో దాదాపు నలభై శాతం కాలక్రమేణా తమ విలువను పూర్తిగా కోల్పోయాయి. ఈ విషయం మనం ఆరవ అధ్యాయంలో గమనిస్తాం. అమెరికాలో అత్యధిక ధనవంతులను ఫోర్బ్స్ మ్యాగజైన్ 400గా ప్రచురిస్తుంది. ప్రతి దశాబ్దంలోనూ వారిలో 20 శాతం మాయమౌతూ ఉంటారు. ఇది ఆ వ్యక్తుల మరణం వల్ల కాదు, ఆ సొమ్మును మరొకరి పేరు వ్రాసినందుకు వల్లకాదు.[17]

పెట్టుబడిదారీ వ్యవస్థ కఠినమైన ప్రయాణం. డబ్బు సంపాదించటం, దానిని భద్రంగా కాపాడుకోవటం రెండు విభిన్న నైపుణ్యాలు. పెట్టుబడిదారీ వ్యవస్థలో కొంతవరకూ ఈ వ్యత్యాసమే కారణం.

డబ్బు సంపాదించాలి అంటే రిస్కు తీసుకోవాలి, ఆశావాదులుగా ఉండాలి, స్వయంగా కృషి చెయ్యాలి.

సంపాదించిన దానిని కాపాడుకోవటం అంటే రిస్కు తీసుకోవటానికి వ్యతిరేకం. అక్కడ నమ్రత కావాలి. అంతే కాక మీరు ఎంత శీఘ్రంగా సంపాదించారో అంత వేగంగానే అది మీ చేతుల్లోనుంచి మాయమవుతుందని భయం ఉండాలి. అక్కడ పొదుపరితనం కూడా కావాలి. మీరు సంపాదించిన దానిలో కొంతవరకైనా అదృష్టవశాత్తూ లభించింది అని మీరు అంగీకరించాలి. కనుక గతవిజయాలు మళ్లీ మళ్లీ పునరావృత మవుతాయని నమ్మకూడదు.

మైకేల్ మోరిట్జ్ ఒక బిలియనీర్. 'సెకోయా క్యాపిటల్' సంస్థ అధిపతి. సెకోయా అంతటి ఘన విజయం ఎలా సాధించింది అని చార్లీ రోజ్ అడిగారు. సాధారణంగా వెంచర్ క్యాపిటల్ సంస్థలు 5 - 10 సంవత్సరాల కాలం సఫలత సాధిస్తాయి. కానీ సెకోయా నాలుగు దశాబ్దాల పాటు అవిచ్ఛిన్నంగా సఫలత సాధించింది. అది ఎలా సాధ్యమైందని రోజ్ అడిగారు.

> మోరిట్జ్: మా వ్యాపారం దెబ్బతింటుందేమో అని మేము నిరంతరం భయపడుతూ ఉండేవాళ్ళ మనుకుంటాను.
>
> రోజ్: నిజంగానా? మీ విజయానికి భయమే కారణమా? ఇక్కడ భయస్తులు మాత్రమే జయించుకు వస్తారా?
>
> మోరిట్జ్: ఆమాట అక్షరాలా నిజం. రేపు నిన్నటిలాగా ఉండబోవటం లేదని మా నిత్య శంక.. నిర్లక్ష్యంగా ఉండకూడదు. నిన్నటి సఫలత రేపటి అదృష్టంగా మారబోతున్నదని ఎప్పుడూ కలలోనైనా ఊహించకూడదు.

ఇక్కడ కూడా అదే: మూలకం బతుకు తెరువు.

ఎదుగుదల, తెలివితేటలు, అంతర్దృష్టి కాదు. తుడిచిపెట్టుకుపోకుండా, బలవంతంగా బయటికి గెంటివేయబడకుండా తగినంత కాలం దానిని అంటిపెట్టుకొని ఉండటమే చావు బతుకుల మధ్య వ్యత్యాసం.

బతికి బట్టకట్టాలనే మనస్తత్వం డబ్బుతో ముడిపడి ఉండటానికి రెండు కారణాలు ఉన్నాయి.

మొదటిది కళ్ళకు కట్టినట్టు కనపడుతూనే ఉన్నది: అంత ఘనత సాధించినది తుడిచిపెట్టుకుపోవటానికి కాదు.

రెండవది, మనము నాలుగో అధ్యాయంలో చూసినట్లు చక్రవృద్ధిలో దర్శనం ఇచ్చే సహజ జ్ఞానానికి ప్రత్యర్థి గణితం.

ఒక ఆస్తికి సంవత్సరాల తరబడి అవకాశం ఇస్తే అది చక్రవృద్ధి పొందుతుంది. దీనిని ఓక్ చెట్లను నాటటంతో పోల్చవచ్చు. ఒక సంవత్సరంలో మీకు చెప్పుకోదగిన తేడా ఏమీ కనిపించదు. 10 సంవత్సరాలు దాటితే కంటికి కనిపించే వ్యత్యాసం దర్శనమీయవచ్చు. 50 సంవత్సరాలు ఓపిక పడితే మీరు అసాధారణమైన సృష్టి గమనిస్తారు.

ఆ అసాధారణ అభివృద్ధి సంపాదించి దానిని కాపాడటం చాలాచాలా మిట్ట పల్లాలు గడిచి భరించవలసి వస్తుంది. అవి జీవితంలో ప్రతి ఒక్కరికి కాలక్రమేణా అనుభవంలోకి రావడం సహజం.

తన పెట్టుబడుల మీద బుఫే అంతటి లాభాలు ఎలా ఆర్జించారు, అటువంటి ఉత్తమమైన సంస్థలు ఆయన ఎలా కనుక్కున్నారు, అతి చవకలో దొరికే స్టాక్స్, అత్యుత్తములైన మేనేజర్లు ఆయనకు ఎలా లభించారు అని చర్చించుతూ మనము ఎంతకాలమైనా గడపవచ్చు. అది చాలా జటిలమైన వ్యవహారం. కానీ ఆయన ఏమి చెయ్యలేదో తెలుసుకోవడం కష్టం కాదు కానీ అది చాలా ముఖ్యం.

ఆయన అప్పుల్లో మునిగి కొట్టుకు పోలేదు.

ఆయన జీవిత కాలంలో జరిగిన 14 ఆర్థిక మాంద్యాలలో భయపడి స్టాక్స్ అమ్మ చూపలేదు.

ఆయన తన వ్యాపార ప్రతిష్టకు భంగం కలగనివ్వలేదు. ఆయన ఒకే పథకానికి, ఒకే అభిప్రాయానికి, ఒకే ధోరణికి అంటిపెట్టుకుని కూర్చోలేదు.

ఆయన ఇతరుల డబ్బుమీద ఆధారపడ లేదు. (పబ్లిక్ సంస్థలో పెట్టుబడులు నిర్వహించడం అంటే పెట్టుబడిదారులు తమ మూలధనాన్ని వెనక్కు తీసుకోలేరు).

ఆయన నిర్వీర్యం అయ్యేవరకు పనిచేసి బయటికి నడవలేదు, వృత్తిలోనుంచి రిటైర్ కాలేదు.

ఆయన నిలదొక్కుకుని కొనసాగించారు. ఆ నిలదొక్కుకోవడంవల్ల ఆయనకు ఆయన వ్యాపారానికి చిరాయుష్షు లభించింది. చక్రవృద్ధి అద్భుతాలు జరపటానికి – పదో యేటనుంచి కనీసం 89 వ సంవత్సరంవరకూ – దీర్ఘాయుష్షు మూల కారణం. ఆయన సఫలత వర్ణించటానికి ఏకైక కారణం అదే.

నేను చెప్పేది మీకు అర్థం కావాలంటే మీరు రిక్ గ్వెరిన్ కథ వినాలి.

బహుశా మీరు వారెన్ బుఫే, చార్లీ మంగర్ పెట్టుబడిదారుల ద్వయాన్ని గురించి వినే ఉంటారు. కానీ 40 సంవత్సరాల క్రితం ఆ గ్రూపులో రిక్ గ్వెరిన్ అనే మూడో వ్యక్తి ఉండేవారు.

వారెన్, చార్లీ, రిక్ ముగ్గురూ కలిసి పెట్టుబడులు పెట్టేవారు. ముగ్గురూ కలిసే వ్యాపార మేనేజర్లను ఇంటర్వ్యూ చేసేవారు. అప్పుడు బుఫే, మంగర్

విజయాలతో పోలిస్తే ఒక విధంగా రిక్ అదృశ్యం అయ్యాడని చెప్పాలి. మోనిష్ పబ్రాయ్ అనే పెట్టుబడిదారు రిక్ ఏమైనారని బుఫేని అడిగారు. వారెన్ సమాధానం మోనీష్ గుర్తు చేసుకుంటారు:

> "వారెన్ అన్నారు మేము ఏనాటికైనా నమ్మలేనంత ధనికుల మవుతామని నాకు, చార్లీకి తెలుసు. ధనికులం కావటానికి మేము తొందర పడలేదు. అది జరుగుతుందని మాకు తెలుసు. రిక్ కూడా మా అంత తెలివితేటలు గలవాడే. కానీ ఆయన హడావిడిలో ఉన్నారు."

> 1973-1974 తిరోగమనంలో రిక్ మార్జిన్ అప్పుల భారం ఎక్కువయింది. ఆ రెండు సంవత్సరాలలో స్టాక్ మార్కెట్ 70% పడిపోయింది. దానితో అప్పుల వాళ్ళు ఆయన వెంటబడ్డారు. ఆయన తన బెర్క్ షైర్ షేర్లు వారెన్ కు అమ్మేశారు – నిజానికి వారెన్ "నేను ఆ షేర్లు కొన్నాను" అన్నారు. – ఒక్కొక్క షేర్ 40 డాలర్ల లోపుగా అమ్మారు. అప్పులబాధవల్ల రిక్ కు ఆ షేర్లు అమ్మక తప్పలేదు.[18]

చార్లీ, వారెన్, రిక్ ముగ్గురూ ధనికులు కావటంలో సమానమైన నైపుణ్యం కలవారే. దానికి తోడు వారెన్, చార్లీల దగ్గర సంపాదించిన ధనాన్ని కాపాడుకునే నైపుణ్యం ఉన్నది. కాలగమనంలో అత్యంత ముఖ్యమైన నైపుణ్యం అదే.

నసీమ్ టాలెబ్ ఇలా అంటారు: " తెలివితేటలు, బతక నేర్వటము రెండూ వేరు వేరు విషయాలు. మొదటి దానికి రెండవది అవసరం. ఏది ఏమైనా సరే సర్వనాశనాన్ని తప్పించుకోవాలి."

---

మనుగడ మనస్తత్వం నిజజీవితంలో అమలు చేయాలంటే మూడు విషయాలు గుర్తుంచుకోవాలి.

**1. పెద్ద పెద్ద లాభాలు గడించడం కంటే నేను ఆర్థికంగా చితికి పోకుండా ఉండటం ముఖ్యం. నేను చితికి పోకుండా ఉంటే నాకు పెద్ద పెద్ద లాభాలు వాటంతటఅవే వస్తాయని అనుకుంటాను. అప్పుడు నేను చిరకాలం వ్యాపారంలో ఉంటాను. ఆ కాలంలో చక్రవృద్ధి అద్భుతాలు చేస్తుంది.**

మార్కెట్ ఉద్ధృతంగా ఉన్నప్పుడు చేతిలో డబ్బు పెట్టుకు ఊరికేనే కూర్చోవాలని ఎవరూ అనుకోరు. దినదిన అభివృద్ధి చెందే ఆస్తిపాస్తులు సొంతం చేసుకోవాలనే కోరిక. మార్కెట్ ఉద్ధృతంగా ఉన్నప్పుడు మీరు చేతిలో డబ్బు పెట్టి కూర్చుంటే మీరు సంప్రదాయ బద్ధులుగా కనబడటమే కాక అలా అనుభూతి చెందుతారు. ఎందుకంటే అప్పుడు లాభాలు సంపాదించే స్టాక్ సొంతం చేసుకోకపోవటం వల్ల మీరు ఎంత కోల్పోయారో స్పష్టంగా తెలుస్తుంది. మాటవరసకు డబ్బు సాలీనా ఒక్క పర్సెంట్ ఆదాయం ఇస్తుందనుకుందాం. అదే డబ్బు స్టాక్స్ మీద 10% ఆదాయం తీసుకువస్తుంది. ఆ తొమ్మిది శాతం వ్యత్యాసం మిమ్మల్ని నిత్యము తేరి చూస్తూ ఉంటుంది.

కానీ మార్కెట్ పతనంలో ఉన్నప్పుడు అదే డబ్బు మీరు స్టాక్స్ అమ్మవలసిన అవసరం లేకుండా చేసిందంటే అప్పుడు ఆ సొమ్ము మీద మీ ఆదాయం సాలీనా 1% కాదు అందుకు చాలాచాలా రెట్లు ఉంటుంది. దిక్కు తెలియని సమయంలో మరో దారిలేక స్టాక్ అమ్మకంవల్ల కలిగే నష్టం జీవితంలో మీకు ఎంత ఆదాయం వచ్చినా పూడ్చలేకపోవచ్చు. ఎన్ని అధిక లాభాలు తెచ్చి ఇచ్చే స్టాక్స్ కొన్నా నిష్ప్రయోజనం.

చక్రవృద్ధి అంటే పెద్ద పెద్ద లాభాలు గడించడం కాదు. దీర్ఘకాలం మంచి లాభాలు నిరంతరంగా వస్తూ ఉండటం – ముఖ్యంగా కష్ట సమయాల్లో. అదే విజయానికి కీలకం.

## 2. ప్రణాళిక అవసరం అన్నది నిర్వివాదాంశం. కానీ ప్రతి ఒక్క ప్రణాళికలోను అత్యంత ముఖ్యమైన అంశం ఏమిటంటే ప్రణాళిక ఆశించిన ప్రకారం జరగకపోతే ప్రత్యామ్నాయ ప్రణాళిక ఏమిటి అన్న విషయం.

ఆ నానుడి ఏమిటి? మీరు ప్రణాళిక రచిస్తారు. భగవంతుడు నవ్వుతాడు. ఆర్థిక ప్రణాళికలు, పెట్టుబడి ప్రణాళికలు చాలా కీలక స్థానం వహిస్తాయి. ఎందుకంటే మీ ప్రస్తుత చర్యలు సంభవ పరిధిలో ఉన్నాయా లేవా అని చెప్పాయి. కానీ ఏ ప్రణాళికలు అయినా సరే వాస్తవ ప్రపంచంతో ముఖాముఖి అయినప్పుడు బతికి బయట పడేవి అత్యల్పం. రాబోయే 20 సంవత్సరాలలో మీరు మీ ఆదాయాన్ని, పొదుపు, రేటును మార్కెట్ నుంచి రాబోయే లాభాలు అంచనా వేస్తున్నారు

అంటే గత 20 సంవత్సరాలలో జరిగిన సంఘటనలను గురించి ఆలోచించండి. అవి అలా జరుగుతాయని ఎవరూ ఊహించని గలిగేవారు కాదు. సెప్టెంబర్ 11 న ఆకాశాన్నంటే అభివృద్ధి, అథ పాతాళానికి దిగజారిన నష్టాలు కలిగాయి. దాదాపు 10 మిలియన్ అమెరికన్లు వాళ్ల నివాసాలను కోల్పోయారు. అప్పుడు కలిగిన ఆర్థిక సంక్షోభంలో సుమారు 9 మిలియన్ వ్యక్తులు ఉద్యోగాలు కోల్పోయారు. అప్పుడే స్టాక్ మార్కెట్‌లో ఎన్నడూ కనీవినీ ఎరుగని ఉద్ధృతం జరిగింది.

వాస్తవ ప్రపంచంలో నిలవగలిగినదే ఉపయోగకరమైన ప్రణాళిక. ఏమి జరగబోతుందో తెలియని భవిష్యత్తు ఒక్కటే ప్రతి ఒక్కరి విషయంలోనూ యధార్థం.

ఒక ప్రణాళిక మంచిదయితే ఇవన్నీ నిజం కాదని కొట్టిపారేయదు. ఆ ప్రణాళిక యధార్థాన్ని అర్థం చేసుకుంటుంది. పొరపాటుకు అవకాశం ఉన్నదని నొక్కి వక్కాణిస్తుంది. మీ ప్రణాళికలో మీరు ఎన్ని అంశాలు అర్థం కావాలని ఆశిస్తారో, మీ ఆర్థిక జీవితం అంత పెళుసు అవుతుంది. మీ పొదుపు పథకంలో తప్పటడుగులకు అవకాశం ఉండాలి. మీరు "రాబోయే 30 సంవత్సరాలలో మార్కెట్లో ఎనిమిది శాతం రాబడి ఉంటే చాలా బాగుంటుంది. అది ఒకవేళ సంవత్సరానికి నాలుగు శాతమే అయినప్పటికీ పరవాలేదు. నేను క్షేమంగానే ఉంటాను." అని మీరు చెప్పగలిగితే ప్రణాళిక విలువ పెరుగుతుంది.

పందాలు విఫలం కావటానికి కారణం అవి తప్పుదోవన నడవడం కాదు. అన్ని పరిస్థితులు సక్రమంగా నడిస్తే ఆ పందాలు అన్నీ సవ్యమైన మార్గం లోనే ఉండేవి. పొరపాట్లకు అవకాశం - దీనిని తరచూ మార్జిన్ ఆఫ్ సేఫ్టీ అని అంటారు - ఆర్థిక రంగంలో అతి చులకనగా పరిగణించబడ్డ అంశం. అది అనేక అవతారాల్లో దర్శనం ఇస్తుంది. పొదుపుతో కూడిన బడ్జెట్, సమయానుకూలమైన ఆలోచన, పట్టువిడుపులు ఉన్న కాలనిర్ణయం - విభిన్న ఫలితాలతో మీ జీవితాన్ని ఆనందమయం చేయగలిగినది ఏదైనా సరే.

సాంప్రదాయాన్ని అనుసరించటం వేరు, ఇది వేరు. సాంప్రదాయాన్ని అనుసరించటం అంటే ఒక స్థాయిలో రిస్క్ తీసుకోవటం ఆపివేస్తారన్నమాట, మార్జిన్ ఆఫ్ సేఫ్టీ అంటే మీరు రిస్క్ తీసుకునే స్థాయిలో మీ సఫలతకు అవకాశాలు పెరగటం అన్నమాట. బతికి బయటపడే అవకాశాలు మెండు అవుతాయి. మీ

మార్జిన్ ఆఫ్ సేఫ్టీ పెరిగితే అనుకూలమైన ఆదాయానికి మీ పెట్టుబడి తగ్గుముఖం పడుతుంది. మార్జిన్ ఆఫ్ సేఫ్టీ మాజిక్ అదే.

## 3. రెండువైపులా భారం వహించగల వ్యక్తిత్వం - భవిష్యత్తును గురించి ఆశావాదం. ఆ భవిష్యత్తును చేరుకోవడానికి కలిగే అడ్డంకులను గురించి ఆందోళన - అత్యవసరం.

అన్నీ సవ్యంగానే జరుగుతాయనే నమ్మకమే ఆశావాదానికి నిర్వచనం. అది అసంపూర్ణమైన నిర్వచనం. పరిస్థితులు మీకు అనుకూలంగా ఉన్నాయని, కాలక్రమేణ పరిస్థితులు సర్దుకొని, మధ్యలో అవాంతరాలు కలిగినా చివరికి సత్ఫలితమే కలుగుతుందన్న నమ్మకం వివేచనామయమైన ఆశావాదం. మధ్యలో అవాంతరాలు తప్పవన్న విషయం మీకు బాగా తెలుసు. దీర్ఘకాల అభివృద్ధి జరుగుతుందనీ, అదీ సవ్యంగానే జరుగుతుందనీ మీరు ఆశించవచ్చు. ఇప్పటికీ అప్పటికీ మధ్యన మార్గం మాత్రం అపాయాలమయమని కూడా దృఢంగా విశ్వసించవచ్చు. ఇవి రెండూ ఒకదానిని విడిచి మరొకటి ఉండవు.

అనతికాలంలో నిష్ప్రయోజనమనిపించినది దీర్ఘకాలంలో ప్రయోజనకారి కాగలదన్న విషయం సహజ జ్ఞానం ఏమీ కాదు.

రెండేళ్ళ వయసులో ఉన్న గ్రంథులలో సగం 20 సంవత్సరాల వయస్సు చేరేసరికి మాయమైపోతాయి. అనవసరము, అసమర్ధము అయిన నాడీవ్యవస్థ తొలగించ బడుతుంది. రెండు సంవత్సరాల శిశువుకంటే ఇరవై సంవత్సరాల వయసు ఉన్న వ్యక్తి మేధావంతులనటం యదార్థం. అభివృద్ధి మార్గంలో ధ్వంసంకూడా సాధ్యమవుతుంది. అనవసరమైన పదార్థాలను తొలిగించటానికి అది సమర్ధవంతమైన మార్గం కూడాను.

మీరు తల్లి/తండ్రి అయి ఉండి మీ బిడ్డ మెదడులోకి తొంగి చూడగలిగారను కోండి. ప్రతి ఉదయము నాడీ తంతులు తగ్గుతూ ఉండటం గమనిస్తారు. మీరు భయభ్రాంతులవుతారు. "ఇది సరికాదు. ఇక్కడ ధ్వంసం, నష్టము జరుగుతున్నాయి. ఎవరో ఒకరు కలగజేసుకోవాలి. వెంటనే డాక్టర్ ను సంప్రదించాలి" అని మీ భావన. కానీ అది అనవసరం. మీరు చూస్తున్నది సహజమైన అభివృద్ధి మార్గం.

ఆర్థిక వ్యవస్థలు, విపణివీధులు, వృత్తి ఉద్యోగాలు కూడా అటువంటి బాటనే నడుస్తాయి - కష్టానష్టాల మధ్య అభివృద్ధి.

గత 170 సంవత్సరాలలో US ఆర్థిక వ్యవస్థ ఎలా నడిచిందో ఈ గ్రాఫ్ చూపిస్తుంది.

యదార్థమైన తలసరి ఆదాయం




కానీ, ఆ మధ్యకాలంలో ఏమి జరిగిందో మీకు తెలుసా? ఎక్కడ మొదలుపెట్టాలి?

- తొమ్మిది యుద్ధాలలో 1.3 మిలీయన్ అమెరికన్లు మరణించారు.
- ఆ కాలంలో ఆరంభించిన సంస్థలలో సుమారు 99.9% తుడిచిపెట్టుకు పోయాయి.
- నలుగురు అమెరికన్ అధ్యక్షులు హతమార్చబడ్డారు
- ఫ్లూ మహమ్మారి కారణంగా ఒకే సంవత్సరంలో 675,000 అమెరికన్లు మరణించారు
- 30 ప్రకృతి భీభత్సాలు ఒక్కొక్కటి కనీసం 400 మంది అమెరికన్లను పొట్టన పెట్టుకున్నాయి
- 33 ఆర్థికమాంద్యాలు మొత్తం 48 సంవత్సరాలపాటు నడిచాయి.
- ఆ ఆర్థికమాంద్యాలను గుర్తించి హెచ్చరించినవారు పూజ్యం.
- స్టాక్ మార్కెట్ కనీసం 102 పర్యాయాలు 10% కంటే ఎక్కువ పతనం అయింది

- కనీసం 12 సార్లు స్టాక్ విలువ మూడింట ఒకవంతు పడిపోయింది
- కనీసం ఇరవై సంవత్సరాలలో విడివిడిగా ద్రవ్యోల్బణం 7% అధిగమించింది.
- గూగుల్ అంచనా ప్రకారం ఆర్థిక నిరాశావాదం (Economic Pessimism) అన్న పదాలు వార్తాపత్రికలలో కనీసం 29,000 సార్లు దర్శనమిచ్చాయి.

ఈ 170 సంవత్సరాలలో మన జీవన ప్రమాణం 20 రెట్లు పెరిగింది. కానీ నిరాశావాదానికి తావులేకుండా ఒక్కరోజుకూడా గడవలేదు.

సమకాలంలో ఆశావాదం, భయభ్రాంతులు ఉన్న మనస్తత్వం కలిగి ఉండటం కష్టమైన విషయం. రెండూ కలిపి చూడగల సూక్ష్మ బుద్ధికంటే నలుపూ, తెలుపూ స్పష్టంగా చూడటం సులువైన పనికదా. కానీ బహువర్ష ప్రణాళికలు విజయవంతంగా కొనసాగాలంటే తాత్కాలిక భయభ్రాంతులు అవసరం.

ఈ సూక్ష్మాన్ని జెస్సీ లివర్ మూర్ గ్రహించేసరికి కాలాతీతమై పోయింది.

మంచిరోజులు వచ్చాయంటే చెడ్డరోజులు అంతమయ్యాయని ఆయన ఉపసంహారం చేశారు. సంపన్నులు కాగానే, తను సంపన్నుడుగానే ఉండటం అనివార్యమనీ, తనకెదురులేదనీ ఆయన అనుభూతి చెందారు. అంతా తుడిచిపెట్టుకు పోయిన తర్వాత ఆయన ఆలోచన:

> "విజయోన్మాదం తలకెక్కకుండా ఉండటానికి ఏమిచెయ్యాలో నేర్చుకోవటానికి ఎంతైనా చెల్లించవచ్చు. అతిమేధావులైనవారి పతనాలన్నిటికీ మూలకారణం ఆ మదం తలకెక్కటమే."

"ఎక్కడైనాసరే, ఎవరికైనాసరే అది అతిప్రమాదకరమైన వ్యాధి." అంటారాయన.

ప్రతికూల పరిస్థితులలో అభివృద్ధి ఎలా సాధ్యమో మరొక మార్గంలో చూద్దాం. తర్వాతి అధ్యాయం అదే.

# 6.
# బోరుసు - గెలుపు మీదే

సగంకాలం మీరు తప్పులు చేయవచ్చు. అయినా కూడా సంపద సాధించవచ్చు

*నేను దీనితో గత 30 సంవత్సరాలుగా కుస్తీ పడుతున్నాను. కొన్ని యోజనలు పనిచేస్తాయి. మరికొన్ని పనిచేయవు అంతే లెక్క. దీనిని గురించి బాధ పడవలసిందేమీ లేదు. ముందుకు కదులుతూ ఉండటమే సూత్రం.*

– స్క్రీన్ యాక్టర్స్ గిల్డ్ అవార్డ్ స్వీకరించుతూ బ్రాడ్ పిట్స్ అన్న మాటలు.

హైంజ్ బెర్గ్గుయెన్ 1936 లో నాజీ జర్మనీ నుంచి పరారయ్యారు. ఆయన అమెరికాలో స్థిరపడ్డారు. యూనివర్సిటీ ఆఫ్ కాలిఫోర్నియా బర్కిలీలో ఆయన సాహిత్యం అధ్యయనం చేశారు.

యౌవనంలో ఆయన ఏదో సాధిస్తారని ఎవరూ ఊహించలేదు. కానీ 1990 నాటికి బెర్గ్గుయెన్ కళాఖండాల విక్రయంలో అత్యంత సఫలత సాధించిన వ్యాపారవేత్త అయ్యారు.

2000 సంవత్సరంలో ఆయన అతను సేకరించినపికాసో, బ్రాక్స్, క్లీస్, మాటి స్సే కళాకృతులలో కొన్నిటిని జర్మన్ ప్రభుత్వానికి అమ్మి నూరు మిలియన్ యూరోస్కు పైగా సంపాదించారు. ఆ బేరం తర్వాత జర్మన్లు దాన్ని కేవలం ఒక ధర్మసంస్థకు దానంగామాత్రమే పరిగణించారు. ప్రైవేట్ మార్కెట్లో ఆ కళాకృతుల విలువ బిలియన్ డాలర్లకు పైగా ఉంటుందని అంచనా.

ఒక్క వ్యక్తి అన్ని అద్భుత కళాఖండాలను సేకరించ గలగటం అత్యాశ్చర్యకరమైన విషయం. కళ అనేది వ్యక్తిగత అభిరుచి. ఆ శతాబ్దంలో అత్యంత విలువైన కళాఖండాలుగా ప్రఖ్యాతి చెందిన వాటిని జీవితం ప్రారంభదశలో ఎవరైనా ఎలా ఊహించగలరు, ఎలా గుర్తించగలరు?

మీరు దానిని ఒక ఒక నైపుణ్యం అనొచ్చు

మీరు దానిని అదృష్టం అని కూడా పిలవవచ్చు.

హారైజన్ రీసెర్చ్ సంస్థ (అది ఒక పెట్టుబడి వ్యాపార సంస్థ) మూడవ

అభిప్రాయం వెలిబుచ్చింది. పెట్టుబడి వ్యాపారంలో ఉన్నవారికి అది చాలా వర్తిస్తుంది.

"పేరుమోసిన పెట్టుబడిదారులు కళాఖండాలను విస్తారంగా కొన్నారు." ఆ సంస్థ అన్నది.[19] "ఆ సేకరణలో ఒక వర్గం అద్భుతమైన పెట్టుబడిగా రూపొందింది. వాటిలో ఉత్తమమైనవాటికి మంచిధర పలికినదాకా వారు వాటిని పట్టుకొని ఉంచారు. అంతే. ఎప్పుడైనా జరిగేది అంతే."

కళాఖండాల వ్యాపారంచేసే ప్రఖ్యాత వ్యాపారవేత్తలందరూ ఇండెక్స్ ఫండ్స్ లాగా ఆపరేట్ చేశారు. వాళ్లకు చేతికి దొరికినవన్నీ కొనేశారు. వారు వాటిని తమకు నచ్చిన ఒకటొకటిగా కాక సామూహికంగా కొన్నారు. ఆ తర్వాత వాటిలో కొన్నిటికి పేరు ప్రఖ్యాతులు వచ్చిన దాకా నిరీక్షించారు.

ఎన్నడైనా జరిగేది అంతే.

బెర్గ్రుయెన్ వంటి వారు జీవితంలో సేకరించే వాటిలో 99% వస్తువుల విలువ చాలా అల్పమై ఉండవచ్చు.ఆ మిగిలిన ఒక్క శాతం పికాసో వంటి మహామహుల కళాకృతి అయితే మిగిలిన 99 ఎలాంటివైనా పర్వాలేదు. బెర్గ్రుయెన్ సర్వకాల సర్వావస్థల్లోనూ తప్పు చేసి ఉండవచ్చు. కానీ చివరికి ఒప్పు చేసినవాడుగా తేలవచ్చు.

వ్యాపారంలోనూ పెట్టుబడిలోనూ చాలా విషయాలు ఇలాగే జరుగుతాయి. దూరతీరాలలో ఎక్కడోవున్న అంశాలు ఆర్థికంగా అద్భుతమైన ప్రభావం కలిగించవచ్చు. అక్కడ చెప్పుకోదగిన సంఘటనలు చాలా తక్కువ సంఖ్యలో ఉన్నా విపరీతమైన ఫలితాలకు దారితీస్తాయి.

మీరు గణిత శాస్త్రంలో ఎంత ప్రవీణులయినా అటువంటి పరిస్థితితో వ్యవహరించటం కష్టమైనపని. ఒక పెట్టుబడిదారుడు సగం సేపు తప్పులుచేస్తూ కూడా విపరీతంగా సంపాదించగలిగితే, అందుకు దూరదృష్టి, సూక్ష్మ దృష్టి, సహజ జ్ఞానం ఏమీ అవసరం లేదు. జీవితంలో చాలా సంఘటనలు

విఫలమవుతాయని మనము అర్థం చేసుకోలేదన్నమాట. కనుక అలా జరిగినప్పుడు మనము తలకిందులు అవుతాం.

---

వాల్ట్ డిస్నీని కదిలే బొమ్మల స్రష్టగా పరిచయం చేసింది స్టీమ్ బోట్ విల్లి. వ్యాపారంలో సఫలత వేరే కథ. డిస్నీ మొట్టమొదటి స్టూడియో దివాలా తీసింది. మొదట్లో ఆయన చిత్రాలు నిర్మించటానికి ఊహాతీతంగా ఖర్చు అయ్యేది. అందుకు అవసరమైన సొమ్ముమీద వడ్డీరేట్లు విపరీతంగా ఉండేవి. 1930 వ దశాబ్దం మధ్యలో డిస్నీ 400 కు పైగా కార్టూన్ చిత్రాలు నిర్మించారు. అవి అన్నీచాలావరకు లఘు చిత్రాలు. వాటిలో చాలాచిత్రాలు ప్రేక్షకుల అత్యంత అభిమానం సంపాదించాయి. అంతేకాక వాటిలో చాలామటుకు విపరీతమైన నష్టానికి గురయ్యాయి.

'స్నో వైట్ అండ్ ది సెవెన్ డ్వార్ఫ్స్' పరిస్థితి అంతటినీ మార్చి వేసింది.

1938 సంవత్సరం మొదటి ఆరునెలల్లో ఆ చిత్రం 8 మిలియన్ డాలర్లు సంపాదించింది. అంతకుముందు ఆ సంస్థ సంపాదన అంతటికంటే ఇది ఊహకందని సంపాదన. దానితో డిస్నీ స్టూడియో రూపురేఖలు మారిపోయాయి. సంస్థ అప్పులు అన్నీ తీరిపోతాయి. ముఖ్యమైన ఉద్యోగస్తులు అందరూ కంపెనీని అంటి పెట్టుకొని ఉన్నందుకు బోనస్ సంపాదించారు. కంపెనీ బర్ బ్యాంకు లో అత్యాధునికమైన స్టూడియో కొన్నది. ఈనాటికీ ఆ స్టూడియో అక్కడే ఉన్నది. ఒక ఆస్కార్ బహుమతితో వాల్ట్ డిస్నీ పేరుపొందిన నిర్మాత నుంచి సుప్రసిద్ధవ్యక్తి అయ్యారు. 1938లో ఆయన కొన్ని వందల గంటలకు సరిపడే చిత్రం నిర్మించారు. కానీ వ్యాపారరీత్యా 83 నిమిషాల స్నో వైట్ మాత్రమే ఆయన గతిని మార్చి వేసింది.

బృహత్తరమైనది లాభసాటి అయినది, ప్రఖ్యాత మైనది, ప్రభావం చూపే అవకాశం అంతా చివరికి ఒక అనామక సంఘటనలోనుంచి ఉద్భవిస్తుంది. అది నూటికి కోటికి ఒకటి కావచ్చు. దాని గురించి ఎవరూ ఆలోచించి కూడా ఉండకపోవచ్చు. మనధ్యాస అంతా బృహత్తరము, లాభసాటి, ప్రఖ్యాత

ప్రభావదాయకమైన విషయాల మీదికే పోతుంది. మన శ్రద్ధాసక్తులు అన్నీ ఒక అనామక సంఘటన మీద కేంద్రీకృతం అవుతాయి అంటే, ఆ అనామక సంఘటనలు ఎంత అరుదైనవో, ఎంత శక్తివంతమైనవో ఊహించడం దుస్సాధ్యం.

తలతోకాక తోకతో నడిచే కొన్ని వ్యవస్థలు మన అందరికీ తెలుసు. ఉదాహరణకు వెంచర్ క్యాపిటల్ తీసుకోండి. ఒక వెంచర్ కాపిటల్ సంస్థ యాభై పెట్టుబడులు పెడితే అందులో సగం విఫలం అవుతాయని, ఒక పది పెట్టుబడులు సుమారుగా లాభసాటి అవుతాయని, ఒకటో రెండో పెట్టుబడి మొత్తాన్ని తీసుకువచ్చే సిరిమల్లెలు అవుతాయని వారికి తెలుసు. పెట్టుబడుల సంస్థ కో రిలేషన్ వెంచర్స్ ఒకసారి ఈ సమాచారం అంతటినీ అంకెలలో ప్రకటించింది.[20] 2004 నుంచి 2014 వరకు చేసిన 21000 వెంచర్ పెట్టుబడులలో:

65 శాతం సొమ్ము నష్టపోయారు

పెట్టుబడులలో రెండున్నర శాతం 10 నుంచి 20 రెట్లవరకు లాభాలు సంపాదించారు

ఒక శాతం 22 ఇంతలు లాభాలు గడించారు.

అర శాతం – అంటే 21000 పెట్టుబడులలో సుమారు 100 పెట్టుబడులు – 50 రెట్లు అంతకుమించి లాభాలు గడించాయి. పరిశ్రమలో లాభాలు అన్నీ వచ్చేది ఆ మూలనుంచి.

వెంచర్ క్యాపిటల్ పెద్ద రిస్క్ అనటానికి ఇదే కారణమని మీరనుకోవచ్చు. వెంచర్ క్యాపిటల్‌లో పెట్టుబడి పెట్టేవారందరికీ అది రిస్క్ అన్న విషయం తెలుసు. ఆరంభదశలో చాలాసంస్థలు విఫలం అవుతాయి. ఈ ప్రపంచం దయాదాక్షిణ్యాలవల్ల కొన్నిమాత్రమే అనూహ్యమైన విజయాన్ని సాధిస్తాయి.

మీ సొమ్ము భద్రంగాఉండి, ఏమి జరగబోతుందో తెలిసి, నికరమైన ఆదాయం రావాలంటే మీరు పెద్ద పబ్లిక్ కంపెనీలలో పెట్టుబడి పెట్టాలి.

అని మీరు అనుకోవచ్చు.

అంతటినీ నడిపేది తల కాదు, తోక అని గుర్తుంచుకోండి.

పేరుమోసిన కంపెనీలలో పబ్లిక్ స్టాక్స్ విజయాలు కూడా వెంచర్ క్యాపిటల్ లాభాల కంటే వేరే ఏమీ కాదు.

పబ్లిక్ కంపెనీలలో చాలా మటుకు నిష్ప్రయోజనం, నిరర్థకం. కొన్ని సుమారుగా వ్యవహరిస్తాయి. అసాధారణమైన లాభాలు గడించే సంస్థలను చేతి వేళ్ళ మీద లెక్క పెట్టవచ్చు. స్టాక్ మార్కెట్ లాభాలన్నిటికీ మూలం ఆ కొద్ది సంస్థలుమాత్రమే.

రస్సెల్ 3000 ఇండెక్స్ సంస్థ కోసం జేపీ మోర్గాన్ అసెట్ మేనేజ్మెంట్ సంస్థ లాభాలు ఏ విధంగా విస్తరించి ఉంటాయి అని ఒక నివేదిక - పబ్లిక్ కంపెనీలను గురించి ఒక ఒక విస్తారమైన బృహత్ సంగ్రహం - తయారు చేశారు, ప్రచురించారు.[21]

రస్సెల్ 3000 స్టాక్ అంశాలలో 40 శాతం అంశాలు వాటి విలువలు కనీసం 70 శాతం కోల్పోయాయి. ఆ తర్వాత తిరిగి ఎన్నడూ కోలుకోలేదు.

ఆ ఇండెక్స్ లో మొత్తంమీద లాభాలు కేవలం ఏడు శాతం కంపెనీల నుంచి మాత్రమే వచ్చాయి. ఈ ఏడు శాతం కంపెనీలు కనీసం రెండు స్టాండర్డ్ డీవియేషన్స్ ను మించిన లాభాలు గడించాయి.

వెంచర్ కాపిటల్స్‌లో ఇలా జరుగుతుందని మీరు ఆశిస్తారు. కానీ ఇది విపరీతంగా విస్తరించి ఉన్న తలనొప్పి పుట్టించే ఇండెక్స్‌లో జరిగిన ఘటన.

పబ్లిక్ కంపెనీలు ఇలా దెబ్బతినటంలో వారు వీరు అనే వివక్షత ఏమీ లేదు. పబ్లిక్ టెక్నాలజీ, టెలికాం కంపెనీలలో సగానికిపైగా తమ విలువ కోల్పోయాయి, తిరిగి ఎన్నటికీ కోలుకోలేదు. సార్వజనిక అవసరాల సంస్థలు కూడా పదింట ఒకటికి మించి విఫలమవుతూ ఉంటాయి.




ఇక్కడ అ ఆసక్తికరమైన విషయం ఏమిటంటే రసెల్ 3000 లో సభ్యత్వం కలిగి ఉండాలి. మీరు ఒక స్థాయి సఫలత సాధించి ఉండాలి. ఇవన్నీ రాత్రికిరాత్రి మూట ముల్లె కూడదీసుకుని మాయమయ్యే ఆరంభశూరులు కాదు. ఇవన్నీ చిరకాలంగా స్థాపితమై ఉన్న సంస్థలు. అయినా కూడా వీటి జీవితకాలం కొన్ని సంవత్సరాలకు - కొన్ని తరాలకు కాదు - మాత్రమే పరిమితమై ఉన్నది.

ఉదాహరణకు వీటిలో ఒక సంస్థను తీసుకోండి. రసెల్ 3000 ఇండెక్స్‌లో మాజీ సభ్యులు కరాల్కో

1980 - 1990 దశకాలలో ఈ సంస్థ బృహత్ చిత్రాలలో కొన్ని నిర్మించింది. మొదటి మూడు రాంబో చిత్రాలతో కలిపి టెర్మినేటర్ టు, బేసిక్ ఇన్ స్టింక్ట్, టోటల్ రీకాల్.

1987లో కరాల్కో పబ్లిక్ సంస్థ అయింది. ఒకదాని తరువాత ఒకటి విజయవంతమైన చిత్రాలు నిర్మించి సఫలమైన సంస్థగా పేరు పొందింది. 1991లో ఈ సంస్థ 500 మిలియన్ డాలర్ల ఆదాయం సంపాదించింది. మార్కెట్లో సంస్థ విలువ 400 మిలియన్ పెరిగింది. ఆనాడు అది, ముఖ్యంగా ఒక ఫిల్మ్ స్టూడియోకు, చాలా పెద్ద మొత్తం.

అప్పుడు ఆ సంస్థ విఫలమైంది.

దిగ్విజయం సాధించే చిత్రాలు ఆగిపోయాయి. పెద్ద బడ్జెట్ తో నిర్మించిన కొన్ని చిత్రాలు దెబ్బతిన్నాయి. 1990 వ దశాబ్దం మధ్యలోకి వచ్చేసరికి. కరాల్కో చరిత్రలో మిగిలిపోయింది. 1996 లో ఆ సంస్థ దివాలా తీసింది. స్టాకు విలువ శూన్యం అయింది. నమ్మరానంత నష్టం. పదింట నాలుగు సంస్థలు కాలక్రమేణా ఈ గాడిలో పడుతుంటాయి. కరాల్కో వాటిలో ఒకటి అయింది. ఇది చాలా ప్రత్యేకం కనుక కరాల్కో కథ ఇక్కడ చెప్పటం లేదు. అది చాలా సాధారణమైన సంఘటన కనుక చెబుతున్నాను.

కథలో అత్యంత ముఖ్యాంశం ఇక్కడ ఉన్నది: రసెల్ 3000 సంస్థ 1980 నాటి నుంచి 73 రెట్లు పెరిగింది. అది అత్యద్భుతమైన విజయం. సఫలత అంటే అది.

ఇండెక్స్ జాబితాలో 40 శాతం సంస్థలు విఫలం అయ్యాయి కానీ అత్యంత లాభాలు గడించిన 7% సంస్థలు ఈ వైఫల్యాలను అన్నిటినీ తుడిచి వేశాయి. అంతా హైంజ్ బెర్గ్రుయెన్ లాగానే. అంత బెడ్ రూమ్ లాగానే కానీ ఇక్కడ పికాసో, మాటిస్సే బదులు మైక్రోసాఫ్ట్, వాల్ మార్ట్ సభ్యులుగా ఉన్నారు.

మార్కెట్‌లో ఆదాయం కేవలం కొద్ది కంపెనీల కారణంగానే కలుగుతుంది. కానీ ఆ కొద్ది సంస్థలలోకూడా కంటికి కనపడని తోకచివర సంఘటనలు ఉంటాయి.

2018లో S&P 500 ఆదాయంలో ఆరు శాతం అమెజాన్ నుంచి వచ్చింది. ఇక్కడ అమెజాన్ అభివృద్ధి అంతా కేవలం అమెజాన్ ప్రైమ్, అమెజాన్ వెబ్ సర్వీసెస్ ద్వారా సాధ్యం అయింది. ఫైర్ ఫోన్ నుంచి ట్రావెల్ ఏజెన్సీస్ దాకా వందల కొద్ది వ్యాపారాలు ప్రయోగం చేసిన అమెజాన్ సంస్థలో కూడా ఈ రెండూ తోక చివర సంఘటనలు.

2018లో యాపిల్ సంస్థ ఇండెక్స్ ఆదాయంలో ఏడు శాతం సాధించిపెట్టింది. ఆపిల్ వ్యాపారం అంతా దాదాపు ఐఫోన్ మీద నడిచింది. సాంకేతిక ఉత్పాదన ప్రపంచంలో దీనిని తోకకు తోక అని చెప్పుకోవచ్చు.

మరి ఈ సంస్థలలో ఎవరు పనిచేస్తున్నారు? గూగుల్ సంస్థలో ఉద్యోగానికి వెయ్యిమంది దరఖాస్తు పెడితే వారిలో ఇద్దరు మాత్రమే ఉద్యోగం సంపాదించగలుగుతారు.[22] ఫేస్బుక్ సంస్థలో వెయ్యి మందిలో ఒకరికి మాత్రమే ఉద్యోగం లభిస్తుంది.[23] అదే యాపిల్ సంస్థలో నూటికి ఇద్దరికి ఉద్యోగం లభించే అవకాశాలు ఉన్నాయి.[24] కనుక ఈ తోకచివరి యోజనల మీద పనిచేసే వ్యక్తులు అక్కడినుంచివచ్చే ఆదాయానికి కారకులు.వారి ఉద్యోగాలు మాత్రం తోక చివరనే ఉంటాయి.

కాని చాలాకొద్ది అంశాలు సంస్థ సాధించే బృహత్ విజయాలన్నిటికీ కారణం అనేది కేవలం స్టాక్ మార్కెట్లో ఉన్న సంస్థలకు మాత్రమే కాదు. పెట్టుబడి దారుగా మీ ప్రవర్తనలో అది చాలా ముఖ్యమైన పాత్ర వహిస్తుంది.

"తన చుట్టూ ఉన్న వారందరూ పిచ్చెక్కినట్టు అటూ ఇటూ పరుగులు తీస్తూఉండగా సాధారణమైన పని చేయగలిగిన వ్యక్తి మహామేధావి" మేధావి అంటే నెపోలియన్ నిర్వచనం ఇది.

పెట్టుబడిలో కూడా ఇదే సూత్రం వర్తిస్తుంది.

మీకు డబ్బువిషయంలో సలహా అంతా ఈనాటిని గురించే. ఇప్పుడు అంటే ఇప్పుడు మీరు ఏమి చేయాలి? ఇవాళ కొనదగిన స్టాక్స్ ఏది?

కానీ సర్వ సమయాల్లోనూ ఈనాడు అంత ముఖ్యమైనది కాదు. పెట్టుబడిదారుగా మీరు ఈనాడు, రేపు, లేదా వచ్చేవారం తీసుకునే నిర్ణయాలు అంత ముఖ్యమైనవేమీ కాదు. మీ చుట్టూ ఉన్న వారందరూ వెర్రిగా పరుగులు తీస్తూ ఉన్నప్పుడు - అది మీ పెట్టుబడిదారు జీవితంలో ఒక శాతం, లేదా అంతకంటే తక్కువ కావచ్చు - మీరు ఏమి చేస్తారు అన్నది అతి ముఖ్య పాత్ర వహిస్తుంది.

1900 సంవత్సరం నుంచి 2019 వరకు మీరు నెలకు ఒక డాలర్ పొదుపు చేసి ఉంటే ఏమయ్యేదో ఆలోచించండి.

మంచి కానివ్వండి చెడు కానివ్వండి ప్రతి నెల మీరు ఆ ఒక్క డాలర్ ను యూఎస్ స్టాక్ మార్కెట్లో పెట్టుబడి పెడతారు. ఇక్కడ ఆర్థిక శాస్త్రవేత్తలు

రాయబోయే ఆర్థిక మాంద్యాన్ని గురించో మార్కెట్ పతనాన్ని గురించో ఘోషిస్తున్నా కూడా పర్వాలేదు. మీరు నెలకు ఒక డాలరు పెట్టుబడి పెడుతూ ఉండండి. ఇలా పెట్టుబడి పెట్టిన వ్యక్తిని స్యూ అని పిలుద్దాం.

ఆర్థిక మాంద్యం నడుస్తున్నప్పుడు పెట్టుబడి పెట్టడం భయానకమైన విషయం కావచ్చు. కనుక మీరు మీ $1 ను ఆర్థిక మాంద్యంలేని కాలంలోనే స్టాక్ మార్కెట్ లో పెట్టుబడి పెడతారు. ఆర్థిక మాంద్యం కలిగినప్పుడు మీరు మీ షేర్లు అమ్మి వేస్తారు. మళ్లీ ఆర్థికమాంద్యం ముగిసిన తర్వాత మీరు మళ్ళీ పెట్టుబడి పెడతారు. ఈ పెట్టుబడిదారులు జిమ్ అని పిలుద్దాం.

ఈ ఆర్థిక మాంద్యం మిమ్మల్ని భయపెట్టడానికి కొన్ని నెలలు పట్టవచ్చు. తర్వాత మళ్లీ ఆ భయం తగ్గిన తరువాత పెట్టుబడి పెట్టే ధైర్యం కలగటానికి మీకు కొన్ని నెలలు పట్టవచ్చు. ఆర్థిక మాంద్యం లేని సమయంలో మీరు ఒక డాలరు పెట్టుబడి పెడతారు. ఆర్థిక మాంద్యం ఆరంభమైన తర్వాత ఆరు నెలలకు వాటిని అమ్మి వేస్తారు. మళ్లీ ఆర్థిక మాంద్యం ముగిసిన తర్వాత ఆరు నెలలకు మీరు స్టాక్స్ మీద పెట్టుబడి పెడతారు. ఈ పెట్టుబడిదారును మనం టామ్ అని పిలుద్దాం.

సమయం ముగిసే సరికి ఈ ముగ్గురు పెట్టుబడిదారులు ఎంత సంపాదిస్తారు?

స్యూ సంపాదన: 435,551 డాలర్లు

జిమ్ సంపాదన: 257,386

టామ్ సంపాదన: 234,476 డాలర్లు

స్యూ అతి ఘన విజయం సాధించింది.

1900కు 2019 కి మధ్య 1, 428 నెలలు ఉన్నాయి. వాటిలో సుమారు 300 ఆర్థిక మాంద్యంలో ఇరుక్కున్నాయి. కనుక ఆర్థిక మాంద్యం ఉన్న 22 శాతం సమయం నిర్భయంగా ఉండండి. జిమ్, టామ్ ల కంటే స్యూ ముప్పాతిక భాగం ఎక్కువ సంపాదించింది.

అంతకంటే ఇటీవలి ఉదాహరణ: 2000 నుంచి 2008 వరకు మీరు ఎలా ప్రవర్తించారు అనేదానికంటే, పెట్టుబడి దారుగా 2008 వ సంవత్సరం

ఉత్తరార్థంలోనూ 2009వ సంవత్సరం పూర్వార్థంలోనూ మీరు ఎలా ప్రవర్తించారనేది మీ జీవితాంతం కలిగే ఆదాయాన్ని ప్రభావితం చేస్తుంది.

పెట్టుబడిలో మేధావి నిర్వచనం: తమ చుట్టూ ఉన్న వారు వెర్రెత్తి నట్లు పరుగులు తీస్తూ ఉంటే సామాన్యమైన పని చేయగలిగినవారు.

ప్రతి ఒక్క దానిని నడిపించేది తోకే.

---

వ్యాపారంలోనూ పెట్టుబడిలోనూ, ఆర్థిక వ్యవహారాలలోనూ తోక చివర ఘటనలే అంతటినీ నడిపిస్తాయి అని మీరు అంగీకరిస్తే, తప్పులు జరగటం, భగ్నం కావటము విఫలం కావటం, పడిపోవటం సామాన్యమని మీరు గ్రహిస్తారు.

స్టాక్స్ సెలెక్ట్ చేయటంలో మీరు నేర్పరులైతే మీ ఎంపికలో సగంవరకు సవ్యం కావచ్చు.

మీరు సమర్థులైన వ్యాపారవేత్తలయితే మీ ఉత్పాదనలో సగం, మీ పథకాలలో సగము సఫలం కావచ్చు.

మీరు తెలివైన పెట్టుబడిదారులయితే అన్ని సంవత్సరాలు దాదాపు సవ్యంగానే నడుస్తాయి. కానీ చాలా మటుకు దెబ్బతింటాయి.

మీరు కార్యనిర్వహణలో దక్షులయితే అనేక ప్రయత్నాల తర్వాత మీరు తగిన రంగంలో సరైన సంస్థను పట్టుకో గలుగుతారు.

మీరు సమర్థులైతే ఇదంతా జరుగుతుంది.

మన తరంలో పీటర్ లించ్ అత్యంత సమర్థులైన పెట్టుబడిదారులలో ఒకరు. "వ్యాపారంలో మీరు ఉద్దండులు అయితే పదింట ఆరుసార్లు మీ నిర్ణయం సరి అవుతుంది" అని ఒకసారి ఆయన అన్నారు.

ప్రతి ఒక్కసారి పరిపూర్ణంగా కార్యం నిర్వహించవలసిన రంగాలు కూడా ఉంటాయి. ఉదాహరణకు విమానాలు నడపటం. ఆ తర్వాత మీరు చేసినపని ప్రతిసారి కనీసం చాలా బాగా ఉండాలని కోరుకునే రంగాలు కూడా ఉంటాయి. ఉదాహరణకు పెద్ద రెస్టారెంట్లో పాక ప్రవీణులు.

పెట్టుబడి, వ్యాపారము, డబ్బుతో వ్యవహారం పైన చెప్పిన రంగాల వంటివి కాదు.

సర్వదా సరైన నిర్ణయాలు మాత్రమే తీసుకోగలిగిన వారెవరూ లేరు. ఇది నేను పెట్టుబడిదారులు, వ్యవస్థాపకులనుంచి నేర్చుకున్నాను. మనకు అత్యద్భుత వ్యక్తులుగా కనిపించే వారందరూ భయంకరమైన ఆలోచనలతో నిండి ఉంటారు. తరుచు ఆ ఆలోచనకే క్రియారూపం కలుగుతుంది.

ఉదాహరణకు అమెజాన్ తీసుకోండి. ఒక పెద్దసంస్థ ఒక ఉత్పాదన విడుదల చేసే సందర్భం సాధారణంగా, గతుకులు లేకుండా ఉంటుందని ఎవరూ ఆశించరు. ఆ సంస్థ సీఈఓ తన షేర్ హోల్డర్లకు క్షమాపణ చెప్పుకుంటారని ఆశిస్తాం. ఫైర్ ఫోన్ విడుదల ఘోరమైన పరాజయం రుచిచూసిన తరువాత ఆ సంస్థ సీఈఓ జెఫ్ బెజోస్ అన్నారు:

మీరందరూ ఇది ఒక ఘోరమైన వైఫల్యం అనుకుంటే, మేము ఇంతకు మించిన వైఫల్యాల మీద ఇప్పుడు కృషి చేస్తున్నాం. నేను పరాచకాలు ఆడటం లేదు. రాబోయే విడుదలలు కొన్నిటితో పోలిస్తే ఈ ఫైర్ ఫోన్ సంఘటన ఆవగింజంత అవుతుంది.

ఫైర్ ఫోన్ ప్రయోగంలో అమెజాన్ చాలాడబ్బు నష్టపోయిఉన్నా పర్వాలేదు. అమెజాన్ వెబ్ సర్వీసెస్ సంపాదించే మిలియన్లకొద్దీ డాలర్లు ఈ నష్టాన్ని సులువుగా పూర్తిచేస్తాయి. ఇక్కడకూడా తోకలే రక్షణ కల్పిస్తున్నాయి.

నెట్ ఫ్లిక్స్ సి ఈ ఓ రీడ్ హేస్టింగ్స్ ఒకసారి తమ సంస్థ పెద్దబడ్జెట్ తో ప్రారంభించిన ఉత్పాదనలు చాలా రద్దు చేస్తున్నట్టు ప్రకటించారు. ఆయన స్పందన:

మా సత్ఫలితాల నిష్పత్తి ప్రస్తుతం చాలా చాలా ఉన్నతంగా ఉన్నది. ఈ యోజనల మీద పనిచేసే బృందాన్ని నేను నిరంతరము ప్రచోదన చేస్తూ ఉంటాను. మేము ఇంకా ఎక్కువ రిస్కు తీసుకోవాలి. మేము ఇంకా పిచ్చి పనులు చాలా ప్రయత్నం చేయాలి. ఎందుకంటే మా వైఫల్యం శాతం పెరగాలి.

ఇవి అన్నీ భ్రమ కాదు, బాధ్యతా నిర్వహణలో తప్పటడుగులు కావు. సఫలత తల దగ్గరనుంచికాక తోక చివరనుంచి వస్తుంది అని తెలివిగా చెప్పటం. ప్రతి ఒక్క అమెజాన్ ప్రైమ్ కు, లేదా 'ఆరెంజ్ ఈజ్ ది న్యూ బ్లాక్' వెనక చతికిలబడిన యోజనలు చాలా ఉంటాయన్నమాట నిశ్చయం.

చూడగానే ఇది ఎందుకు తెలుసుకోలేమంటే, దాదాపు అన్ని రంగాలలోనూ

మనము విడుదలకు సిద్ధంగా ఉన్న ఉత్పాదన మాత్రమే చూస్తాం. ఈ ఉత్పాదన వెనుక కలిగిన నష్టాలను ఇతర యోజనను మనము చూడలేము.

టీవీలో కనిపించే క్రిస్ రాక్ పొల్లుపోని హాస్యం ప్రదర్శిస్తారు. సంవత్సరం పొడుగునా అనేక చిన్నచిన్న క్లబ్స్ లో ప్రదర్శన ఇచ్చే రాక్ పర్వాలేదనిపించు కుంటారు. అది ఒక పథకం ప్రకారం జరుగుతుంది. హాస్య ప్రదర్శకులు ఎవరైనా సరే పరిహాసం కితకితలు పెట్టి నవ్వు పుట్టిస్తుందని ముందుగానే తెలుసుకోలేరు. ప్రతి ఒక్క ప్రఖ్యాత వినోద ప్రదర్శకులు పెద్ద ప్రదర్శనలో ప్రదర్శించ పోయేముందు వారి సరుకును చిన్న చిన్న క్లబ్‌లలో మొదట ప్రయత్నిస్తారు. ఆయన చిన్న క్లబ్ లకు పోరా అని క్రిస్ రాక్ ను ఒకసారి అడిగారు. ఆయన స్పందన:

> నేను ఒక పర్యటన మొదలు పెట్టినప్పుడు పెద్ద కేంద్రాలతో ఆరంభం చెయ్యను. ఈ పర్యటనకు సిద్ధమయ్యే ప్రయత్నంలో నేను న్యూ బర్న్సు వీక్ ఫ్యాక్టరీలో 40-50 ప్రదర్శనలు ఇచ్చాను.

చిన్న క్లబ్బులలో జరిగే ఈ ప్రదర్శనలను ఒక వార్తాపత్రిక చిత్రించింది. రాక్ తను రాసుకున్న నోట్స్ పేజీలు గిరగిర తిప్పటం అందులో ఉన్న విషయాలతో తడబడటం వర్ణించింది. ప్రదర్శన మధ్యలో ఆయన ఈ జోక్స్‌లో కొన్నిటిని నేను తీసివేయాల్సి వస్తుంది అన్నారు. నెట్‌ఫ్లిక్స్‌లో ఆయన ప్రదర్శించే జోక్స్ వందలాది ప్రయత్నాల తర్వాత మిగిలిన తోక ముక్కలు.

పెట్టుబడిలో కూడా దాదాపు ఇలాగే జరుగుతుంది. వారెన్ బుఫే ఆస్తిపాస్తుల విలువ, ఆయన సాలీనా ఆదాయము తెలుసుకోవడం సులభం - ఆయన పెట్టుబడులలో చెప్పుకోదగినవి, అత్యుత్తమమైనవి - జనం సాధారణంగా మాట్లాడుకునేది వాటిని గురించే.

ఆయన తన వృత్తి ఆద్యంతము పెట్టుబడి పెట్టిన ప్రతి ఒక్క పెట్టుబడిని సమీకరించి చూడటం చాలా కష్టమైన పని. అందులో విఫలమైన వాటిని గురించి, తెలివితక్కువగా కొన్నవాటిని, చతికిలపడ్డవాటిని గురించి ఎవరూ మాట్లాడరు. కానీ వారెన్ బుఫె కథలు ముఖ్యపాత్రధారులు. తోకచివరనుంచి వచ్చిన ఆదాయాల వెనక అవి ఉంటాయి.

2013లో బెర్క్ షైర్ హాతవే షేర్ హోల్డర్ మీటింగ్ లో మాట్లాడుతూ, వారెన్ బుఫే తన పెట్టుబడి జీవితంలో 400 నుంచి 500 వరకు స్టాక్స్‌కు సొంత దారుడినని, వాటిలో సుమారు 10 స్టాక్స్ మీదనే తన ఆదాయం అంతా వచ్చిందని ఆయన చెప్పారు. ఆ తర్వాత చార్లీ మంగర్ మాట్లాడుతూ "బెర్క్ షైర్ అతిపెద్ద పెట్టుబడులలో కొన్నిటిని తీసివేస్తే మిగిలినదంతా అతి సాధారణం, సామాన్యం." అన్నారు.

ఒక ఆదర్శ వ్యక్తి సఫలత మీద మనధ్యాస మళ్ళిస్తే, వాళ్ళ సఫలత అంతా వాళ్ళ ప్రయత్నాలలో చాలా కొద్ది శాతం ప్రయత్నాలవల్ల కలిగిందన్న విషయం మనం ఉపేక్షిస్తాం. అప్పుడు మన వైఫల్యాలు, కష్టనష్టాలు, ప్రతికూల ఘటనలు అన్నీ తలుచుకుంటే మనము ఏదో పెద్ద తప్పు చేస్తున్నామనిపిస్తుంది. బహుశా మనము పొరపాటు చేసి ఉండొచ్చునేమో. కానీ అదేవిధంగా విజయాలు సాధించినవారు చేసినట్లు మనం కూడా సవ్యంగానే నిర్వహించి ఉండవచ్చు. వారు సవ్యంగా కృషి చేసినప్పుడు వారి నిర్వహణ అత్యంత సవ్యంగా రూపుదిద్దుకున్నది. కానీ మీరు ఎన్ని సార్లు పొరపాటు చేశారో వారుకూడా అన్నిసార్లు, అంతకాలం పొరపాటు చేసిఉంటారన్నమాట తథ్యం.

"మీరు తప్పా ఒప్పా అన్నది ముఖ్యం కాదు" జార్జ్ సోరోస్ ఒకసారి అన్నారు. "మీరు ఒప్పు అయినప్పుడు ఎంత ధనం సంపాదించారు, మీరు తప్పు చేసినప్పుడు ఎంత నష్టపోయారన్నది" ముఖ్యం. "సగం కాలం మీరు తప్పులు చేస్తూ ఉండవచ్చు అయినా నమ్మరానంత సంపద సంపాదించవచ్చు."

---

ఆకాశవీధిలో సుమారు 100 బిలియన్ గ్రహాలు ఉన్నాయి. మనకు తెలిసినంత మటుకు మేధాపరమైన జీవనం ఒక్క దానిమీద మాత్రమే ఉన్నది.

మీరు ఈ పుస్తకం చదువుతున్నారంటే అందుకు కారణం మీరు ఊహించగలిగినంత పెద్దతోక.

అది సంతోషించ దగిన విషయమే. ఇప్పుడు ధనం మీకు అంతకుమించిన సంతోషాన్ని ఎలా ఇవ్వగలదో చూద్దాం.

# 7.

# స్వేచ్ఛ

---

మీ సమయాన్ని నియంత్రించటమే డబ్బు తెచ్చిపెట్టే
మహోత్తమ ప్రయోజనం

---

ప్రతిరోజూ నిద్ర లేవగానే "ఇవాళ నేను ఏది తలుచుకుంటే అది చేయవచ్చు" అని చెప్పగలగటం అన్నిటినీ మించిన సంపద.

సంతోషంగా ఉండాలంటే ధనవంతులు కావాలని సాధారణంగా ప్రజల కోరిక. సంతోషం ఒక అతి జటిలమైన సబ్జెక్టు. ఎందుకంటే ప్రతి ఒక్కరూ భిన్నంగా ఉంటారు. కానీ ఆ సంతోషంలో సర్వసాధారణమైన విభాజకం ఏదైనా ఉంటే – ఆనందానికి ఈ ప్రపంచమంతటికీ ఒకే ఇంధనం – అది జనం తమ జీవితాలను కంట్రోల్ చేయాలి అని కోరుకోవడమే.

మీకు ఇష్టమైన వారితో, మీకు కోరిన సమయంలో, కోరినంత కాలం మీరు చేయదలుచుకున్నది చేయగలగటం ఒక అమూల్యమైన సామర్థ్యం. డబ్బు తెచ్చిపెట్టే అత్యంత విలువైన ప్రయోజనం అదే.

---

యాంగస్ క్యాంప్ బెల్ యూనివర్సిటీ ఆఫ్ మిషిగన్‌లో మానసిక శాస్త్రవేత్త. ఆయన 1910లో జన్మించారు. మనస్తత్వశాస్త్రం అంతా మనుష్యులను క్రుంగదీసే డిప్రెషన్, ఆదుర్దా, మనోవైకల్యం వంటి వ్యాధుల వైపు కేంద్రీకరించి ఉన్నకాలంలో ఆయన పరిశోధన జరిగింది.

క్యాంప్ బెల్ ప్రజలకు ఏది సంతోషం కలిగిస్తుందో తెలుసుకోవాలనుకున్నారు. ఆయన 1981లో 'ద సెన్స్ ఆఫ్ వెల్ బీయింగ్ ఇన్ అమెరికా' (The sense of well being in America) అనే పుస్తకం రచించారు. మానసిక శాస్త్రవేత్తలు అనేకమంది అనుకున్నదానికంటే ప్రజలు ఆనందంగా ఉన్నారని చెప్తూ ఆయన ఆ పుస్తకం ప్రారంభిస్తారు. కానీ కొంతమంది మిగిలిన వారికంటే ఎక్కువ ఆనందం అనుభవిస్తున్నారు. వాళ్లని వారి ఆదాయం ఆధారంగాగాని, భౌగోళిక పరిస్థితివల్ల గాని చదువు సంధ్యలవల్లగాని కూడతీయడం సాధ్యం కాదు. ఎందుకంటే అందులో ప్రతి ఒక్క రంగంలోనూ నిత్యము సంతోష రహితులైనవారు చాలామంది ఉన్నారు.

ఆనందానికి శక్తివంతమైన సర్వసాధారణ విభాజకం చాలా సరళమైనది. క్యాంప్ బెల్ దానిని క్లుప్తంగా చెప్తారు:

> జీవితంలో మనము ఉద్దేశించిన మిగతా అన్ని పరిస్థితుల కంటే, తన జీవితం స్వయంగా కంట్రోల్ చేయగలగటం అన్నిటినీ మించిన సుముఖ అనుభూతులను, భావాలను కలిగిస్తుంది.

మీరు ఏమి చేయదలచుకున్నారో, ఎప్పుడు చేయదలచుకున్నారో, ఎవరితో కలిసి చేయదలచుకున్నారో, నియంత్రించగలిగితే, అంతకుమించిన ఆనందం ఇంక లేదు. మీ జీతంకంటే, మీ ఇంటి పరిమాణంకంటే, మీ ఉద్యోగం పరపతికంటే ఇంకా అన్నిటికంటే మించిన ఆనందం ఇక్కడ మీకు లభిస్తుంది.

మీ సమయానికి సరైన నియంత్రణ ప్రసాదించడమే డబ్బులో ఉన్న అత్యుత్తమ అంతర్గత శక్తి. అంతకుమించి చెప్పవలసింది ఏమీ లేదు. ఆ ఆధిపత్యం, స్వాతంత్ర్యం మీకు క్రమక్రమంగా చిన్నచిన్న అడుగులు వేసుకుంటూ లభిస్తుంది. అప్పుడు మీరు ఏమి చేయగలరో, ఎప్పుడు చేయదలచుకున్నారో అంతా మీ అధీనంలో ఉంటుంది.

పరిమితమైన సంపద అంటే మీరు అనారోగ్యంగా ఉన్నప్పుడు ఉద్యోగంలో సెలవు తీసుకోవచ్చు. అప్పుడు మీరు పొదుపు చేసుకున్న బ్యాంకు నిల్వలు కదిలించనక్కర్లేదు. మీకు ఆ సామర్థ్యం లేకపోతే అది సంపాదించటమే మహత్కార్యం.

మరికొంత సంపద ఉన్నదంటే ఒక ఉద్యోగం పోయిన తరువాత – ఏది దొరికితే దానికి ఆతృతగా కక్కుర్తి పడకుండా – మరొక మంచి ఉద్యోగం దొరికేవరకూ నిరీక్షించ గలరు.

ఆరు నెలల అత్యవసర ఖర్చులు అంటే మీరు మీ యజమాని లేదా పై అధికారికి భయపడకుండా ఉండటం.ఎందుకంటే మరొక కొత్త ఉద్యోగం వెతకడంలో కొంతకాలం నిరీక్షించడం అవసరమైతే అందువల్ల నీకు పోయేది ఏమీ లేదు అని మీకు తెలుసు.

మరింత సంపద అంటే జీతం తక్కువైనా, పనిచేసే సమయం

అనుకూలంగా ఉన్న వేరొక ఉద్యోగం చేపట్టటం. అది మీ ఇంటికి దగ్గరలో ఉండవచ్చు. లేదా అత్యవసర వైద్యసహాయం కావలసి వస్తే అదనపు ఆదాయం ఏమీ లేకుండానే - ఇది ఎలారా భగవంతుడా అని దిగులు పడుతూ కూచోకుండా - దాన్ని సమర్థించ గలగడం.

ఆ తర్వాత మీరు ఎప్పుడు రిటైర్ కావలసి వస్తుందేమో అని కాకుండా మీరు తలుచుకున్నప్పుడు ఉద్యోగం విరమించ గలగటం మరింత సంపద.

మీరు కోరిన విధంగా జీవిస్తూ, సమయాన్ని మీ అధీనంలో ఉంచుకో గలగటం అందరూ కలలుగనే జీవనసరళి. ఈ భోగాలూ, ఈ విలాస వస్తువులూ దానికి సాటి రావు, రాలేవు.

కాలేజ్‌లో చదివినంతకాలం నేను ఇన్వెస్ట్ మెంట్ బ్యాంకర్ కావా లనుకున్నాను. అందుకు కారణం ఒకేఒక్కటి: వాళ్ళు చాలా డబ్బు గడించేవారు. అది ఒక్కటే ప్రేరణ. అలా డబ్బు సంపాదించ గలిగితే, నేను చాలా సంతోషంగా ఉంటానని నూటికి నూరుపాళ్ళు నానమ్మకం. నేను కాలేజ్ జూనియర్ సంవత్సరంలో ఉన్నప్పుడు లాస్ ఏంజలీస్ లో ఒక ఇన్వెస్ట్ మెంట్ బ్యాంక్‌లో శిక్షణాభృతి సంపాదించాను. అంటే, నేను లాటరీ గెలిచినంత సంబర పడిపోయాను. నేను కలగన్నదంతా అదే.

ఇన్వెస్ట్ మెంట్ బ్యాంకర్లు చాలా డబ్బు ఎలా సంపాదిస్తారో నాకు మొదటిరోజునే తెలిసిపోయింది. వాళ్ళు మనిషికి సాధ్యమయినదానికంటే ఎక్కువసేపు - అదీ నియమితమైన సమయంలో - పనిచేస్తారు. అది అందరికీ సాధ్యమయ్యే పనికాదు. అర్ధరాత్రికి ముందు ఇంటికి వెళ్ళటమంటే భోగం కిందే లెక్క. ఆఫీసులో ఒక నానుడి ఉండేది: "శనివారం నాడు ఆఫీసుకు రాలేకపోతే, ఆదివారం రావాలని ఆరాటపడకు." మేధాపరంగా ఆ ఉద్యోగం ఉత్సాహం కలిగించేది. మంచి జీతం వచ్చేది. నాకంటూ ఒక విలువ ఉన్నదనే అనుభూతి కలిగించింది. అయితే, మేలుకొని ఉన్న ప్రతిక్షణమూ నేను మా బాస్ ఆజ్ఞలకు బానిసను. అది నా జీవితంలోనే అతినికృష్టమైన అనుభవం. నా శిక్షాభృతి నాలుగు నెలలు. నేను అక్కడ ఒకనెలకు మించి భరించలేక పోయ్యాను.

అందులో కష్టమైన విషయమేమిటంటే, ఆ పని నాకు చాలా నచ్చింది. కష్టపడి పనిచెయ్యాలనేది కూడా నా కోరిక. మీ అదుపులోలేని క్రమంలో మీకిష్టమైన పని చెయ్యటమంటే, మీకిష్టంలేని పనిచేస్తున్న అనుభూతే కలుగుతుంది.

ఈ అనుభూతికి ఒక పేరు ఉన్నది. మానసిక శాస్త్రవేత్తలు దాన్ని రియాక్టన్స్ అంటారు. జోనా బెర్గర్ యూనివర్శిటీ ఆఫ్ పెన్సిల్వేనియాలో మార్కెటింగ్ ప్రొఫెసర్. ఆమె దానిని చక్కగా వివరించారు:

పరిస్థితులు తమ అదుపులో ఉన్నాయనే అనుభూతి ప్రజలకు ఆప్యాయమైనది. తామే నడిపిస్తున్నామనే అనుభూతి. వారిచేత మనం ఏదైనా చేయించటానికి ప్రయత్నిస్తే, వారు తమ స్వేచ్ఛ, స్వాతంత్ర్యం కోల్పోయిన అనుభూతి పొందుతారు. వారికి ఇష్టమైన పనికాక మనకిష్టమైన పని వారి నెత్తిన రుద్దిన అనుభూతి పొందుతారు. అంతకు ముందు అది వారికి ఇష్టమైన పనే అయినా, మరొకరు చెప్పగానే వారు వీలుకాదంటారు, లేదా మరొకటి ఏదైనా చేస్తారు.[25]

ఆ వివరణలో యదార్థం గుర్తించండి. అప్పుడు మీరు కోరినదానికి, మీరు కోరుకున్నప్పుడు, మీరు కోరుకున్నవారితో, మీరు కోరుకున్నచోట, మీరు కోరుకున్నంతకాలం డబ్బు వినియోగించగలిగితే, అందులో కలిగే అనుభూతి వర్ణనాతీతం.

దేరిక్ శివర్స్ సఫలత సాధించిన వ్యవస్థాపకులు. ఒకసారి ఆయన మిత్రులొకరు ఆయనను ధనుకులు ఎలా అయ్యారో చెప్పుమన్నారు. ఆయన కథనం:

> మాన్ హట్టన్ ఊరిమధ్యన నాకు ఒక ఉద్యోగం ఉండేది. ఆ ఉద్యోగం పగటిపూట మాత్రమే. నాకు సంవత్సరానికి 20,000 డాలర్లు జీతం. అది కనీసవేతనం క్రిందనే లెక్క. నేనెప్పుడూ బయట తినలేదు. ఎన్నడూ టాక్సీ ఎక్కలేదు. నాకు నెలకు 1000 డాలర్లు ఖర్చు అయ్యేది. నా సంపాదన నెలకు 1800 డాలర్లు. నేను ఆ ఉద్యోగం రెండు సంవత్సరాలు చేశాను. 12000 డాలర్లు పొదుపు చేశాను. అప్పుడు నా వయసు 22 సంవత్సరాలు.[26]

నా చేతిలో 12000 డాలర్లు ఉన్న తర్వాత, నేను ఉద్యోగం విడిచిపెట్టి, సంగీతకారుణ్ణి కావటానికి వీలయింది. తినటానికి సరిపడ డబ్బులు దొరుకుతాయని నా నమ్మకం. అంతే నాకు స్వేచ్ఛ లభించింది. ఒకనెల తర్వాత నేను ఆ ఉద్యోగం వదిలిపెట్టాను. ఆ తర్వాత ఎన్నడూ ఉద్యోగం చేయలేదు.

నా కథ చెప్పటం ముగించినప్పుడు నా మిత్రుడు ఇంకాచెప్పమని అడిగాడు. ఆ తర్వాత ఏమీ లేదు అంతే. అన్నాను నేను. ఆయన అన్నారు: “కాదు. నువ్వు నీ కంపెనీ అమ్మిన మాట ఏమిటి?”

దానివల్ల నా జీవితం ఏమీ మారలేదు. మరికొంత డబ్బు బ్యాంక్‌లో చేరింది. అంతే. మార్పు జరిగింది నా వయసు 22 సంవత్సరాలు ఉన్నప్పుడే.

---

ప్రపంచచరిత్రలో యునైటెడ్ స్టేట్స్ అత్యంత సంపన్నమైన దేశం. 1950 ప్రాంతాలలో సంపద, ఆదాయము ఈ నాటి కంటే - ద్రవ్యోల్బణానికి తగిన సర్దుబాటు జరిగిన తర్వాత కూడా, సగటు ఆదాయం - చాలా చాలా తక్కువగా ఉండేవి. అయినాకూడా ఈనాడు ప్రజలంతా సంతోషంగా ఉన్నారనటానికి నిదర్శనం ఏమీ లేదు. 2019లో 140 దేశాలలో నూట యాభై వేలమంది ప్రజలను సర్వేక్షణ చేశారు. అందులో 45 శాతం అమెరికన్లు ఆ క్రితంరోజు చాలా చింతలకు గురయినట్లు చెప్పారు.[27] ప్రపంచవ్యాప్తంగా ఈ సగటు 39 శాతం. 55 శాతం అమెరికన్లు ఆ క్రితంరోజు చాలా ఒత్తిడికి గురయినట్లు చెప్పారు. మిగిలిన ప్రపంచమంతటా 35 శాతం ఇదేమాట చెప్పారు.

జరిగింది ఏమిటంటే, మన అధిక సంపదను పెద్ద వస్తువులు, నాణ్యమైన వస్తువులు కొనడానికి వినియోగించాము. అదే సమయంలో మనకు మన సమయంమీద అదుపు తప్పింది. మహా అయితే అవి ఒకదానినొకటి రద్దు చేసుకుంటాయి.

1955లో మధ్యతరగతి కుటుంబం ఆదాయం (ద్రవ్యోల్బణం పరిస్థితులకు సర్దుబాటు జరిగిన తర్వాత) సాలీనా 29,000 డాలర్లు.[28] 2019లో అది 62,000 డాలర్లు దాటింది. ఆ అదనపు సంపదను మనం - 1950లో అమెరికన్లు

ఊహించలేని విధంగా - మధ్యతరగతి జీవనశైలికి ఖర్చుపెట్టాం. సగటు అమెరికన్ గృహం 1950లో 983 చదరపు అడుగులు ఉండేది. 2018లో అదే ఇల్లు 2436 చదరపు అడుగులకు పెరిగింది. ఈనాడు సగటు అమెరికన్ గృహంలో మనుషులకంటే బాత్రూంలు ఎక్కువ అయ్యాయి. మన కార్లు మునుపటి కంటే వేగంగా పరిగెత్తాయి, ఎక్కువ సమర్థవంతంగా నడుస్తాయి. మన టీవీ సెట్లు చవక అయ్యాయి నాణ్యతలో వృద్ధి చెందాయి.

మనకాలంలో జరిగిన ఈ మార్పులు అభివృద్ధి అని చెప్పలేము. అందుకు మనము చేసే ఉద్యోగాల స్వరూపమే కారణం.

జాన్ డి రాక్ ఫెల్లర్ అత్యంత సఫలత సాధించిన వ్యాపారవేత్త - ఆధునికయుగంలోనే కాదు అనాదినించీ కూడా. ఆయన దాదాపు సర్వకాల సర్వావస్థల్లోనూ ఏకాకిగా ఉండేవారు. ఆయన చాలా అరుదుగా మాట్లాడేవారు. ఉద్దేశపూర్వకంగానే ఆయన ఎవరికీ అందుబాటులో ఉండేవారు కాదు. ఒకవేళ మీరు ఆయన కంటికి ఎదురైనా ఆయన మౌనం వహించేవారు.

రాక్ ఫెల్లర్‌తో అప్పుడప్పుడు సంభాషించ కలిగిన ఒక రిఫైనరీ కార్మికులు ఒకసారి అన్నారు: "ఆయన అందరినీ మాట్లాడనిస్తారు. ఆయన మాత్రం వెనక్కు వాలి కూర్చొని నోరు విప్పరు."

సమావేశాలలో ఆయన మౌనం వహించడానికి కారణం అడిగినప్పుడు రాక్ ఫెల్లర్ ఒక పద్యం అప్పజెప్పారు:

ఓక్ వృక్షం మీద తెలివైన ముసలి గుడ్లగూబ
అది ఎంత ఎక్కువ చూస్తే అంత తక్కువ మాట్లాడింది:
ఎంత తక్కువ మాట్లాడితే అంత ఎక్కువ విన్నది
మనము ఆ తెలివైన వృద్ధ పక్షిలాగా ఎందుకు ఉండము?

రాక్ ఫెల్లర్ ఒక వింత వ్యక్తి. కానీ. ఈనాడు కోట్లాది కార్మికులకు అన్వయించే ముఖ్యవిషయం ఆయన ఆనాడు తెలుసుకున్నారు.

బావులు తవ్వడం, రైళ్లలో బరువులు ఎక్కించటం, పీపాలు ఒకచోటినుంచి మరొకచోటికి చేరవేయడం రాక్ ఫెల్లర్ ఉద్యోగం కాదు. సవ్యంగా ఆలోచించి

మంచి నిర్ణయాలు చెయ్యటమే ఆయన ఉద్యోగం. రాక్ ఫెల్లర్ ఉత్పాదన ఆయన బాహుబలంతోనూ, భాషాపాటవంతోనూ కలిగేదికాదు. ఆయన ఉత్పాదన ఆయన మనసులో కలిగే ఆలోచనల ద్వారా జనించేది. కనుక ఆయన తన సమయాన్ని, శక్తిని అందులోనే వినియోగించేవారు. ఆయన రోజంతా మౌనంగా కూర్చొని ఉంటే, అందరికీ ఆయన పని లేక, కునికిపాట్లు పడుతున్నట్లు తోచిఉండవచ్చు. కానీ ఆయన నిరంతరం మనసులో సమస్యలను, వాటి పరిష్కారాల గురించి ఆలోచిస్తూ ఉండేవారు.

ఆనాటి కాలంలో ఆయన చేసినది అద్వితీయం. రాక్ ఫెల్లర్ కాలంలో దాదాపు అన్ని పనులు చేతులతో చేయవలసి వచ్చేది. 1870 లో 46 శాతం ఉద్యోగాలు వ్యవసాయంలో ఉండేవి. 35 శాతం ఉత్పాదనలలో ఉండేవి. ఇది ఆర్థిక శాస్త్రవేత్త రాబర్ట్ గార్డెన్ సంగ్రహ నివేదిక. కార్మికుల మేధాసంపత్తిని వినియోగించే ఉద్యోగాలు చాలా కొద్దిగా ఉండేవి. ఆనాడు ఆలోచన అవసరం లేదు. కేవలం శారీరికంగా నిరవధికంగా శ్రమించటమే. ఆనాడు మీరు చేస్తున్న పని కంటికి కనిపించేది, చేతికి తగిలేది.

ఈనాడు అది తలకిందులైంది.

38 శాతం ఉద్యోగాలు మేనేజర్లు, అధికారులు, వృత్తి నిపుణులు అన్నపేర్లతో నడుస్తున్నాయి. ఇవి అన్నీ నిర్ణయాత్మకమైన ఉద్యోగాలు. మరొక 41 శాతం ఉద్యోగాలు సేవావిభాగానికి చెందినవి. అక్కడ మీ ఆలోచనలు చేతలు ఒకదానితో ఒకటి పోటీ పడుతూ ఉంటాయి.

ఈనాడు మనలో చాలామంది చేసే ఉద్యోగాలు రాక్ ఫెల్లర్ ఉద్యోగంతో పోలుతాయి. 1950 నాటి ఉత్పాదన కార్మికుడి ఉద్యోగంతో పోలటం చాలా తక్కువ. అంటే ఆఫీసు టైం అయిపోగానే కర్మాగారం విడిచిపెట్టటంతో మన పని పూర్తి కాదు. నిరంతరం మనతలలో పని జరుగుతూనే ఉన్నది. అంటే మనము చేసేపని ఎన్నటికీ తరగదనిపిస్తుంది.

కార్లు నిర్మించటం మీ ఉద్యోగం అయితే, అసెంబ్లీ లైన్ లో లేనప్పుడు మీరు చేయగలిగింది ఏమీ లేదు. మీరు పనిముగించి మీ పరికరాలు ఫ్యాక్టరీలో వదిలిపెట్టి ఇంటికి వెళ్తారు. కానీ మార్కెటింగ్ ప్రచారం మీ ఉద్యోగం – ఆలోచనా

పూర్వకమైన నిర్ణయాలు చేయవలసిన ఉద్యోగం - అయితే మీ సాధనం మిమ్మల్ని ఎన్నడూ విడువని మీ మెదడు అవుతుంది. మీరు ఇంటినుంచి ఉద్యోగానికి ప్రయాణిస్తున్నప్పుడు, రాత్రి భోజనం చేసేటప్పుడు, మీ పిల్లల్ని నిద్రపుచ్చి కూడా, అంతే కాక తెల్లవారుజామున 3 గంటలకు ఒత్తిడితో నిద్రపట్టక మేల్కొన్నప్పుడు కూడా మీ ఉద్యోగాన్ని గురించే ఆలోచిస్తూ ఉంటారు. 1950లో కంటే ఈనాడు మీరు భౌతికంగా ఆఫీసులో పనిచేసే కాలం తక్కువ కావచ్చు. కానీ మీరు రోజుకు 24 గంటలు, వారానికి 7 రోజులు పనిచేస్తున్న అనుభూతి కలగటం సహజం.

ది అట్లాంటిక్ కు చెందిన డెరెక్ థాంప్సన్ దీనిని ఇలా వర్ణిస్తారు:

> 21 వ శతాబ్దపు సాధన పరికరాలు అన్నీ ఒకచోటినుంచి మరొక చోటికి తరలించ గలిగినవయితే, ఆధునిక కర్మాగారం ఒక స్థలమేకాదు. రోజంతా అది మీతోనే ఉంటుంది. కంప్యూటర్ యుగం ఉత్పాదన సాధనాలను ఆఫీస్ నుంచి విడుదల చేసింది. ఇప్పుడు జ్ఞాన కర్షకులందరికీ వారి వారి ల్యాప్ టాప్ లూ, స్మార్ట్ ఫోన్ లూ ఎక్కడికంటే అక్కడికి పట్టుకు పోవచ్చుగదా! అవి సర్వార్థ సాధక పరికరాలయ్యాయి. కనుక వారందరూ ఆఫీసులో మధ్యాహ్నం 2 గంటలకైనా, టోక్యో వుయ్ వర్క్ లో తెల్లవారు ఝామున 2 గంటలకైనా, అర్ధరాత్రి మీ కౌచ్ లోనైనా మీరు పనిచేస్తూనే ఉండవచ్చు.[29]

పూర్వ తరాలతో పోలిస్తే సమయంమీద మీ అదుపు తప్పింది, తగ్గింది. మీ ఆనందానికి మూలస్తంభం సమయం మీ అదుపులో ఉండటమే. ఈనాడు సగటున జనం ఎప్పటికంటే ధనికులుగా ఉన్నా, వారి ఆనందంమాత్రం అంతంత మాత్రమేనంటే మనం ఆశ్చర్య పడనవసరం లేదు.

మరి మనమేం చెయ్యాలి?

ఆ సమస్య పరిష్కారం అంత సులువేమీ కాదు. ఎందుకంటే ప్రతిఒక్కరూ ఒక ప్రత్యేకవ్యక్తి. ఇక్కడ దాదాపు ప్రతిఒక్కరికీ సంతోషం కలిగించేది, కలిగించనిది ఏది, అని తెలుసుకోవటం తొలిమెట్టు.

వృద్ధాప్య శాస్త్రవేత్త కార్ల్ పిల్మర్ '30 లెసన్స్ ఫర్ లివింగ్' అనే పుస్తకం రచించారు. ఆయన సుమారు వెయ్యిమంది వయోవృద్ధులైన అమెరికన్లను ఇంటర్వ్యూ చేశారు. దశాబ్దాల జీవితానుభవంలో వారు నేర్చుకున్న ముఖ్య పాఠాలు ఏమిటో తెలుసుకోవటం ఈ సర్వేక్షణ లక్ష్యం. ఆయన వ్రాశారు:

> మీరు కోరిన వస్తువులు కొనటానికి, సంతోషంగా ఉండటానికి, అవసరమైన డబ్బు సంపాదించటానికి మీరు సాధ్యమైనంత కష్టపడి పనిచెయ్యాలని ఆ వెయ్యిమందిలో ఒక్కరూ, ఒక్కరుకూడా అనలేదు.
> మీచుట్టూ ఉన్నవారెంత ధనికులుగా ఉన్నారో మీరుకూడా కనీసం అంత ధనికులుగా ఉండాలనీ, వారికంటే ధనికులుగా ఉంటే ఇంకా మేలనీ ఒక్కరూ, ఒక్కరు కూడా అనలేదు.
> మీరు భవిష్యత్తులో ఆశించిన సంపాదన తెచ్చిపెట్టే ఉద్యోగం మీరు చేయాలని ఒక్కరు, ఒక్కరు కూడా వారిలో ఎవ్వరూ అనలేదు.

నిజమైన స్నేహితాలూ, తమకంటే విలువైన వాటితో భాగస్వామ్యం, విలువైన సమయాన్ని పిల్లల్తో గడపటం ఇవీ వారు విలువ ఇచ్చిన విషయాలు. "మీ పిల్లలకు మీ డబ్బు (ఆ డబ్బు కొనగల వస్తువులూ ) అక్కరలేదు. వారికి మీరు కావాలి. ముఖ్యంగా మీరు వారితో ఉండాలని వారి కోరిక" పిల్మర్ వ్రాస్తారు.

జీవితంలో అన్నీచూసినవారి మాట వినండి. మీ సమయం మీ అదుపులో ఉంచటమే డబ్బు మీకు ఇవ్వగలిగిన అత్యుత్తమ కానుక.

ఇప్పుడు, డబ్బు ప్రసాదించే అతి కనీస ప్రయోజనాలను గురించి ఒక చిరు అధ్యాయం.

# 8.
# కారులో మనిషి విరోధాభాసం

---

మీకు ఉన్న వస్తువులు చూసి మురిసిపోయేది
మీరే, మరెవరూ కాదు

---

డ్రైవర్ కావటంవల్ల కలిగే అతిపెద్ద ప్రయోజనం రోడ్డుకెక్కిన అతి కొత్తకార్లు, అతి నాణ్యమైన కార్లు నడపటమే. అతిథులు ఫెరారీలు, లబార్గినీలు, రోల్స్ రాయ్సులలో– అన్నీ పాలకవర్గ ప్రయాణ సాధనాలు – వస్తూ ఉంటారు.

అటువంటి కారు ఒకటి స్వంతం చేసుకోవాలని చాలాకాలం నా కల. మనం ఘనత సాధించామని ఎదటివాళ్ళకు దృఢమైన సంకేతం(అని నా ఆలోచన). మీరు తెలివైనవారు. మీరు ధనవంతులు. మీకు మంచి అభిరుచి ఉన్నది. మీరు ముఖ్యులు. నన్ను చూడు.

నేను ఆ డ్రైవర్లవైపు ఎన్నడూ చూడకపోవటమే ఇక్కడ వ్యంగ్యం.

ఖరీదైనకారు నడుపుతున్న వారిని చూసి, "ఆ కారు నడుపుతున్న వ్యక్తి ఘనుడు" అని మీరనుకోవటం చాలా అరుదు. అలాకాక "నాకే గనక అలాంటి కారు ఉంటే, జనం నన్ను ప్రత్యేకంగా చూస్తారు." అనుకుంటారు మీరు. సచేతనంగా గాని, ఉపచేతనంగాగాని మనుషుల ఆలోచన అలాగే ఉంటుంది.

ఇక్కడ వ్యంగ్యం ఏమిటంటే: ఇతరులు తమనుచూసి అభిమానించాలనీ, తమను మెచ్చుకోవాలనీ ఆశతో జనం ఐశ్వర్యం కోరుకుంటారు. యదార్థం ఏమిటంటే, ఎదటివాళ్ళు మిమ్మల్ని మెచ్చుకునే బదులు మిమ్మల్ని నిర్లక్ష్యం చేస్తారు. ఐశ్వర్యాన్ని మెచ్చుకపోవటం వారి ఉద్దేశ్యం కాదు. ఇప్పుడు మీకంటే ఎక్కువ ఐశ్వర్యం సంపాదించి అదే మెచ్చుకోలు, అభిమానము పొందాలని వారి కోరిక.

మా అబ్బాయి పుట్టిన తర్వాత నేను వ్రాసిన ఉత్తరం, "ఖరీదైన కారు, అధునాతనమైన రిస్ట్ వాచ్, పెద్ద ఇల్లు ఇవి నీకోరికలని నీవనుకోవచ్చు. కానీ నామాట విను. నీ ఆలోచన అదికాదు. నువ్వు ఎదటివారినుంచి ఆశించేది గౌరవం, మెచ్చుకోలు. ఖరీదైన వస్తువులు ఉంటే ఆ గౌరవం, మెచ్చుకోలు లభిస్తాయని నీ ఆలోచన. అది ఎన్నటికీ జరిగే పని కాదు. ముఖ్యంగా మర్యాద, మెచ్చుకోలు ఎవరిదగ్గరినుంచి ఆశిస్తున్నావో, వారి దగ్గరినుంచి.

పెద్దలందరూ వారి ఫెరారీలలో హోటల్ కు వస్తూ ఉంటే వాలెట్‌గా నేను కళ్ళు ఇంతింత చేసుకుని వారిని సంభ్రమాశ్చర్యలతో తేరిచూసేవాడిని. వాళ్ళు ఎక్కడికి వెళ్ళినా జనం వారిని కళ్ళు ఇంతింత చేసుకుని చూస్తారు. అది చూసి వారికి ఆనందం. వారు ఆ మెచ్చుకోలు అనుభూతి చెందిఉంటారు.

కానీ వారంటే లెక్కచెయ్యలేదనీ, పట్టించుకోలేదనీ వారికి తెలుసా? నేను కేవలం కళ్ళు ఇంతలు చేసుకుని వారిని చూడటం మాత్రమే చేశాననీ, మనసులో ఆ డ్రైవర్ సీటులో నన్ను ఊహించు కుంటున్నాననీ వారికి తెలుసా?

వారు ఆశించిన మెచ్చుకోలు కోసమే వారు ఆ ఫెరారి కొన్నారా? నేను కానీ, ఆ కారు చూసిన మరెవరూ కానీ, వారిని గురించి ఆలోచించటం లేదనీ, డ్రైవరు సీటులో తమను ఊహించుకునే చూస్తున్నారనీ వారికి తెలియదా? ఆ విషయం వారు గ్రహించలేదా?

పెద్దపెద్ద భవనాలలో నివసించేవారికి కూడా ఇదే వర్తించుతుందా? తప్పకుండా.

సొమ్ములు, దుస్తులు? తథ్యం.

ఇక్కడ నేను ధనసంపాదన కూడదని చెప్పడంలేదు. ఆమాటకొస్తే ఆర్భాటమైన కార్లు కూడా. నాకు రెండూ ఇష్టమే. జనం సాధారణంగా ఇతరుల ఆదరణ, మెచ్చుకోలు ఆశిస్తారన్నమాట సూక్ష్మ గ్రాహ్యం. ఆర్భాటమైన వస్తువులు కొనటానికి డబ్బు ఖర్చు చెయ్యటంవల్ల మీరు ఆశించిన ఆదరణ, మెచ్చుకోలు లభించక పోవచ్చు. ఆదరణ, మెప్పు మీ లక్ష్యం అయితే, అవి ఎలా సంపా దించాలనుకుంటున్నారో కొంచెం జాగ్రత్తగా ఆలోచించండి. వస్తుసంపదకంటే నమ్రతా, దయ, సహానుభూతి మీకు ఆశించినదానికంటే అధిక ఆదరణ తీసుకువస్తాయి.

ఫెరారీలను గురించిన కబుర్లు ఇంకా పూర్తికాలేదు. కార్లను గురించిన మరొక విరోధాభాసం వచ్చే అధ్యాయంలో.

# 9.

# ఐశ్వర్యం అగోచరం

---

మీ దగ్గర డబ్బుఉన్నదని చూపించటానికి
ఖర్చుచేయటమే సంపద తరిగిపోవటానికి
అతి శీఘ్రమార్గం.

---

డబ్బులో చాలా వ్యంగ్యం ఉన్నది. సంపద అంటే కంటికి కనపడనిది అన్నది వాటిలో ముఖ్యమైన వ్యంగ్యం.

2000 దశాబ్దం మధ్యలో నేను లాస్ ఏంజలీస్‌లో వాలెట్‌గా పని చేశాను. అప్పుడు ప్రాణవాయువు తర్వాత అన్నిటికంటే ముఖ్యమైన విషయం వస్తుసంపదగా దర్శన మిచ్చింది.

చుట్టుపక్కల ఎక్కడైనా ఫెరారీ కనిపిస్తే, ఆ కారు యజమాని ధనికులని – వారిని గురించి మీరు పట్టించుకోక పోయినా – మీరనుకోవటం సాధారణం. కానీ, వారిలో కొంతమందిని గురించి తెలిసిన తర్వాత ఆ విషయం నిజం కాదని గ్రహించాను. వారిలో చాలామందికి సగటు ఆదాయంకూడా ఉండేది కాదు. కానీ వారి జీతంలో ఎక్కువశాతం కారు మీద ఖర్చు చేసేవారు.

నాకు ఒక వ్యక్తి బాగా గుర్తు ఉన్నారు. ఆయనను ప్రస్తుతానికి రోగర్ అని పిలుద్దాం. ఆయన సుమారుగా నా వయసు వారే. ఆయన ఏ ఉద్యోగం చేసేవారో నాకు తెలియదు. కానీ ఆయన పోర్ష్ కారు నడిపేవారు. జనం ఊహాగానానికి అది చాలు.

ఒకనాడు రోగర్ పాత హోండా కారులో వచ్చారు. తర్వాతవారం, ఆ తర్వాతవారం కూడా అంతే.

"మీ పోర్ష్ ఏమైంది?" నా ప్రశ్న. "కారు మీద అప్పు తీర్చక పోయేసరికి అది వెనక్కు వెళ్ళింది." ఆయన సమాధానం. ఆ విషయం చెప్పటానికి ఆయన ఎంతమాత్రము మొహమాట పడలేదు. ఆటలో తర్వాతి ఎత్తు అన్నట్లు చెప్పారు ఆయన. ఆయనను గురించి మన ఊహలన్నీ గాలిమేడలు. లాస్ ఏంజలీస్ అంతా రోగర్స్ మయం.

100,000 డాలర్లు ఖరీదుచేసే కారు ఉన్నవారెవరైనా సరే ధనికులై ఉండవచ్చు. కానీ ఇక్కడ కటిక నిజం ఏమిటంటే, కారు కొనక ముందుకంటే ఇప్పుడు వారి సొమ్ము 100,000 డాలర్లు తగ్గింది (లేదా అప్పు 100,000 డాలర్లు పెరిగింది).

మన కంటికి కనపడే దానితో సంపద అంచనా వేస్తాం. మన కంటికి కనబడేది అదే కనుక. జనం బ్యాంక్ ఎకౌంట్లు, బ్రోకరేజ్ దస్తావేజులు మనకు కనపడవు. కనుక బయటికి కనబడే దృశ్యాలకార్లు, ఇళ్ళు, ఇన్స్టాగ్రామ్ ఫోటోలు – ఆధారంగా ఆర్థిక సఫలత అంచనా వేస్తాం.

ఆధునిక ధనికస్వామ్యం జనాన్ని కపట వేషధారులుగా తయారు చేస్తుంది. అదే ఒక ఆకర్షణీయమైన పరిశ్రమగా తయారైంది.

కానీ, ఐశ్వర్యం అంటే కంటికి కనిపించనిదేనదన్నమాట యదార్థం.

కొనని ఖరీదైన కార్లు, కొనని వజ్రాలు, ధరించని గడియారాలు, కొనకుండా వదిలిపెట్టిన పట్టువస్త్రాలు, అంతస్తును సూచించే ఆర్భాటం పట్టుకు వేలాడకుండా వదిలివేయటం ఇవీ ఐశ్వర్యం అంటే. కంటికి కనిపించే వస్తు ఐశ్వర్యం అంటే సంపదలోకి మారకుండా దాగి ఉన్న ఆర్థిక స్తోమతు.

మనం ఐశ్వర్యాన్ని గురించి ఆ విధంగా ఆలోచించం. కంటికి కనపడని దానిని మనం ఊహించలేం.

అమిత వ్యయంచేసిన గాయని రిహానా దాదాపు దివాలా తీసినంత పనయింది. ఆమె తన ఆర్థిక సలహాదారుమీద వ్యాజ్యం వేశారు. ఆ సలహాదారు సమాధానం: "వస్తువులు కొనటానికి డబ్బు ఖర్చు పెడితే, వస్తువులే మిగులుతాయి కానీ డబ్బు మిగలదు అని ఆమెకు ప్రత్యేకంగా చెప్పాలా?"[30]

మీరు నవ్వచ్చు. సరే నవ్వండి. కానీ, జనానికి ఆ విషయం చెప్పాలి అన్నది సమాధానం. మిలియనీర్లు కావాలని ఆశపడేవారందరూ నిజానికి "నేను మిలియన్ డాలర్లు ఖర్చు చేయాలను కుంటున్నాను." అని చెప్తున్నారన్నమాట. మిలియనీర్ గా ఉండటానికి అది అక్షరాలా విపర్యయం.

పెట్టుబడిదారు బిల్ మన్ ఒకసారి వ్రాశారు: "ధనికులుగా అనుభూతి చెందటానికి అసలైన విలాస వస్తువుల మీద చేతిలో ఉన్న డబ్బంతా ఖర్చుపెట్టటాన్ని మించిన శీఘ్రమార్గం లేదు. కానీ ఉన్నడబ్బు మాత్రమే ఖర్చు చేసి, లేని డబ్బు ఖర్చుచేయకుండా ఉండటమే ధనికులుగా ఉండటానికి మార్గం. అది అంత సరళం."[31]

అది అద్భుతమైన సలహా. కానీ అది ఎంతోమంది చెవికెక్కదు. ఉన్నసొమ్ము ఖర్చు చేయకుండా ఉండటమే ధనికులుగా ఉండటానికి ఏకైక మార్గం. సొమ్ము కూడబెట్టటానికి అది ఒక్కటే మార్గం కాదు. ఐశ్వర్యానికి నిర్వచనమే అది.

సంపదకు, ధనికతకు మధ్య వ్యత్యాసం నిర్వచించటంలో మనం జాగ్రత్త పడాలి. ఇది పదవిన్యాసాన్ని మించిన అర్థం. ఆ వ్యత్యాసం తెలియక పోవటమే లెక్కకందని ఆర్థిక దుర్నిర్ణయాలకు మూలం.

ధనికత అంటే ప్రస్తుత ఆదాయం. 100,000 డాలర్ల కారు నడిపేవారు తప్పకుండా ధనికులై ఉండాలి. వారు దానిని అప్పుచేసి కొన్నా, ఆ అప్పు తీర్చటానికి తగిన రాబడి ఉండాలి. పెద్దపెద్ద భవనాలలో నివసించేవారి విషయం కూడా అంతే. ధనికులైన వారిని గుర్తించటం అంత కష్టమైన విషయమేమీ కాదు. తమను గురించి ప్రదర్శించటానికి పడరాని పాట్లు పడతారు.

కానీ సంపద గుప్తంగా ఉంటుంది. అది ఖర్చు చెయ్యని ఆదాయం. సంపద అంటే తర్వాత ఎప్పుడో ఏదో కొనటానికి ఇంకా నిర్ణయం కాని ఎంపిక. ఈనాటికంటే తర్వాత ఎప్పుడో అంతకంటే విలువైన వస్తువులు కొనటానికి, ఎంచుకోవటానికి, ఒదుగుబాటుకు, ఎదుగుదలకు అవకాశం.

పోషకాహారం, వ్యాయామం ఉపయోగకరమైన సామ్యం చూపుతాయి. బరువు తగ్గటం అనేది ప్రతిరోజూ కష్టపడి వ్యాయామం చేసేవారి దగ్గరకూడా – కష్టసాధ్యమైన విషయంగా చెడుపేరు తెచ్చుకున్నది. అది ఎందుకు అలా అయిందో బిల్ బ్రైసన్ తన రచన 'ది బాడీ' లో వివరిస్తారు:

> అమెరికాలో ఒక అధ్యయనం జరిగింది. అందులో వ్యాయామం చేసేవారు తాము ఖర్చుచేస్తున్న క్యాలరీలను గురించి నాలుగు రెట్లు అధికంగా అంచనా వేస్తారు. సగటున వారు తాము ఖర్చు చేసిన క్యాలరీలకంటే రెట్టింపు ఆహారం స్వాహా చేస్తారు. అతిగా తినటం వల్ల వ్యాయామం వల్ల కలిగిన ప్రయోజనం అంతా నీళ్ళపాలవుతుంది. మనలో చాలా మందిమి చేసేది అదే."

వ్యాయామమంటే ధనికత వంటిది. "నేను వ్యాయామం చేశాను. ఇప్పుడు నేను మంచి భోజనం తినటానికి అర్హత సంపాదించాను." అని మీ ఆలోచన. సంపద అంటే ఆ భోజనం నిరాకరించి, అసలు క్యాలరీలను నిజంగా వ్యయం చెయ్యటం. అది కష్టమైన పని. అందుకు ఆత్మ సంయమనం కావాలి. మీరు చెయ్యవలసినదానికీ మీరు చేయదలచిన దానికీ మధ్య వ్యత్యాసం సృష్టించేది అదే.

ఆదర్శవంతులైన ధనికులను కనుక్కోవటం మనందరికీ సులువైన పని. సంపన్నులను కనుక్కోవటమే కష్టమైన పని. వారి సఫలత దాగి ఉండటమే అందుకు కారణం.

వస్తువులమీద ఖర్చుచేసే సంపన్నులుకూడా లేకపోలేదు. అక్కడ కూడా మనకు వారి ధనికతే కళ్ళకు కనిపిస్తుంది కానీ వారి సంపద కాదు. మనకు వారి కార్లు కనిపిస్తాయి. వారి పిల్లలు చదివే స్కూళ్ళు దర్శన మిస్తాయి. వారి పొదుపు, విశ్రాంత ఎకౌంట్లు, పెట్టుబడి దాఖలాలు మనకు కంపించవు. వారు కొన్న ఇళ్ళే మనకు కన్పిస్తాయి. వారు కొనగలిగిన ఇళ్ళు మనకు దర్శన మియ్యవు.

అంతరాంతరాలలో దాదాపు అందరూ సంపన్నులుగానే ఉండాలని కోరుకుంటారన్నదే ప్రమాదమని నా ఉద్దేశ్యం. వారికి స్వేచ్ఛ, వశ్యత కావాలి. ఖర్చు చెయ్యని ఆర్థిక సంపద మనకు ఇవ్వగలిగిన శక్తి అదే . డబ్బు ఉండటమంటే ఖర్చు చెయ్యటమేనన్న భావన మనందరిలో లోతుగా నాటుకుపోయి ఉన్నది. సంపన్నులుగా ఉండటానికి కావలిసిన నియంత్రణ మనలో శూన్యం. అది మన కంటికి కనబడదు గనక, అది నేర్చుకోవటం మనకు కష్టం.

అనుకరణ జనానికి అనుకూలమైన విద్య. కానీ సంపద గోప్యప్రకృతి అనుకరణకు, నేర్చుకోవటానికీ అవకాశమివ్వదు. చనిపోయిన తర్వాత రోనాల్డ్ రీడ్ జనానికి ఆదర్శప్రాయులయ్యారు. వార్తా మాధ్యమాలలో ఆయనను మృగరాజుతో పోల్చారు. సామాజిక మాధ్యమాలలో ఆయన చిరస్మరణీయులయ్యారు. జీవించి ఉన్నంత కాలం ఆయన ఎవరికీ ఆదర్శ ప్రాయులు కాలేకపోయ్యారు. ఆయనను బాగా ఎరిగినవారికికూడా ఆయన సంపద పూర్తిగా రహస్యమే.

పేరుపొందిన రచయితల రచనలు చదవకపోతే, రాయటం నేర్చుకోవటం ఎంత కష్టమో మీరు ఊహించండి. మీ ప్రేరణ ఎవరు? మీరు ఎవరిని ఆదర్శమూర్తులుగా స్వీకరిస్తారు? ఎవరి సూక్ష్మదృష్టి, వ్యూహాలు మీరు అనుసరిస్తారు? కష్టమైన పనిని ఈ సందర్భం కష్టతరం చేస్తుంది. కనిపించని దానిని నేర్చుకోవటం ఎంత కష్టమో నేర్చుకునేవారికి తెలుసు. అందుచేతనే సంపద నిర్మించటం చాలామందికి దుస్సాధ్యమైన కార్యమవుతుంది.

---

ఖర్చు పెట్టరానిదే సంపద అయితే, ఇక దాని ప్రయోజనమేమున్నది? డబ్బు పొదుపు చేయాలని మిమ్మల్ని ఒప్పించటానికి ప్రయత్నిస్తాను.

# 10.

# డబ్బు పొదుపు చేయండి

---

మీరు నియంత్రించ గలిగిన ఏకైక అంశం
అన్నిటికంటే ముఖ్య వస్తువును ఉత్పత్తి చేస్తుంది.
ఎంత అద్భుతం!

---

డబ్బు పొదుపు చేయాలని మిమ్మల్ని ఒప్పిస్తాను.

అది ఎంతోసేపు పట్టదు.

కానీ అది మొహమాటం వ్యవహారం కదా!

డబ్బు పొదుపు చెయ్యమని జనానికి నచ్చచెప్పాలా?

అవును, చాలామందికి అలా చెప్పటం అవసరమని నా ఉద్దేశ్యం.

రాబడి ఒకస్థాయి దాటిన తర్వాత, జనం మూడు విధాలుగా ఏర్పడుతారు: పొదుపు చేసేవారు, పొదుపు చెయ్యటం వారివల్ల కాదనుకునేవారూ, తాము పొదుపు చెయ్యనక్కర్లేదనుకునేవారు.

ఇది చివరి రెండు గ్రూపుల వారికీ.

---

**మొట్టమొదటి ఆలోచన సరళమే, కానీ నిర్లక్ష్యం చెయ్యటం సులభం సంపద సృష్టించటానికి మీ రాబడితోనూ, మీ పెట్టుబడితోనూ సంబంధం లేదు. అంతా మీ పొదుపును బట్టి ఉంటుంది.**

దక్షత శక్తిని గురించి ఒక కథ.

1970 దశకంలో ఈ ప్రపంచంలో ఇంధనతైలం ఒట్టిపోతున్నట్లు తోచింది. ఆ లెక్కలు కష్టమేమీ కాదు: ప్రపంచమంతటా ఇంధనతైలం విరివిగా ఉపయోగిస్తున్నారు. విశ్వవ్యాప్తంగా ఆర్థికశక్తి దినదినాభివృద్ధి చెందుతున్నది. మన ఆయిల్ ఉత్పాదనలు చాలటంలేదు.

ఏతావాతా ఆయిల్ ఒట్టిపోలేదు. అది మనం ఇంకా ఎక్కువ స్థలాలలో ఆయిల్ కనుక్కున్నందువల్ల కాదు. ఆ ఆయిల్ తవ్వకంలో మనం మేలైన పద్ధతులు ప్రయోగించినందువల్లా కాదు.

మనం శక్తివినియోగంలో దక్షతగల కార్లు, ఫ్యాక్టరీలు, ఇళ్ళు నిర్మించటం మొదలుపెట్టాం. ఆయిల్ సంక్షోభంలో నుంచి బయటపడటానికి అన్నిటినీ మించిన కారణం అదే. 1950 తో పోలిస్తే ఈనాడు యునైటెడ్ స్టేట్స్ GDPలో ప్రతిఒక్క డాలరుల్లో 60% శాతం తక్కువ ఇంధనశక్తి ఉపయోగిస్తుంది.[32] ఈనాటి వాహనాలు 1975 నాటి వాహనాలకంటే రెట్టింపు మైలేజ్ ఇస్తాయి. 1989 ఫోర్డ్ టారస్ (సీడాన్) సగటున గ్యాలన్ కు 18 మైళ్ళు నడిచేది. 2019 నాటి షెవీ సబర్బన్ (అతి భారీ వాహనం) సగటున గ్యాలన్‌కు 18.1 మైళ్ళు నడుస్తుంది.

ప్రపంచం తన ఇంధనశక్తి సంపద పెంచింది. ఎలా? మూలసంపద పెంచి కాదు. ఇంధనశక్తి వినియోగం తగ్గించి. 1975 నాటినుంచి యునైటెడ్ స్టేట్స్ ఆయిల్, గ్యాస్ ఉత్పత్తి 65% పెరిగింది. ఆ ఇంధనశక్తితో మనం రెండురెట్లను మించిన ఫలితాలు సాధించగలం. ఇప్పుడు ఏది ముఖ్యమో గ్రహించటం సులభం.

ఇంధనశక్తి ఇంకా ఇంకా కనుక్కోవటం మన అధీనంలో లేని అంశం. మన అన్వేషణ ఫలిస్తుందో లేదో ఎవరూ చెప్పలేరు. అందుకు భూగర్భ శాస్త్రం, భూగోళశాస్త్రం, వాతావరణం, భౌగోళికరాజకీయాలు అన్నీ సహకరించాలి. ఇవన్నీ కలిసిన సమ్మేళనం ఎంత జారుడు వ్యవహారమో అందరికీ తెలుసు. కానీ ఇంధనశక్తి ఎంత పొదుపుగా, ఎంత దక్షతతో వినియోగిస్తామనేది మన చేతిలో ఉన్నది. తేలికైన కారు, లేదా మోటార్ సైకిల్ నడపాలని నిశ్చయించటం మీ చేతిలో ఉన్న పని. అక్కడ నూటికి నూరు పాళ్ళు సామర్థ్యం, దక్షత పెంచే అవకాశం ఉన్నది.

డబ్బు విషయంలో కూడా అదే సూత్రం వర్తిస్తుంది.

పెట్టుబడిమీద వచ్చే ఆదాయం మిమ్మల్ని ధనికులను చెయ్యొచ్చు. కానీ ఆ పెట్టుబడి ప్రణాళిక ఫలిస్తుందా, చేస్తే ఎంతకాలం పనిచేస్తుంది, విపణివీధి సహకరిస్తుందా, అన్నీ అనుమానాలే. ఫలితాలన్నీ సందిగ్ధావస్థ ముసుగులో ఉంటాయి.

వ్యక్తిగతమైన పొదుపు, మితవ్యయం - ఆర్థిక రక్షణ, దక్షత - ఇవి మీచేతిలో ఉన్న కళ్ళాలు. ఈనాడు ఎంత సమర్థవంతంగా ఉన్నాయో భవిష్యత్తులో ఏనాడైనా కూడా అంత సమర్థవంతంగా ఉంటాయి. ఇది నూటికి నూరుపాళ్ళు వాస్తవం.

సంపద కూడబెట్టటానికి డబ్బు కావాలి, పెట్టుబడులలో పెద్దపెద్ద లాభాలు రావాలని మీ ఊహ అయితే, మీరుకూడా 1970లో నాటి నిరాశావాదుల కోవలోకి ప్రవేశిస్తారు. అప్పుడు ముందడుగు వెయ్యటం మీ చేతికందనిపని, దుస్సాధ్యం, అవుతుంది.

అలాకాక, దానిని మీరు మీ మితవ్యయంతో, దక్షతతో సాధ్యమని అవలోకిస్తే, మార్గం విశదమవుతుంది.

మీరు ఖర్చుచేయగా మిగిలినదానిని కూడబెట్టటమే సంపద అంటే. మీ ఆదాయం పెద్దగా లేకపోయినా మీరు సంపద కూడబెట్టవచ్చు. కానీ పొదుపు, మితవ్యయం లేకపోతే, సంపదకు అవకాశమే లేదు. ఏది ముఖ్యమో ఈపాటికి మీరు గ్రహించి ఉండాలి.

## అతిముఖ్యంగా, సంపద విలువ మీ అవసరాలతో ముడిపడి ఉన్నది

మీకూ నాకూ ఉన్న ఆస్తిపాస్తుల విలువ ఒకటే ననుకుందాం.

మీరు నాకంటే దక్షులయిన పెట్టుబడిదారులనుకుందాం. నేను నా పెట్టుబడులమీద సాలీనా 8% ఆదాయం సంపాదిస్తాను. మీరు సాలీనా 12 శాతం రాబడి సంపాదిస్తారు.

కానీ నేను ఆ డబ్బుతో దక్షతతో వ్యవహరిస్తాను. ఆనందంగా జీవించటానికి నాకు అందులో సగం డబ్బు చాలు. ఈ ఆస్తిపాస్తుల విలువలతో పాటు మీ జీవన శైలి కూడా చక్రవృద్ధి చెందుతుంది.

పెట్టుబడిలో నేను మీకంటే వెనకబడినవాడిని కావచ్చు. కానీ నాసంపద మీ సంపదకంటే మెరుగుగా ఉంటుంది. నాకు వచ్చే రాబడిశాతం తక్కువయినా, నా పెట్టుబడులద్వారా నాకు ఎక్కువ ప్రయోజనం చేకూరుతుంది.

ఆదాయాలకు కూడా ఇదే వాస్తవం వర్తిస్తుంది. తక్కువ డబ్బుతో సంతోషంగా ఉండటంవల్ల మీకు ఉన్నదానికి, మీరు కోరుకున్న దానికి అంతరం ఏర్పడుతుంది. మీ జీతం పెరుగుతూ ఉన్నాకూడా మీ నియంత్రణవల్ల ఆ అంతరం సులువు అవుతుంది.

ఎక్కువ పొదుపు అంటే తక్కువ ఖర్చులు. తక్కువ ఖర్చులు అంటే మీ

పొదుపు – మీరు ఎక్కువ ఖర్చు చేస్తే జరిగే దానికంటే – చాలాదూరం ప్రయాణం చేస్తుంది.

పెట్టుబడిలో సాలీనా 0.1 శాతం అభివృద్ధి సాధించాలంటే ఎంత సమయం, శ్రమ అవసరమో ఆలోచించండి – లక్షలకొద్దీ గంటల పరిశోధన, అనుభవజ్ఞులైన వృత్తి నిపుణులనుంచి బిలియన్ల డాలర్లు విలువచేసే ప్రయత్నం – అప్పుడు ఏది ముఖ్యమో గ్రహించటం సులభం అవుతుంది.

తమ పెట్టుబడుల మీద 0.1% అధిక రాబడి సాధించటానికి వారానికి 80 గంటలు చెమటోడ్చి శ్రమించే వృత్తి నిపుణులు చాలామంది ఉన్నారు. అదే వారి జీవన శైలిలో సర్దుబాటు చేసుకోగలిగితే రెండు, మూడు శాతం అధిక రాబడి అతి సులువుగా, అనాయాసంగా సాధించవచ్చు.

పెట్టుబడుల మీద అధిక లాభాలు, పెద్దపెద్ద జీతాలు సాధ్యమైతే అది ఆశ్చర్యానందాలకు మూలం. ఆ సమీకరణంలో ఒక వైపు మాత్రమే శృతిమించిన శ్రమ కనపడుతుంది. రెండో వైపున శ్రమ దాదాపు పూజ్యం అనే చెప్పవచ్చు. అక్కడే అందరికీ అవకాశం ఎదురుచూస్తున్నది.

**ఆదాయం ఒక స్థాయి దాటిన తర్వాత మీకు కావలసినదల్లా మీ అహంకారానికి కింద ఉన్నది.**

ప్రాథమిక అవసరాలు అందరికీ కావలసినవి. అవి తీరిన తర్వాత వాటి పైమెట్టుమీద సౌఖ్య అవసరాలు ఉన్నాయి. ఆపైన ఇంకా సౌకర్యమైన వినోదమైన, విలాసవంతమైన అవసరాలు ఉన్నాయి.

నిత్యావసరాలకు మించి ఖర్చుచేయటమంటే మన అహంకారం మన ఆదాయాన్ని అందుకోవటానికి ప్రయత్నిస్తున్నదన్నమాట. మీ దగ్గర డబ్బు ఉన్నదని ప్రజలకు ప్రదర్శన చేసే ప్రయత్నం.

దీనిని గురించి ఇలా ఆలోచించండి. మీ పొదుపు పెంచటానికి మీ ఆదాయం పెంచటం సరియైన మార్గం కాదు. మీ నమ్రతను పెంచటమే ఉత్తమమైన మార్గం.

పొదుపు అనేది మీ అహంకారానికి, మీ ఆదాయానికి మధ్యనున్న అంతరం అనుకుని మీరు నిర్వహిస్తే, చెప్పుకోదగిన ఆదాయం ఉన్నవారందరూ, పోనీ

చాలామంది, అంత తక్కువ ఎందుకు పొదుపు చేస్తారో మీరు గ్రహిస్తారు. మీ నెమలి పించం విస్తరింపజేసే ప్రయత్నానికి అడ్డుకోవాలని పోరాటం. అదే క్షణంలో అలా చేసేవారితో సరితూగాలని ప్రయాస.

వ్యక్తిగతంగా ఆర్థిక సఫలత సాధించేవారు - వారి ఆదాయం చెప్పుకో దగినంత ఉండకపోవచ్చు - ఇతరులు వారిని గురించి ఏమనుకుంటున్నారో అనే విషయాన్ని పట్టించుకోరు, లెక్కచేయరు.

**పొదుపు చేయటానికి జనం అనుకున్నదానికంటే మించిన సామర్థ్యం వారిచేతిలోనే ఉన్నది.**

ఖర్చు తగ్గించుకొని పొదుపు చేయవచ్చు.

మీ కోరికలు తగ్గించుకుంటే ఖర్చు తగ్గించవచ్చు.

ఎదటివారు మిమ్మల్ని గురించి ఏమనుకుంటారోనని మీరు పట్టించుకోకపోతే, మీ కోరికలు తగ్గించుకోవచ్చు.

డబ్బు మనస్తత్వం మీద ఆధారపడుతుంది, ఆర్థికశాస్త్రం మీద కాదు. ఈ పుస్తకంలో నేను తరుచూ వాదించేది అదే.

**పొదుపు చేయటానికి ప్రత్యేకించి కారణమేమీ అక్కర్లేదు.**

ఇంటికి, కారుకు అడ్వాన్స్ కట్టటానికీ, లేదా రిటైర్ మెంటుకూ కొంతమంది డబ్బు పొదుపు చేస్తారు.

అది చెప్పుకోదగ్గవిషయమే ననటంలో సందేహం లేదు.

కానీ పొదుపు చేయటానికి ఏదో ఒకటి కొనాలన్న లక్ష్యము, నియమము ఏమీ అక్కరలేదు.

కేవలం పొదుపుచేసే ఉద్దేశ్యంతోనే పొదుపు చేయవచ్చు. చెయ్యవలసింది అదే. ప్రతి ఒక్కరూ చెయ్యాలి.

జరగబోయ్యేది ఏమిటో తెలిస్తే, ఒక ప్రయోజనంకోసం పొదుపు చేయటంలో అర్థం ఉన్నది. కానీ ఈ ప్రపంచంలో మరుక్షణం ఏమి జరగబోతున్నదో మనకు తెలియదే! మనం ఆశించని క్షణంలో ఏదో ఒక ఆఘాతం కలిగించి ఈ జీవితం మనల్ని తలకిందులు చేస్తుంది. అటువంటి అనూహ్య సమయంలో మనల్ని ఆదుకునేది ఈ పొదుపు ఒక్కటే.

రాబోయ్యే ఖర్చుకు కాకుండా పొదుపువల్ల కలిగే మరొక ప్రయోజనం మనం 7 వ అధ్యాయంలో చర్చించాం. మీ సమయం మీద అదుపు.

డబ్బు కొనగలిగే వస్తువులను గురించి అందరికీ తెలుసు. కనబడని వస్తువులను గురించి ఆలోచించటమే కష్టమైన వ్యవహారం. కనుకనే అది మన దృష్టిని తప్పించుకు తిరుగుతుంది. సామాన్యంగా మనం ఏదో ఒకవస్తువు కొనే ఉద్దేశ్యంతో డబ్బు పొదుపు చేస్తాం. డబ్బువల్ల కంటికి కనబడని ప్రయోజనాలు విలువైనవి. అవి మన ఆనందాన్ని ఇనుమడింప జేస్తాయి.

ఖర్చు చేయాలనే లక్ష్యంలేకుండా పొదుపుచేస్తే అనుకున్నవిధంగా వినియోగించే వెసులుబాటు, సదవకాశంకోసం నిరీక్షించే శక్తి, అవకాశం దొరికినప్పుడు అందిపుచ్చుకునే సామర్థ్యం అన్నీ మీ చేతిలో ఉంటాయి. ఆలోచించటానికి మీకు వ్యవధి దొరుకుతుంది. మీ షరతుల ప్రకారం వ్యవహరించే సత్తా మీ చేతిలో ఉంటుంది.

భవిష్యత్తులో మరొకరి సొమ్ము కాబోయ్యే క్షణాన్ని మీరు సొంతం చేసుకో గలగటమే.

**మీ సమయం మీ అదుపు ఆజ్ఞలలో ఉండటమే సంపద మీకు తెచ్చిపెట్టే వరం. అది కంటికి కనిపించని లాభం.**

ఉద్యోగాలు మారుతున్నప్పుడూ, పెందలాడే రిటైర్ అవుదామనుకున్నప్పుడూ, చీకూ చింతాలేని జీవితం కోరుకున్నప్పుడూ మీ బ్యాంక్‌లో ఉన్న సొమ్ము మీకు తెచ్చిపెట్టే ఆదాయం ఎంత?

అది లెక్కకందదని నా ఉద్దేశ్యం.

రెండు విధాలుగా అది లెక్కకందదు. అది విలువ కట్టటానికి సాధ్యంకానంత పెద్దది, ముఖ్యమైనది. రెండోది, అది నిజంగానే లెక్కకట్టటానికి – వడ్డీరేట్లు లెక్కకట్టినట్లు దీనిని లెక్కవెయ్యటం కుదరదు – అందదు. లెక్కకందని విషయం గనక మనం దానిని నిర్లక్ష్యం చేస్తాం.

మీ సమయం మీ అదుపులో లేకపోతే, దురదృష్టం మీ మొఖాన వేలాడుతున్నదని ఒప్పుకోక తప్పదు. అదే ఒదుగుబాటు మీ చేతిలోఉంటే సరైన

అవకాశం వచ్చినదాకా మీరు ఆగగలరు. మీ పొదుపు వెనక దాగి ఉన్న పెద్దప్రయోజనం ఇదే.

బ్యాంక్‌లో మీ పొదుపు కారణంగా మీరు తక్కువ జీతం ఇచ్చే ఉద్యోగం - అక్కడ మీకు ఎక్కువ ప్రయోజనం ఉండవచ్చు - చేసే అవకాశం ఉన్నది. సరయిన పెట్టుబడికోసం నిరీక్షించే అవకాశం మీ సొత్తు. అలా నిరీక్షించలేకపోతే, గత్యంతరం లేని పెట్టుబడి అవుతుంది కదా! బ్యాంక్ లో మీ సొమ్ముకు 0% వడ్డీ వస్తున్నా సరే, ఇప్పుడు చెప్పినట్లు కలిగే లాభాలు అసాధారణం కదా!

ఆ దాగిఉన్న ఆదాయమే ప్రాముఖ్యం అవుతున్నది

ఒకనాడు ఈ ప్రపంచమంతా స్థానికంగా ఉండేది. వంద సంవత్సరాల క్రితం అమెరికన్లలో 75% మందికి టెలిఫోన్లు లేవు, తపాలా సర్వీస్ లేదు - అంటారు చరిత్రకారులు రాబర్ట్ గార్డన్. అప్పుడు జరిగే పోటాపోటీ అంతా ఇంట్లోనే, లేకపోతే మీ గ్రామంలోనే. సగటు తెలివితేటలు ఉన్న కార్మికుడు గ్రామంలోనే ఘనుడు. ఇంకో ఊరి కార్మికుడితో పోటీ పడవలసిన పని లేదు గనక వారికి మంచి ఆదరణ లభించేది.

## ఇప్పుడు అదంతా మారిపోయింది.

అతి సన్నిహితంగా కలిసిపోయి ఉన్న ప్రపంచం అంటే మీ ఊరిలో ఉన్న వందలు వేల కొద్ది సమర్థులకే అంటే ప్రపంచం అంతటా వ్యాపించి వున్న కోట్లాది సమర్థులు అందుబాటులో ఉన్నారు అన్నమాట. కండబలంతో కాక బుద్ధిబలంతో పనిచేసే ఉద్యోగాల విషయంలో అంతమంది సమర్థులు అందుబాటులో ఉంటారు. చదువు చెప్పటం, మార్కెటింగ్ విశ్లేషణ, సలహా సంప్రదింపులు, అకౌంటింగ్, కంప్యూటర్ ప్రోగ్రామింగ్, జర్నలిజం, వైద్య వృత్తి ప్రపంచవ్యాప్తంగా విస్తృతంగా పోటీపడుతున్నాయి. కంప్యూటర్ విజ్ఞానం సరిహద్దు రేఖలు తుడిచి వేస్తున్నకొద్దీ ఇంకా అనేక ఇతర రంగాలు ఈ పరిధిలో ప్రవేశిస్తాయి. వెంచర్ క్యాపిటలిస్ట్ మార్క్ ఆండ్రీసెన్ చెప్పినట్లు సాఫ్ట్‌వేర్ ఈ ప్రపంచాన్ని తినివేస్తున్నది.

ఈ పోటీ ఇలా పెరుగుతూ ఉంటే మీరు అడగవలసిన ప్రశ్న: నేను గుర్తింపు పొందటం ఎలా?

"నేను తెలివైన వాడిని" అన్న సమాధానం అపఖ్యాతి నానాటికీ వృద్ధి

చెందుతున్నది. ఎందుకంటే ఈ ప్రపంచంలో తెలివైన వాళ్ళు చాలామంది ఉన్నారు. ప్రతి సంవత్సరము సుమారు 600 మంది SAT పరీక్ష అవలీలగా ఉత్తీర్ణులు అవుతున్నారు. మరొక 7,000 మంది ఆ లక్ష్మణ రేఖకు అతిదగ్గరలో ఉంటారు. ఇప్పుడు ఈ ప్రపంచం అంతా ఒకటే. అక్కడ విజయం సాధించిన వారిదే సొమ్ము. అటువంటి సర్వసమర్థులు అందరూ మీకు ప్రత్యర్థులు అవుతారు.

ఎంతో సన్నిహితంగా కలిసిపోయి ఉన్న మన ప్రపంచంలో తెలివితేటల మీద ఆధారపడటం లాభసాటి బేరం కాదు.

సమయానుకూలంగా ప్రవర్తించటమే లాభసాటి వ్యవహారం.

ప్రస్తుత ప్రపంచంలో తెలివితేటలకు పోటీ విపరీతంగా పెరిగిపోయింది. ఇప్పుడు కమ్యూనికేషన్, సహానుభూతి, అన్నిటినీ మించి సమయానుకూల ప్రవర్తనలో సమర్థతకే ఓటు.

మీరు సమయానుకూలంగా ప్రవర్తిస్తే, ఉద్యోగంలోనూ, పెట్టుబడులలోనూ సదవకాశాలకోసం కాచుకుని ఉండవచ్చు. అవసరానుగుణంగా కొత్త మెళకువలు నేర్చుకునే అవకాశం మెరుగుపడుతుంది. మీరు చేయలేని పనులు చెయ్యగల పోటీదారులను ఎదుర్కోవాలనే సమస్య మందగిస్తుంది. అప్పుడు మీకు అనువైన రీతిలో మీ అభిరుచి, పాశము గుర్తించే అద్భుత అవకాశం దొరుకుతుంది. మీ దినచర్య కొత్తదనం సంతరించుకుంటుంది. హడావిడి తగ్గుతుంది. జీవితాన్ని విభిన్న ఊహలతో, విభిన్న కోణంలో దర్శిస్తారు. ఎంతోమంది చేయలేని పనులు మీకు సాధ్యమవుతాయి. అప్పుడు మీకు ఈ భూమిమీద – తెలివితేటల ఉపయోగం మందగించిన ఈ ప్రపంచంలో – ఒక ప్రత్యేక స్థానం ఏర్పడుతుంది.

మీ ఇష్టాయిష్టాలను, సమయాన్ని మీ చెప్పుచేతలలో ఉంచగల శక్తి, ఈనాటి ప్రపంచంలో అత్యంత విలువైన మారకద్రవ్యం అవుతున్నది.

కనుకనే క్రమంగా ఎక్కువమంది డబ్బు పొదుపు చెయ్యగలరు. అలా చేయాలి కూడా.

వాళ్ళు ఇంకా ఏమి చెయ్యాలో తెలుసా? అంత తార్కికంగా, హేతుబద్ధంగా ఉండటానికి ప్రయత్నించకండి. ఎందుకో చెబుతాను.

# 11.
# సమంజసం > సహేతుకం

నిష్కర్షగా హేతుబద్ధంగా ఉండటానికి బదులు
సమంజసంగా ఉండటం మేలు.

మీరు ఒక చదరపు కాగితం కారు. మీరు ఒక వ్యక్తి. భావావేశమయులైన వ్యక్తి.

ఈ విషయం అర్థం చేసుకోవటానికి నాకు కొంతకాలం పట్టింది. అది గ్రహించిన తర్వాత, ఆర్థిక రంగంలో అది చాలా ముఖ్యపాత్ర వహిస్తుందని తెలుసుకున్నాను.

మనం తరుచూ ఉపేక్షించే అంశం దాని వెనకనే వస్తుంది. ఆర్థిక రంగంలో నిర్ణయాలు చేసేటప్పుడు, కేవలం హేతుబద్ధంగా ఉండటానికి ప్రయత్నించకండి. సాధ్యమైనంత సమంజసంగా ఉండటానికి ప్రయత్నించండి. సమంజసంగా ఉండటమే వాస్తవానికి సన్నిహితం. దానితో మీరు చాలాకాలం నెట్టుకురాగలరు. డబ్బుతో వ్యవహరించేటప్పుడు అదే ముఖ్యం.

నేను చెప్పేది మీకు అర్థం కావటానికి సిఫిలిస్ కు మలేరియాతో చికిత్స చేయటానికి పూనుకున్న పెద్దమనిషి కథ చెప్తాను.

---

జూలియస్ వాజ్నర్ జౌరెగ్ 19 వ శతాబ్దం మానసిక వైద్యులు. ఆయనదగ్గర రెండు అద్వితీయమైన మెలకువలు ఉన్నాయి. నమూనాలలో క్రమత గుర్తించటం ఆయన ప్రతిభ. మిగతా అందరికీ 'పిచ్చి' గా కనిపించేది ఆయనకు 'ధైర్యం' గా కనిపించేది.

న్యూరో సిఫిలిస్ – ఆనాడు అది చికిత్స తెలియని ప్రాణాంతక వ్యాధి – రోగులను చికిత్స చేయటంలో ఆయన పేరు పొందారు. ఆయనకు అందులో ఒక క్రమం దర్శనమిచ్చింది. సిఫిలిస్ తో బాధపడుతున్న రోగులకు – అదనపు దురదృష్టం – మరేదైనా కారణంచేత జ్వరాలువస్తే సిఫిలిస్ నుంచి త్వరగా కోలుకుంటున్నారని గమనించారు.

శతాబ్దాల తరబడిగా 'జ్వరాలు శరీరంలో ఉన్న సంక్రమణంతో పోరాడటానికి తోడ్పడుతాయి' అని ఒక గుడ్డి నమ్మకం ఉన్నది.

ఆనాటి వైద్యులు దీన్ని పూర్తిగా అర్థం చేసుకోలేక పోయినారు. రోగులు సిఫిలిస్ నుంచి కోలుకోవటానికి కారణం ఇదేనని వాఘ్నర్ జౌరెగ్ ఆలోచన.

కనుక ఆయన వెంటనే హేతుబద్ధమైన నిర్ణయానికి వచ్చారు. 1900 తొలి రోజులలో ఆయన రోగులకు టైఫాయిడ్, మలేరియా, మశూచి వంటి క్రిములను ఇంజెక్షన్ ఇచ్చేవారు. ఆ ఇంజెక్షన్ వల్ల వాళ్ళకు వచ్చే గట్టిజ్వరాలు వారిలో ఉన్న సిఫిలిస్ క్రిములను నిర్మూలిస్తాయని ఆయన ఊహ. వినటానికి అది ఎంత భయంకరంగా ఉన్నదో, వాస్తవంలో అంత ప్రమాదకారి అయింది. ఆ చికిత్సవల్ల కొందరు రోగులు చనిపోయారు. చాలా ప్రయత్నాల తర్వాత ఆయన బలహీనమైన మలేరియాను ఎంచుకున్నారు. ఎందుకంటే విపరీతమైన జ్వరం కొన్నాళ్ళు తాండవం చేసిన తర్వాత క్వినైన్ తో మలేరియా వెళ్ళగొట్టవచ్చు.

కొన్ని విషాద సంఘటనల తర్వాత ఆయన ప్రయోగం ఫలించింది. మలేరియా చికిత్స పొందిన సిఫిలిస్ రోగులలో పదింట ఆరుగురు పూర్తిగా కోలుకున్నారని ఆయన నివేదిక. ఏ చికిత్సా లేకపోతే, పదింట ముగ్గురు మాత్రమే కోలుకునేవారు ఆ రోజులలో. 1927లో ఆయనకు వైద్యశాస్త్రంలో నోబెల్ పురస్కారం లభించింది. ఆ సంస్థ ఈనాడు అంటుంది: "జ్వరం కలిగించటం ద్వారా మానసిక రోగాన్ని నయం చెయ్యటమే వృత్తి జీవితమంతా డాక్టర్ వాఘ్నర్ జౌరెగ్ సాధించిన విజయం."[33]

పెన్సిలిన్ వచ్చిన తర్వాత సిఫిలిస్ చికిత్సలో మలేరియా చికిత్స పురాతనమై, వెనకబడిపోయింది. కానీ జ్వరం అంటురోగ క్రిములను నిర్మూలించగలదని గుర్తించిన వైద్యులు చరిత్రలో డాక్టర్ వాఘ్నర్ ఒక్కరే. అంతేకాక ఆయన దానిని చికిత్సగా కూడా నిర్దేశించారు.

జ్వరాలు ఎందుకు వస్తాయో, ఏమి చేస్తాయో అంతా అగమ్య గోచరం. అందుకే జ్వరాలంటే ప్రజలకు భయం. పురాతన రోమన్లు ఫెబ్రిస్ – ప్రజలను జ్వరాల నుంచి కాపాడే దేవతను ఆరాధించేవారు. ఆమెను శాంతింప జెయ్యటానికి

జనం ఆమె ఆలయంలో మొక్కుబడులు వదిలేవారు. అలా అయినా కనీసం తమకు ఆ జ్వరాల పీడ వదులుతుందేమోనని వారి ఆశ.

కానీ వాజ్నర్ జౌరెగ్ ఆలోచనే వేరు. జ్వరాలు యాదృచ్ఛికంగా కలిగే ఇబ్బందులు కావు. శరీరం కోలుకోవటంలో అవి ఒక పాత్ర నిర్వహిస్తాయి. వ్యాధి సంక్రమణం నిరోధించటంలో జ్వరం ఉపయోగకారి అని ఈ నాడు శాస్త్రీయమైన సాక్ష్యం ఉన్నది. శరీరం ఉష్ణోగ్రత ఒక డిగ్రీ పెరిగితే, కొన్ని వైరస్‌ల వృద్ధి 200 రెట్లు మందగిస్తుంది. "జ్వరం లక్షణాలు ఉన్న రోగులు శీఘ్రంగా కోలుకున్నారని అనేకమంది పరిశోధకులు గుర్తించారు." ఒక NIH వైద్య వ్యాసం అంటుంది.[34] సియాటిల్ చిల్డ్రెంస్ హాస్పిటల్ వెబ్ సైట్ లో పిల్లల తలిదండ్రుల కోసం ఒక విభాగం ఉన్నది. అందులో బిడ్డ శరీరం ఉష్ణోగ్రత ఏమాత్రం పెరిగినా తల్లడిల్లిపోయే తలిదండ్రులకు సూచన: "జ్వరం శరీరం రోగనిరోధక శక్తి పెంచుతుంది. వ్యాధి సంక్రాంణాన్ని అవి పోరాడుతాయి. $100^0$ -$104^0$ మధ్య జ్వరాలు అనారోగ్యంగా ఉన్న పిల్లలకు శ్రేయస్కరం."[35]

విజ్ఞానం అక్కడే ఆగిపోతుంది. యదార్థం బండి నడుపుతుంది.

విశ్వవ్యాప్తంగా జ్వరం ఒక దుష్టశక్తిగానే దర్శన మిస్తుంది. అది కంటపడగానే వీలైనంత త్వరగా వదిలించుకోవటానికి టైలనాల్ వంటి మందులు ఉపయోగిస్తారు. లక్షలాది సంవత్సరాలనుంచి శరీరానికి రక్షణ వ్యవస్థగా కొనసాగుతున్న ఈ జ్వరాన్ని అందరు తలిదండ్రులూ, రోగి, డాక్టర్లు, మందుల కంపెనీలు కూడా ఒక దౌర్భాగ్యంగా చూస్తారు. దాన్ని వీలైనంత త్వరగా వదిలించుకోవటమే ప్రతి ఒక్కరి తక్షణ లక్ష్యం.

ఈ అభిప్రాయాలు వైద్యవిజ్ఞానంతో సరిపోలవు. ఒక అధ్యయనం ముక్కుసూటిగా కుండ బద్దలుకొట్టినట్లు చెప్పింది: "జ్వరాన్ని ICUలో చికిత్స చెయ్యటం మామూలైపోయింది. ఇది సాక్ష్యాధారాలతో చేసే చికిత్స కాదు. కేవలం మూఢనమ్మకాల కారణంగా కొనసాగే వ్యాపారం."[36] సెంటర్ ఫర్ ది హిస్టరీ ఆఫ్ మెడిసిన్ కు హోవర్డ్ మార్కెల్ డైరెక్టర్. జ్వరభయాన్ని గురించి ఆయన అంటారు: "ఇవన్నీ సాంస్కృతిక సంప్రదాయాలు. ఇవి అంటువ్యాధులంత వేగంగా విస్తరిస్తాయి."[37]

ఇలా ఎందుకు జరుగుతుంది? జ్వరాలు శ్రేయస్కరాలు అయితే ప్రపంచమంతటా మనం వాటితో ఎందుకు పోరాడుతున్నాం?

అది అంత క్లిష్టసమస్య అనుకోను. జ్వరాలు బాధిస్తాయి. జనానికి బాధపడటం ఇష్టంలేదు.

అంతే.

వైద్యుడి లక్ష్యం కేవలం వ్యాధి నయంచెయ్యటం మాత్రమే కాదు. రోగికి సమంజసంగా, భరించగలిగిన పరిమితులలో వ్యాధి నయం చెయ్యాలి. అంటువ్యాధుల నిర్మూలనలో జ్వరాలు కొంతవరకు ప్రయోజనకారులు కావచ్చు. కానీ అవి పీడిస్తాయి. ఆ పీడన వదిలించుకోవటానికే నేను డాక్టర్ దగ్గరికి వెళ్తాను. దుప్పటికింద గజగజ వణుకుతూ ఉంటే నాకు కావలిసింది వైద్య పరిశోధన కాదు. ఆ జ్వరం తగ్గించటానికి మీ దగ్గర మాత్ర ఉంటే, నాకు కావాల్సింది అదీ. వెంటనే.

అంటువ్యాధి ఏదైనా ఉన్నప్పుడు మీకు జ్వరం ఉండటం హేతుబద్ధం కావచ్చు. కానీ అది సమంజసం కాదు.

ఆ తత్వం – హేతుబద్ధం కంటే సమంజసంగా మెలగటం – డబ్బుతో వ్యవహరించేటప్పుడు జనం గమనించవలసిన విషయం అదీ.

---

విద్యావిషయికంగా ఆర్థిక రంగం ఉత్తమమైన పెట్టుబడులకు గణిత సూత్రాలు అన్వయిస్తుంది. వాస్తవ ప్రపంచంలో జనానికి గణితసూత్రానుసారం వ్యూహాలు అనవసరమని నా ఉద్దేశ్యం. రాత్రిపూట సుఖంగా నిద్రపోవటానికి వారికి ఉత్తమ వ్యూహాలు కావాలి.

రిస్క్‌కు లాభాలకు అన్వయించే గణితసూత్రం కనుక్కున్నందుకు హారీ మార్కోవిట్జ్ నోబెల్ పురస్కారం పొందారు. ఆయన తన సొమ్ము ఎలా పెట్టుబడి పెడతారని ఒకసారి అడిగారు. ఆయన తన గణిత సూత్రాలు కనుక్కుంటున్న సమయంలో తన పెట్టుబడుల (1950) వివరాలు చెప్పారు:

> "స్టాక్ మార్కెట్ పెరుగుతున్నప్పుడు నేను అందులో లేకపోయినా, అది పడిపోతున్నప్పుడు నేను అందులో ఇరుక్కుని ఉన్నా నాకు కలిగే సంతాపాన్ని నేను దర్శించ గలిగాను. భవిష్యత్తులో చింతించకుండా ఉండటమే నా సంకల్పం. కనుక నేను బాండ్స్/ ఈక్విటీస్ లో సమానంగా పెట్టుబడి పెట్టాను."

ఆ తర్వాత మార్కొవిట్జ్ తన పథకం మార్చారన్నది వేరే విషయం. అయితే ఇక్కడ రెండు విషయాలు ముఖ్యం.

'భవిష్యత్తులో చింతించకుండా ఉండటం' వాటిలో ఒకటి. వ్రాతపూర్వకంగా దీన్ని హేతుబద్ధం చెయ్యటం కష్టసాధ్యమైన విషయం. నిజజీవితంలో సమర్థించటం సులువు. హేతుబద్ధులైన పెట్టుబడిదారు అంకెలు ఆధారంగా నిర్ణయం చేస్తారు. సమంజసమైన పెట్టుబడిదారు ఒక సమావేశంలో తన నిర్ణయాలు చేస్తారు. అప్పుడు ఆయన చుట్టూ ఆయన సహోద్యోగులు (వారు మిమ్మల్ని గురించి ఏమనుకోవాలి?), మీ జీవిత భాగస్వామి ( వారిని మీరు అన్యాయం చేయకూడదు! అలా చెయ్యటం మీ ఉద్దేశ్యం కాదు), మీ బావమరిది, మీ పొరుగు ఇంటి పెద్దమనిషి (వారు పనికిమాలిన వారే. అయినా వారే మీకు నిజజీవితంలో పోటీదారులు. వారితో పోలికే మీ విలువ) ఇంకా మీ మనసును తొలిచే సందేహాలు. పెట్టుబడిలో సామాజిక అంశం నిరంతరము ఉంటుంది. ఆర్థిక కటకం దానిని ఎప్పుడూ ఉపేక్షిస్తుంది.

రెండవది 'ఇది బాగుంది'. మార్కోవిట్జ్ పెట్టుబడి విధానాన్ని గురించి జేసాన్ జ్వైగ్ ఇంటర్ వ్యూ చేశారు. ఆయన అంటారు:

> జనం హేతుబద్ధులు కారు, కాకపోలేదు. మనం మానవ మాత్రులం. అవసరానికి మించి ఆలోచించటం మనకు గిట్టని పని. అదీకాక మనకు ఒకటి కాదు, సవాలక్ష వ్యాపకాలు ఉంటాయి. ఆ దృష్టితో చూస్తే, పోర్ట్ ఫోలియో సిద్ధాంతం ప్రతిపాదనకు మూలపురుషులు తమ పరిశోధనా ఫలితాలకు, పెట్టుబడికీ సంబంధం లేకుండా పెట్టుబడి పెట్టారనటంలో ఆశ్చర్య

పడవలసిందేమీ లేదు. ఆ తర్వాత తగిన మార్పులు చేశారనటం అంతకంటే ఆశ్చర్యమేమీ కాదు.[38]

మార్కోవిట్జ్ హేతుబద్ధులు కారు, కాకపోలేదు. ఆయన సమంజసంగా ప్రవర్తించారు.

ఆర్థిక రంగంలో ఒక విషయం సాంకేతికంగా నిజం కావచ్చు. కానీ ఆ సందర్భానికది అనుచితం అవుతుంది. ఆర్థిక రంగంలో చిన్నచూపు చూసేది ఈ విషయాన్నే.

2008 లో యేల్ యూనివర్సిటీ పరిశోధకులు ఇద్దరు ఒక అధ్యయనం ప్రచురించారు. రిటైర్మెంట్ పథకాల కోసం పొదుపు చేసే యువతరం స్టాక్స్ కొనేటప్పుడు 2 –1 మార్జిన్ (వారి ప్రతి ఒక్క డాలర్ పెట్టుబడికీ రెండు డాలర్ల అప్పు) ఉపయోగించి రిటైర్ మెంట్ ఎకౌంట్స్ బలవత్తరం చేయాలని ఆ ప్రచురణ సారాంశం. పెట్టుబడిదారుల వయసు ఉడుగుతున్న కొద్దీ ఆ నిష్పత్తిని క్రమంగా తగ్గించుతూ రావచ్చు. అంటే, వారు యువతరంలో ఉన్నపుడు ఎక్కువ రిస్క్ తీసుకుంటారు, ఆ వయసులో మార్కెట్ ఒదుదుడుకులు తట్టుకోగలరు. పెద్ద అవుతున్నకొద్దీ ఆ రిస్క్ తగ్గుతుంది.

యౌవనదశలో అలా చేసినప్పుడు మీరు పూర్తిగా నష్టపోయినా సరే (మీరు 2–1 మార్జిన్ వినియోగించి, మార్కెట్ 50% పడిపోయి, మిమ్మల్ని వివస్త్రులుగా వదిలివేస్తే) ఆ పెట్టుబడిదారులు దీర్ఘకాలంలో భద్రంగానే ఉంటారని ఆ పరిశోధకుల ఉపసంహారం. ఇక్కడ, చతికిలబడ్డ వెంటనే లేచి మళ్ళీ ఆ పథకం అనుసరించాలి. పూర్తిగా నష్టపోయిన మర్నాటినుంచీ మళ్ళీ ఆ 2–1 లివరేజ్ పథకం కొనసాగించాలి.

కాగితం మీద ఈ లెక్క బాగానే ఉంటుంది. అది హేతుబద్ధమైన వ్యూహం.

కానీ అది పూర్తిగా అవ్యక్తం, అసంబద్ధం, అసమంజసం.

రిటైర్మెంట్ ఎకౌంట్ నూటికి నూరు శాతం గాలిలో కలిసిపోయిన తర్వాత సామాన్య మానవుడెవరైనా, చెక్కుచెదరకుండా అదే పథకం కొనసాగించటం అసంభవం. వారు అక్కడినుంచి తప్పుకుంటారు. మరోదారి చూసుకుంటారు. వీలైతే తమకు సలహా ఇచ్చినవారిమీద దావా వేస్తారు.

వారి వ్యూహం అనుసరిస్తే "మామూలు జీవితకాల ద్రవ్యం కంటే ఇక్కడ 90 శాతం అధిక దిగుబడి వస్తుం" దని పరిశోధకుల వాదన. అది 100% అసమంజసం.

---

నిజానికి, నిర్హేతుకంగా కనిపించే నిర్ణయాలు చెయ్యటానికి కూడా ఒక తర్కబద్ధమైన కారణం ఉన్నది.

ఇదిగో ఒక ఉదాహరణ: మీ పెట్టుబడులమీద మీకు వల్లమాలిన ప్రేమ అనుకుందాం.

ఇది సంప్రదాయకమైన సలహా కాదు. తమ పెట్టుబడులమీద తమకు ఎలాంటి మమకారమూ లేదనే పెద్దలకు ఇది దాదాపు ఒక సన్మాన పతకం. ఎందుకంటే ఇది పూర్తిగా హేతుబద్ధం.

మీ స్టాక్స్ పట్ల, మీ వ్యూహం పట్ల మీకు భావావేశాలు లేవు. అవి కష్టాల్లో పడినప్పుడు మీరు వాటికి దూరంగా తొలుగుతారు. ఒకనాడు హేతుబద్ధమైన విషయం ఈనాడు ఒక బరువైన బాధ్యత అవుతుంది. సాంకేతికంగా అపరిపూర్ణులైనా, సమంజసంగా పెట్టుబడి పెట్టినవారు ఒకమెట్టు పైన ఉంటారు. వారు తమ పథకాలకు అంటిపెట్టుకొని ఉండటమే అందుకు కారణం.

వ్యాపారం మందకొడిగా ఉన్న సంవత్సరాలలో – పెట్టుబడి మొత్తాలకూ, కాలక్రమేణా కోలుకోవటానికీ – ఒక పథకానికి అంటిపెట్టుకొని ఉండటమే విమోచనకు మార్గం. ఇంతకు మించిన పథకాలు వేరే లేవు. యునైటెడ్ స్టేట్స్ విపణి వీధిలో లాభాలు సంపాయించే అవకాశాలు: ఒకరోజులో అయితే 50/50, ఒక సంవత్సరంలో అయితే 68%, 10 సంవత్సరాలలో అయితే 88%, ఇరవై సంవత్సరాలలో అయితే (ఇంతవరకూ) 100%. ఆటలో కొనసాగుతున్నంత కాలము మీకు చెప్పుకోదగిన ప్రయోజనం ఉంటుంది.

ఆనందమయ జీవితానికి "మీకు ప్రీతికరమైన పని చెయ్యటం" మీ మతమైతే అది ఖాళీ పాత్రలు చేసే శబ్దంలా ధ్వనిస్తున్నది. సఫలత సాధించటానికి మీ అవకాశాలు పెంచే సాధనంగా దర్శిస్తే, మీ ఆర్థిక పథకం పటిష్టంగా ఉండాలనేది అతి ముఖ్యమని మీరు గ్రహిస్తారు.

మీరు ఒక సంస్థలో పెట్టుబడి పెట్టారు. ఆ సంస్థ ముందువెనకలు మీకు తెలియవు, మీకు అక్కరలేదు. అంతా సవ్యంగా నడుస్తున్నప్పుడు మీకు ఆనందంగానే ఉంటుంది. కానీ ఎప్పుడో ఒకప్పుడు పరిస్థితులు ఎదురు తిరగక మానవు. అప్పుడు మీరు నష్టపోతున్నారు. ఆ సంస్థ ఉన్నా పోయినా మీకేమీ ఫర్వాలేదు. ఇప్పుడు అది ద్విగుణమైన భారం. అప్పుడు తిరుగులేని మార్గమేమిటంటే మరొక సంస్థకు కదలటం. అలాకాక, మీరు పెట్టుబడి పెడుతున్న సంస్థమీద మీకు అభిమానం ఉంటే – వారి ధ్యేయం, వారి ఉత్పత్తి, వారి కార్యనిర్వాహక బృందం, వారి శాస్త్ర పద్ధతి ఇంకా చాలా – కష్టకాలం వచ్చినప్పుడు మీరు నష్టపోతున్నారు, సంస్థకు సహాయం అవసరం, అన్న విషయాలకంటే, సార్ధకమైన కృషిలో మీరూ ఒక అంగంగా అనుభూతి చెందుతారు. ఆ బలమే మిమ్మల్ని వారిని వదిలి వెళ్లకుండా అడ్డుకుంటుంది.

డబ్బుతో హేతుబద్ధంగా ఉండటానికంటే, సమంజసంగా వ్యవహరించ టానికి ఇంకా అనేక సందర్భాలు ఉన్నాయి.

"ఇంటి పట్టున" – జనం తాము నివసిస్తున్న దేశంలోని సంస్థలలోనే పెట్టుబడి పెట్టటానికి ఇచ్చగిస్తారు. మిగిలిన 95% మించిన భూగోళాన్ని గురించి పట్టించుకోరు – పెట్టుబడి పెట్టటానికి చాలా కారణాలు ఉన్నాయి. పెట్టుబడి అంటే మీరు అపరిచితుల చేతులో మీ సొమ్ము పెడుతున్నారని అర్థం. అది హేతుబద్ధం కాదు కదా! ఆ అపరిచితులను నమ్మటానికి మీ పరిచయం మీకు విశ్వాసం కలిగిస్తే, అది సమంజసమే.

ఉదయం నుంచి సాయంత్రం లోపల ట్రేడింగ్ చేసి, రకరకాల స్టాక్స్ క్రయవిక్రయాలు జరపటం చాలామందికి ఇష్టం ఉండదు. అక్కడ సఫలత అందని దూరాన ఉంటుంది. పెద్ద మొత్తాలను అలా వదిలేసి చిన్నచిన్న మొత్తాలలో దురద తీరిందాకా ట్రేడింగ్ చెయ్యటం సమంజసమే. జోష్ బ్రౌన్ ఒక పెట్టుబడిదారుడు. ఆయన రకరకాల స్టాక్స్ కు సొంతదారులు. అందరికీ కూడా ఆయన అదే సలహా ఇస్తారు. అన్నిరకాల స్టాక్స్ ఎందుకు సొంతం చేసుకున్నారో ఆయన చెప్తారు: "నేను ఏదో ఊహాతీతమైన కార్యం సాధించబోతున్నానని రకరకాల స్టాక్స్ కొనటం లేదు. స్టాక్స్ అంటే నాకు వల్లమాలిన ప్రేమ. నాకు ఇరవై ఏళ్ళ

వచ్చినప్పటి నుంచీ ఆదేతీరు. అదీగాక అది నా సొమ్ము. నా ఇష్టం వచ్చినట్లు చేస్తాను." న్యాయమే కదా.

ఆర్థిక రంగంలో, స్టాక్స్ మార్కెట్ లో తర్వాత ఏం జరగబోతున్నదో చెప్పే సూచనలు ఘోరం. సూచించటమనేది సమంజసమే. తర్వాత ఏం జరగబోతున్నదో ఏమీ తెలియదనుకుంటూ కళ్ళుతెరవటం కష్టమైన పనే. కానీ అది నిజం కూడాను. ఎక్కడ పెట్టుబడులు పెట్టాలో చెప్పే జోశ్యాలు నమ్మి అనుసరించటం ప్రమాదకరమైన పని. వచ్చే సంవత్సరం ఏం జరగబోతున్నదో చెప్పటానికి ఎందుకు ప్రయత్నిస్తారో నాకు తెలుసు. అది మానవ నైజం. అదీ సమంజసమే.

కీర్తిశేషులు జాక్ బోగ్లే 'వ్యాన్ గార్డ్' వ్యవస్థాపకులు. ఆయన తన ఉద్యోగజీవితమంతా మిట్టపల్లాలు అతిగా లేని తక్కువ ఖరీదుచేసే పెట్టుబడులమీద దృష్టిసారించి వాటినే ప్రచారం చేశారు. ఆయన కొడుకేమో ఎక్కువ మొత్తాలు చార్జ్ చేసే హెడ్జ్ ఫండ్, మ్యూచువల్ ఫండ్ మేనేజర్ గా వృత్తి అవలంబించాడు. ఎక్కువ మొత్తాలు చార్జ్ చేసే ఫండ్స్ "సామాన్య గణితాన్ని అతిక్రమిస్తాయి" అని ఘోషించే బోగ్లే, కొడుకు వ్యాపారంలో పెట్టుబడి పెట్టారు. ఆయన సిద్ధాంతానికి విరుద్ధంగా ఆయన ఎలా వ్యవహరించారు?

"కుటుంబం కారణాల వల్ల మేం కొన్ని పనులు చేస్తూ ఉంటాం." వాల్ స్ట్రీట్ జర్నల్‌తో బోగ్లే అన్నారు. "నేను చెప్పినదానికీ, చేసినదానికీ పొంతన లేకపోతే, నేనేం చేయలేను. జీవితమే అంత."[39]

నిజమే. జీవితంలో పొంతన అనేది చాలా అరుదు.

# 12.
# ఆశ్చర్యం!

---

చరిత్ర అంటే మార్పుల అధ్యయనం. దానిని
భవిష్యత్తుకు బాటగా వినియోగించటమే వ్యంగ్యం.

---

శాన్ ఫర్డ్ యూనివర్సిటీ ప్రొఫెసర్ స్కాట్ షాగాన్ ఒకసారి అన్నారు: ఆర్థిక స్థితిగతులనూ, పెట్టుబడి మార్కెట్లనూ అనుసరించేవారంతా ప్రతి ఒక్కరూ తమ ఇంట్లో గోడమీద "ఇంతకు మునుపు ఎన్నడూ జరగని సంఘటనలే ఎప్పుడూ జరుగుతాయి." అని తగిలించాలి.

చరిత్ర అంతా అద్భుత ఆశ్చర్య విషయాల అధ్యయనమే. పెట్టుబడి దారులూ, ఆర్థికశాస్త్రవేత్తలూ దానిని భవిష్యత్తుకు తిరుగులేని మార్గదర్శిగా ఉపయోగించటమే అంతకుమించిన ఆశ్చర్యం.

అందులో వ్యంగ్యం గమనించారా?

అందులో సమస్య గమనించారా?

ఆర్థిక చరిత్ర, పెట్టుబడి వ్యాపార గమనం క్షుణ్ణంగా తెలిసి ఉండటం తెలివైన పని. మనం ఏమి ఆశించవచ్చు, జనం సాధారణంగా ఎక్కడ తప్పులు చేస్తాము, ఏయే పరిస్థితులు అనుకూలంగా ఉంటాయి అన్న ప్రశ్నలకు ఉజ్జాయింపు సమాధానాలతో చరిత్ర మనకు సాయం చేస్తుంది. అంతేకాని అది భవిష్యత్తుకు ఎన్నటికీ మార్గదర్శి కాలేదు.

"చరిత్రకారులను ప్రవక్తలుగా" గుర్తించే భ్రమలో పడటమే పెట్టుబడిదారులందరూ చేసే పెద్దతప్పని నా అభిప్రాయం. ఇక్కడ ముందడుగు వెయ్యాలంటే అడుగడుగునా నవకల్పనలూ, నిత్యనూతనంగా మార్పులు అత్యవసరం. గతాన్ని భవిష్యత్తుకు దిక్సూచిగా వినియోగించటం కంటే భ్రమ లేదు.

కానీ ఇలా చేసినందుకు మీరు పెట్టుబడిదారులను తప్పుపట్టలేరు. పెట్టుబడి ఒక విజ్ఞానశాస్త్రం అయివుంటే అప్పుడు చరిత్ర భవిష్యత్తుకు తప్పకుండా మార్గదర్శి అవుతుంది. భూగర్భశాస్త్రవేత్తలు కోట్లాది సంవత్సరాల డేటా విశ్లేషించి భూమి ఎలా ప్రవర్తించుతుందో నమూనాలు తయారు చెయ్యగలరు. అలాగే

అంతరిక్షశాస్త్రవేత్తలూ. డాక్టర్లు - మూత్రపిండాలు 1020 లో ఎలా పనిచేశాయో 2020 లో ఈనాడూ అలాగే పనిచేస్తాయి.

కానీ పెట్టుబడి అటువంటి నికరమైన విజ్ఞానశాస్త్రం కాదు. అది మహాజన సందోహం. వాళ్ళకు అందుబాటులో ఉన్న సమాచారం పరిమితం. ఆ విషయాలు వారి బాగోగులను అమితంగా ప్రభావం కలిగిస్తాయి. వారు తప్పొప్పులతో నిర్ణయాలు చేస్తూ ఉంటారు.

ప్రఖ్యాత భౌతికశాస్త్రవేత్త రిచర్డ్ ఫేన్ మన్ ఒకసారి అన్నారు: "ఎలక్ట్రాన్లకు అనుభూతులు ఉంటే భౌతిక శాస్త్రం ఎంత కఠినతరం అయ్యేదో ఊహించండి." ఇక్కడ పెట్టుబడిచేసేవారికి, చాలమందికి, అనుభూతులు ఉంటాయి. కనుకనే వారు నిన్నచేసిన దానిని బట్టి రేపు ఏం చెయ్యబోతున్నారో ఊహించటం అసాధ్యం.

కాలక్రమేణా వస్తువులు, పరిస్థితులు అన్నీ మారుతూ ఉంటాయనేది ఆర్థికశాస్త్రం మూలసూత్రం. శుభంకాని, అశుభంకాని చిరకాలం కొనసాగటం ఆ అదృశ్యహస్తానికి గిట్టని విషయమనుకుంటాను. శ్రీమాన్ విపణివీధి ఎలా పనిచేస్తారో పెట్టుబడిదారులు బిల్ బోనర్ ఒకసారి వర్ణించారు: "ఆయన ధరించిన T షర్ట్ మీద 'క్యాపిటలిజం పనిలో ఉన్నది' అని వ్రాసి ఉంటుంది. ఆయన చేతిలో పెద్ద సమ్మెట ఉంటుంది." చిరకాలం ఏదీ స్థిరంగా ఉండదు. కనుక చరిత్రకారులను మనం ప్రవక్తలుగా ఆదరించలేము.

డబ్బుకు సంబంధించిన వ్యవహారాలు నడిపేదంతా జనం తమకు తాము చెప్పుకునే కథలు, వారి ఇష్టాయిష్టాలకు గురయిన వస్తువులు, సేవలు. అవి ఎన్నడూ స్థిరంగా ఉండవు. తరాలతో, సంస్కృతితో అవి మారుతూనే ఉంటాయి. నిత్యమూ అవి మారుతున్నాయి. మారుతూనే ఉంటాయి కూడా.

డబ్బు విషయానికి వచ్చేసరికి మనల్ని మనమే గమ్మత్తు చేసుకుంటాం. అక్కడికి చేరినవారు, అది సాధించినవారూ అంటే మనకు ఎనలేని ఆదరాభిమానాలు. ఒక ఘటన అనుభవించినంత మాత్రాన తర్వాత ఏమి జరగబోతున్నదో మీకు తెలియదు, మీరు చెప్పలేరు. అలా జరగటం చాలా అరుదైన విషయం. అనుభవం భవిష్యత్తును గురించి చెప్పటంకంటే మితిమీరిన ఆత్మవిశ్వాసానికి దారితీస్తుంది.

పెట్టుబడిదారులు మిషేల్ బ్యాత్నిక్ ఒకసారి దీనిని బాగా వివరించారు: వడ్డీరేట్లు పెరగ బోతున్నాయంటే పెట్టుబడిదార్లు ఎవ్వరూ అంగీకరించటానికి సిద్ధంగాలేరు. కారణం ఇంతవరకు అది వారి అనుభవంలోకి రాలేదు. నలభై ఏళ్లక్రితం ఎప్పుడో ఒకసారి వడ్డీరేట్లు పెరిగాయి. వారు సిద్ధంగా ఉన్నా లేకపోయినా ఏమీ ఫర్వాలేదని ఆయన వాదన. గతంలో జరిగిన దానిని అనుభవంలో చూసి ఉన్నా, అధ్యయనం చేసి ఉన్నా, భవిష్యత్తులో రేట్లు పెరిగితే ఏమవుతుందో చెప్పటానికి ఎంతమాత్రమూ ఉపయోగపడవు.

> అయితే ఏమిటి? ఇప్పుడు జరిగే పెరుగుదల గతంలో జరిగిన దానిలాగానో, అంతకుమునుపు జరిగిన దానిలాగానో ఉంటుందా? వివిధ వర్గాల వారు అదేవిధంగా, లేదా ఒకేవిధంగా, లేదా వ్యతిరేకంగా ప్రవర్తిస్తారా?

1987, 2000, 2008 కాలంలో పెట్టుబడులు పెడుతూ వచ్చినవారు మార్కెట్‌లో అనేక మార్పులు చూశారు. ఈ అనుభవం మితిమీరిన ఆత్మవినాశనానికి దారితీస్తుందా? సాధ్యమే కదా? మీరు తప్పుచేశారని ఒప్పుకోరు కదా! గతంలో వచ్చిన ఫలితాలకే అంటిపెట్టుకుని ఉంటారు కదా!

తర్వాత ఏమి జరగబోతున్నదో తెలుసుకోవటానికి పెట్టుబడి చరిత్రను నమ్ముకుంటే రెండు ప్రమాదాలు జరుగుతాయి.

## 1. అత్యంత ప్రభావం కలిగించే బాహ్య పరిస్థితులు మీ దృష్టికి అందకుండా పోతాయి.

చరిత్రాంశాలలో అత్యంత ముఖ్య సంఘటనలు, జరుగుతున్న చరిత్రకు దూరంగా, దారితప్పి, ఉంటాయి. ఆర్థికవ్యవస్థలోను, స్టాక్ మార్కెట్ లోనూ విపరీత ప్రభావం కలిగించేది ఈ దారితప్పిన సంఘటనలే. మహా సంక్షోభం (The Great Depression), రెండవ ప్రపంచ యుద్ధం, డాట్ కామ్ బుడగ, సెప్టెంబర్ 11, 2000 దశకం మధ్యలో స్వగృహ వ్యాపారం కూలుడు. వేళ్ళమీద లెక్కపెట్టగల ఈ విపరీత సంఘటనలు ప్రమాదకరపాత్ర వహిస్తాయి. దానితో సంబంధంలేని అనేక ఇతర రంగాలను తలక్రిందులు చెయ్యగలవు.

19, 20 శతాబ్దాలలో పదిహేను బిలియన్ ప్రజలు పుట్టారు. కానీ వారిలో ఈ ఏడుగురు లేకపోయి ఉంటే ప్రపంచ ఆర్థిక స్థితి ఎలా ఉండేదో ఒక్కసారి ఊహించండి:

- అడాల్ఫ్ హిట్లర్
- జోసెఫ్ స్టాలిన్
- మావో జెడాంగ్
- గవ్రులో ప్రింకిప్
- థామస్ ఎడిసన్
- బిల్ గేట్స్
- మార్టిన్ లూథర్ కింగ్

ఈ జాబితా ఎంతవరకు పరిపూర్ణమో నాకు తెలియదన్నమాట వాస్తవం. కానీ ఈ ఏడుగురు ఈ భూమిమీద తమ ముద్రవేసి ఉండకపోతే, దేశసరిహద్దుల నుంచి, సాంకేతికతనుంచి, సామాజిక నియమాల వరకూ ఈ ప్రపంచంలో ప్రతిఒక్కటీ భిన్నంగా ఉండేవి. మరొక విధంగా చెబితే గత శతాబ్దంలో ఈ ప్రపంచానికి దారి చూపినవారు ప్రపంచ జనాభాలో 0.00000000004 శాతం మాత్రమే!

మహాయోజనలకు, నవకల్పనలకు, విపరీత పరిణామాలకు కూడా ఇదే వర్తిస్తుంది.

- ఆర్థిక మాంద్యం
- రెండవ ప్రపంచ యుద్ధం
- మాన్ హట్టన్ ప్రాజెక్ట్
- వాక్సిన్లు
- యాంటీ బయోటిక్స్
- ఆర్పానెట్ (ARPANET)
- సెప్టెంబర్ 11
- సోవియట్ యూనియన్ పతనం

లేకపోతే, గత శతాబ్దం ఎలా ఉండేదో ఊహించ గలరా?

20వ శతాబ్దంలో ఎన్ని ప్రణాళికలు జరిగి ఉండవచ్చు? బిలియన్లు కావచ్చు, ట్రిలియన్లు కావచ్చు. ఎవరికి తెలుసు? కానీ పై ఎనిమిది ప్రపంచాన్ని, ప్రపంచ స్థితిగతులను కుదిపి వేసినై.

ఆ తర్వాత అనుసరించే సంఘటనలు ఎలా జరుగుతాయో తెలిసే లోపల జరిగిపోతాయి. ఎవరి దృష్టిలోకీ రావు. ఉదాహరణకు 9/11 సంఘటన ఫెడరల్ రిజర్వ్ చేత వడ్డీ రేట్లు తగ్గింప జేసింది. దానివల్ల గృహనిర్మాణ వ్యాపారం చతికిల బడింది. అందువల్ల ఆర్థిక సంక్షోభం కలిగింది. తత్కారణంగా నిరుద్యోగ సమస్య పడగ విప్పింది. ఆ బుసకారణంగా అందరూ కాలేజ్ చదువులకు పరుగులు తీశారు. ఈ కాలేజ్ చదువులతో విద్యార్థి రుణాలు 1.6 ట్రిలియన్ డాలర్ల కు (10.8% వడ్డీ రేటుతో) చేరాయి. విద్యార్థుల ఈనాటి రుణభారానికి ఆ 19 మంది హైజాకర్లకు లంకె వెయ్యటానికి దివ్యదృష్టి, దివ్యజ్ఞానం ఏమీ అవసరం లేదు. అసాధారణ సంఘటనల కారణంగా నడిచే ఈ ప్రపంచంలో జరిగేది అదే.

ఈ క్షణంలోనైనా సరే ఈ ప్రపంచం ఆర్థికవ్యవస్థలో కలిగే పరిణామాలు గతంలో జరిగిన అతికొద్ది సంఘటనలతో ముడిపెట్టవచ్చు. కానీ ఆ కొద్ది సంఘటనలు ఎప్పుడు, ఎందుకు, ఎలా జరిగుతాయో చెప్పటం కాదుకదా, ఊహించటంకూడా అసాధ్యం

ఆర్థిక ప్రపంచంలో హఠాత్పరిణామాలే సాధారణ వ్యూహం. ఈ హఠాత్పరిణామాలు మన తెలివితేటల లోపంవల్ల, మన పథకంలో పొరబాట్లవల్ల కలిగినవి కావు. అడాల్ఫ్ హిట్లర్ పుట్టటానికి తొమ్మిది నెలలకు ముందు ఆయన అమ్మానాన్నా పోట్లాడుకున్నారన్న మాటకు ఎంత అవకాశం ఉన్నదో, ఆ నాడు గర్భం కలిగిందనటానికి కూడా అంతే అవకాశం ఉన్నది. జోనాస్ సాక్ కు తిక్కరేగి వాక్సిన్ కనిపెట్టే ప్రయత్నాలకు తిలోదకాలు ఇచ్చి ఉంటే బిల్ గేట్స్ పోలియోతో చనిపోయి ఉండవచ్చు. సాంకేతిక రంగంలో ఈ క్షణంలో ఏమి జరుగుతుందో చెప్పటం కష్టసాధ్యం. విద్యార్థిరుణాలలో అనూహ్యమైన పెరుగుదల ఊహించలేకపోయాం. ఎందుకంటే, విమానాశ్రయంలో సెక్యూరిటీ గార్డ్ హైజాకర్ కత్తి స్వాధీనం చేసుకొని ఉండవచ్చు. అంతకుమించి చెప్పటం అసాధ్యం.

పెట్టుబడుల విషయంలో అమిత విషాదాంత పరిస్థితులు ఊహించటానికి మనం రెండవ ప్రపంచ యుద్ధం, ది గ్రేట్ డిప్రెషన్ వంటి సంఘటనలు వినియోగిస్తూ ఉంటాం. కానీ చరిత్రాత్మకమైన ఆ సంఘటనలకు పూర్వాపరాలు ఏమీ లేవు. కనుక గతంలోని దుర్ఘటనలు భవిష్యత్తులో జరుగబోయే దుర్ఘటనలకు పోలుతాయని ఆశించే పెట్టుబడిదారుడు చరిత్రను అనుసరించటంలేదన్న మాట. పూర్వాపరాలు లేని చారిత్రిక సంఘటనలు భవిష్యత్తుకు వర్తించవు అని ఆలోచించటంకూడా యాదృచ్ఛికమే.

ఫూల్డ్ బై రాండమ్ నెస్ (Fooled By Randomness) అన్న తన రచనలో నసీమ్ టాలెబ్ వ్రాస్తారు:

> ఫారో ఈజిప్ట్‌లో ... పెద్దదైన నైలు నది అంతకు పూర్వం చేరుకున్న అత్యున్నత స్థాయి గుర్తించి, భవిష్యత్తులో జరుగబోయే దుర్ఘటనలకు సూచికగా వినియోగించారు. ఫుకుషిమా న్యూక్లియర్ రియాక్టర్ ను గురించి కూడా ఇదేవిధంగా చెప్పవచ్చు. 2011 లో త్సునామి తాకినప్పుడు ఆ రియాక్టర్ ఘోరంగా విఫలమయింది. చరిత్రాత్మకంగా సంభవించిన అత్యంత దారుణ భూకంపాన్ని తట్టుకోటానికి అది నిర్మితమయింది. గతంలో జరిగిన ఘోర భీభత్స పరిణామం ఒక హఠాత్పరిణామమనీ, దానికి పూర్వా పరాలు లేవనీ వారు ఆలోచించలేదు. ఆనాడు ఆ నిర్మాతలు అంతకు మించిన ఘోర పరిణామాన్ని ఊహించలేకపోయ్యారు.

ఇది విశ్లేషణా వైఫల్యం కాదు. ఇది ఊహావైఫల్యం, ఆలోచనా వైఫల్యం. భవిష్యత్తు ఎన్నటికీ భూతకాలం లాగా ఉండబోవటంలేదని గ్రహించటమే ఒక ప్రత్యేక కౌశలం, నైపుణ్యం. ఆర్థిక రంగంలో భవిష్యత్ప్రణాళికలు రచించేవారికి ఇది రుచించదు.

2017లో నేను న్యూయార్క్‌లో ఒక డిన్నర్ హాజరయ్యాను. అక్కడ డేనియల్ కానేమన్ అన్న నిపుణులు ఒకరు ఉన్నారు. మనం సూచించే భావి సంఘటనలు తప్పిపోతే, పెట్టుబడిదారులు ఎలా స్పందించాలి? అని ఆయనను ప్రశ్నించారు. ఆయన అన్నారు:

మనం ఆశించనిది ఏదైనా జరిగితే - ఒకవేళ మనం తప్పు చేశామని ఒప్పుకున్నా సరే - "చస్తే జన్మలో అటువంటి పొరబాటు మళ్ళీ చెయ్యను" అని మనకు మనమే చెప్పుకుంటాం. జరగబోయ్యేదేమిటో ఆశించ లేకపోవటంచేత మీరు ఒక తప్పు చేశారు. అందులో తెలుసుకోవలసిందేమిటంటే, ఈ ప్రపంచంలో ఏమి జరగబోతున్నదో ఊహించటం కష్టం అని. ఈ ప్రపంచం ఒక ఆశ్చర్య స్థావరం. మనకు ఎదురయ్యే ఊహించని పరిణామాలవల్ల నేర్చుకోవలసిన సరైన పాఠం అదే.

ఈ ప్రపంచం ఆశ్చర్యాలకు పుట్టిల్లు అనేదే అనుకోని పరిణామాలవల్ల నేర్చుకోవలసిన సరైన పాఠం. గతంలో జరిగిన హఠాత్పరిణామాలను భవిష్యత్తుకు మార్గదర్శకాలుగా వినియోగించకూడదు. గత పరిణామాలవల్ల తర్వాత ఏమి జరగబోతున్నదో మనకు తెలియదని మనం ఒప్పుకోవాలి.

భవిష్యత్తులో జరగబోయ్యే - విపరీత పరిణామాలు కలిగించే - అతి ముఖ్యమైన ఆర్థిక సంఘటనలు, పరిణామాలను గురించి చరిత్ర మనకేమీ చెప్పలేదు, దారిచూపలేదు. అవి అపూర్వ సంఘటనలు మాత్రమే అవుతాయి. అవి అపూర్వం కనుక మనం వాటికి సిద్ధంగా ఉండం. కనుక వాటి ప్రభావం విపరీతమవుతుంది. భయంకర ఆర్థిక మాంద్యము, యుద్ధాలు అయినా, అద్భుత ఆవిష్కరణల ఆనంద సమయం అయినా ఇదే తథ్యం.

ఆ విషయంలో మాత్రం నాకు భవిష్యత్తును గురించి సంపూర్ణ విశ్వాసం ఉన్నది. ఎందుకంటే ప్రపంచంలో జరిగిన ఆశ్చర్యకర హఠాత్పరిణామాలన్నీ విపరీత పరిణామాన్ని కలిగిస్తాయనేది ప్రతిఒక్కసారీ నిజమయింది.

## 2. ఆర్థిక వ్యవస్థ, స్టాక్‌మార్కెట్‌ల భవిష్యత్తును చరిత్ర తప్పుదారి పట్టిస్తుంది. ఈ నాటి ప్రపంచనిర్మాణానికి అవసరమైన మార్పులు చరిత్రలో ఉండవు.

కొన్ని ముఖ్య సంఘటనలు గమనించండి.

401 (k) వచ్చి 42 సంవత్సరాలయింది. 1990లలో సృష్టి అయిన Roth IRA ఇంకా చిన్నది. ఉద్యోగవిరమణ సమయానికి ఈనాటి అమెరికన్లు

ఎలా పొదుపు చేసుకోవాలన్న విషయం ఒక తరం వెనక ఉన్న పరిస్థితితో పోల్చటం తగదు. పరిస్థితులు మారాయి. మనకు ఇప్పుడు ఉన్న అవకాశాలు మారాయి.

ఆ మాటకు వస్తే వెంచర్ క్యాపిటల్ తీసుకోండి. పాతికేళ్ళ క్రితం దాని ఉనికి చాలామందికి తెలియదు. ఈనాడు ఒక్క వెంచర్ క్యాపిటల్ ఫండ్ ఆనాటి మొత్తం పరిశ్రమలో ఉన్న క్యాపిటల్ కంటే ఎక్కువ ఉంటుందంటే సత్యదూరం కాదు.[40] నైకి వ్యవస్థాపకులు ఫిల్ నైట్ తన జ్ఞాపకాలలో ఆ నాటి తన అనుభవాన్ని వివరిస్తారు:

> ఆనాడు వెంచర్ క్యాపిటల్ అంటూ ఏమీ లేదు. ఆశాభావాలు గల యువ వ్యాపారవేత్తలకు అవకాశాలు చాలా అరుదుగా ఉండేవి. ఉన్న ఆ కొద్ది అవకాశాలు కూడా అతికొద్దిమంది చేతులలో భద్రంగా ఉండేవి. వారికి సాహసం చేయటమంటే గిట్టదు. దానికితోడు వారి ఊహాసామర్థ్యం శూన్యం. ఒక్కమాటలో చెప్పాలంటే వారు కేవలం బ్యాంక్ వ్యాపారం నడిపేవారు.

కొన్ని దశాబ్దాల క్రితం సంస్థలు ఆరంభ దశలో ఆర్థిక సహాయం ఎలా సాధించాయనేది ఈనాటి వ్యాపారానికి నిరుపయోగమని దీని భావం. పెట్టుబడుల ఆవృత్తాలు, కొత్తగా ప్రారంభమయిన సంస్థల వైఫల్యం గురించి తెలుసు కోవటానికి పెద్ద చరిత్ర ఏమీ లేదు. ఈనాటి సంస్థల ఆర్థిక స్తోమతు చరిత్రలోనే కొత్త అధ్యాయం.

లేకపోతే, పబ్లిక్ మార్కెట్లు గమనించండి. 1976 వరకూ S&P 500 పరిధిలో డబ్బురూపేణ స్టాక్స్ ఏమీ ఉండేవి కావు. ఈనాడు వారిస్టాక్స్ డబ్బు రూపంలో 16% ఉన్నాయి. యాభై సంవత్సరాల క్రితం సాంకేతిక రూపంలో స్టాక్స్ అంటే ఎవరికీ తెలియదనే చెప్పాలి. ఈనాటివ్యాపారంలో సాంకేతిక రూపంలో స్టాక్స్ మొత్తంలో అయిదోవంతుకు మించి ఉంటున్నాయి. కాలక్రమేణ ఎకౌంటింగ్ నిబంధనలు మారుతూ వచ్చాయి. అలాగే డిస్ క్లోషర్లు, ఆడిటింగ్, మార్కెట్ లిక్విడిటీ అన్నీ మారుతూ వచ్చాయి.

గత 150 సంవత్సరాలలో అమెరికాలో ఆర్థిక మాంద్యం మధ్య విరామం నాటకీయంగా మారుతూ వచ్చింది.

ఆర్థిక మాంద్యంలో US ఆర్థిక వ్యవస్థ




1800 చివరి భాగంలో రెండు సంవత్సరాలకొక సారి ఆర్థిక మాంద్యం కలుగుతూ ఉండేది. 20 వ శతాబ్దం మొదట్లో ఆ విరామం 5 సంవత్సరాలకు పెరిగింది. గత యాభై సంవత్సరాలలో ఆ విరామం ఎనిమిది సంవత్సరాలకు పెరిగింది.

నేను ఈ పుస్తకం వ్రాస్తూ ఉండగా మనం మరోక ఆర్థిక మాంద్యంలోకి అడుగు పెడుతున్నట్లు తోస్తునది. 2007లో అంటే పన్నెండు సంవత్సరాల క్రితం ఒక ఆర్థిక మాంద్యం మొదలైంది. పౌరహక్కుల యుద్ధం తర్వాత ఆర్థిక మాంద్యాల మధ్య అత్యంత పెద్ద విరామం ఇదే.

ఆర్థిక మాంద్యాలు ఎందుకు మందగించాయన్న విషయం మీద అనేక సిద్ధాంతాలు ఉన్నాయి. వ్యాపార ఆవృత్తాలను నిర్వహించటంలో, లేదా వాటిని పొడిగించటంలో Fed మెరుగుగా వ్యవహరిస్తున్నది. ఇంకొకటి ఏమిటంటే భారీ పరిశ్రమలు అభివృద్ధికి, అధః పతనానికి సులువుగా ఆహారమవుతాయి.

గత యాభై సంవత్సరాలుగా సేవాపరిశ్రమలు రాజ్యమేలుతున్నాయి. ప్రస్తుతం ఆర్థిక మాంద్యాలు మందంగా ఉన్నాయి. కానీ అవి వచ్చాయంటే గతంలోకంటే ఉధృతంగా ఉంటాయన్నదే ఇక్కడ నిరాశావాదం. మనకు మటుకు మార్పుకు కారణమేమిటో అనవసరం. పరిస్థితులు మారాయన్నదే ముఖ్య విషయం.

బెంజమిన్ గ్రాహం పెట్టుబడి మేధావులలో అగ్రగణ్యులుగా ప్రసిద్ధికెక్కారు. చరిత్రలో కలిగే మార్పులు పెట్టుబడులను ఎలా ప్రభావితం చేస్తాయో తెలుసుకోవటానికి ఆయన రచన 'ది ఇంటెలిజెంట్ ఇన్వెస్టర్' (The Intelligent Investor) పరిశీలించుదాం.

గ్రాహం ప్రామాణిక రచన ది ఇంటెలిజెంట్ ఇన్వెస్టర్ సిద్ధాంతానికి అతీతం. అందులో పెట్టుబడిదారులకు గణితసూత్రాలలాగా దిశానిర్దేశం చెయ్యబడింది. పెట్టుబడులలో తెలివిగా ప్రవర్తించటానికి అది సహాయపడుతుంది.

నేను కిశోరప్రాయంలో ఉన్నప్పుడూ గ్రాహం రచన చదివాను. పెట్టుబడులను గురించి అప్పుడే నేను అక్షరాభ్యాసం చేస్తున్నాను. ఆపుస్తకంలో దర్శనమిచ్చిన సూత్రాలు నాకు చాలా నచ్చాయి. ఎందుకంటే సంపన్నులం కావటానికి అవి మనలను చెయ్యి పట్టుకుని అడుగులో అడుగేసి నడిపిస్తున్నట్లు ఉన్నాయి. మీరు చెయ్యవలసిందల్లా సూత్రాలు అనుసరించటమే. అంత సులువుగా తోచింది అది ఆనాడు.

కానీ ఆ సూత్రాలు అమలుపరచటం మొదలుపెట్టినప్పుడు అసలువిషయం బయట పడుతుంది. వాటిలో పనిచేసేవి చాలా తక్కువ.

అసలు ధరకంటే తక్కువలో అమ్మకమవుతున్న స్టాక్స్ కొనమని గ్రాహం సలహా. అంటే అప్పులుపోగా బ్యాంక్ లో మిగిలి ఉన్న సొమ్ము అన్నమాట. ఆ సలహా చాలా చక్కగా ధ్వనిస్తుంది. కానీ ప్రస్తుతం ఏ స్టాక్స్ అంత చవకగా - దొంగలెక్కలు చూపించి పట్టుబడ్డ వ్యాపారాలు తప్ప - దొరకవు.

'బుక్ వాల్యూవ్ కంటే ఒకటిన్నర రెట్లు మించిన ధరలో చలామణి అవుతున్న స్టాక్స్ కొనవద్దు' అన్నది గ్రాహం శిక్షణా ప్రమాణాలలో ఒకటి. గత శతాబ్దంలో మీరు ఈ సూత్రం పాటించి ఉంటే మీ దగ్గర ఇన్స్యూరెన్స్ స్టాక్స్,

బ్యాంక్ స్టాక్స్ తప్ప మరేమీ ఉండబోవు. ఆ సూత్రం ఆచరణ యోగ్యమయిన ప్రపంచం ఎక్కడా లేదు.

పెట్టుబడిని గురించి ఇప్పటివరకూ వెలువడిన పుస్తకాలన్నిటిలోనూ 'ది ఇంటెలిజెంట్ ఇన్వెస్టర్' ఉత్తమోత్తమమైన పుస్తకాలలో ఒకటి. అయితే గ్రాహం మెరుగులుదిద్ది ప్రచురించిన సూత్రాలను అనుసరించి బాగుపడిన పెట్టుబడిదారులు నాకు ఇంతవరకూ ఎదురుపడలేదు. ఆ పుస్తకమంతా వివేచనామయం. ఇంత వరకూ వచ్చిన పెట్టుబడి పుస్తకాలన్నింటిలోనూ ఇది అత్యంత వివేచనామయం. కానీ అది ఎంతవరకు ఆచరణాత్మకం అనే ప్రశ్న ప్రశ్నగానే మిగిలి పోతుంది.

ఏమయింది? ఆయన సలహా వినటానికి తప్ప మరెందుకూ పనికిరాదా? పొరబాటు. ఎంతమాత్రమూ కాదు. విపరీతమైన సఫలత సాధించిన పెట్టుబడి దారులలో ఆయన ఒకరు.

కానీ ఆయన ఆచరణశీలి. దానికితోడు ఆయన అసలైన వ్యతిరేకవాది. పెట్టుబడి సూత్రాలకు ఆయన కట్టుబడలేదు. చాలామంది పట్టుకుని వేలాడుతున్న సూత్రాలకు ఆయన పట్టుబడలేదు. అందువల్ల ఆ సూత్రాలు ప్రజాదరణ పొంద వచ్చునేమోగాని, కాలక్రమేణ వాటి శక్తి ఉడిగిపోతుంది. నిష్ప్రయోజనమవుతాయి. గ్రాహం పుస్తకానికి తర్వాత వచ్చిన ముద్రణ ఉదాహరిస్తూ జేసన్ జ్వైగ్ అంటారు:

> గ్రాహం తన ఆలోచనలను నిత్యమూ పరీక్ష చేస్తూఉండేవారు. వాటిలో ఏది మంచిఫలితాలనిస్తుందో – నిన్న ఏది పనిచేసింది, ఇవాళ ఏది పనిచేస్తుంది అని కాదు – తెలుసుకోవటమే ఆయన లక్ష్యం. 'ది ఇంటెలిజెంట్ ఇన్వెస్టర్' ప్రతిఒక్క ప్రచురణలోను ఆయన అంతకు పూర్వప్రతిలో ఉన్న సూత్రాలు చెత్తబుట్టకు పంపేవారు. వాటిస్థానంలో కొత్త సూత్రాలు ప్రవేశపెట్టేవారు. "అవి ఇప్పుడు పనిచెయ్యవు" అనో లేకపోతే "అవి ఇంతకు మునుపు పనిచేసినట్లు ఇప్పుడు చెయ్యటం లేదు. వాటికంటే మేలుగా పనిచేసే సూత్రాలు ఇవిగో, ఇవి." అని ప్రకటించేవారు.
>
> 1972 ప్రచురణలో కనిపించిన సూత్రాలు అన్నీ పాతబడి పోయాయి, బూజు పట్టిపోయాయి అనేది గ్రాహంను గురించిన

విమర్శ. ఆ విమర్శకు సమాధానం ఒక్కటే: "నిజమే, అవి పాతబడి పోయాయి. 1965 ప్రచురణలో ఉన్న సూత్రాల స్థానే వచ్చినవి ఈ సూత్రాలు. 1965 సూత్రాలు 1954 ప్రచురణలో ఉన్న సూత్రాల స్థానంలో వచ్చాయి. 1949 ప్రచురణలో ఉన్న సూత్రాల స్థానంలో 1954 సూత్రాలు వచ్చాయి. 1934లో ప్రచురించిన 'సెక్యూరిటీ ఎనాలిసిస్'లో ఉన్న సూత్రాలకు బదులు 1954 సూత్రాలు వచ్చాయి."

గ్రాహం 1976లో స్వర్గస్తులయ్యారు. ఆయన ప్రతిపాదించిన సూత్రాలు 1934 కు 1972 కు మధ్య ఐదు సవరణలకు గురయ్యాయంటే 2020లో వాటి ప్రయోజనం ఎంత? కాకపోతే 2050 లో వాటి విలువ ఏమిటి?

ప్రతిఒక్క స్టాక్‌ను వివరంగా విశ్లేషించటంలో ఆయన ప్రసిద్ధికెక్కారు. ఆయన కొద్దిరోజులలో చనిపోతారనగా ఆ వివరణాత్మక విశ్లేషణ ఇంకా ఆయన అభిమాన విషయమేనా అని అడిగారు. ఆయన సమాధానం:

"మామూలుగా 'కాదు' అనే చెప్పాలి. అవకాశాల విలువలు అంచనా వెయ్యటానికి వివరమైన భద్రతా విశ్లేషణ ఇకమీదట నా సలహా కాబోదు. ఒకనాడు అంటే 40 సంవత్సరాల క్రితం – మా పుస్తకం తొలిసారి ముద్రణ అయినప్పుడు – ఆ విశ్లేషణ సత్ఫలితాలను చూపించింది. ఆనాటికీ ఈనాటికీ పరిస్థితులు పూర్తిగా మారిపోయ్యాయి."[41]

ఏం మారాయి? అవకాశాలు పెరుగుతున్న కొద్దీ పోటీ ఎక్కువయింది. సాంకేతికతవల్ల కావలసిన సమాచారమంతా, చేతికి అందుబాటులోకి వచ్చింది. ఆర్థిక వ్యవస్థ పారిశ్రామికత నుంచి సాంకేతికతకు మారేసరికి పరిశ్రమలు మారిపోయ్యాయి. కొత్తగా వచ్చిన పరిశ్రమల వ్యాపార అవృత్తాలు వేరు, మూలధనం ప్రయోజనాలు వేరు.

పరిస్థితులు మారిపోయ్యాయి.

ఈ పెట్టుబడి చరిత్రలో వెనక్కు చూసినకొద్దీ కనిపించే వింత ఏమిటంటే, మీరు ఎంత వెనక్కుపోతే ఆ వ్యవస్థ ఈనాటి ప్రయోజనాలకు అంత దూరమవు తుంది. చాలామంది పెట్టుబడిదారులు, ఆర్థికశాస్త్రవేత్తలు అందరూ తమ దూరదృష్టి

వెనక దశాబ్దాల, ఇంకా మాట్లాడితే శతాబ్దాల దత్తాంశాల మద్దతు ఉన్నదని ఊరట పొందుతారు. కానీ ఆర్థిక స్థితీగతులు నిత్య నూతన పరిణామాలకు లోనవుతూ ఉంటాయి గనక ఇటీవలి చరిత్ర భవిష్యత్తుకు కొంతదారి చూపగలదేమో. అందులో భవిష్యత్తుకు సంబంధించిన పరిస్థితులు ఉండే అవకాశం ఎక్కువ.

పెట్టుబడి వ్యాపారంలో సాధారణంగా పరిహాసంగా ఉపయోగించే పదబంధం ఒకటి ఉన్నది: "ఇప్పటి పరిస్తితి వేరు". భవిష్యత్తు గతంలోలాగా ఉండబోవటంలేదని జోస్యం చెబుతున్నవారిని వెక్కిరించాలంటే "ఊ, ఇప్పటి పరిస్తితి వేరని మీ అభిప్రాయం?" అనవచ్చు. "ఇప్పటి పరిస్తితి వేరు." అన్నవి చాలా ప్రమాదకరమైన పదజాలమని పెట్టుబడి నిపుణులు జాన్ టెంపుల్టన్ అభిప్రాయం.

కనీసం 20% శాతం సమయం పరిస్తితి వేరుగా ఉంటుందని టెంపుల్టన్ ఒప్పుకున్నారు. ఈ ప్రపంచం మారుతూ ఉంటుంది. మారి తీరుతుంది. అప్పుడు కలిగే మార్పులే కాలక్రమేణా ముఖ్యమవుతాయి. "'ఇప్పటి పరిస్తితి వేరు' అన్నవి చాలా ప్రమాదకరమైన పదజాలం" అన్నదే అత్యంత ప్రమాదకరమైన పదజాలం." అంటారు మైఖేల్ బాట్నిక్.

అంటే డబ్బును గురించి ఆలోచిస్తున్నప్పుడు మనం చరిత్రను పట్టించుకోనక్కర లేదని అర్థం కాదు. అక్కడ ఒక ముఖ్యమైన సూక్ష్మం ఉన్నది. చరిత్రలో మీరు ఎంత వెనక్కువెళ్ళి చూస్తే, మీ సంపాదన అంత సామాన్య మవుతుందన్నమాట. లోభానికి, భయానికీ ప్రజల బాంధవ్యం, ఒత్తిడి పరిస్తితిలో వారి ప్రవర్తన, ఆశ చూపిస్తే వారు ఎలా స్పందిస్తారు అనేవి సామాన్యంగా స్థిరంగా ఉంటాయి. అటువంటి పరిస్థితులలో ధనం చరిత్ర ఉపయోగపడుతుంది.

కానీ నిర్దిష్టమైన ధోరణులు, నిర్దిష్టమైన వ్యాపారాలు, నిర్దిష్టమైన రంగాలు, విపణివీధితో నిర్ధిష్టమైన తాత్కాలిక సంబంధాలు, తమ డబ్బుతో జనం ఏం చెయ్యాలియనేవి పురోగమిస్తున్న పరిణామాలకు, వికాసానికి సూచన. చరిత్రకారులు జోశ్యులు కారు.

మరయితే, భవిష్యత్తును గురించి ఆలోచించి, వ్యూహరచన చెయ్యటం ఎలా? ఆ విషయం రాబోయ్యే అధ్యాయంలో గమనించుదాం.

# 13.

# పొరపాటుకు అవకాశం

---

మీ పథకం మీరు ఆశించిన ప్రకారం
నడవకపోతే, ఏమి చేయాలో ఆలోచించి
ఉంచటం మీ పథకంలో అతి ముఖ్యాంశం.

---

ఆర్థిక విషయాలలో ప్రవర్తనకు అత్యుత్తమమైన ఉదాహరణలు మీరు ఊహించలేని చోట దొరుకుతాయి: లాస్ వేగాస్ క్యాసినోలు.

అందరూ కాదనుకోండి. కొందరు మాత్రమే. బ్లాక్ జాక్ ఆడే కొద్దిమంది క్రీడాకారులలో తమ కార్డులు లెక్కపెడుతూ ఆడేవారు మామూలు మనుషులకు అత్యంత ప్రధానమైన ఒకవిషయం నేర్పగలరు: తప్పుకు అవకాశం ఉన్నదని గ్రహించటం అత్యవసరం.

---

బ్లాక్ జాక్ ఆటలో కార్డ్లు లెక్కపెట్టటంలో ప్రాధమిక విషయాలు చాలా సరళం.

- కార్డులు పంచే వ్యక్తి తర్వాత ఏ కార్డ్ తియ్యబోతున్నాడో ఎవరికీ తెలియదు.
- ఇప్పటివరకూ ఏ కార్డులు లు డీల్ చేశారో గమనిస్తే కట్టలో మిగిలిన కార్డులు ఏమిటో మీరు లెక్కకట్టవచ్చు.
- అప్పుడు డీలర్ ఫలానా కార్డు తియ్యటానికిగల అవకాశాలేమిటో మీరు అంచనా వేయవచ్చు.

మీరు కోరుకున్న కార్డు రావటానికి అవకాశాలు ఎక్కువగా తోచినప్పుడు మీరు ఎక్కువ పందెం కాస్తారు.

ఇదంతా ఎలా చేస్తారు అనేది ఇక్కడ అప్రస్తుతం. బ్లాక్ జాక్ ఆడేవారికి తాము అవకాశాలతో ఆట ఆడుతున్నామనీ, ఖచ్చితంగా ఏమి జరగబోతున్నదో తమకు తెలియదనీ తెలుసు. మంచి అవకాశం ఉన్నదనుకున్న కార్డులు వచ్చినప్పుడుకూడా, ఆ అవకాశం కలగక పోవచ్చునన్న విషయంకూడా వారికి బాగా తెలుసు. వారి వృత్తిని గురించి ఆలోచిస్తే అది వింతగా తోచవచ్చు. కానీ వారి పథకం అంతా నమ్రతమీద ఆధారపడుతుంది. తమకు తెలియదనీ, తర్వాత ఏమి జరగబోతున్నదో తెలుసుకోవటం అసాధ్యమనీ వారికి తెలుసు. తదను

గుణంగానే వారు ఆడుతారు. కార్డులు లెక్కపెట్టే పద్ధతి కొంతవరకు పనిచేస్తుంది. దానివల్ల గెలిచే అవకాశాలు క్యాసినో నుంచి ఆటగాడి వైపుకు కొద్దిగా మొగ్గుతాయి. కానీ ఆ అవకాశాలు మొగ్గినంతమాత్రాన పెద్ద పందెం కాయటం అనర్థం కావచ్చు. అది జరగకపోతే, మీరు భారంగా నష్టపోవచ్చు. తర్వాత ఆట కొనసాగించటానికి మీ దగ్గర డబ్బు కొరత పడవచ్చు కూడా.

మీ ముందు ఉన్న చిప్స్ అన్నీ పందెం కాయగల స్థితికి మీరు ఎన్నటికీ చేరలేరు. ఎందుకంటే మీ ఊహ ఎన్నటికీ నూటికి నూరుపాళ్ళు సరికాదు. ఈ ప్రపంచం ఎవరినీ – నిత్యమూ – కనికరించదు. కనుక మీరు తప్పుచేసే అవకాశం ఉన్నదని గుర్తించి అందుకు తగిన మెసులుబాటు ఇవ్వాలి. మీరు అనుకున్నప్రకారం జరగబోవటంలేదని ఒప్పుకుని తదనుగుణంగా మీ పథకం తయారు చేయాలి.

కెవిన్ లెవీస్ కార్డు లెక్కపెట్టటంలో ప్రవీణులు. 'బ్రింగింగ్ డౌన్ ది హౌస్' అన్న తన పుస్తకంలో ఆయన ఈ తత్వాన్ని వివరిస్తారు:

> కార్డులు లెక్క వెయ్యటం నిరూపణ అయిన పద్ధతి. అంతమాత్రాన – మీరు క్యాసినో దర్శించిన ప్రతిసారి మాట అటు ఉంచండి – మీరు కార్డులు చేతికి తీసుకున్న ప్రతిసారీ గెలుస్తారని గ్యారంటీ ఏమీ లేదు. అదృష్టం చెంపదెబ్బలు కొడుతూ ఉంటే తట్టుకోవటానికి చేతిలో డబ్బు ఉండాలి.

క్యాసినో కంటే మీకు రెండు శాతం అధిక బలం ఉందనుకుందాం. అంటే క్యాసినో గెలవటానికి 49 శాతం అవకాశాలు ఉన్నాయనేగా అర్థం? కనుక మీకు తగిలే ఎదురు దెబ్బలు తట్టుకోవటానికి మీదగ్గర తగినంత డబ్బు ఉండాలి. ఇక్కడ బండగుర్తు ఏమిటంటే మీదగ్గర కనీసం నూరు పందాలు కాయటానికి తగిన సొమ్ము ఉండాలి మీ దగ్గర పదివేల డాలర్లు ఉన్నాయను కుంటే, మీరు ఆడుతూ పాడుతూ నూరు డాలర్ల పందాలు కాయవచ్చు.

చరిత్ర అంతా అతిగా ప్రయోగించిన సదాలోచనలమయం. ఈ సదాలోచనలకు, దురాలోచనలకు పెద్ద తేడా ఏమీ ఉండదు. తప్పుకు అవకాశం ఉన్నది అనే వివేచన మనం ప్రయోగిస్తున్నామంటే, అనిశ్చితి, యాదృచ్ఛికత, అజ్ఞాత విషయాలను గ్రహించి అంగీకరిస్తున్నామన్నమాట. మీరు అనుకున్నదానికీ

జరగబోయ్యేదానికీ మధ్య దూరం పెంచటమే వాటితో వ్యవహరించటానికి ఏకైకమార్గం. అప్పుడే మర్నాడు ఆ పోరాటం కొనసాగించటానికి సిద్ధమయ్యే శక్తి మనలో కలుగుతుంది.

---

లాభం గూబలోకి రాకుండా పందెం కాయటంలో బెంజమిన్ గ్రాహం పేరుపొందారు. దానిని గురించి ఆయన చాలా విపులంగా లెక్కప్రకారం వ్రాశారు. ఆయన ఒక ఇంటర్వ్యూలో "మార్జిన్ ఆఫ్ సేఫ్టీ అంటే జరగబోయ్యేదానిని గురించి జోస్యం అనవసరం కావటమే." అన్నారు. ఆ సిద్ధాంతం నాకు చాలా నచ్చింది.

అతి సరళంగా ధ్వనించే ఆ సూత్రంలో ఎంత శక్తి ఇమిడి ఉన్నదో చెప్పటం కష్టం.

మార్జిన్ ఆఫ్ సేఫ్టీ - దానినే మీరు తప్పుకు అవకాశం అనీ లేకపోతే పునరుక్తి అనీ అనవచ్చు - నిశ్చయంగా కాక మిట్టపల్లాలతో నిండిఉన్న ప్రపంచంలో భద్రంగా ముందడుగు వెయ్యటానికి అది ఒక్కటే మార్గం. డబ్బుకు సంబంధించిన ప్రతిఒక్క విషయమూ ఆ మిట్టపల్లాల లోకంలోనే ఉన్నది.

ఫలానా జరగబోతున్నది అని ఖచ్చితంగా చెప్పటం కష్టం. అతి నిశితంగా కార్డులు లెక్కపెట్టేవారికి కూడా ఈ విషయం బాగాతెలుసు. ఎందుకంటే మనకు కావలిసిన కార్డు పేకలో ఎక్కడున్నదో ఎవరికీ తెలియదు. "రాబోయ్యే పది సంవత్సరాలలో స్టాక్ మార్కెట్ సగటు ఆదాయం ఎంత ఉంటుంది?" లేకపోతే "నేను ఎప్పుడు విశ్రాంతి తీసుకోవచ్చు?" అన్న ప్రశ్నలు అడిగేవారికి సమాధానం అంతకంటే తెలియదు. కానీ ప్రాధమికంగా రెండూ దాదాపు ఒకటే. మనం చెయ్యగలిగినదల్లా ఒదుదుడుకులను గురించి ఆలోచించటమే.

మన కళ్ళెదుట ఉన్న ప్రపంచాన్ని నలుపు తెలుపుగానో, తెలిసినట్లుగానో, కళ్ళకు గంతలు కట్టుకొని బాణం వేసినట్లుగానో చూడనవసరం లేదు. అదే గ్రాహం చెప్పిన మార్జిన్ ఆఫ్ సేఫ్టీ సూత్రంలో కిటుకు. నలుపూ తెలుపూ కానీ ఆ బూడిద రంగు ప్రదేశంలో - అనేక అవకాశాలు కొలువై ఉన్న ప్రదేశం - దేవులాడటమే తెలివైన మార్గం.

కానీ డబ్బుతో కూడిన వ్యవహారానికి వచ్చేసరికి జనం పొరబాట్లకు తావు ఇవ్వటం మర్చిపోతారు. స్టాక్ మార్కెట్ విశ్లేషకులు తమ ఖాతాదారులకు ఫలానా ధర అని చెప్తారుగానీ ఆ ధర ఎక్కడినుంచి ఎక్కడివరకూ ఉండవచ్చునో చెప్పరు. ఆర్థిక రంగంలో ప్రణాళికలను గురించి చెప్పేవారు చాలా ఖచ్చితమైన సంఖ్యలు చెప్తారు. సాధ్యాసాధ్య అవకాశాలను గురించి వారు చాలా అరుదుగా చెప్తారు. "దానిని గురించి ఖచ్చితంగా చెప్పలేము" అని సంభావ్యతను గురించి చెప్పేవారికంటే ఇది తప్పకుండా జరుగుతుంది అని దృఢంగా చెప్పేవారిని అనురించేవారు ఎక్కువ.[42]

డబ్బుతోకూడిన వ్యవహారాలన్నిటిలోనూ – ముఖ్యంగా అది మన సొమ్ము, మన వ్యవహారమైతే – మనం ఇలాగే ప్రవర్తిస్తాము. ఎదటివాళ్ళ ఇళ్ళు మరమ్మతులు, పునరుద్ధరణ జరిగేటప్పుడు పని పూర్తయ్యేసరికి వారు ఆశించిన దానికంటే 25–50% ఖర్చు పెరుగుతుందని అంచనా వేస్తారు.[43] అదే వారి ఇల్లు, వారి ప్రాజెక్ట్ అయితే అంతా సకాలంలో, బడ్జెట్ ప్రకారం జరుగుతుందని అంచనా వేస్తారు. ముగింపులో కలిగే ఆశాభంగాన్ని గురించి వేరే చెప్పనక్కర్లేదు.

పొరబాటు జరగవచ్చు అనే ఆలోచన తప్పించుకోవటానికి రెండు కారణాలు ఉన్నాయి. భవిష్యత్తు ఎలా ఉంటుందో చెప్పలేమని ఒప్పుకోవటం కష్టంగా ఉంటుంది. కనుక ఎలా ఉండబోతున్నదో తెలుసు ననే భావంతో ముందడుగు వెయ్యటం. కనుక తర్వాతి మెట్టు ఏమిటంటే భవిష్యత్తులో మనం ఆశించినట్లు జరగటానికి తగుచర్యలు తీసుకోకపోతే, మీకు మీరే అన్యాయం చేసుకుంటున్నారన్న మాట.

పొరబాటు సాధారణంగా అపార్థానికి గురవుతుంది. దాని విలువ గుర్తించటం కూడా అరుదు. పొరబాటును గురించి జాగ్రత్త పడేవారందరికీ సంప్రదాయవాదులుగా ముద్ర పడుతుంది. దానిని గూర్చి ముందు జాగ్రత్తలు తీసుకునేవారు రిస్క్ తీసుకోవటానికి విముఖులనీ, వారి అభిప్రాయాలలో వారికే విశ్వాసం లేదనీ ప్రచారం జరుగుతుంది. కానీ సక్రమంగా ప్రయోగిస్తే, ఆ దూరదృష్టి చెప్పరాని మేలుచేస్తుంది.

పొరబాటు జరగవచ్చునని జాగ్రత్త పడితే, అనేక విపరీత ఫలితాలను ఎదుర్కునే శక్తి వస్తుంది. పరిస్థితులు సానుకూలంగా అయ్యేవరకు కాచుకొని ఉండగల స్తోమతు వస్తుంది. జీర్ణించిన అవకాశాలు మీకు సానుకూలంగా అయి మీరు లబ్ధి పొందుతారు. పెద్ద ప్రయోజనాలు అరుదుగా కలుగుతాయి. అవి తరుచూ జరగకపోవటం ఒక కారణం. పెద్దగా పెరగటానికి ఆ అవకాశాలకు కొంత  సమయం కావాలనటం ఇంకొక కారణం. కనుక తమ పథకంలో పొరబాటుకు తగిన పెట్టుబడి (సొమ్ము) సిద్ధం చేసి ఉంచినవారు మరొకచోట కష్టాన్ని(స్టాక్స్) ఎదుర్కోగల స్థితిలో ఉంటారు. అంతా పెట్టుబడి పెట్టినవారు అనువుకాని సమయంలో పందెం కాస్తారు, అంతా ఊడ్చిపెట్టుకు పోతుంది. మళ్ళీ పెట్టుబడికి చేతులు ఖాళీ.

బిల్ గేట్స్ ఈ విషయం బాగా అర్థం చేసుకున్నారు. మైక్రోసాఫ్ట్ సంస్థ పసితనంలో ఉన్నపుడు ఆయన "మాకు ఏమీ సొమ్ము ఆదాయం రూపంలో రాకపోయినా సరే, ఒక సంవత్సరం పొడుగునా పూర్తిగా జీతాలు ఇవ్వటానికి తగిన మొత్తం బ్యాంక్ లో ఉండాలని ఒక సంప్రదాయక ఆలోచన కలిగిం" దని అన్నారు. 2008లో బెర్క్ షైర్ హాతవే షేర్ హోల్డర్లతో ప్రసంగించినప్పుడు వారెన్ బుఫే అలాంటి భావననే వ్యక్తం చేశారు. "బెర్క్ షైర్ విభాగం అవసరమైన దానికంటే ఎక్కువ సొమ్ముతో నడపటానికి నేను - మీకు, రేటింగ్ ఏజన్సీలకు, నాకు - తీర్మానించాను. అవసరమైతే నేను లాభాలు వదులుకుంటాను గాని, నిద్ర - ఒక్కనాడైనా సరే - చెడగొట్టుకో దలచలేదు.[44]

పొరబాటుకు అవకాశాలు కొన్ని ముఖ్యమైన చోట్ల జరుగుతాయి. మదుపర్లు వీటిని  గుర్తించాలి.

గాలిలో కలిసి పోవటం. మీ సొమ్ము విలువ 30% దిగిపోతే మీరు కొనసాగగలరా? కాగితం మీద సాధ్యం కావచ్చు - మీ బిల్లులు వగైరా సకాలంలో చెల్లించటం, అవసరానికి సొమ్ము చేతిలో ఆడుతూ ఉండటం వంటివి. కాని మనసు మాట ఏమిటి? మీ సొమ్ము విలువ 30% దిగిపోతే మానసికంగా ఎంత దెబ్బతింటారో మీరు ఊహించలేక పోవచ్చు. మంచి అవకాశం వచ్చిన క్షణంలో మీ విశ్వాసం గాలిలో కలిసిపోయి ఉంటుంది. మీరు - మీ భాగస్వామిగాని -

ఇదివదిలేసి మరొక పథకం, లేదా మరొక ఉద్యోగాన్ని గురించి ఆలోచిస్తూ ఉండవచ్చు. నష్టపోయిన తర్వాత దుకాణం మూసివేసిన మదుపర్లు ఎందరో నాకు తెలుసు. అప్పటికి వారు డస్సిపోయి ఉన్నారు - శారీరకంగా నిర్వీర్యు లయినారు. పద్దుపుస్తకం లాభ నష్టాల అంకెలు మాత్రమే చెప్పగలుగుతుంది. రాత్రిపూట పిల్లలను పడుకోబెట్టినతర్వాత మీ పెట్టుబడులు వారి భవిష్యత్తును ఎలా దెబ్బతీస్తాయోనన్న అనుభూతిని అవి చిత్రించలేవు. గణితశాస్త్ర రీత్యా లేదా సాంకేతిక రీత్యా భరించగలిగినదానికి, అనుభూతులద్వారా సహించగలిగిన దానికి మధ్యనున్న వ్యత్యాసమే పొరపాటుకు అవకాశం. దాన్నే మనం తరుచూ పట్టించుకోము.

రిటైర్ అయిన తర్వాతి జీవితానికి పొదుపు చేయటం మరొకటి. ఉదాహరణకు మనం చరిత్ర గమనిస్తే, 1870 ద్రవ్యోల్బణం నాటినుంచీ US స్టాక్ మార్కెట్ సగటున సాలీనా 6.8% ఆదాయం ఇచ్చింది. రిటయిర్మెంట్ తర్వాత జీవితానికి కావలసిన దాన్ని ఈ సూచిక ఆధారంగా పొదుపు చెయ్యటం సముచితంగా ఉంటుంది. దాని ప్రకారం రిటైర్మెంట్ తర్వాత మీ అవసరాలను అనుసరించి నెలకు ఎంత వెనకెయ్యాలో నిర్ణయించటానికి ఇది నమ్మదగిన సూచిక.

మరి భవిష్యత్తులో ఆదాయం తగ్గితే మాటేమిటి? దీర్ఘకాల చరిత్ర దీర్ఘకాల భవిష్యత్తుకు కూడా సూచిక అయితే, మీ రిటైర్మెంట్ స్టాక్ మార్కెట్ కు భయంకరమైన 2009 లాంటి సంవత్సరంలో జరిగేట్లయితే? భవిష్యత్తులో జరగబోయ్యే నష్టాలు చూసి భయపడి లాభాల ఉరవడి మిస్ అయితే మాట ఏమిటి? అప్పుడు మన ఆదాయం సగటుకంటే తగ్గిపోతుంది గదా! మీరు నాలుగో దశకంలో ఉన్నప్పుడు మీ ఆరోగ్యం దెబ్బతిన్నది. రిటర్మెంట్ ఎకౌంట్ లో ఉన్న సొమ్ము అంతా తీయవలసి వచ్చింది. అప్పుడేం చెయ్యాలీ?

ఆ అయితే గియితే లకు "మీరు అనుకున్నట్లుగా రిటైర్ కాలేరు." అన్నదే జవాబు. అలా అయితే కొంప మునిగినట్లేకదా!

**దానికి పరిష్కారం సరళం:** భవిష్యత్తులో మీ ఆదాయం అంచనా వేసేటప్పుడు పొరబాటుకు అవకాశం కల్పించండి. ఇది శాస్త్రజ్ఞానం కాదు. ఇది

ఒక కళ. నా పెట్టుబడుల విషయంలో - వాటిని 20వ అధ్యాయంలో విపులీకరిస్తాను - భవిష్యత్తులో నా జీవితకాల ఆదాయం చారిత్రిక సగటుకంటే మూడింట ఒకపాలు తక్కువ ఉంటుందని నా అంచనా. భవిష్యత్తు గతాన్ని పోలుతుందనుకుంటే వచ్చే ఆదాయం కంటే నేను ఎక్కువ పొదుపు చేస్తాను. అదే నా సేఫ్టీ మార్జిన్. భవిష్యత్తు నేను ఆశించిన దానికంటే- గతంలోని మూడు పాళ్లలో ఒకపాలు తక్కువగా - నిర్దయగా ఉండవచ్చు. కానీ మీరు సేఫ్టీ మార్జిన్ ఎంత పెంచినా దేనికీ 100% గ్యారంటీ లేదు. మూడింట ఒక పాలు ఆపద్ధర్మ కవచం రాత్రుళ్ళు నన్ను సరిగా నిద్రపోనిస్తుంది. ఒకవేళ భవిష్యత్తు గతంలో లాగా నడిస్తే నాకు అంతకంటే ఆనందం ఉండదు. లక్ష్యం ఉన్నతి తగ్గించటమే సుఖసంతోషాలకు ఉత్తమమార్గం.

---

'పొరబాటుకు అవకాశానికి' ఒక కజిన్ ఉన్నాడు. దాన్నే నేను ఆశావాదం అంటాను. "సాంఖ్యశాస్త్రం ప్రకారం రష్యన్ రూలెట్ పనిచేయాలి." అన్న ధోరణి. విముఖ పరిస్తితి ఎంతమాత్రం అంగీకరించనివారి ఆశావాద ధోరణి ఇది.

నసీమ్ టాలెబ్ అంటారు: "ప్రేమించటానికి మీరు సాహసించవచ్చు. విధ్వంసానికి మాత్రం పూర్తిగా విముఖులు కావచ్చు." నిజానికి, అలాగే ఉండాలి!

ముందడుగు వెయ్యాలంటే సాహసించాలన్నది ఇక్కడ భావం. కానీ, విధ్వంసానికి దారితీసే సాహసం ఎన్నడూ చేయకూడదు. రష్యన్ రూలేట్ ఆడుతున్నపుడు, అవకాశాలు మీకు అనుకూలంగా ఉన్నాయి. కానీ, సంభావ్య విధ్వంసాన్ని గమనిస్తే, ఒకస్థాయిని మించి పైకివెళ్లటం భావ్యం కాదు. ఆ సాహసానికి తగిన సేఫ్టీ మార్జిన్ లేదు.

డబ్బుతోగూడా వాస్తవం ఇదే. ఆకర్షణీయమైన అనేక విషయాలలో అవకాశాలు మీకే అనుకూలంగా ఉంటాయి. దాదాపు ప్రతి సంవత్సరమూ రియల్ ఎస్టేట్ ధరలు పైపైకి పోతూనే ఉంటాయి. దాదాపు సర్వకాల సర్వావస్థలలోనూ మీ సొమ్ము మీకు వారం వారం టంచన్ గా అందుతుంది. కానీ, ఏదైనాసరే 95% శాతం అవకాశాలు మీకు అనుకూలంగా ఉంటే, 5%

మీకు ప్రతికూలంగా ఉన్నాయన్నమాటే గదా! అంటే జీవితంలో ఎప్పుడో ఒకప్పుడు ఆ 5% శాతం దెబ్బ తగిలి తీరుతుంది. ఆ 5% వల్ల కలిగే దెబ్బ ప్రాణాంతకమైతే, మిగతా 95% అనుకూల అవకాశాలు - ఎంత ఆకర్షణీయంగా ఉన్నా సరే - సాహసించవలసినవి, సాహసించదగినవి కావు.

ఇక్కడ తులాదండ సూత్రమే పెద్ద రాక్షసి. తులాదండసూత్రం - పెట్టుబడి పెట్టటానికి అప్పుచేయ్యటం - విధ్వంసానికి దారితీస్తుంది. నిరంతరంగా మనలో మెదిలే ఆశావాదం మధ్యలో కలగగల విధ్వంసాన్ని కప్పివేస్తుంది. అప్పుడు మన సాహసంలో దాగిఉన్న విధ్వంసాన్ని మనం తప్పు - తక్కువ - అంచనా వేస్తాం. గత దశాబ్దంలో ఇళ్ళధరలు 30% శాతం పడిపోయ్యాయి. కొన్ని సంస్థలు అప్పులు తీర్చలేక పోయ్యాయి. స్వామ్యవాదం అంటే అదే. అలా జరగటం సాధారణం. పెద్దపెద్ద తులాదండాలతో పరుగులు తీస్తున్నవారు ద్విగుణీకృతంగా చతికిల బడ్డారు. వారు బికారులుగా మిగలటమే కాక, అవకాశం మళ్ళీ తలెత్తినప్పుడు ఆటలో ప్రవేశించే అవకాశం కూడా లేకుండా పోయింది. 2009 లో పూర్తిగా నష్టపోయిన గృహనిర్మాత 2010లో తనఖారేట్లు తగ్గినప్పుడు వ్యాపారంలో తిరిగి అడుగుపెట్టలేక పోయ్యారు. 2009 లో రుణాలు చవక అయిన సమయంలో లెమన్ బ్రదర్స్ కి పెట్టుబడిపెట్టే అవకాశం లేకపోయింది. అప్పటికే వారు పూర్తిగా నష్టపోయి ఉన్నారు.

ఇది వివరించాలంటే, నా సొమ్ము రెండు భాగాలుగా (బార్ బెల్ మీద రెండు వైపులా పెట్టిన బరువులలాగా) విడదీసి ఉంటుంది. ఒకవైపు నేను రిస్క్ తీసుకుంటాను. రెండవ వైపు అంటే నాకు చచ్చేటంత భయం. ఇది పొసగని వ్యాపారం ఏమీ కాదు. కానీ డబ్బు మనస్తత్వం అలా నమ్మిస్తుంది. నేను చేసే సాహసాలు ఫలించేవరకూ నేను తట్టుకో గలగాలి అని నా ఉద్దేశ్యం. బతికి ఉంటేనే కదా బలుసాకయినా తినగలిగేది? ఈ పుస్తకంలో ఈపాటికే కొన్నిసార్లు పునరావృతం అయిన అంశం: మీరు చెయ్యదలచుకున్నది, ఎప్పుడు చెయ్యదలచుకున్నారో, ఎంతకాలం చెయ్యదలచుకున్నారో, చెయ్యగలిగితే, దానివల్ల కలిగే ఆదాయం అనంతం.

---

పొరపాటుకు అవకాశం ఉన్నదని జాగ్రత్త పడటంవల్ల మీ లక్ష్యాన్ని సాధించే

అవకాశాలు పెరుగుతాయి. మనకు జీవితంలోనూ వ్యాపారంలోను అనుకోని దుర్భర సంఘటనలు ఎదురుకావటం సహజం. అటువంటి సమయాలలో ఈ ముందు జాగ్రత్త మిమ్మల్ని ప్రమాదంనుంచి కాపాడుతుంది.

రెండవ ప్రపంచయుద్ధంలో స్టాలిన్ గ్రాడ్ యుద్ధం చరిత్రలో అన్నిటికంటే పెద్ద యుద్ధం. ఆ ప్రమాదంలో జనం ఎలా వ్యవహరించారో చెప్పే కథలు గగుర్పొడిచేవిగా ఉంటాయి.

వాటిలో ఒకటి 1942 లో వచ్చింది. ఊరిబయట పచ్చిక మైదానాలలో ఒక జర్మన్ టాంక్ యూనిట్ రిజర్వ్ లో ఉన్నది. క్లిష్టపరిస్థితులలో అగ్రశ్రేణిలో టాంకులు అత్యవసరమైనప్పుడు ఎవరికీ అంతుబట్టనిది ఏదో జరిగింది. రిజర్వ్ లో ఉన్న టాంక్ ఒక్కటికూడా పనిచెయ్యలేదు!

ఆ యూనిట్ లో ఉన్న 104 టాంక్ లలో 20 కూడా సరిగా పనిచెయ్యలేదు. అక్కడి ఇంజనీర్లు అందుకు కారణం వెంటనే కనుక్కున్నారు. చరిత్రకారులు విలియం క్రేగ్ వ్రాస్తారు: "అగ్రశ్రేణుల వెనక ఉండటం వల్ల ఆ టాంక్‌లకు వారాల తరబడి పనిలేకపోయింది. పొలాల్లో తిరిగే ఎలుకలు ఆ టాంక్‌లలో ప్రవేశించి గూళ్ళు కట్టుకున్నాయి. ఎలక్ట్రికల్ సిస్టమ్స్ మీది ఇన్సులేషన్ కవరింగ్ కొరికి పారేశాయి.

జర్మన్ యంత్రాలు ప్రపంచమంతటిలోనూ అత్యంత అధునాతనమైనవని ప్రసిద్ధి. చివరికి అవికూడా ఎలుకలకు దాసోహమయ్యాయి.

వాళ్ళ నమ్మలేనితనాన్ని మీరు ఊహించలేరు. ఈ విషయం వారికెవరికీ తట్టలేదు. యుద్ధానికి కావలసిన టాంక్ లు డిజైన్ చేసేవారికి ఎలుకలబారి నుంచి రక్షణ ఏర్పాటుచేయ్యాలని ఎలా తట్టుతుంది? ఆ అవకాశమే లేదు. ముఖ్యంగా టాంక్ చరిత్ర చదివి ఉంటే ఆ ఆలోచన కలలో కూడా రాదు.

కాని ఎప్పుడూ ఇలాంటివే జరుగుతూ ఉంటాయి. మీరు అన్నిరకాల ప్రమాదాలనుంచీ రక్షణ ఏర్పాటు చేయవచ్చు. మీ మనసుకు తట్టని వెర్రి విషయాలకు మీరు రక్షణ కల్పించలేరు. కానీ ఆ వెర్రి సంఘటనలే చెప్పరానంత హానికి కారణమవుతాయి.మీరు అనుకున్నదానికంటే తరుచుగా అవి సంభవిస్తాయి. వాటితో ఎలా వ్యవహరించాలో మీకు ముందుచూపు లేదు, ఉండటం అసంభవం కూడా.

2006లో వారెన్ బుఫే తన స్థానం ఆక్రమించగల మరొక వ్యక్తికోసం వెతుకుతున్నట్లు ప్రకటించారు. "ఘాతుకమైన రిస్కులు ముందే గుర్తించి –వాటిలో అంతకు మునుపు ఎన్నడూ జరగని రిస్కులు కూడా ఉండవచ్చు-వాటిని వంశానుగతంగా తప్పించుకోగల సామర్థ్యం ఉన్న వ్యక్తి" కావాలని చెప్పారు.[45]

ఈ నైపుణ్యం నేను మా సంస్థ కొలాబరేటివ్ ఫండ్ ఆరంభదశలో గమనించాను. ఏ వ్యవస్థాపకులనైనా వారు ఎదుర్కోబోయ్యే పెద్ద రిస్కులు ఏమిటో జాబితా వ్రాయమనండి. మామూలు జాబితా బయటికి వస్తుంది. సంస్థ ఆరంభదశలో ఎదురయ్యే సమస్యలు కొన్ని తెలుసు. అవి కాక మేము మా సంస్థలలో ఎదుర్కొన్న సమస్యలు కొన్ని:

- నీళ్ళ పైపులు పగిలిపోయి, కంపెనీ ఆఫీసును వరద ఎత్తించి సర్వనాశనం చేశాయి.
- కంపెనీ ఆఫీసులో మూడుసార్లు దొంగలు జొరబడ్డారు
- ఉత్పాదన సంస్థలోనుంచి ఒక కంపెనీని తన్ని బయటికి తగలేశారు
- ఒక కస్టమర్ హెల్త్ డిపార్ట్ మెంట్ కు ఫిర్యాదు చెయ్యటంతో ఒక స్టోర్ మూత బడింది. మరొక కస్టమర్ తన కుక్కతో లోపలికి రావటం ఆమెకు గిట్టలేదు.
- విరాళాలు సేకరిస్తున్న సమయంలో CEO ఇ-మెయిల్ ఎవరో డూప్లికేట్ సృష్టించారు.
- ఒక వ్యవస్థాపకులకు మానసిక వ్యాధి వచ్చింది.

ఈ సంఘటనలలో చాలామటుకు కంపెనీ భవిష్యత్తులో ఉండి తీరుతాయి. కానీ ఎవరూ వీటిని ఊహించలేదు. ఎందుకంటే ఈ సంఘటనలలో ఈ ఒక్కటీ ఇంతవరకూ ఆ సంస్థ నిర్వహిస్తున్న సి ఇ ఓ అనుభవంలోకి రాలేదు. ఆయనేకాదు ఆ సంస్థ నిర్వాహకులలో ఎవరి అనుభవంలోకీ రాలేదు. అది అంతకు పూర్వం ఎవరూ అడుగు పెట్టని ప్రదేశం.

ఈ అజ్ఞాతప్రమాదలను తప్పించుకోవటం ఎవరికైనా సరే అసాధ్యం. మీరు ఊహించలేని దానిని ఎదుర్కోవటానికి మీరు సంసిద్ధులుగా ఉండరుకదా!

ఏదైనా జరగవలసి ఉంటే అది జరిగి తీరుతుంది అనేదే జీవితంలో

చాలా విషయాలకు వర్తించే సూత్రం. అనేక సంఘటనలు ఒక్క పరిస్థితిమీద ఆధారపడి ఉంటే, ఆ ఒక్క పరిస్థితీ తలకిందులైతే, మీరు సర్వ నాశనానికి రోజులు లెక్కపెడుతున్నారన్నమాట. వైఫల్యానికి అది ఏకైక మూలం.

ఈ ఏకైక మూలకారణాలను తప్పించుకోవటంలో కొందరు అతిసమర్థులు. విమానాలలో క్లిష్ట వ్యవస్థలన్నిటికీ వెనుకదన్ను ఉంటుంది. ఆ వెనకదన్నుకు మళ్ళీ వెనకదన్ను ఉంటుంది. ఆధునిక జెట్ విమానాలలో అవసరానికి మించి నాలుగు ఎలక్ట్రికల్ సిస్టమ్స్ ఉంటాయి. విమానం ఒక్క ఇంజిన్ తోనే గాలిలో ఎగరగలదు. సాంకేతికంగా ఒక్క ఇంజిన్ తోనే లాండింగ్ చెయ్యగలదు. ప్రతిఒక్క జెట్ రన్ వే మీద ఇంజన్లు రివర్స్ చేయకుండానే ఒక్క బ్రేక్స్ సహాయంతోనే ఆపవచ్చు. అలాగే సస్పెన్షన్ బ్రిడ్జ్ లలో చాలా తీగెలు తెగిపడినా బ్రిడ్జ్ పడిపోదు.

తాత్కాలిక అవసరాలకు కేవలం జీతం మీదనే ఆధారపడుతారు. భవిష్యత్తులో కలిగే అవసరాలను ఆదుకోవటానికి మీరు ఏమీ పొదుపు చేయలేదు. డబ్బువిషయంలో అన్నిటినీ కుప్పకూల్చే ఏకైక బలహీనత అదే.

అత్యంత ధనవంతులు కూడా తరుచూ ఉపేక్షించే కీలక విషయాన్ని గురించి మనం పదవ అధ్యాయంలో చెప్పుకున్నాం: పొదుపు చేయటానికి ప్రత్యేకించి ఒక కారణం ఏమీ అక్కర్లేదనీ. ఒక కారుకోసం, ఇంటికోసం లేదా రిటైర్మెంట్ కోసం దేనికోసమైన పొదుపు చేయవచ్చు. దానితోబాటు మీరు ఊహించని, ఆశించని విషయాలకోసంకూడా – పొలాల్లో ఎగబడే ఎలికలలాగా – పొదుపు చెయ్యటం అంతే ముఖ్యం.

మీరు పొదుపుచేసిన సొమ్ము దేనికోసం వినియోగించ బోతున్నారో మీకు ముందుగానే తెలిస్తే, భవిష్యత్తులో మీకు రాబోయ్యే ఖర్చులనుగూర్చి మీకు ఖచ్చితంగా తెలుసునన్నమాట. కానీ ఆ విషయం ఎవరికీ తెలియదన్నమాట తథ్యం. నేను చాలా పొదుపు చేస్తాను. భవిష్యత్తులో ఆ సొమ్ము దేనికి ఉపయోగించబోతున్నానో నాకు ఎంతమాత్రమూ తెలియదు. మనకు తెలిసిన అవసరాలకు చేసే ఆర్థిక పథకాలలో తగినంత సేఫ్టీ మార్జిన్ ఉంటుంది. అందువల్ల ఈ వాస్తవ ప్రపంచంలో నెగ్గుకు రాగలుగుతాము.

మన పథకం ఆశించిన ప్రకారం జరగకపోతే, ఏమిచెయ్యాలి అనే ప్రత్యామ్నాయమే ప్రతిఒక్క పథకంలోనూ అతిముఖ్యమైన అంశం.

అది మీకు ఎలా వర్తిస్తుందో ఇప్పుడు చెప్తాను.

# 14.
# మీరు మారుతారు

---

దీర్ఘకాల ప్రణాళిక కనిపించేదానికంటే
కష్టతరం. మనుషుల లక్ష్యాలు, కోరికలు
కాలంతో పాటు మారుతూ వుంటాయి.

---

నేను ఒక స్నేహితుడితో కలిసి పెరిగాను. అతను ఉన్నవాడూ కాదు, తెలివితేటలు గలవాడూ కాదు. కాని, నాకు తెలిసిన వారందరికంటే కష్టపడి పనిచేసేవాడు. వాళ్లదగ్గర నేర్చుకోవలసింది చాలా ఉన్నది. విజయానికి బాటలో వారికి ప్రతిఒక్క అంగుళమూ కొట్టినపిండి.

కిశోరప్రాయంలో డాక్టర్ కావాలనేదే అతని స్వప్నము, ధ్యేయము. పరిస్థితులు అతనికి ప్రతికూలంగా ఉన్నాయనటం అతనిని చాలా కనికరించి చెప్పటమన్నమాట. సామాన్య మనుషులెవరికీ అది సాధ్యంగా తోచలేదు.

కాని అతను పట్టువదలకుండా తన కృషి కొనసాగించాడు. వయసులో అతను తన తోటి విద్యార్థులకంటే పదేళ్ళు పెద్ద. కాని చివరికి అతను డాక్టర్ అయ్యాడు.

కేవలం ఒట్టిచేతులతో మొదలుపెట్టి, మెడికల్ కాలేజిలో అష్టకష్టాలతో నెట్టుకువచ్చి, అన్నీ విపరీత పరిస్థితులను ఎదుర్కొని అత్యంత గౌరవప్రదమైన వృత్తికి అర్హత సాధించటమంటే ఎంత సంతృప్తి?

కొన్ని సంవత్సరాల క్రితం నేను అతనితో మాట్లాడటం జరిగింది. ఆ సంభాషణ ఇలా నడిచింది:

నేను: "మనం మాట్లాడుకొని చాలాకాలమైంది. ఎలా ఉన్నావు..."

అతను: "భయంకరమైన వృత్తి..."

నేను: "బాగుంది...."

అతను: "ఘోరమైన వృత్తి స్వామీ..."

అలా పది నిమిషాలు గడిచాయి. ఒత్తిడితో, రోజంతా పనితో అతను దస్సిపోయ్యాడు. తన ప్రస్తుత స్థితిలో అతను చాలా నిరాశ చెంది ఉన్నాడు. పదిహేను సంవత్సరాలక్రితం ఆ స్థితి కోసమే అతను రాత్రనకా పగలనక, కృషి చేశాడు.

భవిష్యత్తులో తామేమి చెయ్యబోతున్నారో మనుషులకు తెలియదన్నది దానివెనక ఉన్న మనస్తత్వం.

జీవితంలో ఒక లక్ష్యం ఊహించటం సులువు. అది సరదాగా కూడా ఉంటుంది. జీవితంలో పోటీ, దానితోబాటు వచ్చే ఒత్తిడి, వీటితో కూడిన లక్ష్యం ఊహించటం మరొక ఎత్తు.

జీవితంలో ఆర్థిక లక్ష్యాల ప్రణాళిక మీద ఇది చాలాప్రభావం చూపుతుంది.

---

ఐదేళ్ళ వయసులో ప్రతి చిన్నారి పెద్దయినతర్వాత ట్రాక్టర్ తోలాలని ఆశపడుతాడు. మంచిపని అంటే "దుర్ర్ దుర్ర్ ...బీప్... బీప్...నేను... పెద్ద ట్రాక్టర్ ను ...వస్తున్నాను." మొదలు చివరా కూడా అలా శబ్దం చేసేదే ఆ చిన్నవాడి మనసులో మంచి ఉద్యోగమంటే.

పెద్దయిన తర్వాత చాలామంది ట్రాక్టర్ నడపటమంటే పెద్ద విషయమేమీ కాదని గ్రహిస్తారు. వాళ్ళకు బహుశా అంతకంటే పరువైనది, ఆకర్షణీయమైనది కావలసి వస్తుంది.

కనుక కిశోరప్రాయంలో వాళ్ళు లాయర్ కావాలని కలగంటారు. అప్పుడు వాళ్ళ భవిష్యత్తు నిర్ణయమైనట్లేనని వారికి తెలుసు – అని వారనుకుంటారు. లా స్కూల్. దాని ఫీజు, దాని ఖర్చు. ఇదిగో, వచ్చేస్తున్నా!

తీరా లాయరయిన తర్వాత వాళ్ళు దాదాపు రోజంతా పనిచెయ్యాల్సి వస్తుంది. భార్యా బిడ్డలతో కాలక్షేపం కాదుకదా, వాళ్ళను చూసే వీలుకూడా దొరకనంత బిజీగా ఉంటారు.

కనుక జీతం కొంత తగ్గినాసరే, అనుకూలమైన సమయంలోచేసే ఉద్యోగంలో చేరుతారు. అప్పుడు పిల్లల పెంపకం చాలా ఖర్చుతో కూడిన విషయమనీ, తమజీతమంతా దానికే సరిపోతున్నదనీ గ్రహిస్తారు. అప్పుడు ఇంట్లో ఉండి పిల్లలను చూసుకోవటానికి నిశ్చయించుకుంటారు. మంచిపని చేశామనుకుంటారు.

అప్పుడు 70 వ ఏట, జీవితమంతా ఇంట్లోనే గడపటం వల్ల రిటైర్మెంట్ జీవితానికి సిద్ధంగాలేరని గ్రహిస్తారు.

మనలో దాదాపు అందరమూ ఇటువంటి జీవనపథం లోనే కొట్టుకు పోతాం. కాలేజ్ పట్టభద్రులలో 27% మాత్రమే వారు చదివిన చదువుకు తగిన ఉద్యోగంలో ఉంటారు. ఇది ఫెడరల్ రిజర్వ్ వారి అధ్యయనం.[46] ఇంట ఉండి పిల్లలను చూసుకునే తలిదండ్రులలో 29% కి కాలేజ్ డిగ్రీ ఉంటుంది.[47] తమ చదువు వృథా అయిందని ఎవరూ బాధపడరనేది వేరే విషయం. 18 సంవత్సరాల

వయసులో ఉద్యోగ లక్ష్యాలను గురించి ఆలోచించినట్లుగానే 30 ఏళ్ళ వయసులో కొత్తగా తలిదండ్రులయినవారు జీవిత లక్ష్యాలను గురించి ఆలోచిస్తారని మనం ఒప్పుకొని తీరాలి.

ఆర్థిక ప్రణాళికలో ముందుచూపు చాలా అవసరం. కానీ పరిస్థితులు మారుతాయి. మీ చుట్టూ ఉన్న ప్రపంచము, మీ కోరికలు, మీ లక్ష్యాలు అన్నీ మారుతాయి. "రేపు ఏం జరుగుతుందో మనం చెప్పలేం." అనటం ఒకఎత్తు. భవిష్యత్తులో మీకేం కావాలో ఈనాడు మీకు తెలియకపోవటం మరొక ఎత్తు. అసలు విషయమేమిటంటే మనలో చాలామందికి వాళ్ళకు ఏం కావాలో తెలియదు. భవిష్యత్తును గురించిన మీ ఆలోచనలు ఎప్పటికప్పుడు మారుతూ ఉంటాయి. కనుక దీర్ఘకాలిక ప్రణాళికలు రచించటం చాలా దుస్సాధ్యమవుతుంది.

గతంలో తాము ఎంత మారారో జనానికి బాగా తెలుసు. కానీ వారి వ్యక్తిత్వాలు, కోరికలు, లక్ష్యాలు భవిష్యత్తులో ఎంతగా మారబోతున్నాయో వారికి తెలియదు. అంతేకాదు వారు మారబోతున్నారనికూడా అనుకోరు. ఈ స్వభావాన్నే మానసిక శాస్త్రవేత్తలు 'చారిత్రిక భ్రమ సమాప్తి' (End of History Illusion) అంటారు. హార్వర్డ్ మానసిక శాస్త్రవేత్త డేనియల్ గిల్బర్ట్ ఒకసారి అన్నారు:

> మనం భవిష్యత్తులో కాదలుచుకున్న వ్యక్తులుగా రూపొందటానికి అవసరమైన నిర్ణయాలు మనం జీవితం ప్రతిదశలోనూ చేస్తూనే ఉంటాం. చివరకు మనం ఆశించిన వ్యక్తులుగా రూపుదిద్దుకున్న తర్వాత, మనం మంచి నిర్ణయాలు చేశామని సంతోషించటం తక్కువ. కిశోరప్రాయంలో డబ్బు ఇచ్చి వేయించుకున్న పచ్చబొట్లు తుడిచివేయ్యటానికి యౌవనంలో మళ్ళీ డబ్బు చెల్లిస్తారు. యౌవనంలో ఎవరినైతే పెళ్లిచేసుకోవాలని పెరుగులు తీశారో నడివయసులో వారికే విడాకులు ఇవ్వటానికి పరుగులు తీస్తారు. నడివయసులో దేన్ని సాధించటానికి ఒళ్ళు విరుచుకున్నారో వృద్ధాప్యంలో దానిని వదిలించుకోవటానికి అంతకు మించి శ్రమపడతారు.[48]

"మనమందరమూ" ఆయన అంటారు, "ఒక భ్రమలో చరిస్తున్నాం. చరిత్ర అంటే మన వ్యక్తిగత చరిత్ర ఒక కొలిక్కి వచ్చిందనీ, మనం ఉండవలసిన స్థితికి ఇటీవలనే చేరుకున్నామనీ, మిగిలిన జీవితమంతా ఇక అలాగే

ఉండబోతున్నామనీ ఆ భ్రమ.” ఈ పాఠం నేర్చుకోవటానికి కాక, నేర్చుకోకుండా ఉండటానికి మనం సిద్ధమవుతూ ఉంటాం. గిల్బర్ట్ పరిశోధనలో 18 నుంచి 68 ఏళ్ల వయసులో ఉన్నవారందరూ భవిష్యత్తులో వారు ఎంత మారబోతున్నారనే విషయం తక్కువ అంచనా వేస్తారు.

దీర్ఘకాల ప్రణాళిక మీద ఈ స్వభావం ప్రభావం ఏమిటో ఊహించగలరు కదా! దానిని ఎప్పుడూ అనవసరంగా అడ్డగించకుండా ఉండటమే చక్రవృద్ధిలో మొదటి సూత్రం అంటారు చార్లీ మంగర్. జీవితంలో మీకు కావలసినవి - ఉద్యోగాలు, పెట్టుబడులు, ఖర్చులు, బడ్జెట్, ఇంకా ఎన్నో – మారుతూ ఉన్నప్పుడు డబ్బు ప్రణాళిక మారకుండా ఎలా ఉంటుంది? కష్టం. రోనాల్డ్ రీడ్ – ధనికుడైన ఈ కాపలా మనిషిని ఇంతకు మునుపు ఈ పుస్తకంలో కలుసుకున్నాం – వారెన్ బుఫే వంటివారు దశాబ్దాల తరబడి ఒకే పని చేశారు – చక్రవృద్ధిని స్వేచ్ఛగా కొనసాగనిచ్చారు – కనుకనే వారు విజయం సాధించారు. మనలో చాలామందిమి జీవితకాలంలో విపరీతంగా పరిణామం చెందుతాం. కనుక మనం దశాబ్దాల తరబడి – దశాబ్దాలు కాదు, అర దశాబ్దం కూడా – ఒకే పని చేస్తూ కూర్చోము. కనుక మన డబ్బుకు 80 సంవత్సరాల జీవితకాలానికి బదులు, ఇరవై సంవత్సరాల జీవితదశలు నాలుగు ఉండవచ్చు.

కొద్దిపాటి రాబడితో పొదుపుగా జీవించే యువతరం కొందరు నాకు తెలుసు. ఒక ప్రయోజనం కోసం వారు ఆ పని చేస్తున్నారు. అందులో వారు ఆనందంగా ఉన్నారు. విలాసవంతమైన జీవితం కోసం నడుములు విరిగేట్లు పనిచేసేవారు మరికొందరు ఉన్నారు. వారూ అందులో మహదానందంగా ఉన్నారు. రెండింటిలోనూ ప్రమాదం ఉన్నది. మొదటి దాంట్లో వారు కుటుంబాన్ని నడపటానికీ, రిటైర్మెంట్ కూ సిద్ధంగా లేరు. రెండవ వర్గం వారు యౌవనం, ఆరోగ్యమయమైన కాలం అంతా క్యూబికిల్ లో గడిపినందుకు విచారిస్తారు.

దీనికి ఒక సులువైన పరిష్కారం అంటూ ఏమీ లేదు. తను ట్రాక్టర్ డ్రైవర్ కాక, లాయర్ కావాలని ఎవరైనా ఐదేళ్ళ పిల్లవాడికి చెప్పి చూడండి. వాడు ససేమిరా వల్లకాదంటాడు.

మీరనుకొనే దీర్ఘకాలిక నిర్ణయాలను గురించి ఆలోచించేటప్పుడు రెండు విషయాలు మనసులో పెట్టుకోవాలి.

**ఆర్థిక ప్రణాళికలో కొసదాకా వెళ్ళకూడదు. మీరు కొద్ది రాబడితోనే సంతోషంగా ఉన్నారనుకుందాం.** లేదా అధిక రాబడికోసం నిర్విరామంగా పనిచెయ్యటానికి సిద్ధంగా ఉన్నారనుకుందాం. ఏమి చేసినా, ఏదో ఒకనాడు మీరు చేసిన పనికి విచారించే అవకాశాలు ఎక్కువవుతాయి. పరిస్థితులకు అనుగుణంగా సర్దుకుపోవటానికి జనం అలవాటుపడిపోతారు. ఏమీ లేకుండా సరళంగా జీవించటము, అన్నీ ఉండి సుఖసంతోషాలతో జీవించే పులకరింతలు కాలక్రమేణా తరిగి పోతాయి. అతిశయమైన ఈ జీవితాలలో - రిటైర్మెంట్ తర్వాతి జీవితానికి ఉపాధి లేకపోవటం, డబ్బును వెంటాడుతూ వ్యయం చేసిన జీవితం - మిగిలేది అంటిపెట్టుకొని ఉండేవి ఆ విచారాలే. అంతకు పూర్వం పథకాన్ని వదిలిపెట్టి మరొక లక్ష్యం దిశగా అంతకంటే రెట్టింపు వేగంతో - నష్టపోయిన సమయాన్ని పూడ్చాలంటే - పరిగెత్తాలనేది ఇంకా బాధాకరమైన విచారం.

ఒక ప్రణాళికను కొన్ని సంవత్సరాలపాటు, వీలైతే కొన్ని దశాబ్దాలపాటు నడిపిస్తే, చక్రవృద్ధి మహోత్తమంగా పనిచేస్తుంది. ఇది ఒక పొదుపుకే గాదు, ఉద్యోగాలకు, బాంధవ్యాలకు కూడా వర్తిస్తుంది. ఇక్కడ సహనమే కీలకం. కాలగతిలో మనమెవరము అనేది మారుతూ ఉంటుందని మీకు తెలుసు. భవిష్యత్తులో విచారించకుండా ఉండటానికీ, సహనాన్ని ప్రోత్సహించటానికీ జీవితంలో ప్రతిదశలోనూ సమతుల్యత ఒక వ్యూహమవుతుంది.

ఉద్యోగజీవితంలో సుమారైన పొదుపు, సుమారైన ఆటవిడుపు, ఇంటికి ఆఫీసుకు మధ్య సుమారైన దూరం, కుటుంబంతో సుమారైన సమయం, ఇవన్నీ కలిసి ఒక పథకాన్ని అనుసరించటానికి తోడ్పడుతాయి. అప్పుడు పైవాటిలో ఏదైనా ఒకటి అతిశయస్థాయికి చేరినా చింతించవలసిన అవసరం ఉండదు.

**మన మనసులు మారుతాయనే వాస్తవాన్ని మనం అంగీకరించాలి.** కొంతమంది ఉద్యోగులు తాము ఎందులో పనిచెయ్యాలన్న విషయం కాలేజ్ లో మేజర్ ఎంచుకునేటప్పుడు నిశ్చయించుకున్నారు. కనుక వారు ఆ ఉద్యోగంలో చాలా విశ్వాసపాత్రులుగా పనిచేస్తారు. కానీ వారు అతిదీనావస్థలో ఉంటారు. 'మందు' తాగటానికి అర్హులుకాని వయసులో మీరు ఒక ఉద్యోగం ఎంచుకున్నారు. ఆ ఉద్యోగమంటే మీకు చాలా ఇష్టం. మీరు 'చారిత్రాత్మక భ్రమ సమాప్తి' ని

అంగీకరిస్తే, సామాజిక భద్రతకు యోగ్యత సంపాదించిన వయసులో కూడా ఆ ఉద్యోగం మీద ప్రేమ ఉండటం కష్టసాధ్యం.

మార్పు సహజమని అంగీకరించి వీలైనంత శీఘ్రంగా అక్కడినుంచి కదలటమే కిటుకు.

జేసాన్ జ్వైగ్, వాల్ స్ట్రీట్ జర్నల్‌లో పెట్టుబడులను గురించిన సమాచారాలు వ్రాస్తూ ఉంటారు. ఆయన మానసిక శాస్త్రవేత్త డానియల్ కానేమన్ రచన థింకింగ్ ఫాస్ట్ అండ్ స్లో (Thinking, Fast and Slow) వ్రాయటంలో తోడ్పడ్డారు. జ్వైగ్ ఒకసారి కానేమన్ వ్యక్తిత్వంలోని వైపరీత్యాన్ని గురించి చెప్పారు. ఆ విపరీతం కానేమన్ కు బాగా ఉపయోగపడింది. "డానీ అప్పుడే చేసిన పనిని చెత్తబుట్టలో వెయ్యటంలో నేర్పరి. ఆయనలో ఆ సామర్థ్యం నన్ను చకితుణ్ణి చేసింది." అని వ్రాశారు జ్వైగ్. ఆయన, కానేమన్ ఒక అధ్యాయం మీద అపారంగా కృషిచేసి ఉండవచ్చు. కానీ:

> మరుక్షణం ఆయన కానేమన్ గుర్తుపట్టటానికి వీలులేని మరొక రూపం పంపిస్తారు. అది భిన్నంగా ఆరంభమవుతుంది. అంతకంటే భిన్నంగా ముగుస్తుంది. అందులో మీరు కనీవినీ ఎరగని ఉపాఖ్యానాలు, రుజువులు ఉంటాయి. మీరు కనీవినీ ఎరగని పరిశోధనలో నుంచి సంగ్రహణం ఉంటుంది.

"ఇంతకు మునుపు ఎన్నడూ వ్రాయనట్లు కొత్తగా మొదలు పెట్టి ఎలా వ్రాయగలుగుతున్నారు? అని నేనాయననడిగాను." జ్వైగ్ చెప్తారు. "ఆయన మాటలు నేను ఎన్నటికీ మర్చిపోలేదు: 'అందులో నేనేమీ పాతిపెట్ట లేదు.'"[49]

పాతిపెట్టిన ఖర్చులు – గతంలో చేసిన ప్రయత్నాలకు ముడిపడి ఉన్న నిర్ణయాలు – మనుషులు అనుక్షణమూ మారుతున్న ఈ ప్రపంచంలో అవి రాక్షసులు. అవి మన భావి వ్యక్తిత్వాలను గత వ్యక్తిత్వాలకు (అవి వేరు) బందీలను చేస్తాయి. అంటే ముఖ్యమైన మీ జీవిత నిర్ణయాలను ఒక అపరిచితుడు చేసినట్లే.

మీరు ఈనాటి వ్యక్తిగా కాక మరొక వ్యక్తిగా ఉన్ననాడు చేసిన ఆర్థిక నిర్ణయాలు నిర్దాక్షిణ్యంగా బహిష్కరించాలి. వాటిని పట్టుకు వేలాడటం వృధా ప్రయాస. అప్పుడే భవిష్యత్తులో మీ విచారం క్షీణించే అవకాశం ఉన్నది.

అది ఎంత త్వరగా చేస్తే మీరు అంత శీఘ్రంగా చక్రవృద్ధిని చేరుకోగలరు.

ఇప్పుడు చక్రవృద్ధిలో ప్రవేశానికి రుసుము ఎంతో పరిశీలిద్దాం.

# 15.
# ఏదీ ఉచితం కాదు

---

ప్రతి దానికి ఒక వెల ఉన్నది. కానీ అన్నీ వెలలూ
చీటి మీద కనపడవు.

---

ప్రతి దానికీ ఒక వెల ఉన్నది. డబ్బుతో కూడిన విషయాలలో చాలామటుకు ఆ వ్యవహారం వెల ఎంతో తెలిసిఉండటం, ఆ వెల చెల్లించటానికి సిద్ధంగా ఉండటమే కీలకం.

చాలావిషయాలలో ప్రత్యక్షంగా అనుభవంలోకి వచ్చినదాకా వెల తెలియకపోవటమే సమస్య. అప్పటికి బిల్లు గడువు దాటి ఉంటుంది.

---

2004 లో జనరల్ ఎలెక్ట్రిక్ ప్రపంచంలోకెల్లా పెద్ద సంస్థ. ఆనాడు ఆ సంస్థ విలువ సుమారు 350 బిలియన్ డాలర్లు ఉండవచ్చు. ఆ కిందటి దశాబ్దం అంతా ప్రతిసంవత్సరమూ మొదటి రెండు స్థానాలలో ఉండేది. సంస్థ ఆధిపత్యంలో ధనిక స్వామ్యం ధ్రువతార.

ఒకనాడు అంతా ఛిద్రమై పోయింది.

2008 నాటి ఆర్థిక సంక్షోభం జనరల్ ఎలక్ట్రిక్ ఆర్థిక విభాగాన్ని - సంస్థ లాభాలలో సగానికి పైగా గడించే విభాగం - గందరగోళం చేసింది. చివరికి అది తుక్కుగా అమ్ముడు బోయింది. తర్వాత ఆయిల్, ఎనర్జీలలో పెట్టుబడులు ఉత్పాతాలయ్యాయి. బిలియన్లకొద్దీ డాలర్లు రద్దు చేయాల్సి వచ్చింది. 2007లో 40 డాలర్లు ఖరీదు చేసే GE స్టాక్ 2018 లో 7 డాలర్లకు పడిపోయింది.

దీనికంతటికీ నేరం CEO జెఫ్ ఇల్‌మెట్ నెత్తిన రుద్దబడింది. 2001 నుంచీ ఆయన సంస్థను నడుపుతున్నారు. తక్షణం కఠిన చర్య అయింది. ఆయన నాయకత్వం, ఆయన కొనుగోళ్ళు, షేర్లమీద ఆదాయంలో కోత, పనివారిని తీసివెయ్యటం, అన్నిటికీ మించి స్టాక్ ధర పతనం అన్నీ విపరీతమైన విమర్శలకు లోనయ్యాయి. అది సబబే కదా. రోజులు బాగున్నప్పుడు వంశపారంపర్యంగా సరిపడా సంపద పురస్కారంగా పొందినవారు, రోజులు బాగాలేనప్పుడు ఆ భారం వహించాలి కదా. ఆయన 2017 లో తన పదవి నుంచి నిష్క్రమించారు.

వీడ్కోలు సమయంలో ఆయన ఒక ఆలోచించదగిన విషయం చెప్పారు.

ఆయన తప్పులు చేశారనీ, ఆయన చెయ్యవలసింది చాలా స్పష్టంగా ఉన్నదనీ అంటున్న విమర్శకులకు సమాధానంగా ఆయన తన వారసుడికి చెప్పారు: "మీరు చెయ్యనక్కర్లేకపోతే ప్రతిఒక్క పనీ సులువుగానే కనబడుతుంది."

చేసేది మీరు కాకపోతే ప్రతిపనీ సులభంగానే కనబడుతుంది. అసలు పనిచేస్తున్నవారు ఎదుర్కొనే సమస్యలు బయటివారికి కనబడవు.

విస్తరిస్తున్న పరిమాణం, తాత్కాలిక పెట్టుబడిదారులు, కట్టడిదారులు, యూనియన్లు, అధికారవర్గం, వీరందరి ఆకాంక్షలు, ఆశయాలు పరస్పర విరుద్ధాలు. వాటితో నెగ్గుకురావటం సామాన్యం కాదు. స్వయంగా వ్యవహరిస్తేతప్ప వాటి తీవ్రత, జటిలత అర్థం కాదు. ఇమ్మెల్ట్ వారసుడు ఈ విషయం బాగా తెలుసుకున్నారు. ఆయన పధ్నాలుగు నెలలలోనే పదవినుంచి నిష్క్రమించారు.

ఏదైనా సిద్ధాంతరీత్యా అందంగా దర్శనమిస్తుంది. ఆచరణలోనే దాని అసలు రూపం తెలుస్తుంది. అందుకే 'చెప్పుట సులభము చేయుట కష్టము' అన్నారు. మన అతిధైర్యంవల్ల కూడా ఇలా జరుగుతుంది. అన్నిటినీ మించి ఆ విజయానికి మూల్యం ఎంతో ఏమిటో మనం గుర్తించలేకపొయ్యామన్నమాట. మనల్ని ఆ మూల్యం చెల్లించ నియ్యకుండా అడ్డుపడేది అదే.

---

S&P 500 కి 2018 నాటికి 50 సంవత్సరాలు నిండాయి. ఈ 50 సంవత్సరాలలో ఆ సంస్థ 119 రెట్లు పెరిగింది. మీరు చెయ్యవలసిందల్లా హాయిగా కుర్చీలో వెనక్కివాలి కూర్చుని మీ డబ్బు చక్రవృద్ధి చెందుతూ ఉంటే చూసి ఆనందించటమే. సఫలత సాధించే పెట్టుబడి సులువుగానే కన్పిస్తుంది – చేసేది మీరు కాకపోతే.

"స్టాక్స్ ఎక్కువకాలం నిలవ ఉంచాలి." మామూలుగా వినిపించే సలహా. అది మంచి సలహాయే.

కానీ స్టాక్స్ పడిపోతుంటే వాటిని పట్టుకు కూర్చోవటం ఎంత కష్టమో మీకు తెలుసా?

విలువైన వాటన్నిటిలాగానే, పెట్టుబడిలో విజయానికి కూడా ఒక

మూల్యం చెల్లించాలి. కానీ ఆ మూల్యం డాలర్లు, సెంట్లలో కాదు - చపలత్వం, భయం, సందేహం, అనిశ్చిత పరిస్థితి, చింతలతో చెల్లించాలి. మామూలు సమయాలలో వీటన్నిటినీ గురించి పట్టించుకోము. ఉపేక్షిస్తాము.

పెట్టుబడికి కూడా ఒక మూల్యం చెల్లించాలనే విషయం గుర్తించలేకపోతే, మనం ఉచితంగా లాభాలు సంపాదించే ప్రలోభానికి గురవుతాం. దొంగతనం లాగానే అది ఎన్నడూ సుఖాంతం కాబోదు.

మీకు ఒక కొత్త కారు కావాలనుకుందాం. దాని ఖరీదు 30,000 డాలర్లు. ఇప్పుడు మీకు మూడు అవకాశాలు ఉన్నాయి. 1) దానికి 30,000 డాలర్లు చెల్లించటం, 2) చవకలో సెకండ్ హ్యాండ్ కారు కోసం వెతకటం, 3) దొంగతనం చెయ్యటం. ఇక్కడ నూటికి 99 మందికి మూడవ అవకాశం వైపు పోకూడదని తెలుసు. అందువల్ల కలిగే ఫలితాలు ప్రయోజనాలకంటే భయంకరంగా ఉండవచ్చు.

అలా కాకుండా - రిటైర్ అయిన తర్వాత ప్రశాంత జీవితం గడపటానికి సాలీనా 11% ఆదాయం వచ్చే మార్గం ఎంచుకున్నారనుకోండి. ఈ ప్రతిఫలం ఉచితంగా వస్తుందా? ఎంతమాత్రమూ కాదు. ఈ ప్రపంచం అంత ఉదారం ఏమీ కాదు. దానికీ ఒక మూల్యం ఉన్నది. ఆ బిల్లు కట్టి తీరాలి. ఇక్కడ మార్కెట్ నుంచి అనుక్షణమూ ఎకసెక్కమే. మార్కెట్ నుంచి మీకు ఎంత అధికంగా రాబడి ఇస్తుందో అది అంత త్వరగానూ తిరిగి తీసుకుపోతుంది. 1950 నుంచి 2019 దాకా ప్రతిసంవత్సరమూ 11% లాభాలు ఇచ్చిన 'డౌ జోన్స్' ఇండస్ట్రియల్ యావరేజ్' కూడా ఇందుకు అతీతం ఏమీ కాదు. కానీ ఈ కాలంలో ఆ సఫలతకు మూల్యం ఊహాతీతం. చార్ట్ లో మసకగా కనిపించే రేఖలు ఆ లాభాలు గతంలో వచ్చిన అత్యుత్తమ లాభాలకంటే 5% తక్కువ అని చెబుతాయి.




మార్కెట్‌లో లాభాలు సంపాదించాలంటే మూల్యం ఇదీ. అందులో అడుగు పెట్టటానికి చెల్లించవలసిన ఫీజు. అది కొరికి తినేస్తుంది.

అన్ని వస్తువులలాగానే లాభాలు ఎక్కువకావాలంటే ధర ఎక్కువ పెట్టాలి. 2002 నుంచి 2018 వరకూ నెట్ ఫ్లిక్స్ స్టాక్స్ 35,000% లాభాలు గడించాయి. కానీ 94% సమయం గతంలో అత్యున్నత ధరకంటే తక్కువ ధరలో వ్యాపారం జరిపాయి. 1995 నుంచి 2018 వరకూ మాన్స్టర్ బెవరేజ్ (Monster Beverage) 319,000% లాభాలు తెచ్చి ఇచ్చింది. అవి చరిత్రలోనే అత్యధిక లాభాలు. కానీ తనుకూడా 95% సమయం గతంలో అత్యున్నత ధరలోపునే వ్యవహరించింది.

అసలు విషయం ఇక్కడే ఉన్నది. మీరు కొనదలిచిన కారులో లాగానే ఇక్కడ కూడా కొన్ని ఎంపికలు ఉన్నాయి. కిందా మీదా అవుతుందని తెలిసి మీరు మూల్యం చెల్లించవచ్చు. లేదా అనిశ్చితి తక్కువగా ఉండి కొంచెం తక్కువ లాభాలు ఇచ్చే స్టాక్స్ కోసం చూడవచ్చు. ఇది సెకండ్ హ్యాండ్ కారు కొనటం

లాంటిది. లేదా ఘనచౌర్యానికి(కారు) పాల్పడవచ్చు: అందులో ఉన్న అనిశ్చితి తప్పించుకొని లాభాలు మాత్రమే సంపాదించే ప్రయత్నం.

పెట్టుబడి పెట్టేవారిలో ఎక్కువమంది మూడవ ఎంపికవైపు మొగ్గుతారు. వారి ఉద్దేశ్యాలు మంచివే. వారు న్యాయాన్ని అనుసరిస్తారు. కానీ దొంగలాగా వారు ధర చెల్లించకుండా లాభాలు సంపాదించటానికి కొన్ని కిటుకులు, వ్యూహాలు పన్నుతారు. వారివ్యాపారం ఇంటా బయటా తిరుగుతూ ఉంటుంది. ధరలు పడిపోకముందే అమ్మటానికి ప్రయత్నం చేస్తారు. ధరలు పెరగక మునుపే కొనటానికి ప్రయత్నం చేస్తారు. ఏమాత్రం అనుభవం ఉన్న పెట్టుబడిదారులైనా అనిశ్చితి యదార్థమనీ, సాధారణమనీ తెలుసు. కానీ చాలమంది దానిని తప్పించుకోవటానికి ప్రయత్నం చేస్తారు.

కానీ ధర చెల్లించకుండా వస్తువు దోచుకు పోదామనే వారిని ఐశ్వర్య లక్ష్మి దయతలచదు. కొంతమంది దొంగలు తప్పించుకు పోవచ్చు. చాలామంది పట్టుబడి శిక్ష అనుభవిస్తారు.

పెట్టుబడిలో కూడా అంతే.

మార్నింగ్ స్టార్ ఒకసారి టాక్టికల్ మ్యూచువల్ ఫండ్స్ ఎలా పనిచేస్తున్నాయో పరిశీలించింది. అనుకూల సమయాలలో స్టాక్స్, బాండ్స్ మధ్య మారుతూ తక్కువ రిస్క్ తో ఎక్కువ లాభాలు గడించమే ఇక్కడ ధ్యేయం.[50] అంటే వారు మూల్యం చెల్లించకుండానే ఆదాయం ఆశిస్తున్నారన్నమాట. ఈ అధ్యయనం 2010 మధ్య నుంచి 2011 ఉత్తరార్థం వరకూ జరిగింది. అప్పుడు మరొక ఆర్థిక మాంద్యం వస్తుందనే భయంతో US మార్కెట్లన్నీ గజగజలాడుతున్నాయి. S & P 500 స్టాక్స్ 20% కుపైగా పడిపోయ్యాయి. టాక్టికల్ ఫండ్స్ వ్యవహరించేది ఇటువంటి పరిస్థితులలోనే. వారు ధగద్ధగాయమానంగా మెరిసే సమయం అదే.

మార్నింగ్ స్టార్ లెక్క ప్రకారం ఆ సమయంలో 112 టాక్టికల్ మ్యూచుయవల్ ఫండ్స్ నడుస్తున్నాయి. మామూలుగా స్టాక్ - బాండ్ ఫండ్ 60/40 నిష్పత్తిలో ఉంటుంది. రిస్కుకు అంతకంటే మేలుగా సర్దుబాటు ఉన్న

సంస్థలు తొమ్మిది మాత్రమే ఉన్నాయి. టాక్టికల్ ఫండ్స్ లో చాలా కొద్ది మాత్రమే లీవ్ ఇట్ ఎలోన్ ఇండెక్స్ కంటే తక్కువ పతనం అయ్యాయి. మార్నింగ్ స్టార్ వ్రాసింది: "అతిశయమైన ఏ కొద్దో తప్ప టాక్టికల్ ఫండ్స్ లాభించింది తక్కువ, మామూలు ఫండ్ కంటే ఎక్కువ ఆటుపోటులకు లోనయ్యాయి. వారి రిస్క్ ఇతర స్టాక్స్ రిస్క్ కంటే తక్కువేమీ కాదు."

పెట్టుబడిదారులు కూడా తమ స్వంత సొమ్ము పెట్టుబడి పెడుతున్నపుడు ఈ ప్రలోభానికి లోనవుతారు. స్టాక్స్ కొని ఉంచకుండా, తరుచూ అమ్మకం, కొనుగోలు చెయ్యటం వల్ల రాబడి సాలీనా 0.5% తగ్గుతుంది.[51]

ఖర్చు తప్పించుకోవటానికి ప్రయత్నించే పెట్టుబడిదారులు చివర్లో రెట్టింపు ధర చెల్లిస్తారు.

GE కి తిరిగి వద్దాం. GEలో చాలా లోపాలు ఉన్నాయి. వాటిలో మాజీ CEO జాక్ వెల్ష్ కాలంలో ఒక పెద్ద తప్పు జరిగింది. ప్రతి క్వార్టర్ లోనూ GE స్టాక్స్ సంపాదన వాల్ స్ట్రీట్ అంచనాలను మించేట్లు చేయటంలో వెల్ష్ ప్రసిద్ధులయ్యారు. అప్పుడు ఆయనే సర్వాధిపతి. ఒక్కొక షేర్‌కు 0.25 డాలర్లు లాభాలు వస్తాయని వాల్ స్ట్రీట్ అంచనా అయితే, వ్యాపారస్థితి, ఆర్థికస్థితి ఎలా ఉన్నసరే, ప్రతి ఒక్క షేర్‌కు కనీసం 0.26 డాలర్లు లాభం వచ్చేట్లు చూడటం జాక్ ధ్యేయం. అంకెలకు మర్దనం చేసి ఆ ఫలితాలు సాధిస్తారు ఆయన. రాబోయ్యే క్వార్టర్లలో లాభాలు ఈ క్వార్టర్లోకి ఈడ్చుకువచ్చి అంకెల గారడీ చేసే వారాయన. అంకెలు విధేయంగా ఆయనకు సెల్యూట్ చేసేవి.

ఫోర్బ్స్ (అనేక ఉదాహరణలలో) ఒక ఉదాహరణ ప్రకటించింది. "జనరల్ ఎలక్ట్రిక్ రెండు సంవత్సరాలుగా లోకోమోటివ్‌లు, అసలు వినియోగదారులకు కాక, అనామక ఆర్థిక భాగస్వాములకు అమ్మింది. దానివల్ల స్వంతదారులకు అంట వలసిన రిస్క్ GE కే అంటుకుపోయి ఉన్నది.[52]

వెల్ష్ ఈ వ్యూహాన్ని ఎన్నడూ నిరాకరించలేదు. 'స్ట్రెయిట్ ఫ్రమ్ ది గట్' అన్న తన పుస్తకంలో ఆయన వ్రాస్తారు.

సంస్థలో ఆపత్కర సమయాలలో వ్యాపారవేత్తల ప్రతిస్పందన GE సంస్కృతిని ప్రదర్శిస్తుంది. ఆ క్వార్టర్‌కు ఎకౌంట్ బుక్స్ అన్నీ మూతబడి ఉండవచ్చు. లాభాలలో లోపాన్ని పూడ్చటానికి మా నాయకులలో చాలామంది చేయూతనివ్వటానికి తక్షణం సిద్ధంగా ఉండేవారు. ఒకరు 10 మిలియన్ డాలర్లు ఇస్తానంటే మరొకరు 20 మిలియన్, ఇంకొకరు 30 మిలియన్ తమ వ్యాపారాలలోనుంచి తెచ్చి ఇచ్చేవారు. అప్పుడు ఆ ఆపదనుంచి తాత్కాలికంగా గట్టెక్కేవాళ్ళం.

ఏతావాతా వెల్ష్ నాయకత్వంలో స్టాక్ హోల్డర్లకు మూల్యం చెల్లించవలసిన అవసరం లేకపోయింది. ఆ స్టాక్ ప్రతి సంవత్సరమూ పైపైకి వెళ్తూ ఉన్నది. మధ్యలో ఏ అఘాతాలూ లేకుండా. వాళ్ళకు కావాల్సింది అదే. నికరంగా ఏమి జరగబోతున్నదో చెప్పగలగటం. ఎప్పటిలాగా చివర్లో బిల్లు వచ్చింది. ఒక దశాబ్దం కాలం G E షేర్ హోల్డర్లు విపరీతంగా నష్టానికి గురయ్యారు. ఇవన్నీ అంతకు పూర్వం ఎకౌంటింగ్ సర్కస్ తో కప్పిపుచ్చబడ్డాయి. వెల్ష్ యుగంలో పెన్నీలలో వచ్చిన లాభం డాలర్ల నష్టంగా అవతారమెత్తింది.

ఫ్రెడ్డీ మాక్ & ఫానీ మే ఈ ప్రక్రియలో వింత ఉదాహరణ. వారు మార్ట్ గేజ్ వ్యాపారంలో అతిపెద్ద సంస్థ. 2000 పూర్వార్థంలో వారు పట్టుబడ్డారు. ఆనాటి వారి సంపాదన బిలియన్లలో తక్కువగా చూపినందుకు పట్టుకున్నారు. గోప్యంగా దాచిన ఆ సొమ్మంతా భవిష్యత్తులో సర్దుబాటు చేస్తే పెట్టుబడిదారులకు అంతా సజావుగా నడుస్తున్నది, రేపు ఎలా ఉండబోతున్నదో చెప్పవచ్చుననే భావన కలిగించటానికి ఉపయోగిస్తుందని వారి దూరాలోచన.[53] మూల్యం చెల్లించనక్కర్లేదనే భ్రమ.

---

ఇక్కడ ప్రశ్న ఏమిటంటే: కార్లు, ఇళ్ళు, ఆహారం, విహారాలు వీటన్నిటికీ మూల్యం చెల్లించటానికి సిద్ధంగా ఉన్న ప్రజలు పెట్టుబడులమీద లాభాలకు అవసరమైన మూల్యం చెల్లించటానికి ఎందుకు సిద్ధంగా లేరు?

అందుకు జవాబు సరళం: పెట్టుబడిలో సఫలతకు మూల్యం వెంటనే కనిపించదు. ఇతర వస్తువులకు వేలాడగట్టిన ధర చీటీలాగా కనిపించదు. కనుక ఆ బిల్ వచ్చినప్పుడు అది ఒక మంచివస్తువుకు చెల్లించే ఫీజుగా తోచదు. ఏదో తప్పుచేసినందుకు చెల్లించే జరిమానాలాగా తోస్తుంది. ఫీజు కట్టటమంటే ఫర్వాలేదు. కానీ జరిమానాలు తప్పించుకోవాలి. మీ నిర్ణయాలు జరిమానాలు రాకుండా చూడాలి. వస్తే తప్పించుకోవటానికి మార్గం ఉండాలి. ట్రాఫిక్ ఫైన్లు, IRS ఫైన్లు అంటే మీరేదో తప్పు చేశారన్నమాట. మీరు దండనార్హులు. తమ సంపద తరిగిపోవటం, ఆ తరుగు ఒక జరిమానా అవటం చూసేవారి సహజ స్పందన భవిష్యత్తులో ఆ జరిమానాలు తప్పించుకోవటానికే.

ఇది చాలా చిన్న విషయంగా తోచవచ్చు. కానీ మార్కెట్‌లో అస్థిరత్వం ఒక జరిమానాగా కాక, ఒక ఫీజుగా దర్శించటం ఒక ముఖ్యమైన మనస్తత్వం. అప్పుడు మీ పెట్టుబడులు మీకు అనుకూలంగా పనిచేసేవరకూ కాచుకొని ఉండే సహనం మీ సొమ్ము అవుతుంది.

"నా సొమ్ములో ఒక 20% నష్టపోయినా ఫర్వాలేదు' అనే మనస్తత్వంగల పెట్టుబడిదారులు అతితక్కువమంది ఉంటారు. అంతకు మునుపెన్నడూ 20% శాతం పతనం చూడని కొత్త పెట్టుబడిదారులకు ఇది ద్విగుణీకృతంగా వర్తిస్తుంది.

కానీ, మార్కెట్ లో ఆ అస్థిరతను మీరు ఒక ఫీజుగా దర్శించ గలిగితే, పరిస్థితులు మరొకలా దర్శనమిస్తాయి.

మార్కెట్‌లో లాభాలు ఎన్నడూ ఉచితంగా రావు, రాబోవు. అన్ని వస్తువులకు లాగానే వాటికీ ధర చెల్లించాలి. మీరు డిస్నీ ల్యాండ్ కు వెళ్ళాలని బలవంతం లేనట్లే మీరు ఈ ఫీజు చెల్లించాలని బలవంతం ఏమీ లేదు. మీరు స్థానికంగా 10 డాలర్ టికెట్లతో నడుస్తున్న సంతకు వెళ్లవచ్చు. లేకపోతే ఏ ఖర్చూ లేకుండా ఇంట్లో కూర్చోవచ్చు. అప్పుడుకూడా మీరుఆనందంగానే ఉండవచ్చు. కానీ మీకు దొరికే ప్రతిఫలం మీరు చెల్లించిన రుసుముకు అనుగుణంగా ఉంటుంది. మార్కెట్లు కూడా అంతే. అస్థితరత/అనిశ్చితి ఫీజు– మీ లాభాలకు మూల్యం – పెద్దలాభాలకు ప్రవేశరుసుము వంటిది. క్యాష్, బాండ్స్ చవకబారు పార్కుల వంటివి.

మార్కెట్‌కు తగిన మూల్యం చెల్లిచటం సబబేనని మీకు మీరు నచ్చ చెప్పుకోవటమే కిటుకు. అస్థిరత/అనిశ్చితితో వ్యవహరించటానికి మార్గం అదొక్కటే. దాన్ని ఎలాగోలా భరించటం కాదు, అది చెల్లించదగిన ప్రవేశ రుసుమేనని గ్రహించటం ముఖ్యం.

అది అలా వుంటుందని గ్యారంటీ ఏమీ లేదు. డిస్నీ ల్యాండ్ లో కూడా కొన్నిసార్లు వర్షం కురుస్తుంది.

కానీ ఆ ఫీజును మీరు జరిమానాలాగా చూస్తే మీరు ఆ గారడీ ఎన్నటికీ ఆనందించలేరు.

ధర తెలుసుకోండి. చెల్లించండి.

# 16.
# మీరు
# నేను

---

మీ ఆట వేరు. వారి ఆట వేరు. ఆర్థిక రంగంలో వారి సలహాలను మెలకువతో గమనించండి.

---

**2**000 తొలిదశలో డాట్ కామ్ బుడగ పేలటంతో కుటుంబాలలో సంపద 6.2 ట్రిలియన్ డాలర్లు తగ్గిపోయింది.

ఇళ్ళ నిర్మాణం పునరారంభ మయ్యేసరికి లోతు 8 ట్రిలియన్ డాలర్లు చేరుకున్నది.

ఆర్థిక రంగంలో బుడగలు పేలిపోతే సామాజికంగా ఎంత నష్టం కలుగుతుందో చెప్పటం కష్టం. అవి జీవితాలను ధ్వంసం చేస్తాయి.

ఈ సంఘటనలు ఎందుకు జరుగుతాయి?

ఎందుకు జరుగుతూనే ఉంటాయి?

మనం అవసరమైన పాఠాలు ఎందుకు నేర్చుకోం?

మామూలుగా జనం అత్యాశపరులనేది సాధారణ సమాధానం. మానవ స్వభావంలో అత్యాశ ఎన్నటికీ చెరగని, తరగని స్వభావం.

కావచ్చు. చాలామంది ఆ సమాధానంతో తృప్తి పడవచ్చు. కానీ మొదటి అధ్యాయంలో మాటలు జ్ఞాపకం తెచ్చుకోండి. ఎవరూ వెర్రివాళ్లు కారు. జనం చేసే ఆర్థిక నిర్ణయాలవల్ల, వారు తర్వాత చింతించ వలసి వస్తుంది. అందుకు తగిన సమాచారమూ, కారణము ఏమీ లేకుండా ఆ నిర్ణయాలు జరుగుతాయి. ఆ నిర్ణయాలు చేసేటప్పుడు వారికవి సబబుగానే తోచాయి. బుడగలు పేలిపోవటానికి అత్యాశే కారణమని చెప్పి అంతటితో ఆపేస్తే ముఖ్యమైన పాఠాలు మిస్ అవుతాం. వెనక్కు తిరిగి చూసినప్పుడు అత్యాశతో కూడిన నిర్ణయాలుగా కనిపించే వాటిని ఎలా సమర్థిస్తారు, ఎందుకు సమర్థిస్తారు అనే పాఠాలు మిస్ అవుతాం.

క్యాన్సర్‌లో అయితే బయాప్సీ చేస్తే వ్యాధి నిర్ణయము, హెచ్చరిక కూడా తెలుస్తాయి. బుడగలు క్యాన్సర్ లాంటివి కావు. కనుక వాటినిగురించి ముందుగా తెలుసుకోవటం ఏమాత్రమూ సాధ్యం కాదు.రాజకీయ పార్టీ పెరుగుదల, పతనం వెనక్కి తిరిగి చూసినప్పుడే తెలుస్తాయి. అందుకు కారణం, బాధ్యత ఎవరూ ఎన్నడూ ఒప్పుకోరు. బుడగలు ఈ రాజకీయపార్టీలలాంటివి.

పెట్టుబడులమీద లాభాలకోసం పోటీ అతి తీవ్రంగా ఉంటుంది. సొత్తు అన్న ప్రతిదానికీ ఎప్పుడైనా సరే సొంతదారులు ఎవరో ఒకరు ఉండితీరాలి. అంటే ఈ బుడగ ఎప్పుడూ పేచీకోరు వ్యవహారమే. అసలుకంటే ఎక్కువ విలువ చూపే సొత్తుకు సొంతదారులుగా ఉండాలని ఎవరూ అనుకోరు, ఉండటానికి ఎవరూ ఒప్పుకోరు. వెనక్కి తిరిగి చూసినప్పుడు అందులో తప్పులు తెలుసుకొని నేర్చుకోవటంకంటే మనం ఎదటివారిలో తప్పులు వెటకటానికి ప్రయత్నం చేస్తాం.

ఈ బుడగలు ఎందుకు వస్తాయో, ఎలా పేలుతాయో మనకు ఎన్నటికీ తెలియబోవటంలేదని నా ఉద్దేశ్యం. ఇది యుద్ధాలు ఎందుకు వస్తాయని అడగటం లాంటిది. అందుకు అనేక కారణాలు ఉంటాయి. ఆ కారణాలు పరస్పరం విరుద్ధం. దానికితోడు ఆ కారణాలు ఎవరూ ఒప్పుకోరు.

అది చాలా తికమకలతో కూడిన విషయం. దానికి సూటి అయిన సమాధానం లేదు.

కానీ అవి అలా జరగటానికి నేను ఒక కారణం చెప్తాను. ఆ కారణం అందరూ ఉపేక్షిస్తారు. వ్యక్తిగతంగా అది మీకు వర్తిస్తుంది: పెట్టుబడిదారులు అమాయకంగా ఇతర పెట్టుబడిదారుల నుంచి సలహాలు,సూచనలు తీసుకుంటారు. సలహాలు అడిగేవారు ఆడే ఆటలు, సలహాలు ఇచ్చేవారు ఆడే ఆటలు వేరు వేరు అన్న విషయం గమనించాలి.

---

ఆర్థిక రంగంలో ఒక భావన ఉన్నది. చూడటానికి అది చాలా అమాయకంగా కనిపిస్తుంది. కానీ అది లెక్కకందని నష్టం కలిగించింది.

పెట్టుబడిదారుల లక్ష్యాలు వేరు, కాలమానాలు వేరు. కానీ సరుకుకు ఒకే ఒక న్యాయమైన ధర ఉంటుందని భావన.

మిమ్మల్ని మీరే ప్రశ్నించుకోండి: ఈనాడు గూగుల్ స్టాక్ కు మీరు ఎంత చెల్లించవచ్చు?

మీరెవరు అనేదాన్ని బట్టి సమాధానం ఉంటుంది.

మీరు 30 సంవత్సరాల పెట్టుబడిని గురించి ఆలోచిస్తున్నారా? అప్పుడు

రాబోయ్యే 30 సంవత్సరాలలో గూగుల్ డిస్కౌంటెడ్ క్యాష్ ఫ్లో విశ్లేషణ చేస్తే సరసమైన ధరను గురించి మీకు ఒక భావన కలుగుతుంది.

పదేళ్లలోగా మీరు సొమ్ము చేసుకోవాలనుకుంటున్నారా? అప్పుడు రాబోయ్యే పది సంవత్సరాలలో సాంకేతిక పరిశ్రమ సంభావ్య శక్తి, గూగుల్ నిర్వాహక బృందం తమ దూరదృష్టి పథకాలు ఎంతవరకు అమలు జరపగలరు అన్నదానిమీద స్టాక్ విలువ ఆధారపడుతుంది.

ఒక సంవత్సరంలోగానే అమ్మాలనుకుంటున్నారా? అయితే ప్రస్తుతం గూగుల్ ఉత్పాదనల అమ్మకాలు ఎలా ఉన్నాయో పరిశీలించండి. ఈ సంవత్సరం మార్కెట్ ఎలా ఉండబోతున్నదో అధ్యయనం చెయ్యండి.

మీ వ్యాపారం పగటిపూట మాత్రమే నడుస్తుందా? అప్పుడు ధర ఏదయినా ఫర్వాలేదు. ఎందుకంటే మీరు మధ్యాహ్నం లోపల ఎంతోకొంత పిండదలుచు కున్నారు. ధర ఎంత అయినా అది సాధించవచ్చు.

పెట్టుబడిదారులకు లక్ష్యాలు, కాలపరిమితులు వేరువేరుగా ఉంటాయి. సరుకుతో సంబంధం లేకుండా ఈ వ్యత్యాసాలు ప్రతిచోటా ఉంటాయి. ఒకరికి అపహాస్యంగా తోచిన ధర మరొకరికి సవ్యంగా కనిపిస్తుంది. వీరికి శ్రద్ధకలిగించే విషయాలు వేరు, వారికి శ్రద్ధకలిగించే విషయాలు వేరు.

1999లో Yahoo! స్టాక్ చూసినవారు "అది వెర్రితనం. అంతులేని సంపాదన. ఆ విలువకు అర్థం లేదు." అనవచ్చు.

కానీ 1999 లో Yahoo! స్టాక్ కొన్న పెట్టుబడిదారుల కాలపరిమితి అతితక్కువ. కనుక స్టాక్ ధర ఎంత అయినా వారికి సబబుగానే తోచింది. ఏ పూట వ్యాపారం ఆ పూట ముగించే వ్యాపారికి Yahoo! షేర్ 5 డాలర్లు పలికినా, 500 డాలర్లు పలికినా ఫర్వాలేదు. వాళ్ళకు కావలసిందల్లా ఆనాడు ఆ షేర్ సక్రమంగా నడిస్తే చాలు. వారి లక్ష్యం నెరవేరుతుంది. చాలా సంవత్సరాలకాలం అలాగే నడిచింది.

డబ్బు సాధ్యమైనంత వరకు లాభాల వెంట పరుగులు తీస్తుందన్నది ఆర్థిక రంగంలో తిరుగులేని నిబంధన. ఒక వస్తువు ధర కొంతకాలంగా పెరుగుతూ

ఉంటే , తాత్కాలిక వ్యాపారులు అది అలా పెరుగుతూనే ఉంటుందని ఆశించటంలో తప్పేమీ లేదు. వెర్రితనం అంతకంటే కాదు. నిరవధికంగా కాదు. వాళ్ళకు అవసరమైన ఆ తాత్కాలిక సమయంలో మాత్రం.ఆ ఊపు తాత్కాలిక పెట్టుబడిదారులను ఆకర్షిస్తుంది.

ఆ తర్వాత అది ఎటో పరుగులు తీస్తుంది.

తాత్కాలిక లాభాలకు ఊపు వచ్చింది. దీర్ఘకాల పెట్టుబడిదారులందరూ తమ పెట్టుబడులు తాత్కాలికం చేశారు. అప్పుడే బుడగలు పుట్టటం, పెరగటం మొదలవుతుంది.

ఆ ప్రక్రియ స్వయంచాలక మవుతుంది. తాత్కాలిక లాభాలు పెరుగుతున్న కొద్దీ ఇంకా ఇంకా ఎక్కువమంది వ్యాపారులు బరిలోకి దిగుతారు. అప్పుడు త్వరలోనే - ఎంతోకాలం పట్టదు - మార్కెట్ లో ధరలు నిర్ణయించేవారంతా తాత్కాలిక వ్యాపార వర్గానికి చెందినవారవుతారు.

స్టాక్ ధరలు పెరిగినందువల్ల బుడగలు పెరిగి పేలటం జరగదు. అది మరొక వ్యాధి లక్షణం. తాత్కాలిక వ్యాపారులు రంగంలోకి దిగుతున్న కొద్దీ కాల పరిమితి కుంచించుకు పోతున్నది.

భవిష్యత్తును గురించి అర్థం లేని కలలు కనటమే డాట్ కామ్ బుడగకు మూలకారణం అనటం సాధారణం. కానీ వ్యాపారం అనూహ్యమైన శిఖరాలను చేరుతున్నదని ఆనాటి పతాక శీర్షికలు ఘోషిస్తూ ఉండేవి. పెట్టుబడిదారులు కొనుగోళ్ళు అమ్మకాలు ఒకేరోజులో చేస్తూ ఉంటే జరిగేది అదే. పెట్టుబడిదారులు - ముఖ్యంగా ధరల నిర్ణేతలు-రాబోయ్యే 20 సంవత్సరాలను గురించి ఆలోచించలేదు. 1999 లో మ్యూచువల్ ఫండ్ సగటున సాలీనా 120% వ్యాపారం సాధించింది. అంటే అందరూ రాబోయ్యే ఎనిమిది నెలలను గురించి మాత్రమే ఆలోచిస్తున్నారన్నమాట. ఆ మ్యూచువల్ ఫండ్స్ కొన్న ఒక్కొక్క పెట్టుబడిదారుడు కూడా అలాగే ఆలోచించారన్నమాట! 'బుల్' (Bull!) అన్న తన పుస్తకంలో మాగీ మహర్ వ్రాశారు:

1990 - 2000 మధ్యంతరంలో వార్తా మాధ్యమాలు వార్షిక నివేదికల

స్థానంలో మూడునెలల కొకసారి నివేదికలు ప్రచురించాయి. ఆ మార్పుతో పెట్టుబడిదారులందరూ ఫలితాల వేట కొనసాగించారు. ఫండ్స్ ఖరీదు ఎంత ఎక్కువ ఉన్నాకూడా, అమిత ప్రియమైన ఫండ్స్ వెంటబడ్డారు.

ఇదే పగటివ్యాపార యుగం. ఇక్కడ జరిగే ఒప్పందాలన్నీ తాత్కాలికమే. ఆ క్షణంలో మార్కెట్ లో ఏమి జరుగుతున్నదో వ్యాఖ్యానాలు వెలువడుతూ ఉండేవి. ఇవి దూరదృష్టితో నడిచే వ్యవహారాలు కావు.

2000 లో గృహనిర్మాణ వ్యాపారం బుడగలో కూడా ఇదే జరిగింది.

మీ కుటుంబం రాబోయ్యే పది సంవత్సరాల నివాసానికి ఫ్లోరిడాలో 700,000 డాలర్లు ఖర్చుచేసి రెండు బెడ్‌రూమ్ ఇల్లు కొనటం తెలివైన పని అనిపించుకోదు. కానీ మార్కెట్ ధరలు పెరుగుతున్న కారణంగా మీరు కొద్ది నెలలలో ఆ ఇంటిని అమ్మి త్వరగా లాభాలు జేబులో వేసుకోదలుచుకొని ఉంటే అది చాలా తెలివైన పని. బుడగలు పెరుగుతున్న సమయంలో దాదాపు అందరూ చేసే పని ఇదే.

డేటా ఫ్రమ్ యాటమ్ (Data from Attom) రియల్ ఎస్టేట్ లావాదేవీలు అనుసరించి గమనించే సంస్థ. అమెరికాలో ఒకే సంవత్సరంలో ఒకసారికి మించి అమ్ముడుబోయిన ఇళ్ల వివరాలు, సంఖ్య చెబుతుంది. ఆ బుడగ పెరుగుతున్న సమయంలో వాటి ధర ఐదింతలు (2000 సంవత్సరం మొదటి క్వార్టర్‌లో 20,000 డాలర్ల ఖరీదు చేసే ఇల్లు 2004 మొదటి క్వార్టర్‌కు 100,000 డాలర్లు చేరుకున్నది) అయింది.[54] బుడగ పేలిన తర్వాత ధరలు క్వార్టర్ కు 40,000 డాలర్ల చొప్పున దిగిపోయ్యాయి. అప్పటినుంచి అలాగే స్థిరంగా ఉండిపోయ్యాయి.

ఇలా ఎగరవేసుకు పోయినవారు ఆ తర్వాత ఇంటి ధర, ఇంటి అద్దె నిష్పత్తులను గురించి ఆలోచించార నుకుంటున్నారా? వారు చెల్లించిన ధరలకూ రానున్న కాలంలో ఆదాయం పెరుగుదలకూ ఏమైనా సంబంధం ఉన్నదా? ఎంతమాత్రమూ లేదు. వాళ్ళ ఆటకూ, ఆ అంకెలకూ ఏమీ సంబంధం లేదు. వాళ్ళకు కావలసినదల్లా ఆ ఇంటి ధర ఈ నెలలోకంటే వచ్చే నెల మరికొంత

పెరగటమే. చాలా సంవత్సరాలు అలాగే జరిగింది.

ఈ పెట్టుబడిదారులను గురించి మీరు ఎంతైనా చెప్పవచ్చు. వాళ్ళను మీరు సట్టావ్యాపారులనవచ్చు. బాధ్యతా రహితంగా ప్రవర్తించేవారనవచ్చు. వారి అతీవ సాహసాలను చూసి మీరు తల అడ్డంగా తిప్పవచ్చు.

కానీ వారినందరినీ హేతురహితులనటం సరికాదని నా ఉద్దేశ్యం.

ఈ బుడగలు ఏర్పడటం జనం అర్థంలేకుండా దీర్ఘకాలిక పెట్టుబడులలో పాల్గొనటంవల్ల కాదు. తాత్కాలిక వ్యాపారం దిశగా కదులుతున్న జనం దీనికి ఎక్కువ కారణం. అక్కడ స్వయంచాలకంగా జరుగుతున్న ఉరవడివల్ల కొందరు అటు కదిలారు.

అక్కడ ఉరవడి ఉన్నది. తాత్కాలికంగా అక్కడ లాభాలకు ఎక్కువ అవకాశం ఉన్నది. జనం చూస్తూ కూర్చోరుగదా! అది ఎన్నడూ జరిగే పనికాదు. ఈ ప్రపంచం తీరే అంత. అందరూ లాభాలనే వెంటాడుతారు. దీర్ఘకాలిక పెట్టుబడులలో స్టాక్ విలువలమీద నిబంధనలు ఉంటాయి. తాత్కాలిక వ్యాపారులు వాటిని ఉపేక్షిస్తారు. తాత్కాలిక వ్యాపారానికి అవి పనికిరావు.

అక్కడే వ్యాపారం ఆసక్తికరమవుతుంది. సమస్యలు కూడా అక్కడే మొదలవుతాయి.

దీర్ఘకాలిక పెట్టుబడుల దారి వేరు. తాత్కాలిక వ్యాపారుల దారి వేరు. దీర్ఘకాలిక పెట్టుబడిదారులు తాత్కాలిక వ్యాపారుల సలహాలు చెవిన పెట్టినప్పుడే బుడగలు తమ ప్రతాపం చూపటం మొదలు పెడతాయి.

1999లో సిస్కో (Cisco) స్టాక్ 300% పెరిగి షేర్ విలువ 60 డాలర్లు చేరుకున్నది. ఆ ధరతో కంపెనీ విలువ 600 బిలియన్ డాలర్లుగా లెక్కకట్టారు. అది వేలంవెర్రి. ఆ సంస్థ విలువ అంత ఉంటుందని అనుకున్నవారు చాలా తక్కువ. కానీ పొద్దు పొడిచి పొద్దుగూకే లోపల వ్యాపారం నడిపేవారు ఆనందంగా ఉన్నారు. ఆర్థిక శాస్త్రవేత్త బార్టన్ మాల్కీల్ ఒకసారి అన్నారు: “ఆ విలువ స్థాయిలో ఆశించే అభివృద్ధి ప్రకారం Cisco ఇరవై సంవత్సరాలలోగా అమెరికా ఆర్థిక వ్యవస్థనే అధిగమిస్తుంది.”

కానీ 1999లో మీరు దీర్ఘకాలిక పెట్టుబడిదారులు అయి ఉంటే, 60 డాలర్లు ఆనాటి కొనుగోలు వెల. ఆనాడు చాలామంది ఆ వెలకు కొన్నారు. అప్పుడు మీరు చుట్టూ పరికించి "వీళ్ళకు ఇందులో ఏదో రహస్యం తెలిసినట్లుంది." అనుకోని ఉండవచ్చు. బహుశా మీరుకూడా నలుగురితోబాటు కలిసి నడిచి ఉంటారు. తెలివైన పని చేశామనుకొని ఉంటారు కూడా.

అక్కడ మార్జినల్ ధర నిశ్చయించుకున్న వ్యాపారుల ఆట, పథకం వేరు. మీరు గ్రహించని విషయం అదే. ఆ వ్యాపారులకు ఒక షేర్ 60 డాలర్లు అంటే సరసమైన ధరే. ఎందుకంటే వాళ్ళు ఆ షేర్ విలువ కొంచెం పెరగగానే, సాయంత్రం లోపల అమ్మేస్తారు. కానీ మీ షేర్లు చాలాకాలం మీ దగ్గరే ఉండబోతున్నాయి. కనుక 60 డాలర్ల షేర్లు మీకు సంభవించబోయ్యే విధ్వంసానికి నాంది.

ఈ ఇద్దరు పెట్టుబడిదారులు ఒకరినొకరు ఎరగరు. కానీ వాళ్ళు ఒకే ప్రదేశంలో కళ్ళుమూసుకొని ఒకరికొకరు ఎదురెదురుగా పరుగెత్తుతున్నారు. వాళ్ళు ఇద్దరూ ఢీకొన్నప్పుడు ఎవరో ఒకరికి దెబ్బతగులుతుంది. చాలా ఆర్థిక నిర్ణయాలు ఎదటివారిని గమనించటంవల్ల జరుగుతాయి. అవతలివాళ్ళు ఏమి చేస్తున్నారో చూసి వాళ్ళను అనుకరించటమో, లేకపోతే వాళ్ళకు పోటీగా పందెం కాయటమో జరుగుతుంది. కానీ అవతలి వ్యక్తి అలా ఎందుకు ప్రవర్తిస్తున్నారో మనకు తెలియనప్పుడు వాళ్ళు ఎంతకాలం అలా ప్రవర్తిస్తారో తెలియదు, వాళ్ళు మనసు ఎందుకు మార్చుకుంటారో మనకు తెలియదు, అందులో వారు గుణపాఠం ఎన్నటికైనా నేర్చుకుంటారోలేదో తెలియదు.

ఒక CNBC వ్యాఖ్యాత "మీరు ఈ స్టాక్ కొనాలి" అని సలహా చెప్పినప్పుడు మీరెవరో వారికి తెలియదని గుర్తుంచుకోండి. మీరు కిశోరప్రాయంలో సరదాకు స్టాక్ వ్యాపారం చేస్తున్నారా? పరిమితమైన బడ్జెట్ తో వ్యవహరిస్తున్న పూర్వసువాసినులా? క్వార్టర్ ముగిసేలోగా మీ ఎకౌంట్ పుస్తకాలకు చక్కదిద్దటానికి ప్రయత్నం చేస్తున్న హెడ్జ్ ఫండ్ మేనేజరా? ఈ ముగ్గురు వ్యక్తుల అవసరాలూ ఒకటేనని మనం అనుకోవాలా? ఒక స్థాయిలో ఉన్న స్టాక్ వీరు ముగ్గురికీ సరిపడుతుందా?

అది వెర్రితనం.

మన లక్ష్యాలు, ఇతర పెట్టుబడిదారుల లక్ష్యాలు వేరువేరుగా ఉంటాయని గ్రహించటం కష్టం. లౌకికజ్ఞానం ఉన్న పెద్దలందరూ ఈ ప్రపంచాన్ని మీదృష్టితోకాక, తమదృష్టితో చూస్తారని గ్రహించలేకపోవటం మానసిక శాస్త్రంలో ఒక లంగరు. అందరూ దాన్నే పట్టుకు వేలాడుతుంటారు. పెరుగుతున్న ధరలు పెట్టుబడిదారులందరినీ పరుగులు తీయిస్తాయి. విక్రయదారులందరూ నోరుతెరిచి చూస్తూ ఉంటారు. ధరలు సూక్ష్మంగా పరిశీలించి ఆచితూచి కొనే వారందరికీ పెరుగుతున్న ధరలు మత్తుమందు అవుతాయి. పెట్టుబడిదారులందరూ ఆనంద పరవశంతో ఆశావాదులవుతారు. ఎదటివారిని (వారి పథకం, క్రీడాంగణం, క్రీడా వేరు) చూసి తమ యదార్థాన్ని విస్మరిస్తారు.

ఎదుటివారిని అనుసరించే ప్రయత్నంలో మీ డబ్బు ఎలా విని యోగించాలోనన్న మీ ఆలోచన కూడా పక్కదారి పడుతుంది. కొనుగోలుదార్లు చేసే ఖర్చు - ముఖ్యంగా అభివృద్ధి చెందిన దేశాలలో - అంతా సామాజిక ప్రచోదనే. మీరు మెచ్చుకొనే వారినుంచి ఈ ప్రభావం మిమ్మల్ని సున్నితంగా మాయపుచ్చుతుంది. ఇతరులు మిమ్మల్ని మెచ్చుకోవాలని మీ సుకుమారమైన కోరిక.కనుక మీరు మెచ్చుకునే వారిని మీరు అనుకరిస్తారు.

ఎదటివారు కార్లు, ఇళ్ళు, దుస్తులు, విహార యాత్రలు, వగైరాలమీద ఎంత ఖర్చు చేస్తున్నారో మనకు కనబడుతూ ఉంటుంది. మనకు కనబడనివి వారి లక్ష్యాలు, చింతలు, చికాకులు, ఆశలు, ఆశయాలు. పేరుపొందిన న్యాయసంస్థలో భాగస్వామిగా చేరదలుచుకున్న న్యాయవాదికి దుస్తుల ఆడంబరం అవసరం కావచ్చు. ఒక రచయితగా నేను ఇంట్లో కూర్చొని స్వెట్ ప్యాంట్స్ వేసుకుని నా పని నేను చేసుకుంటూ ఉండవచ్చు. నాకు ఆ ఆడంబరమైన దుస్తులు అవసరం లేదు. కానీ ఆయన కొంటున్న దుస్తులు చూసి నేను అనుసరిస్తే, నిరాశకు దారితీసే బాటన నడుస్తున్నానన్నమాట. ఆడంబరమయిన ఆ దుస్తులవల్ల ఆయనకు వృత్తిలో పురోగతి సాధ్యం కావచ్చు. కానీ నేనో, డబ్బు వృధాగా నీళ్ళపాలు చేస్తున్నాను. మా పద్ధతులు వేరుకాకపోవచ్చు. కానీ ఆయన ఆట

వేరు, నా ఆట వేరు. ఈ విషయం ఒంటబట్టటానికి నాకు కొన్ని సంవత్సరాలు పట్టింది.

ఎదటివారు వేరే ఆటలో నిమగ్నులై ఉన్నారు. కనుక వారి ప్రవర్తన, చర్యలు వేరుగా ఉంటాయి. వారిని అనుసరించి అనుకరించక, మీ పరిస్థితులు, పరిమితులు అర్ధం చేసుకోవటం అవసరమన్నదే ఇక్కడ తెలుసుకోవలసిన విషయం.

నేను చెప్పగలిగినదల్లా ఎలాగైనా సరే మీ ఆట మీరు గుర్తించాలని మాత్రమే.

మనలో ఎంతమంది నిజంగా తమ ధ్యేయాన్ని గుర్తిస్తారో గమనిస్తే ఆశ్చర్యం వేస్తుంది. డబ్బు పెట్టుబడి పెట్టేవారినందరినీ – ఒకేవిధమైన నిబంధనలతో ఒకే ఆటాడే బాస్కెట్ బాల్ క్రీడాకారులలాగా మనం పెట్టుబడిదారులంటాం. ఆ ఆలోచన ఎంత అధ్వాన్నమైనదో మీరు గ్రహిస్తే, మీరు ఏ ఆటలో ఉన్నారో గుర్తించటం ఎంత ముఖ్యమో మీరే తెలుసుకుంటారు. నా డబ్బు నేను ఎలా పెట్టుబడి పెడతానో 20 వ అధ్యాయంలో వివరించాను. కానీ కొన్ని సంవత్సరాల క్రితం "నేను నిష్క్రియాత్మకుడినైన పెట్టుబడిదారుడిని. అసలైన ఆర్థిక అభివృద్ధి ఈ ప్రపంచం సాధించగలదని నా ఆశావాదం. ఆ అభివృద్ధి రానున్న 30 సంవత్సరాలలో నా పెట్టుబడులకూ సంక్రమిస్తుందని నా విశ్వాసం." అని వ్రాశాను.

ఆ ఆశ వింతగా తోచవచ్చు. కానీ అది వ్రాసిన తర్వాత ఆ ఆశకు సంబంధించని విషయాలు అనేకం ఈ సంవత్సరం మార్కెట్ ఎలా నడిచింది, వచ్చే సంవత్సరం ఆర్థిక మాంద్యం కలగవచ్చునా – మీరు గ్రహిస్తారు. ఇవన్నీ నా పరిధిలో లేవుకదా! కనుక నా ధ్యాస వాటిమీదికి పోదు. అవి నన్ను వెంటాడుతాయనే ప్రమాదం కూడా లేదు.

ఇప్పుడు నిరాశావాదాన్ని గురించి మాట్లాడుదాం.

# 17.
# నిరాశావాదం ప్రలోభం

---

ఆశావాదం విక్రయ వాగ్దాటిగా ధ్వనిస్తుంది.
నిరాశావాదం మీకు సహాయం చెయ్యటానికి
ప్రయత్నిస్తున్నట్లు ధ్వనిస్తుంది.

---

*ఈ ప్రపంచం నాశనం కాబోతున్నదని వినాలని జనం కోరిక.*
*ఎందుకో నాకెన్నటికీ అర్థం కాదు.*
**- చరిత్రకారులు డైడ్రే మక్లోస్కీ**

ఆశావాదం అందరికీ మహోత్తమమైన వరం. అప్పుడు ఈ ప్రపంచం సర్వకాల సర్వావస్థలలోనూ అందరికీశ్రేయోదాయకం అవుతుంది. కానీ నిరాశావాదానికి మన హృదయాలలో ప్రత్యేకస్థానం ఉన్నది. ఆశావాదంకంటే నిరాశావాదం సర్వసాధారణం కావటమే కాదు, అదే తెలివైన పనిగా ధ్వనిస్తుంది. వివేచనలో అది సమ్మోహనం. ఆశావాదం అంటే తరుచూ ప్రమాదాన్ని నిర్లక్ష్యం చెయ్యటం అనే భావన ఉన్నది. కనుక ధ్యాస  నిరాశావాదం వైపు తిరుగుతుంది.

ముందడుగు వెయ్యబోయేముందు ఆశావాదమంటే ఏమిటో నిర్వచించాలి. అంతా సవ్యంగానేజరుగుతుందని అసలైన ఆశావాదులు నమ్మరు. అది అలసత్వం. దారిలో ఆటంకాలు ఎదురైనా, మొత్తం మీద ఫలితం మీకు అనుకూలంగా ఉంటుందనే నమ్మకమే ఆశావాదం. పొద్దున్నే నిద్రలేచినప్పుడు, ఏదో ఒక సమస్య తెచ్చిపెట్టాలని కాక, జనం ఆరోజు ఏదో మేలు చేయాలని, మంచిపని చేయాలని అనుకుంటూ ఉండటమే ఆశావాదానికి పునాది. అందులో మెలికలు ఏమీ లేవు. కానీ అది గారంటీ మాత్రం కాదు. దాదాపు అన్నివేళలా అందరికీ కలిగే ఆలోచన. సాంఖ్యశాస్త్రవేత్త స్వర్గీయ హాన్స్ రాస్లింగ్ మరోవిధంగా చెప్పారు: “నేను ఆశావాదిని కాను. నేను చాలా తీవ్రమైన సాధ్యవాదిని.”

ఇప్పుడు మనం ఆశావాదం తోబుట్టువు నిరాశావాదాన్ని చర్చించుదాం.

---

డిశంబర్ 29, 2008.

ఆధునిక చరిత్రలో అత్యంత దుర్భరమైన ఆర్థిక సంవత్సరం ముగియబోతున్నది. ప్రపంచమంతటా స్టాక్ మార్కెట్లు కుప్పకూలి పోయ్యాయి.

ప్రపంచమంతటా ఆర్థిక వ్యవస్థ దినదిన గండంగా ఈడ్చుకు వస్తున్నది. నిరుద్యోగం పెరిగిపోతున్నది.

ఇంతకంటే దుర్భిక్షం ఉండదనుకుంటున్న సమయంలో ది వాల్ స్ట్రీట్ జర్నల్ ఇంతవరకూ జరిగింది ఒక లెక్కలోకి రాదు. ముందున్నది ముసళ్ళ పండగ అంటూ ఒక వ్యాసం ప్రచురించింది. ఇగోర్ పానరిన్ అన్న రష్యన్ ప్రొఫెసర్ ఉన్నారు. ఆర్థిక స్థితిగతులను గురించి ఆయన అభిప్రాయాలు విజ్ఞానశాస్త్ర కల్పనలలాగా ఉంటాయి. వాల్ స్ట్రీట్ జర్నల్ ఆయన అభిప్రాయ సంకలనాన్ని మొదటి పేజ్ లో వ్యాసంగా ప్రచురించింది:

> సుమారు 2010, జూన్ మాసాంతంలో యునైటెడ్ స్టేట్స్ ఆరు ముక్కలుగా విడిపోతుంది (పానరిన్ అన్నారు) – అలాస్కా రష్యన్ అధికారంలోకి వెళ్తుంది. కాలిఫోర్నియా 'కాలిఫోర్నియన్ రిపబ్లిక్' కు కేంద్రంగా మారుతుంది. చైనీస్ ప్రభావంతో చైనాలో భాగం అవుతుంది. టెక్సాస్ 'ది టెక్సాస్ రిపబ్లిక్' రాజధాని అవుతుంది. కొన్ని రాష్ట్రాల ఒక సమూహం మెక్సికో ప్రభావం వల్ల మెక్సికోలో చేరుతాయి. వాషింగ్టన్ DC, న్యూయార్క్ 'అట్లాంటిక్ అమెరికా'లో భాగం అవుతాయి. అవి యూరోపియన్ యూనియన్‌లో చేరవచ్చు. ఉత్తర భాగంలో కొన్ని రాష్ట్రాలు కెనడా చేజిక్కించు కుంటుంది. ప్రొఫెసర్ పానరిన్ దానిని 'ది సెంట్రల్ నార్త్ అమెరికన్ రిపబ్లిక్' అన్నారు. హవాయి జపాన్ లేదా చైనా రక్షణలోకి పోతుందని ఆయన సూచన. అలాస్కా రష్యాలో కలిసిపోతుంది.[55]

ఇది ఎవరో అనామకుల అవాకులు చవాకులు కావు. మూఢనమ్మకాల వల్ల జరిగే చర్యలు కావు. ప్రపంచంలో అత్యంత ప్రఖ్యాతి చెందిన ఆర్థిక వార్తాపత్రిక మొదటి పేజిలో ప్రచురించిన వ్యాసం.

ఆర్థిక పరిస్థితిని గురించి నిరాశ ప్రకటించవచ్చు. దుస్సహ దుర్భర పరిస్థితులు కలగబోతున్నాయని భవిష్యద్వాణి చెప్పవచ్చు. చరిత్రలో దేశాలు ఆర్థికమాంద్యం అనుభవించటమేకాక ముక్కలుగా విచ్ఛిన్నమైన ఉదాహరణలు ఎన్నో ఉన్నాయి.

పానరిన్ కథవంటి కథలలో ఆసక్తికరమైన విషయమేమిటంటే వాటికి పూర్తిగా వ్యతిరేకమైన కథలు - అపారమైన ఆశావాదంతో కూడిన భవిష్యద్వాణి - జనం పట్టించుకోరు. ఈ కథలను మాత్రం చాలా తీవ్రంగా అధ్యయనం చేస్తారు.

ఉదాహరణకు 1940 ల ఉత్తరార్ధంలో జపాన్ ను గమనించండి. రెండవ ప్రపంచయుద్ధంలో పరాజయంతో దేశం అన్నివిధాలా- ఆర్థికంగా, పారిశ్రామికంగా, సాంస్కృతికంగా, సామాజికంగా - నేలపాలయింది. 1946 శీతాకాలం చాలా క్రూరంగా పెచ్చరిల్లింది. దేశంలో క్షామం ఏర్పడింది. ఆహారం రోజుకు తలకు 800 క్యాలరీలకు పరిమితమయింది.[56]

ఆ సమయంలో జపనీస్ విద్యావేత్త ఎవరైనా ఒక వార్తాపత్రికలోఇలా వ్యాసం వ్రాసిఉంటే ఏమయ్యేదో ఆలోచించండి:

> అందరూ తలెత్తి సంతోషంగా ఉండండి. మన జీవితకాలంలోనే మన ఆర్థికస్థితి యుద్ధం ముగిసేనాటికి ఉన్న స్థితికంటే15 ఇంతలు మెరుగుపడ బోతున్నది. మన జీవితకాలం దాదాపు రెట్టింపు కాబోతున్నది. మన స్టాక్ మార్కెట్లు ఇంతకు పూర్వం ఏ దేశమూ ఎరగనంతగా లాభాలు సంపాదించి పెడతాయి. రాబోయ్యే 40 సంవత్సరాలలో మన నిరుద్యోగ పరిమితి 6% దాటబోదు. ఎలక్ట్రానిక్ రంగంలో, సంస్థానిర్వహణలోనూ మనం విశ్వనేతలం కాబోతున్నాం. త్వరలోనే మన సంపదతో యునైటెడ్‌స్టేట్స్‌లో విలువైన రియల్ ఎస్టేట్ మనం సొంతదారులం కాబోతున్నాం. అమెరికన్లు మన సన్నిహితు లవుతారు. మన ఆర్థిక పథకాలన్నిటినీ అనుకరిస్తారు.

వారిని ఆ గదిలోనుంచి బయటికి నడిచిందాకా గేలిచేసేవారు. డాక్టరును సంప్రదించమని కూడా చెప్పి ఉండేవారు.

యదార్థానికి పైన చెప్పినదంతా యుద్ధం తర్వాత జపాన్ లో జరిగిందని గుర్తుంచుకోండి. కానీ పానరిన్ చెప్పినదానికి ప్రతికూల ప్రకటన అసంబద్ధంగా, అసంభవంగా కనిపిస్తుంది.

ఆశావాదానికంటే నిరాశావాదం వివేచనామయంగా, సహేతుకంగా కనిపిస్తుంది.

అంతా సవ్యంగానే ఉంటుందని ఎవరికైనా చెప్పి చూడండి. మిమ్మల్ని వింతగా చూస్తారు. లేదా విననట్లు అక్కడినుంచి నిష్క్రమిస్తారు. వారికేదో ప్రమాదం జరగబోతున్నదని ఎవరికైనా చెప్పండి. ఒళ్ళంతా చెవులు చేసుకుని మీరు చెప్పేదంతా వింటారు.

తెలివైనవారు ఎవరైనా వచ్చి రాబోయ్యే సంవత్సరంలో పదిరెట్లు పెరగబోయ్యే స్టాక్ తమదగ్గర ఉన్నదని చెప్తే, వారు చెప్పేదంతా చెత్తకింద కట్టి, వారిని తప్పించుకు తిరుగుతాను.

పనికిమాలిన వెధవ ఎవరో వచ్చి నా దగ్గర ఉన్న స్టాక్ ఏదో ఒక ఎకౌంటింగ్ గోలమాల్ వల్ల చతికల పడబోతున్నదని చెప్తే, ఆ రోజు పనులన్నీ విడిచిపెట్టి వారు చెప్పేది శ్రద్ధగా వింటాను.

ఒక పెద్ద ఆర్థిక మాంద్యం కలిగింది. ఒక వార్తాపత్రిక మిమ్మల్ని ఆహ్వానించింది. మన సగటు పెరుగుదల ఎవరూ పట్టించుకోబోని సగటు స్థాయిలో ఉండబోతున్నది. మహా పతనం దగ్గర్లోనే ఉన్నది. మీరు TVలో కెక్కారు. మంచిరోజులు రాబోతున్నాయని, మార్కెట్లు సవ్యంగా నడవటానికి అవకాశాలు ఉన్నాయని, పరిశ్రమ పెరగటానికి అవకాశాలు మెండుగా ఉన్నాయని చెప్తారు. వ్యాఖ్యాతలు, ప్రేక్షకులు మిమ్మల్ని సేల్స్ మన్ అంటారు లేకపోతే జరుగుతున్నఆర్థిక పరిస్థితిని గురించి మీకేమీ తెలియదంటారు.

పెట్టుబడి వ్యవస్థలో వార్తాపత్రికలకు ఈ విషయం చాలాకాలంగా తెలుసు. గత శతాబ్దం పర్యంతం స్టాక్ మార్కెట్ 17000 రేట్లు ఎదిగింది. అయినాకూడా వార్తాప్రపంచం అంతా కుప్పకూలిపోబోతున్నదని జోస్యంచెప్పే పెద్దలతో నిండి ఉన్నది.

ఆర్థిక ప్రపంచం బయటకూడా ఇదే పరిస్తితి. 'ది రేషనల్ ఆప్టిమిస్ట్' అన్న తన పుస్తకంలో మ్యాట్ రిడ్లీ వ్రాస్తారు:

> నిరాశావాదం నగారాలమోతలో విజయశంఖారావం మునిగిపోతుంది. ఈ ప్రపంచం బాగుపడుతున్నదని మీరు చెబితే, మిమ్మల్ని మూర్ఖులని, మొద్దులనీ మాటలతో వదిలిపెడుతుంది. ఈ నిరాశావాదం ప్రపంచం దినాభివృద్ధి చెందబోతున్నదని చెబితే మిమ్మల్ని పిచ్చివాడికింద

> జమకడతారు. అలాకాక, ప్రళయం రాబోతున్నదనో, విధ్వంసం జరుగబోతున్నదనో చెబితే, మాక్ అర్థర్ జీనియస్ పురస్కారమో ఇంకా రోజులు బాగుంటే నోబెల్ పురస్కారమో కూడా మిమ్మల్ని వరించవచ్చు. నా జీవితకాలంలో ... నిరాశావాదానికి కారణాలు సొగసుగా మారాయి. నిరాశావాదం మాత్రం నికరంగా నిలిచి ఉన్నది.

"నేను ఎవరినడిగినా ప్రతివారూ యదార్థంకంటే, ఈ ప్రపంచం భయంకర మైనదనీ, హింసామయమనీ, ఆశాశూన్యమనీ - ఒక్కమాటలో చెప్పాలంటే నాటకీయమని - అనుకుంటారు." ఫాక్ట్ ఫుల్ నెస్ అన్న తన పుస్తకంలో హాన్స్ రాస్లింగ్ వ్రాశారు.

ఆర్థిక అభివృద్ధి, వైద్య రంగంలో నూతన ఆవిష్కరణలు, స్టాక్ మార్కెట్ లాభాలు, సామాజిక సమానత్వం వగైరా గమనిస్తే, మనుషులు ఒక జీవితకాలంలో ఎంత ప్రగతి సాధించగలరో గ్రహిస్తారు. నిరాశావాదానికంటే ఆశావాదం ప్రజల ధ్యాసను ఆకట్టుకోవాలనుకుంటారు. కానీ ......

మేధాపరంగా నిరాశావాదం ఆకట్టుకుంటుందని యుగయుగాలుగా మనకు తెలుసు. 1840 లలో జాన్ స్టువార్ట్ మిల్ వ్రాశారు: "అందరూ నిరాశలో మునిగితేలుతున్నప్పుడు ఆశావాదిని ఎవరూ పట్టించుకోరు. అందరూ ఆశావాదులైనప్పుడు నిరాశావాది అయిన వ్యక్తిని అందరూ ఒక మహర్షిగా ఆరాధిస్తారు. ఇది నేను గమనించిన వాస్తవం."

ఎందుకు?అన్నది ప్రశ్న. డబ్బును గురించి మన ఆలోచనలకు అది ఎలా ప్రభావం కలిగిస్తుంది?

---

ఎవరూ వెర్రివాళ్ళు కారు అన్న మన ఆలోచన పునరుద్ఘాటిద్దాం.

డబ్బుతో వ్యవహరించేటప్పుడు నిరాశావాదం మనలను వలలో వేసుకోవటానికిగల కారణాలు ఉన్నాయి. అవి ఏమిటో తెలుసుకుంటే, వాటినుంచి బయట పడటంలో సాయపడుతుంది.

దానిలో కొంతమటుకు తప్పించుకో వీలులేని సహజ ప్రవృత్తి. నష్టంపట్ల

మన విరక్తి పరిణామక్రమంలో మనకు సంక్రమించిన కవచం అంటారు కానేమన్. ఆయన వ్రాస్తారు:

> సూటిగా పోల్చి చూసినప్పుడు లాభాలకంటే నష్టాలే ఎప్పుడూ పెద్దవిగా కనిపిస్తాయి. సుముఖము, విముఖము అయిన ఆపేక్షల మధ్య ఏర్పడిన అసమానత్వం, అనుభవాలకు పరిణామ క్రమంలో ఒక చరిత్ర ఉన్నది. అవకాశాలకంటే అపాయాలతో అత్యవసరంగా వ్యవహరించే జీవుల జీవనావకాశాలు, పునరుత్పత్తి అవకాశాలు మెరుగ్గా ఉంటాయి.

ఆశావాదం కంటే ఆర్థిక నిరాశావాదాన్ని సులభతరంగా, సాధారణంగా, దృఢంగా ఒప్పించగల కొన్ని ఇతర అంశాలు ఉన్నాయి.

**మొదటి దేమిటంటే డబ్బు సర్వవ్యాపి అయి విలసిల్లే వస్తువు. దానికి ఏదైనా హాని జరిగితే ప్రతిఒక్కరికీ కీడు కలుగుతుంది. కనుక అందరి ధ్యాసనూ ఆకట్టుకుంటుంది.**

వాతావరణం విషయంలో ఇది నిజం కాదు. ఫ్లోరిడాలో దూసుకువస్తున్న సుడిగాలి మిగతా 92% అమెరికన్లకు ఎటువంటి హానీ కలిగించబోదు. కానీ ఆర్థిక రంగంలో మాంద్యం తోసుకు వస్తున్నదంటే, అది ప్రతిఒక్కరినీ – మిమ్మల్ని కూడా – కదిలించి వేస్తుంది. కనుక మెలకువగా ఉండండి!

ఈ ప్రభావం స్టాక్ మార్కెట్ వంటి ప్రత్యేకమైన రంగానికి కూడా వర్తించుతుంది. అమెరికన్లలో సగానికి పైగా కుటుంబాలు స్టాక్స్ స్వంతం చేసుకుని ఉంటాయి.[57] స్టాక్ మార్కెట్ కదలికలు చాలా ఉధృతంగా ప్రచారమవుతాయి. కనుకనే ఏ స్టాక్స్ లోనూ పెట్టుబడి పెట్టనివారుకూడా ఆర్థిక స్థితిగతులు తెలుసుకోవటానికి 'డౌ జోన్స్ ఇండస్ట్రియల్ యావరేజ్' తీక్షణంగా గమనిస్తూ ఉంటారు.

స్టాక్ విలువలు 1% శాతం పెరిగాయనే వార్త సాయంకాలం వార్తలలో క్లుప్తంగా దర్శన మియ్యవచ్చు. కానీ అవే విలువలు 1% పడిపోతే, ఆ వార్త పెద్ద పెద్ద అక్షరాలలో, ఇంకా చెబితే ఎర్ర రంగు అక్షరాలలో దర్శనమిస్తుంది. ఈ పక్షపాతం తప్పించుకోవటం దుస్సాధ్యం.

మార్కెట్ ఎందుకు పెరుగుతున్నది అన్న విషయం గురించి ఎవరో కొందరు ప్రశ్నించవచ్చు, కొందరు వివరించే ప్రయత్నం చేయవచ్చు. మార్కెట్ పెరుగుతూనే ఉండాలిగదా! కానీ మార్కెట్ పడిపోతే ఎందుకు, ఏమిటీ అని అనేక సంజాయిషీలు వస్తాయి.

పెట్టుబడిదారులు ఆర్థిక అభివృద్ధిని గురించి చింతిస్తున్నారా?

Fed మళ్ళీ పాడుపని చేసిందా?

రాజకీయవేత్తల నిర్ణయాలు కంపుకొడుతున్నాయా?

మళ్ళీ ఇంకొక ఆర్థికమాంద్యం రాబోతున్నదా?

ఒక పతనం ఎందుకు జరిగిందో చెప్పే కథనాలవల్ల ఆ సంఘటనను గురించి మాట్లాడటానికీ, చింతించటానికీ, తర్వాత జరగబోయే కథ ఊహించి చెప్పటానికీ అవకాశాలు సులువవుతాయి. చాలావరకు చర్విత చరణమవుతూ ఉంటాయి.

మీకు స్వంతగా స్టాక్స్ లేకపోయినా ఇటువంటి వార్తలు మీ ధ్యాసను ఆకట్టుకుంటాయి. 1929 లో మార్కెట్ కుప్పకూలి ఆర్థిక వ్యవస్థ అధః పతనమైనప్పుడు 2.5% శాతం అమెరికన్ల దగ్గర మాత్రమే స్టాక్స్ ఉన్నాయి. మార్కెట్ పతనమవు తున్నప్పుడు చాలామంది అమెరికన్లు భయభీతులై నోరువెళ్లబెట్టుకుని కన్నార్పకుండా చూశారు. తర్వాత తమగతి ఏమవుతుందోనని వారి భయం. మీరు లాయర్ కానివ్వండి, కర్షకులుకానివ్వండి, మెకానిక్ కానివ్వండి, ఏదైనా కానివ్వండి, ఇది మీకు వర్తిస్తుంది.

చరిత్రకారులు ఎరిక్ రాశ్వే వ్రాస్తారు:

> ఈ మార్కెట్ పతనం వల్ల కొద్దిమంది అమెరికన్లు మాత్రమే దెబ్బతిన్నారు. మిగిలినవారందరూ ఆ సంఘటన భూతద్దంలో పరీక్షించి భవిష్యత్తులో తమ గతికి ఇది సూచనగా భావించి, వారి లావాదేవీలన్నే దాదాపు నిలిపివేశారు. ఆర్థికశాస్త్రవేత్త జోసెఫ్ శుంపీటర్ తర్వాత వ్రాశారు, "జనం తమ కాళ్ళకింద భూమి విచ్చిపోతున్నదన్నట్లు అనుభూతి చెందారు."[58]

మీకు ఇష్టం ఉన్నా లేకపోయినా రెండు విషయాలు - డబ్బు, ఆరోగ్యం - మీ జీవితాన్ని ప్రభావితం చేస్తాయి. ఆరోగ్య సమస్య వ్యక్తిగతమైన విషయం.

డబ్బు సమస్యలు సంస్థాపరమైనవి. ఒకరికొకరు లంకె పడివున్న వ్యవస్థలో ఒకరి నిర్ణయం మిగిలినవారందరిమీద ప్రభావం చూపుతుంది. కనుకనే ఆర్థిక సంఘటనలు అనేసరికి అవి వెలుగులోకి వచ్చి అందరి ధ్యాసను ఆకట్టుకున్నట్లు మరే ఇతర సంఘటనలూ అందరినీ ఆకర్షించలేవు.

**మార్కెట్లు సమయానుగుణంగా ఎలా ప్రవర్తిస్తాయా అని ఆలోచించకుండా, నిరాశావాదులు ప్రస్తుత పరిస్థితులను భవిష్యత్తులోకి పొడిగిస్తారు.**

పర్యావరణవేత్త లెస్టర్ బ్రౌన్ 2008లో వ్రాశారు: “2030 నాటికి చైనాకు రోజుకు 98 మిలియన్ బ్యారెల్స్ ఆయిల్ అవసరమవుతుంది. ప్రస్తుతం ప్రపంచం అంతటా కలిసి రోజుకు 85 మిలియన్ బ్యారెల్స్ ఆయిల్ ఉత్పత్తి అవుతున్నది. ఈ ఉత్పాదన అంతకుమించి పెరగబోవటంలేదు. ప్రపంచంలోని ఆయిల్ నిధులన్నీ అంతటితో సరి.”[59]

ఆయన సరిగ్గానే చెప్పారు. ఆ పరిస్థితులలో ప్రపంచంలో ఆయిల్ కరువవుతుంది.

కాని మార్కెట్లు ఆ పద్ధతిలో నడవవు.

ఎకనామిక్స్‌లో ఒక దృఢమైన న్యాయం ఉన్నది: సప్లై డిమాండ్ చెప్పనలవి గాని పద్ధతిలో పరిస్థితులకు అనుగుణంగా మారిపోతాయి. కనుక అతి మంచి పరిస్థితులుగాని, అతి చెడ్డ పరిస్థితులుగాని ఎంతోకాలం కొనసాగవు.

బ్రౌన్ భవిష్యద్వాణి వెనువెంటనే ఆయిల్ విషయంలో ఏమి జరిగిందో చూడండి.

ప్రపంచ వ్యాప్తంగా ఆయిల్ డిమాండ్ –ఎక్కువ శాతం చైనా నుంచే – పెరుగుతూ ఉత్పాదన శిఖరాలను తాకబోతూ ఉండగా ఆయిల్ ధరలు పెరగ సాగాయి. 2001లో 20 డాలర్లుఉన్న బ్యారెల్ ఆయిల్ ఖరీదు 2008 లో 138 డాలర్లు అయింది.[60]

కొత్త ధరలో ఆయిల్ కోసం డ్రిల్లింగ్ అంటే మట్టిలోనుంచి బంగారం తీసినట్లే అయింది. ఆయిల్ ఉత్పత్తి దారులకు ప్రేరణ ఆకాశాన్నంటింది. అంతకు పూర్వం బ్యారేల్‌కు 20 డాలర్ల వెలతో – ఖర్చులు ఆదాయాన్ని మించటంతో –

కష్టసాధ్యమైన ప్రదేశాలలో డ్రిల్లింగ్ ఆగిపోయింది. ఇప్పుడు 138 డాలర్లతో ఆ వ్యాపారం కొంగుబంగారమైంది.

దానితో డ్రిల్లింగ్‌లో నూతన పద్ధతులు ప్రవేశించాయి.

మానవ చరిత్రలో తెలిసినంతవరకు భూమిలో ఉన్న ఆయిల్ నిలవలు ఒకటే. ఇంతవరకూ వాటిలో ఘనమైన నిలవలు ఎక్కడ ఉన్నాయో తెలుసుకున్నాం. ఇప్పుడు సాంకేతికత మారింది. దానితో ఆయిల్ భూమిలోనుంచి అనువైన ఖర్చుతో బయటికి తియ్యగల సామర్థ్యం కలిగింది. ఆయిల్ చరిత్రకారులు డేనియల్ యెర్గిన్ వ్రాస్తారు: "అమెరికా ఆయిల్ నిలవలలో 86% నిలవలు కనుక్కున్నప్పటివి కావు. సాంకేతికత అభివృద్ధి చెందుతూ ఉండగా కనుగొన్నవి."

2008 లో ఫ్రాకింగ్ (అత్యధిక పీడనతో ద్రవపదార్థాలు రాతి పగుళ్ళలోకి పంపించి తద్వారా భూమి అడుగున ఉన్న ఆయిల్ నిలవలను వెలికి తీసే ఆధునిక విజ్ఞాన పద్ధతి) మొదలైనప్పుడు అదే జరిగింది. ఒక్క యునైటెడ్ స్టేట్స్ లోనే 2008 లో రోజుకు 5 మిలియన్ బ్యారెల్స్ ఉన్న ఆయిల్ ఉత్పాదన 2019లో 13 మిలియన్ బ్యారెల్స్‌కు పెరిగింది.[61] ప్రస్తుత ఆయిల్ ఉత్పాదన రోజుకు 100 మిలియన్ బ్యారెల్స్ మించింది. ఆనాడు బ్రౌన్ ఊహించిన పరిమితికంటే సుమారు 20% అధికం.

2008లో ఆయిల్ ఉత్పాదనలు పరిశీలిస్తున్న నిరాశావాదికి భవిష్యత్తు దుర్భరంగా కనిపించటం సహజం. అన్నీ ఆవిర్భావాలకూ అవసరమే తల్లి అని అర్థం చేసుకున్న యదార్థవాదికి ఆనాడు భవిష్యత్తు అంత భయంకరంగా కనిపించి ఉండదు.

వికారంగా ఉన్నది అలాగే ఉండబోతున్నదని చెప్పటం సులభమైన దూరదృష్టి. అక్కడ ఆలోచన ఏమీ అవసరం లేదుగనక అది మభ్యపెడుతుంది. వెంటబడి నచ్చచెప్పి ఒప్పిస్తుంది. కానీ సమస్యలకు పరిష్కారాలు దొరుకుతాయి, జనం పరిస్థితులకు అనుగుణంగా మారుతారు. భయాలు పరిష్కారాలకు దోహదం చేస్తాయి. భయం ఎంత విపరీతమైతే పరిష్కారానికి అంతమిక్కుటంగా దోహదం పెరుగుతుంది. ఆర్థిక చరిత్రలో అది సాధారణ పథకం. నిరాశావాదులు ఆ విషయం విస్మరించి ముక్కుసూటిగా లెక్కలు వేస్తారు.

**అభివృద్ధి కంటికి కనబడనంత నిదానంగా జరుగుతుంది. ఎదురుదెబ్బలు ఉపేక్షించటానికి వీలుకాకుండా అతివేగంగా తగులుతాయి.**

అకస్మాత్తుగా, కన్నుమూసి తెరిచేలోగా జరిగే దుర్ఘటనలు/విషాదాలనేకం. అదే విధంగా జరిగే అద్భుతాలు అరుదు.

ఒకనాడు మనిషి పక్షిలాగా గాలిలో ఎగరగలడు అనే కలను జనవరి 5, 1889 న డెట్రాయిట్ ఫ్రీ ప్రెస్ వెనక్కు నెట్టింది.ఆ పత్రిక "విమానాలు అసంభవాలుగా తోస్తాయి." అని వ్రాసింది:

> గాలిలో ఎగిరే యంత్రం, అందుకు అవసరమైన ఇంధనం, నడిపేవారితో కలిసి కనీసం 300 లేదా 400 పౌండ్లకు తక్కువ ఉండదు. గాలిలో తేలగల ఆ బరువుకు కూడా ఒక పరిమితి ఉన్నది. అది 50 పౌండ్లకు మించకూడదు. మించితే ఆ జీవి ఎగరలేదు. ప్రకృతి ఇప్పటికే ఆ పరిమితి చేరుకున్నది. ఎంత ప్రయత్నించినా దానిని అధిగమించలేక పోయింది.

ఆరునెలల తర్వాత ఆర్విల్ రైట్ తన సోదరుడు విల్బర్‌కు సహాయం చేయటానికి హైస్కూల్ చదువు విడిచిపెట్టి వచ్చాడు. అప్పుడు విల్బర్ వారి పెరటిలో ఒక అచ్చుయంత్రం తయారుచేసే ప్రయత్నంలో ఉన్నాడు. అది ఆ సోదరుల మొదటి ఆవిష్కరణ. కానీ అది ఆఖరుది మాత్రం కాదు.

20 వ శతాబ్దంలో జరిగిన ముఖ్య ఆవిష్కరణల జాబితా వ్రాస్తే, మొదటిది కాకపోయినా, విమానం కనీసం మొదటి ఐదింటిలో ఉంటుంది. విమానం ప్రపంచం అంతటినీ మార్చివేసింది. అది ప్రపంచ యుద్ధాలకు నాంది పలికింది, మంగళం కూడా పాడింది. నగరాల మధ్య, గ్రామ సమాజాలమధ్య, సాగరాల, దేశాలమధ్య వంతెనలు కట్టి ప్రపంచాన్ని ఒకటి చేసింది.

విమానం నిర్మించటంలో రైట్ సోదరుల అన్వేషణలో ఒక ఆసక్తికరమైన మెలిక ఉన్నది.

వారు గాలిలో ఎగరటం సాధించిన తర్వాత ఎవరూ గమనించినట్లు లేదు ఎవరికీ పట్టినట్లు కూడా లేదు .

అమెరికా చరిత్రను గురించి వ్రాస్తూ తన 1952 పుస్తకంలో ఫ్రెడరిక్ లూయిస్ అలెన్ వ్రాశారు:

> రైట్ సోదరులు ఏమి చేస్తున్నారో ప్రజలు తెలుసుకునే లోపల చాలా సంవత్సరాలు గడిచిపోయాయి. ఎగరటం అన్నది అసంభవమని ప్రజలు గాఢంగా నమ్మారు. 1905 లో డేటాన్ (ఒహాయో) లో గాలిలో విహరిస్తున్న వారిని చూసినవారు అది ఏదో పనికిమాలిన - టెలిపతీని పదర్శనను గురించి మనలో ఈనాడు చాలామంది అనుకుంటున్నట్లుగానే - గారడీ అనుకుని పట్టించుకోలేదు. మే 1908 వరకూ - అంటే రైట్ సోదరుల మొదటి విమాన యానం తర్వాత సుమారు నాలుగున్నర సంవత్సరాలకు గాని - అనుభవజ్ఞులైన విలేకరులేవ్వరూ ఆ వార్తని నివేదించలేదు. అప్పుడు అనుభవజ్ఞులైన సంపాదకులు విలేకరుల నివేదికలకు విలువ ఇచ్చి వారు చూసినది, చెప్పినదంతా నిజమేనని సమర్ధించారు. అప్పుడు మనిషి పక్షిలాగా గాలిలో ఎగరగలడు అన్న యదార్ధానికి ఈ ప్రపంచం కళ్ళుతెరిచింది.

ప్రజలు విమాన అద్భుతాన్ని తెలుసుకున్న తర్వాతకూడా సంవత్సరాల తరబడి దాన్ని చులకన చేశారు.

మొదట్లో విమానం ఒక యుద్ధ ఆయుధంగా పరిగణించారు. ఆ తర్వాత దాన్ని సంపన్నుల ఆటవస్తువన్నారు. ఆ తర్వాత కొంతమంది ప్రజలను రవాణా చేయటానికి వినియోగమయింది.

1909లో ది వాషింగ్టన్ పోస్ట్ వ్రాసింది: "ఆకాశమార్గాన సరుకులు రవాణా చెయ్యటమనేది ఏనాటికీ జరగదు. సరుకుల భారీతనం అంతా సహనమూర్తి అయిన నేలమీదనే నిదానంగా జరిగితీరుతుంది." ఆ తర్వాత అయిదునెలలకు సరుకులతో నిండిన మొట్టమొదటి విమానం తొలిసారిగా గాలిలోకి లేచింది.

విమానాన్ని గురించి ఆశాపూర్వకంగా ఆలోచించటానికి నిదానంగా ఎన్ని సంవత్సరాలు పట్టిందో గమనించండి. అదే ఒక సంస్థ దివాలా వార్త ప్రజల ధ్యాసను ఎంత శీఘ్రంగా దోచివేస్తుందో పోల్చి చూడండి.

లేకపోతే ఒక యుద్ధవార్త.

లేదా ఒక విమానం కూల్చివేత. 1908 లో డిమాన్ స్ట్రేషన్ ఫ్లైట్ లో

థామస్ సెల్ఫ్ రిడ్జ్ అనే ఒక ఆర్మీ లెఫ్టినెంట్ చనిపోయాడు. అప్పుడే మొదటిసారిగా రైట్ సోదరుల విమానాన్ని గురించిన వార్త ప్రస్తావన దర్శనమిచ్చింది.[62]

చక్రవృద్ధి వల్లనే ఎదుగుదల కలుగుతుంది. అందుకు టైమ్ పడుతుంది. విధ్వంసం, ఎక్కడో ఒకచోట వైఫల్యం కలిగితే చాలు, జరిగితీరుతుంది. ఆ విధ్వంసం జరగటానికి కొన్ని సెకన్ల టైమ్ చాలు. అంతే, మరుక్షణం విశ్వాసం గాలిలో కలిసిపోతుంది.

నిరాశావాదం చుట్టూ కథ అల్లటం సులువైన పని . ఇటీవలనే జరిగిన తాజా కథాంశాలను ఏరికూర్చటం ఆసక్తికరమైన వ్యాపకం. ఆశావాద కథలు అల్లటానికి చరిత్ర తిరగెయ్యాలి. దారిలో జరిగిన అభివృద్ధులు గుర్తించాలి. ప్రజలు వీటినన్నిటినీ మర్చిపోవటం సహజం. ఆ కథాంశాలను ఏరికూర్చటం ప్రయత్నంతో కూడిన పని.

వైద్యరంగంలో అభివృద్ధి తీసుకోండి. గత సంవత్సరం ఒక్కటే పరిశీలిస్తే సరిపోదు. ఒక దశాబ్దం పరిశీలించినా ఏమంత ప్రయోజనం ఉండదు. కానీ ఒక 50 సంవత్సరాలు పరిశీలిస్తే, మీకు అద్భుతాలు దర్శనమిస్తాయి. ఉదాహరణకు హృద్రోగంవల్ల – వయసుకు ఉచితమైన సర్దుబాట్లు చేసిన తర్వాత – మరణాల సంఖ్య 1965 నుంచి 70% శాతం తగ్గింది. ఇది నేషనల్ ఇన్స్టిట్యూట్ ఆఫ్ హెల్త్ ప్రచురించిన వార్త.[63] హృద్రోగ మరణాలలో 70 శాతం తగ్గుదల అంటే సాలీనా 500,000 అమెరికన్ ప్రాణాలు రక్షించ బడినట్లే. ప్రతి సంవత్సరమూ అట్లాంటా రాష్ట్రంలో ఉన్న జనాభా రక్షించ బడిందని ఊహించండి. కానీ ఆ అభివృద్ధి నిదానంగా జరిగింది. కనుక ప్రజాదృష్టిని ఆకర్షించదు. తీవ్రవాదం, విమాన ప్రమాదం, ప్రకృతి వైపరీత్యాలు ఆకర్షించినంత శీఘ్రంగా అభివృద్ధి ఆకర్షించదు. కత్రీనా సుడిగాలి వారానికి ఐదు సార్లు ప్రతివారమూ జరగవచ్చు. అప్పుడు దానిపట్ల ఎంత ధ్యాస మళ్ళుతుందో ఊహించండి. దానివల్ల గత 50 సంవత్సరాలలో హృద్రోగం నుంచి కాపాడబడిన ప్రాణాలకు ఏమీ ముప్పు ఉండదు.

వ్యాపారానికి కూడా ఇదే వర్తిస్తుంది. అక్కడ ఒక వస్తువు గాని, ఒక సంస్థగాని ఎంత ముఖ్యమో గుర్తించటానికి సంవత్సరాల తరబడి పడుతుంది. కానీ వైఫల్యాలు రాత్రికిరాత్రే జరుగుతాయి.

స్టాక్ మార్కెట్ ఆరునెలలలో 40% పడిపోతే కాంగ్రెస్ నుంచి దర్యాప్తులు

జరుగుతాయి. కానీ ఆరు సంవత్సరాలలో కలిగే 140% అభివృద్ధి ఎవరి దృష్టినీ ఆకర్షించకపోవచ్చు.

ఉద్యోగాలలో, పదవులలో మంచిపేరు సంపాదించటానికి ఒక జీవితకాలం పట్టవచ్చు. కానీ అవి ధ్వంసం కావటానికి ఒక ఇ-మెయిల్ చాలు.

నిరాశావాదం ఒక్క కాటు ప్రబలుతుంది. ఆశావాదం ఎంత శక్తికొద్దీ ప్రయత్నించినా ఎవరి దృష్టినీ ఆకర్షించకపోవచ్చు.

ఇది ఇంతకు మునుపు ఈ పుస్తకంలో చెప్పిన పాయింట్ దృఢపరుస్తుంది: పెట్టుబడిలో మీరు సఫలత విలువ గుర్తించాలి - అభివృద్ధి జరుగుతున్న దీర్ఘకాలంలో కలిగే మిట్టపల్లాలు, నష్టాలు - ఆ విలువ చెల్లించటానికి సిద్ధంగా ఉండాలి.

---

2004లో ది న్యూయార్క్ టైమ్స్ విజ్ఞానశాస్త్రవేత్త స్టీఫెన్ హాకింగ్ ను ఇంటర్ వ్యూ చేసింది. ఆయనకు 21వ ఏట చికిత్సకు అందని మోటార్ - న్యూరాన్ వ్యాధి వచ్చింది. దానివల్ల ఆయనకు పక్షవాతం వచ్చింది, మాట పడిపోయింది.

ఇంటర్ వ్యూ చేసినవారితో ఆయన తన కంప్యూటర్ ద్వారా సంభాషించారు. సామాన్య ప్రజలకు పుస్తకాలు అమ్మటంలో తనకు ఎంత ఉత్సాహంగా ఉన్నదో చెప్పారు ఆయన.

"మీరు ఎప్పుడూ ఇలాగే ఇంత ఆనందంగా ఉంటారా?" టైమ్స్ అడిగారు.

"నా 21 వ ఏట నా ఆశలు శూన్యమయ్యాయి. ఆ తర్వాత దొరికినదంతా బోనస్సే." ఆయన జవాబు.

అంతా ఘనంగా ఉంటుందనుకుంటే, ఎంత ఘనంగా ఉన్నా చాలదు. నిరాశావాదం ఆశలను క్షీణింప జేస్తుంది. అప్పుడు మీరు ఆశించిన దానికీ, యదార్థానికే మధ్య ఖాళీ తగ్గిపోతుంది.

కనుకనే అది అంత సమ్మోహనకరం. పరిస్థితులు దుర్భరంగా ఉంటాయని ఆశించటం ఉత్తమం. అప్పుడు అందుకు భిన్నంగా జరిగితే ఆనందాశ్చర్యాలు అనుభూతి చెందవచ్చు.

అది కూడా ఒక ఆశావాదమే కదా! అక్కడ అదే వ్యంగ్యం.

ఇప్పుడు కథలను గురించి ఒక చిన్న కథ.

# 18.
# మీరు ఏదైనా నమ్ముతారు

మనసును దోచే కల్పనలు, కథలు
గణాంకాలకంటే బలమైనవి

ఒక గ్రహాంతరవాసి భూమి మీదికి రవాణా అయ్యారనుకోండి. మన ఆర్థిక పరిస్థితి గమనించటం అతని కర్తవ్యం.

అతను న్యూయార్క్ నగరం పైన గాలిలో తిరుగుతూ ఆర్థిక స్థితిని పరిశీలిస్తూ 2007కు 2009 కి మధ్య ఎలా మారిందో తెలుసుకుంటూ ఉంటాడు.

2007 నూతన సంవత్సర సాయంత్రం అతను టైమ్స్ స్క్వేర్ పైన్ తిరుగుతూ ఉంటాడు. దేదీప్యమానంగా కాంతులు వెదజల్లుతున్న దీపాలు, తాటిప్రమాణంలో ఉన్న ప్రకటన బోర్డులు, బాణసంచా, TV కెమేరాల మధ్య ఆనందంగా పార్టీలకు తర్లుతున్న వేలాది మంది పౌరులను చూస్తాడు.

2009 నూతన సంవత్సర సాయంత్రం తిరిగి ఆ గ్రహాంతరవాసి టైమ్స్ స్క్వేర్ కు వస్తాడు. దేదీప్యమానంగా కాంతులు వెదజల్లుతున్న దీపాలు, తాటి ప్రమాణంలో ఉన్న ప్రకటన బోర్డులు, రంగురంగుల బాణసంచా, TV, కెమెరాల మధ్య ఆనందంగా పార్టీలకు తర్లుతున్న వేలాదిమంది పౌరులను చూస్తాడు.

అంతా ఒకటిగానే ఉన్నది. అతనికి తేడా ఏమీ కనపడలేదు.

న్యూయార్క్ నగరవాసులు సుమారు అదే సంఖ్యలో ఊరు చుట్టబెడుతున్నారు. వారి చుట్టూ ఆఫీసు భవనాలు అదే సంఖ్యలో ఉన్నాయి. వాటిలో ఉన్న డెస్కుల సంఖ్య, కంప్యూటర్ల సంఖ్య, ఇంటర్నెట్ కనెక్షన్ల సంఖ్య అంతా మునుపటిలాగానే ఉన్నది.

నగరం వెలుపల అవే కర్మాగారాలు, అవే గిడ్డంగులు, వాటిని కలుపుతున్న అవే రహదార్లు, ఆ రోడ్లమీద అదే సంఖ్యలో వాహనాలు.

మరికొంచెం కిందికి దిగి అవే విషయాలు బోధిస్తున్న అవే విశ్వ విద్యాలయాలు, అదే సంఖ్యలో ఉన్న జనానికి ఇస్తున్న అవే పట్టాలు.

అదే సంఖ్యలో ఉన్న ఆవిష్కరణలను భద్రపరుస్తున్న అవే పేటెంట్లు.

సాంకేతికత అభివృద్ధి చెందిందని అతను గమనిస్తాడు. 2009లో ప్రతి ఒక్కరి చేతిలోను ఒక స్మార్ట్ ఫోన్ ఉన్నది. 2007 లో అవి లేవు. కంప్యూటర్లు మునుపటికంటే వేగంగా ఉన్నాయి. వైద్యరంగం మెరుగ్గా ఉన్నది. కార్లు ఒకలీటర్ గాస్ తో మునుపటికంటే ఎక్కువ దూరం నడుస్తున్నాయి. సౌరశక్తి వినియోగం,

ఫ్రాకింగ్ టెక్నాలజీ వృద్ధిచెందాయి. సామాజిక మాధ్యమాల రొద ఆకాశాన్నంటు తున్నది.

దేశమంతా చుట్టుతిరిగినా అతనికి అదే దర్శనమిచ్చింది. ప్రపంచమంతా చుట్టివచ్చాడు. అంతా అదే !

ఆర్థిక స్థితి 2007లో ఎలాఉన్నదో 2009 లో సుమారు అలాగే ఉన్నది. కొంచెం మెరుగ్గా కూడా ఉన్నదేమో అని అతని నిర్ధారణ.

అప్పుడు ఆయన దృష్టి అంకెలవైపు మళ్ళింది.

2007 నాటికంటే 2009లో US గృహస్థులు 16 ట్రిలియన్ డాలర్లమేరకు పేదవారయ్యారని చూసి షాక్ అయ్యాడు.

మరొక 10 మిలియన్ అమెరికన్లు నిరుద్యోగులయ్యారని తెలిసి అవాక్కు అయ్యాడు.

ప్రస్తుతం స్టాక్ మార్కెట్ విలువ రెండేళ్ళనాటి విలువలో సగం మాత్రమేనని తెలిసి నమ్మలేకపోయ్యాడు.

ఆర్థిక భవిష్యత్తు ప్రజల దృష్టిలో అంధకారమయంగా ఉన్నదని గమనించి ఉక్కిరిబిక్కిరయ్యాడు.

“నాకేమీ అంటు పట్టటంలేదు.” అతను అంటాడు. “నేను నగరాలు దర్శించాను. కర్మాగారాలు చూశాను. మీ అందరి శాస్త్రజ్ఞానం ఆదేస్థాయిలో ఉన్నది. సాధనాలు అవే ఉన్నాయి. ఆలోచనలు, భావాలు అలాగే ఉన్నాయి. ఏమీ మారలేదు. మరి ఈ పేదరికం ఎలా వచ్చిపడింది? అందరూ ఎందుకు ఇలా నిరాశలో కొట్టుకులాడుతున్నారు?

2007కు 2009 కి మధ్య ఒకమార్పు వచ్చింది. ఆ మార్పు ఆ గ్రహాంతరవాసి గమనించలేకపొయ్యాడు. ఆర్థిక స్థితిని గురించి మనకుమనం చెప్పుకున్న కథలు.

2007 లో ఇళ్ల ధరలు నిలదొక్కుకుంటాయని, బ్యాంకర్లు దూరదృష్టితో, ప్రాజ్ఞతతో వ్యవహరిస్తారనీ, ఫైనాన్షియల్ మార్కెట్లలో వెలకు తగిన రిస్క్ మాత్రమే చేస్తారనీ కథ చెప్పుకున్నాం.

2009 లో ఆ కథ నమ్మటం ఆపివేశాం.

జరిగిన మార్పు అదొక్కటే. కానీ అది ఒక్కటే ప్రపంచాన్ని తారుమారు చేసింది.

ఇళ్లధరలు పెరుగుతూ ఉంటాయనే కథ చెదిరిపోగానే తనఖా చెల్లింపులలో నాగాలు పెరిగిపోయ్యాయి. బ్యాంకులు డబ్బు కోల్పోయాయి. దానితో బ్యాంకులు ఇతర వ్యాపారాలకు అప్పులు ఇవ్వటం తగ్గించేశాయి. అందువల్ల నిరుద్యోగం పెరిగింది. దానితో వ్యయం తరిగిపోయింది. ఆ కారణంగా మరికొంత నిరుద్యోగం...అలా... అలా కథకు అంటిపెట్టుకోవటం మాట అటుంచి, సంపాదనకూ, ఐశ్వర్యానికీ మనకు 2007 లో ఎంత సత్తా ఉన్నదో 2009 లో కూడా - కొంచెం మెరుగ్గా కూడా ఉన్నదేమో - అదే సత్తా ఉన్నది. కానీ ఆర్థిక స్థితి 80 ఏళ్ల చరిత్రలో అత్యంత హీన స్థితికి చేరుకున్నది.

1945 లో జర్మనీ లో జరిగినదానికీ దీనికీ తేడా ఉన్నది. అక్కడ ఉత్పాదన సమూలంగా పెకలించివేశారు. ఆ మాటకు వస్తే 2000 లలో జపాన్ లో జరిగినదానికీ దీనికీ పోలిక లేదు. ఆనాడు జపాన్ లో పని చెయ్యగల వయసుఉన్నవారి సంఖ్య కుంచించుకు పోతున్నది. అది కంటికి కనబడే ఆర్థిక నష్టం. 2009 లో మనం కథాఘాతం కలిగించుకున్నాం. అది దారుణం. అది అత్యంత శక్తివంతమైన ఆర్థిక బలగం.

ఆర్థికవ్యవస్థలు, వాణిజ్యాలు, పెట్టుబడులు, వృత్తులు వగైరాలను గురించి ఆలోచించేటప్పుడు మనం కంటికి కనబడే వాటిని గురించి ఆలోచిస్తాం. ప్రస్తుతం చేతిలో ఎంత ఉన్నది? ఇంకా ఎంత సంపాదించ గలం?

కానీ ఆర్థిక రంగంలో కథలు చాలా శక్తివంతమైన బలగం. ఆర్థిక రంగంలో కంటికి కనబడే భాగాలకు అది ఇంధనంలాగా పనిచేయ్యగలదు. లేదా మన సామర్థ్యాలను పట్టి బంధించే అవరోధంగా కూడా పనిచెయ్యవచ్చు.

మీ డబ్బుతో వ్యవహరించేటప్పుడు, ఈ కథా చాలిత ప్రపంచంలో రెండు విషయాలు గుర్తు పెట్టుకోవాలి.

---

## 1. ఒక విషయం నిజమైతే బాగుణ్ణు అని మీరు కోరినప్పుడు, అది నిజమయ్యే అవకాశాలు ఎక్కువగా కనిపించే కథనే మీరు నమ్ముతారు.

మీ జీవితంలో అత్యంత ఆనందదాయకమైన రోజు ఏది?

'హౌ టు లివ్ ఫరెవర్' (How to Live Forever) అన్న డాక్యుమెంటరీ చిత్రంలో ఒక శతవృద్ధను అమాయకంగా ధ్వనించే ఆ ప్రశ్న అడుగుతారు.

"యుద్ధవిరమణ సంధి రోజు (Armistice Day)." అన్నదామె. అది మొదటి ప్రపంచ యుద్ధానికి ముగింపు పలికిన ఒప్పందం జరిగిన రోజు.

"ఎందుకని?" ఆ చిత్రనిర్మాత అడుగుతారు.

"ఇక ఎన్నడూ యుద్ధాలు ఉండబోవని మనకు తెలుసు గనక." ఆమె జవాబు.

21 సంవత్సరాల తర్వాత రెండవ ప్రపంచ యుద్ధం మొదలైంది. అందులో 75 మిలియన్ ప్రజలు హతులైనారు.

జీవితంలో మనం చాలా విషయాలు నిజమేననుకుంటాం. అవి ఎలాగైనా సరే నిజం కావాలని మన అభీష్టం.

వీటిని "మనసును దోచే కల్పనలు" అంటాను నేను. డబ్బును గురించిన మన ఆలోచనలను ఇవి చాలా ప్రభావితం చేస్తాయి – ముఖ్యంగా పెట్టుబడులు, ఆర్థిక వ్యవస్థ.

మీరు తెలివైనవారు. పరిష్కారాలు తెలుసుకోవాలనుకుంటారు. కానీ మీ చేత ఉన్న నియంత్రణ పరిమితం. పందెం మాత్రం పెద్దది. అప్పుడే మనసునుదోచే కల్పన జరుగుతుంది.

అవి మహాశక్తివంతమైనవి. అవి మీచేత ఏదైనా నమ్మిస్తాయి.

ఒక చిన్న ఉదాహరణ.

ఆలీ హజాజీ కుమారుడు జబ్బుపడ్డాడు. ఆయనకు యెమెని గ్రామపెద్దలు ఒక నాటువైద్యం సలహా ఇచ్చారు. కొడుకు శరీరంనుంచి జబ్బు బయటికి లాగాలంటే, కాలుతున్న కొరివి కొన అతని ఛాతీలో దూర్చుమని ఆ సలహా.

ఆ కార్యక్రమం ముగిసిన తర్వాత హజాజీ న్యూయార్క్ టైమ్స్ తో "మీ చేతిలో డబ్బు లేక మీ కొడుకు జబ్బుగా ఉన్నపుడు మీరు ఏదైనా నమ్ముతారు." అన్నారు.[64]

ప్రయోజనకరమైన వైద్యం రాకపూర్వం వేలాది సంవత్సరాలుగా వైద్యం వాడుకలో ఉన్నది. క్రిములను కనుగొనటం, శాస్త్రీయపద్ధతి రాకమునుపు

రక్తస్రావం, లంఖనాల వైద్యం, దయ్యాలను, పిశాచాలను శరీరంలోనుంచి బయటికి లాగటానికి శరీరంలో తూట్లు పొడవటం లాంటి ఇతర చికిత్సలు ఇంకా అనేకం ఉండేవి. ఇవన్నీ జీవితానికి త్వరగా మంగళం పాడాయి.

అది వెర్రితనంగా తోచవచ్చు. మీకు ఎలాగైనా సరే ఒక పరిష్కారం కావాలి. మంచి పరిష్కారమేదో తెలియదు. లేదా మీకు అందుబాటులో లేదు. హజాజీ తర్కమే శరణ్యం: ఏదైనాసరే నమ్మటానికి సమ్మతించటం. ఏదైనా సరే ప్రయత్నించటం కాదు, నమ్మటం.

లండన్‌ను ఆవహించిన ప్లేగ్ (Great Plague) గురించి 1722 లో డేనియల్ డెఫో వ్రాస్తారు:

> జనం భవిష్యద్వాణికి, జ్యోతిశ్శాస్త్ర రాశిఫలాలకు, కలలకు, జానపద కథలకు అంటుకు పోయ్యారు. పంచాంగాలంటే వారికి విపరీతమైన భయం. ఇంటి స్తంభాలమీద, దారి మలుపులలో డాక్టర్ బిల్లులు అతికించి ఉండేవి. వాటికితోడు ఏమీ తెలియనివాళ్ళ కాగితాలు అంటించి ఉండేవి. వాటిలో తమదగ్గర అద్భుతమైన చికిత్స, మందులు ఉన్నాయని, వచ్చి వాటి ప్రయోజనం పొందమని ఆహ్వానాలు: "నిర్దుష్టమైన ప్లేగ్ నిరోధక మాత్రలు", "సంక్రమణాన్ని నిరోధించటంలో తిరుగులేని మందు", "గాలిలో దోషానికి రాజవైద్యం"

18 నెలలలో ఆ ప్లేగ్ లండన్‌లో నాలుగోవంతు ప్రజలను పొట్ట బెట్టుకుంది. అటువంటి ప్రమాద పరిస్థితిలో మీరు దేన్నైనా నమ్ముతారు.

అదే పరిమితమైన సమాచారం, విపరీతమైన ప్రమాదం మన ఆర్థిక నిర్ణయాలను ఎలా ప్రభావితం చేస్తాయో ఆలోచించండి.

టెలివిజన్‌లో ప్రసారమయ్యే పెట్టుబడుల వ్యాఖ్యానాలు జనం ఎందుకు వింటారు? ఆ వ్యాఖ్యానాలలో సఫలమైనవి చాలా కొద్ది. కానీ పెట్టుబడులు భారీ లాభనష్టాలతో కూడుకున్నవి. ఏవో కొన్ని మంచి స్టాక్స్ పట్టండి. అనాయాసంగా మీరు ధనికులైపోతారు. ఎవరైనా చెప్పింది జరగటానికి 1% అవకాశమున్నా, ఆ ఒక్కశాతమూ ఫలిస్తే మీ జీవితమే మారిపోతే ఆ చెప్పేది

జాగ్రత్తగా వినటం వెర్రి ఏమీ కాదు. (ఏ పుట్టలో ఏ పాము ఉన్నదో ఎవరికి తెలుసు?)

ఆర్థిక రంగంలో అభిప్రాయాలు కొల్లలు. మీరు ఒక అభిప్రాయాన్ని ఒక జట్టును పట్టుకుంటే, ఆర్థికంగాను, మానసికంగాను మీరు అందులో సభ్యులైపోతారు. ఒక స్టాక్ పదింతలు పెరగాలనుకుంటే అది మీ జాతి. ఒక ఆర్థిక సిద్ధాంతం ద్రవ్యోల్బణం కలిగిస్తుందని మీరనుకుంటే, అది మీ పక్షం.

ఇవన్నీ హీన సంభావ్యత ఉన్న పందాలు కావచ్చు. ప్రేక్షకులు కనిష్ట అవకాశాలు అంటే 1% అవకాశాలు అంచనా వెయ్యరు, చేయలేరు. చాలామంది అది నిజమయితే బాగుణ్ణు అన్న నమ్మకానికి దాసులవుతారన్నది తిరుగులేని సత్యం. ఒకవేళ నిజమయితే కలిగే లాభం అపరిమితం కావటమే వారు అలా ప్రవర్తించటానికి కారణం.

అపారమైన ప్రతిఫలాలను ప్రతిరోజూ చూపే రంగం పెట్టుబడి ఒక్కటే. వాతావరణ ఫలితాలకంటే ప్రజలు ఆర్థిక ఫలితాలను ఎక్కువగా నమ్ముతారు. వచ్చేవారం వానకురుస్తుందా, ఎండకాస్తుందా అన్న జోస్యానికి కలిగే ఫలితాలకంటే వచ్చేవారం స్టాక్ మార్కెట్ ఎలా ఉంటుందో చెప్పగలిగితే మీ ప్రపంచమే మారిపోతుంది.

ఉదాహరణకు 2018 లో ముగిసిన పది సంవత్సరాలకాలం మ్యూచువల్ ఫండ్స్‌లో 85% ఆశించిన స్థాయికి చేరలేదనుకోండి.[65] ఆ అంకెలు తరాల తరబడిగా అలాగే స్థిరంగా ఉంటున్నాయి. అంత దయనీయమైన ఫలితాలు చూపించే పరిశ్రమ ఏదో ప్రత్యేకమైన సేవ అయి ఉంటుంది, ఎంతోకాలం వ్యాపారంలో నిలవదని మీరనుకోవచ్చు. కానీ ఈ ఫండ్స్ లో దాదాపు ఐదు ట్రిలియన్ డాలర్లు పెట్టుబడి ఉన్నది.[66] పెట్టుబడిలో వారెన్ బుఫే వారసులవంటి వారి సరసన పెట్టుబడి పెట్టే అవకాశం ఇచ్చిచూడండి. మిలియన్లకొద్దీ జనం వారి జీవితాంతం కూడబెట్టిన సొమ్మంతా అందులో పెట్టటానికి సిద్ధమవుతారు.

లేకపోతే, బెర్నీ మాడాఫ్‌ను తీసుకోండి. వెనక్కు తిరిగి చూస్తే ఆయన పొంజీ స్కీమ్ ఏమిటో తెలియటం కష్టమేమీ కాదు. ఆయన చూపించే లాభాలు ఎప్పుడూ ఒకటిగానే ఉండేవి. ఆయన ఎకౌంట్లు ఏదో ఒక అనామక ఎకౌంటింగ్ సంస్థ ఆడిట్ చేసేది. లాభాలు ఎలా వచ్చాయో వివరాలు చెప్పటానికి ఆయన

నిరాకరించారు. అయినా ప్రపంచంలో ఎంతో తెలివైన పెట్టుబడిదారుల దగ్గరినుంచి మాడాఫ్ బిలియన్ల డాలర్లు సంపాదించారు. ఆయన మంచి కథ చెప్పారు. జనం వినటానికి, నమ్మటానికి సిద్ధంగా ఉన్నారు.

పొరబాటుకు అవకాశము, ఒదుగుబాటు, ఆర్థిక స్వాతంత్ర్యం - గత అధ్యాయాలలో చర్చించిన ముఖ్య విషయాలు - ఎందుకు అనివార్యమో ఇక్కడే తెలుస్తుంది.

మీకు అంగీకారమైన ఫలితాలు రావాలంటే మీరనుకున్నది నిజం కావటం అవసరం. కానీ నిజం కావాలని ఆశించేది మరొక స్థాయిలో ఉంటుంది. ఈ రెండింటిమధ్య దూరం ఎంత ఎక్కువయితే - మనసును దోచే ఆర్థిక కల్పనకు వశులు కాకుండా - మిమ్మల్ని మీరు అంత కాపాడు కుంటున్నారన్నమాట.

2007 ఆఖరి సమావేశంలో ఫెడరల్ రిజర్వ్ 2008, 2009 సంవత్సరాలలో ఆర్థిక అభివృద్ధి ఎలా ఉండబోతున్నదో అంచనావేసి చెప్పింది.[67] అప్పటికే ఆర్థికవ్యవస్థ బలహీనమవుతున్నది. కనుక ఈ అంచనాకూడా అంత ఆశాజనకంగా ఏమీలేదు. సంభావ్య అభివృద్ధి 1.6 % నుంచి 2.8% మధ్య ఎంతైనా ఉండవచ్చునని అంచనా. అదే వారి సేఫ్టీ మార్జిన్. పొరబాటుకు అవకాశం. యదార్థానికి ఆర్థిక వ్యవస్థ 2% మించి కుంచించుకు పోయింది. అంటే ఫెడరల్ రిజర్వ్ వారి అంచనా మూడింతలు తప్పుబడిందన్నమాట.

ఆర్థిక మాంద్యం రాబోతున్నదని చెప్పటం రాజనీతిజ్ఞులకు కష్టమైన వ్యవహారం. ఎందుకంటే, ఆర్థిక మాంద్యం వచ్చిందంటే వారి ఉద్యోగాలు చిక్కుల్లో పడతాయి. కనుక అథమాథమ అంచనాలలోకూడా 'నిదానమైన పెరుగుదల' కంటే దుర్భరమైన అంచనాలు రావటం చాలా అరుదు. అదే మనసును దోచే కల్పన. దానిని నమ్మటం సులువు. అంతకంటే కఠినమైన అంచనా తలుచుకోవటానికి కూడా బాధాకరంగా ఉంటుంది.

పాలసీ తయారుచేసేవారు సులువుగా విమర్శలకు లోనవుతారు. కానీ కొద్దిగానో, గొప్పగానో మనమందరమూ ఈ పని చేస్తూనే ఉంటాం. ఆర్థిక మాంద్యం రాబోతున్నదని ఊహించి మీరు మీ స్టాక్స్ సొమ్ము చేసుకున్నారు. ఏమి జరగాలని మీరు అనుకుంటున్నారో దానికనుగుణంగా ఆర్థికస్థితిని గురించి మీ అభిప్రాయం రూపు దిద్దుకుంటుంది. ప్రతి సంఘటన, ప్రతి కథానిక

ఆర్థికమాంద్యం మీదపడినట్లే అనిపిస్తుంది. అది నిజంగా వచ్చినందువల్ల కాదు, మీరు ఆశిస్తున్నారు గనుక.

ప్రోత్సాహకాలు బలమైన ప్రేరణలు. మన ఆర్థిక దృక్పథాలను, లక్ష్యాలను అవి ఎలా ప్రభావితం చేస్తాయో మనం ఎప్పుడూ గుర్తుంచుకోవాలి. ఆర్థికరంగంలో పొరబాటుకు అవకాశం ఇవ్వటానికి మించిన శక్తి మరొకటి లేదు. స్టేక్స్ పెరుగుతున్నకొద్దీ అవకాశం పెరుగుతూ ఉండాలి. ఇంతకుమించి చెప్పగలిగింది లేదు.

## 2. ఈ ప్రపంచాన్ని గురించి ప్రతిఒక్కరి ఊహా అసంపూర్ణమే. కానీ ఖాళీలు నింపటానికి మనం కథ చెప్తాము.

నేను ఇది వ్రాస్తున్నప్పుడు నా కుమార్తె వయసు ఒక సంవత్సరం. తనకు ప్రతి ఒక్కటీ తెలుసుకోవాలని అమితమైన ఆకాంక్ష. దానికి తోడు అన్నీ చాలా త్వరగా నేర్చుకుంటుంది కూడాను.

కానీ తనకు అర్థంకాని విషయాలను గురించి నేను అప్పుడప్పుడు ఆలోచిస్తూ ఉంటాను.

వాళ్ళ నాన్న ప్రతిరోజూ ఆఫీసుకు ఎందుకు వెళ్తాడో తనకు తెలియదు.

బిల్లులు, బడ్జెట్, ఉద్యోగాలు, ప్రమోషన్లు, రిటయిర్మెంట్ కోసం పొదుపు చెయ్యటం వంటి విషయాలు ఆ చిన్న మనసు ఊహకందనివి.

ఫెడరల్ రిజర్వ్, అప్పులకు సంబంధించిన వివరాలు, NAFTA తనకు వివరించటాన్ని గురించి ఊహించండి. అసంభవం.

కాని తను చీకటి ప్రపంచంలో లేదు. తను అయోమయంలో తిరుగాడుతూ ఉండదు.

ఒక సంవత్సరం వయసులోనే ప్రతిదీ ఎలా పనిచేస్తుందో అంతరంగంలో కథ వ్రాసుకున్నది.

దుప్పటి కప్పుకుంటే వెచ్చగా ఉంటుంది, అమ్మను కావలించుకుంటే భయం ఉండదు. ఖర్జూరకాయలు తినటానికి రుచిగా ఉంటాయి.

తన మనసులో కొన్ని నమూనాలు ఉన్నాయి. కనుక తనకు ఎదురైన

ప్రతిఒక్కటీ ఆ నమూనాలలో ఏదో ఒకదానిలోకి ఇముడ్చుతుంది. నేను పనికి వెళ్లినప్పుడు, నా జీతం ఎంత, చెల్లించవలసిన బిల్లులు ఏమేమి ఉన్నాయా అని, తను అయోమయంలో నిలిచిపోదు. ఆ పరిస్థితి వర్ణించటానికి తన దగ్గర పుష్కలమైన సరుకు ఉన్నది: నాన్న నాతో ఆడటం లేదు, నాన్న నాతో ఆడితే బాగుంటుంది. నాకు దిగులుగా ఉన్నది.

తనకు తెలిసింది చాలా కొద్ది మాత్రమే. ఆ విషయం తనకు తెలియదు. తనకు తెలిసినంతలో జరిగుతున్న దానిని గురించి ఒక కథ చెప్పుకుంటుంది.

మనమందరమూ, మన వయసు ఎంతైనా సరే, అదే పనిచేస్తాము.

నా బిడ్డ లాగానే, నాకేం తెలియదో నాకు తెలియదు. కనుక నా మనసు పరిధిలో ఉన్న నమూనాల సహాయంతో ఈ ప్రపంచాన్ని అర్థంచేసుకుని విపులీకరించే ప్రయత్నం చేస్తాను.

తనలాగానే నేనూ ప్రతిఒక్క విషయంలోనూ బాగా అర్థమయ్యే కారణాలకోసం వెతుకుతాను. తనలాగానే నేనూ చాలా విషయాలలో తప్పులు చెబుతూ ఉండవచ్చు. నేననుకునే దానికంటే ఈ ప్రపంచాన్ని గురించి నాకు నిజంగా తెలిసింది చాలాకొద్ది.

వాస్తవ విషయాలన్నిటా ఇదే సత్యం.

చరిత్ర తీసుకోండి. అది కేవలం జరిగిన విషయాలను, సంఘటనలను ఏకరువు పెట్టటం. అది స్పష్టంగా, ప్రయోజన పూర్వకంగా ఉండాలి. బి.హెచ్.లిడెల్ హార్ట్ తన పుస్తకం 'వై డోంట్ వుయ్ లెర్న్ ఫ్రమ్ హిస్టరీ' (Why Don't We Learn From History?) లో వ్రాస్తారు:

> ఊహాశక్తి, సద్యఃస్ఫురణ లేకుండా చరిత్రకు అర్థం చెప్పలేం. అందులో సాక్ష్యాధారాలు బండెడు. వాటిలో ఏరి తీసుకోవటం తప్పనిసరి. ఆ తీసుకోవటానికి ఏరటం ఒక కళ. చరిత్ర చదివే వారు తమ వ్యక్తిగత అభిప్రాయాలకు అనుగుణంగా ఉన్నదానిని, తాము చెప్పింది సమర్థించేదానికోసం మాత్రమే చూస్తారు. తమ విశ్వాసాన్ని కాపాడుకుంటారు. వారు సమర్థించటానికి లేదా వాగ్యుద్ధానికి మాత్రమే చదువుతారు. అందరూ దేవతల పక్షంలో ఉండాలను కుంటారు గనుక, వారు అసౌకర్యం కలిగించే నిజాన్ని నిరసిస్తారు.

ఇది యుద్ధాలకు ముగింపు పలకటానికి మనం యుద్ధాలు చేసినట్లే.

గతాన్ని అర్థం చేసుకోవటానికి జనం తమకు తామే కథలు చెప్పుకుంటారని ఒకసారి డేనియల్ కానేమన్ నాతో అన్నారు:

వెనక చూపు, గతాన్ని విపులీకరించే సామర్థ్యంవల్ల ఈ ప్రపంచం మనకు అర్థమవుతుందనే భ్రమ కలుగుతుంది. మనకర్థం కాకపోయినా, ఈ ప్రపంచం మనకర్థమవుతుందనే భ్రమ కలిగిస్తుంది. అనేక రంగాలలో తప్పులు జరగటానికి ఇది ఒక పెద్ద కారణం.

తమకు అర్థంకాని దేదైనా ఎదురైనప్పుడు అది తమకర్థం కాలేదని గ్రహించరు. ఈ లోకంలో ప్రజల అనుభవం చాలా పరిమితం. వారి దృక్పథం,అనుభవాల ననుసరించి తమకర్థం కానిదానికి వ్యాఖ్యానం, కథనంతో తయారవుతారు. మనం జీవించే ఈ జటిల ప్రపంచం మనకర్థం కావాలని మనందరి కోరిక. కనుక మనకు ఏమీ తెలియనిచోట ఖాళీలు నింపటానికి మనం మనకే కథలు చెప్పుకుంటాం.

ఆర్థికంగా ఈ కథలు మనకు చెప్పేది మైమరపించేదిగానూ, భయానకంగానూ ఉంటుంది.

కొన్ని విషయాలలో ఈ ప్రపంచం ఎలా పనిచేస్తుందో తెలియక పోతే,ఈ స్టాక్ మార్కెట్ పనిచేసే విధానం నేను పూర్తిగా అపార్థం చేసుకోవచ్చు. ఆ కారణంగా తర్వాత ఏం జరగబోతున్నదో నాకు తెలుసుననే ఆత్మవిశ్వాసం నాలో పెరగవచ్చు. ఈ ప్రపంచం మీరాశించినట్లుగానే నడుస్తుందని అనుకునేవారు మీరొక్కరే. కనుకనే స్టాక్ మార్కెట్ లో ఏమిజరగబోతున్నదో చెప్పటం దుస్సాధ్యం. మీరు కొన్ని నిర్ణయాలు చేస్తారు. అందుకు కారణాలు నాకు అర్థంకావు సరికదా, ఊహకు కూడా అందవు. మీ నిర్ణయం నేను గుడ్డిగా అనుసరించవచ్చు. ఆ నిర్ణయం మీకు మంచిదే కావచ్చు. నాకు వినాశకారి కావచ్చు. మనం 16 వ అధ్యాయంలో చూసినట్లుగా, బుడగలు ఏర్పడేది ఇలాగే.

మీకు ఎంత తెలియదో అన్న విషయం అంగీకరిస్తే, ఈ ప్రపంచంలో జరిగే దాంట్లో మీ అధీనంలో ఎంత లేదో అంగీకరించినట్లే. అది అంగీకరించటం చాలా దుర్భరమైన విషయం.

మార్కెట్ భవిష్యత్తులో ఎలా ఉండబోతున్నదో అన్న విషయం గురించి ఆలోచించండి. ఏమి జరగబోతున్నదో మనమెవరమూ చెప్పలేం. మార్కెట్ చరిత్రాత్మక సగటు లెక్కవేయవచ్చుగదా! మార్కెట్ ప్రతిసంవత్సరమూ ఆ సగటున పెరుగుతుందని మీరు అంచనావేస్తే, వాల్ స్ట్రీట్ బ్యాంక్ లలో లెక్కలువేసే 20 మంది మేధావుల లెక్కకంటే మీ లెక్క వాస్తవానికి అతిచేరువలో ఉంటుంది. ఇది నేను వేసిన లెక్క. ఆర్థిక మాంద్యాలను గురించి చెప్పటానికి మన సామర్థ్యం సరిపోదు. మహత్తర సంఘటనలు ఎక్కడినించో హఠాత్తుగా ఊడిపడతాయి. వాటిని గురించి ఊహాగానాలు చెయ్యటం వల్ల మంచికంటే చెడు జరిగే అవకాశం ఎక్కువగా ఉంటుంది. ఊహించని సంఘటనలే చాలావరకు ఫలితాలను నిర్ణయిస్తాయి. కార్ల్ రిచర్డ్స్ "మీరు అన్నివిధాలా ఆలోచించామనుకున్న తర్వాత మిగిలేదే రిస్క్ అంటే." అంటారు.

ప్రజలకు ఈ విషయం తెలుసు. మార్కెట్ ను గురించిన ఊహాగానాలు సముచితమేనని, అవి ప్రయోజనకారులని చెప్పిన పెట్టుబడిదారుడు నాకు ఇంతవరకూ కనబడలేదు. కానీ వార్తామాధ్యమాలలో, ఆర్థిక సలహాదారులలోనూ వాటికి విపరీతమైన డిమాండ్ ఉన్నది.

ఎందుచేత?

మనస్తత్వ శాస్త్రవేత్త ఫిలిప్ టెట్లాక్ ఒకసారి, "ఏమి జరగబోతున్నదో చెప్పగల, నియంత్రణలో ఉన్న ప్రపంచంలో నివసిస్తున్నామని మనం నమ్మాలి. కనుక ఆ కొరత తీర్చే మహామహులలాగా కనిపించేవారి అండ చేరుతాం."

ఆ కొరతతీర్చే అనే మాట చాలా పెద్దమాట. అంతా మన అధీనంలో ఉన్నదని నమ్మాలనుకోవటం గణన చేసి పరిష్కరించాల్సిన విశ్లేషణాత్మక సమస్య ఏమీ కాదు. అది కేవలం భావావేశ కండూతి. దానికి కావలసిందల్లా కొంచెం గోకుడు. ఏమి జరుగుతున్నదో మనం చెప్పలేమనే యదార్థానికంటే, అంతా మన అధీనంలోనే ఉన్నదనే భ్రమ బలీయమైనది. కనుక ఫలితాలు మనచేతిలో ఉన్నాయని చెప్పే కథలకు మనం దాసోహమవుతాం.

ఖచ్చితంగా చెప్పగలిగిన వాటికీ, చెప్పలేనివాటికీ మధ్య అయోమయమే ఇందుకు కారణం.

NASA వారి న్యూ హోరైజన్స్ అంతరిక్షనౌక రెండు సంవత్సరాల క్రితం ప్లూటో గ్రహాన్ని దాటివెళ్లింది. అది మూడు బిలియన్ మైళ్ళ ప్రయాణం. అందుకు

తొమ్మిదిన్నర సంవత్సరాలు పట్టాయి. NASA ప్రకటన అనుసరించి "2006 లో ఆ అంతరిక్ష నౌక బయలుదేరినప్పుడు, వేసిన అంచనా కంటే ఒక నిమిషం ముందుగా ఫ్లూటోను చేరింది."[68]

ఆలోచించండి. ఒక దశాబ్దం పాటు ఏ పరీక్షలూ లేకుండా జరిగిన ప్రయాణంలో, NASA లెక్కలు 99.99998% వంతు వరకూ కరెక్ట్ గా తేలాయి. ఇది బోస్టన్ నుంచి న్యూయార్క్ ప్రయాణం ఒక సెకండ్ లో 4,000,000, వంతు వరకూ కరెక్ట్ గా చెప్పినట్లు.

ఖగోళభౌతికశాస్త్రం అగ్రగామి శాస్త్రం. ఆర్థికశాస్త్రంలాగా అది మానవ ప్రవర్తన, భావావేశాలవల్ల ఏమీ చెక్కుచెదరదు. వ్యాపారము, ఆర్థికశాస్త్రము, పెట్టుబడి అనిశ్చితి మయమైన రంగాలు. ఇక్కడ జరిగే నిర్ణయాలు ఫ్లూటో ప్రయాణం సూత్రాలలాగా నిశ్చితమైన సూత్రాలకు కట్టుబడి ఉండవు. కానీ ఇక్కడకూడా ఫ్లూటో ప్రయాణం లాగానే తు.చ. తప్పకుండా జరగాలని మన ప్రగాఢ వాంఛ. ఎందుకంటే NASA ఇంజనీర్లు 99.99998% సఫలత సాధించ గలిగారనేది అత్యంత మనోహరం, ఆహ్లాదకరం. ఆ ఆనందం అనుభవించిన తర్వాత, మన జీవితాలలో డబ్బు వంటి ఇతర రంగాలలో కూడా మనకు ఎంత నియంత్రణ ఉన్నదో కథలుగా చెప్పుకోవాలని మన ఉబలాటం.

ఈ కథలు ఎలా నడుస్తాయో, కానేమన్ ఒకసారి చెప్పారు:

- ఏదైనా ఒక ప్రణాళిక రచించేటప్పుడు మనం ఏమి చెయ్యాలనుకుంటున్నాం, మనం ఏమి చేయగలం అనే విషయాలమీద ధ్యాస కేంద్రీకరిస్తాం. ఇతరుల ప్రణాళికలు, నైపుణ్యాలను గురించి మనం పట్టించుకోము. మన ఫలితాలమీద వాటి ప్రభావం ఏమిటి?
- గతాన్ని విపులీకరించేటప్పుడు, భవిష్యత్తును గురించి చెప్పేటప్పుడు మనం నైపుణ్యాలను గురించి మాట్లాడుతాము తప్ప, అదృష్టం పాత్రను గురించి పట్టించుకోము.
- మనకు తెలిసిన దాని మీదనే కేంద్రీకరిస్తాము, మనకు తెలియని దానిని గురించి పట్టించుకోము. అందువల్ల మన నమ్మకాలమీద మనకు అమిత విశ్వాసం ఏర్పడుతుంది.

వ్యాపారం మీద దాని ప్రభావమేమిటో ఆయన వివరిస్తారు:

> కొత్తగా వ్యవస్థలు స్థాపించుతున్న వ్యవస్థాపకులను, అందులో పాల్గొంటున్న వారిని అనేక సందర్భాలలో నేను ఒక ప్రశ్న అడిగాను: మీ సంస్థలో మీరు చేసే పనిలో సఫలత ఎంతవరకు మీ ప్రయత్నం మీద ఆధారపడి ఉంటుంది? చూడటానికి అది చాలా సులువైన ప్రశ్నలాగా తోస్తుంది. దీనికి జవాబు వెంటనే వస్తుంది. అది 80% ఎన్నడూ తగ్గలేదు. వారు సఫలత సాధిస్తారో లేదో తెలియనప్పుడు కూడా ఈ సాహసికులు తమ అదృష్టం తమ చేతుల్లో ఉన్న దనుకునేవారు. అక్కడే వారు పొరబడ్డారు. కొత్తగా ఆరంభమైన సంస్థ సఫలత కేవలం వారి శక్తిసామర్థ్యాల మీదనే కాక పోటీదార్ల విజయాలమీద, మార్కెట్ లో కలిగే మార్పుల మీద కూడా ఆధార పడుతుంది. కానీ వ్యవస్థాపకులు సాధారణంగా తమకు తెలిసినదానిమీద వారి పథకాలు, చర్యలు, కంటికి కనబడే అవకాశాలు, అవరోధాలమీద, నిధులు దొరకటం వంటి విషయాలు - కేంద్రీకరిస్తారు. తమ పోటీదార్లను గురించి వారికి ఎక్కువగా తెలియదు. కనుక పోటీ లేని భవిష్యత్తును వారు ఊహించటం సహజం.

కొద్దిగానో గొప్పగానో మనమందరమూ ఇలాగే వ్యవహరిస్తాం.

మా అమ్మాయి లాగానే మనం వాటిని పట్టించుకోము.

మనం గుడ్డిగాను, అయోమయంలోనూ తిరగం కదా. ఈ ప్రపంచం మనకు తెలిసిన ప్రకారంగానే నడుస్తుందని మనం అనుకోవాలి. లేకపోతే పొద్దున్నే పక్కమీది నుంచి లేవటం కష్టమై పోతుంది.

మరి భూమిపైన వెళుతూ తిరుగుతున్న ఆ గ్రహాంతరవాసి మాట ఏమిటి?

తను చూసినదాని ప్రకారం ఏమి జరుగుతున్నదో తనకు తెలుసునని ప్రతి ఒక్కరి దృఢ విశ్వాసం. కానీ ఇతరుల మనసులలో నడుస్తున్న కథలు తెలియవు గనుక అడుసు తొక్కారు.

మనమందరమూ అదే.

# 19.

# ఇప్పుడు అంతా ఒక చోట

---

మీ సొంత డబ్బును గురించి మనం ఏమి నేర్చుకున్నాం ?

---

ఇంకా చదువుతున్నందుకు మీకు శుభాభినందనలు!

ఇంతవరకూ మనం నేర్చుకున్నవన్నీ ఒకచోట చేర్చుదాం.

ఈ అధ్యాయం ఒకవిధంగా ఇంతవరకూ చెప్పినదానికి సంగ్రహం. ఆర్థిక నిర్ణయాలు చేయటంలో మీకు సాయంగా కొన్ని ఆచరణాత్మకమైన చిన్న చిన్న పాఠాలు.

మొదట దంతవైద్యుడితో భయంకరంగా వక్రించిన అపాయింట్ మెంట్ ను గురించిన కథ చెప్తాను. మీడబ్బుతో ఏంచెయ్యాలో చెప్పే సలహావల్ల కలిగే ప్రమాదాలను గురించి విలువైన విషయాలు బోధిస్తుంది.

---

1931 లో క్లారెన్స్ హ్యూస్ దంతవైద్యుడి దగ్గరికి వెళ్ళాడు. అతని నోరంతా నొప్పి పుడుతున్నది. ఆ నొప్పి తగ్గించటానికి దంతవైద్యులు అతనికి బలమైన మత్తుమందు ఇచ్చారు. కొన్ని గంటల తర్వాత కళ్ళు తెరిచిన క్లారెన్స్ కు తనకు 16 పళ్ళు పీకివేశారనీ, టాన్సిల్స్ తీసివేశారనీ తెలిసింది.

ఆ తర్వాత అంతా తలకిందులైంది. శస్త్రచికిత్సలో సంభవించిన చిక్కులవల్ల వారం రోజుల తర్వాత క్లారెన్స్ మరణించాడు.

ఆయన భార్య ఆ దంతవైద్యుల మీద దావా వేసింది. కానీ శస్త్రచికిత్సలో లోపం మీద కాదు ఆమె దావా. ఆనాడు ప్రతి ఒక్క శస్త్ర చికిత్సలోనూ మరణ ప్రమాదం పొంచి ఉండేది.

క్లారెన్స్ ఆనాటి చికిత్సా పద్ధతులు ఒప్పుకోలేదని ఆమె వ్యాజ్యం. ముందే తెలిసి ఉంటే శస్త్ర చికిత్సకు ఒప్పుకునేవారు కాదని ఆమె అభియోగం.

కేసు కోర్టులలో మెలికలు తిరుగుతూ నడిచింది. కానీ ఒక పరిష్కారం మాత్రం దొరకలేదు. 1931 లో డాక్టర్ కు రోగికీ మధ్య వ్రాతకోతల ఒప్పందం అంటూ ఏమీ లేదు. ఒక కోర్ట్ ఉత్తమమైన వైద్య నిర్ణయాలు చేయటానికి డాక్టర్లకు స్వాతంత్ర్యం కావాలని అభిప్రాయం వెలిబుచ్చింది. “అలా కాకపోతే, విజ్ఞానశాస్త్ర అభివృద్ధిని మనం ఆనందించలేము.”

చరిత్రకందినంత వరకు రోగికి నయంచేయటం డాక్టర్ విధ్యుక్త ధర్మమని వైద్యశాస్త్ర సంప్రదాయ ఆలోచన. డాక్టర్ చికిత్సా విధానాన్ని గురించి రోగి ఏమనుకున్నారనేది ఇక్కడ అప్రస్తుతం. తన పుస్తకం 'ది సైలెంట్ వర్ల్డ్ బిట్వీన్ డాక్టర్ అండ్ పేషన్ట్' (The Silent World Between Doctor and Patient) లో డాక్టర్ జె కాట్జ్ వ్రాస్తారు:

> ఆ లక్ష్యం నెరవేరాలంటే రోగి శారీరిక, మానసిక అవసరాలు రెండూ ఎలా చికిత్స చెయ్యాలా అన్నది డాక్టర్ల భారమే. అందులో నిర్ణయాధికారం డాక్టర్లదే. వాటిని గురించి రోగితో చర్చించవలసిన అవసరం డాక్టర్లకు లేదని ఆనాటి వైద్యవర్గ అభిప్రాయం. డాక్టర్ల నిర్ణయాలలో రోగులకు కూడా పాత్ర, హక్కు ఉన్నాయనే భావన ఆనాటి వైద్య సాంప్రదాయంలో లేదు.

అందులో అహంకారమూ, దురుద్దేశ్యమూ లేవు. ఆ విశ్వాసంలో రెండు అంశాలు ఉన్నాయి:

1. ప్రతి ఒక్క రోగీ వ్యాధినుంచి బయటపడాలనే కోరుకుంటాడు.
2. వారికి చికిత్సకు సవ్యమైన విశ్వవ్యాప్త మార్గం ఉన్నది.

పై రెండు అంశాలతోనూ మీరు ఏకీభవిస్తే, చికిత్సా ప్రణాళికలో రోగి సమ్మతి అనవసరమనే భావన సరియైనదేనని అనిపిస్తుంది.

కానీ వైద్యశాస్త్రం అలా పనిచేయదు.

గత 50 సంవత్సరాలలో వైద్యవిద్యాలయాలు వ్యాధికి చికిత్స చేయాలనే ఆలోచన నుంచి రోగికి చికిత్స జరపాలనే భావనకు సున్నితంగా కదిలారు.

అంటే అందుబాటులో ఉన్న చికిత్సాపద్ధతులు ఏకరువుపెట్టి, వాటిలో తమకు ఉత్తమమని తోచిన వాటిని రోగి నిర్ణయించుకునే అవకాశం వైపు కదిలారు.

ఈ ధోరణికి రోగి రక్షణ న్యాయాలు కొంతవరకూ కారణం. డాక్టర్ కాట్జ్ ప్రభావ వంతమైన రచన మరికొంత కారణం. వైద్య రంగంలో విలువలను గురించి రోగులకు విపరీతమైన భిన్నాభిప్రాయాలు ఉన్నాయి. కనుక వారి విశ్వాసాలు పరిగణించాలి అని ఆయన వాదన. కాట్జ్ వ్రాస్తారు:

వైద్యులు తమ కళను, శాస్త్రాన్నీ ప్రయోగించేటప్పుడు కేవలం తమ శ్రేయోదాయకమైన సంకల్పాలు, ఏది సవ్యమైన మార్గమో నిర్ణయించే సామర్థ్యమూ మాత్రమే ప్రయోగించటం ప్రమాదకరమైన చెలగాటం. అది అంత సులభం కాదు. వైద్యం ఒక జటిలమైన వృత్తి. వైద్యుడికీ, రోగికీ మధ్య మాటామంతీ కూడా అంతకంటే జటిలమైనవి.

ఆ చివరి పంక్తి చాలా ముఖ్యమైనది. "వైద్యం ఒక జటిలమైన వృత్తి. వైద్యుడికీ రోగికీ మధ్య మాటామంతీ కూడా అంతకంటే జటిలమైనవి."

అటువంటిదే మరొక వృత్తి ఏమిటో తెలుసా? ఆర్థిక సలహా.

నాకు మీరెవరో తెలియదు కనుక మీ డబ్బుతో మీరేం చెయ్యాలో నేను చెప్పలేను.

మీకేం కావాలో నాకు తెలియదు. మీకు ఎప్పుడు కావాలో నాకు తెలియదు. అది మీకు ఎందుకు కావాలోకూడా నాకు తెలియదు.

కనుక మీ డబ్బుతో మీరేం చెయ్యాలనేది నేను చెప్పబోవటంలేదు. క్లారెన్స్ హ్యూస్ కు చికిత్స చేసిన ఆ వైద్యుడిలాగా నేను మీతో వ్యవహరించ బోవటం లేదు.

కానీ డాక్టర్లు, దంతవైద్యులు నిష్ప్రయోజకులు కారు. వారికి విద్య ఉన్నది. ఒక పరిస్థితిలో లాభనష్టాలేమిటో వారికి తెలుసు. రోగులు తమకు ఈ చికిత్స సవ్యమైనదో రకరకాల నిర్ణయాలకు వచ్చినా, ఏది ప్రయోజనకారి అవుతుందో వైద్యులకు బాగా తెలుసు.

ఆర్థిక రంగంలో సలహాదార్లు కూడా అంతే. డబ్బులో జగమెరిగిన సత్యాలు కొన్ని ఉన్నాయి. ఆ సత్యాలను తమ డబ్బుకు ఎలా ప్రయోగించాలన్న విషయంలో జనం విభిన్న నిర్ణయాలు చేయవచ్చు.

ఆ హెచ్చరిక మనసులో ఉంచుకోండి. ఇప్పుడు మీ డబ్బుతో మేలైన నిర్ణయాలు చేయటానికి సాయపడే కొన్ని సిఫార్సులు పరిశీలిద్దాం.

---

**అన్నీ సవ్యంగా నడుస్తున్నప్పుడు నమ్రతతో ఉండటానికి సర్వవిధాలా ప్రయత్నించండి. ఏదీ సవ్యంగా నడవనప్పుడు క్షమాగుణం, అనుకంప అలవర్చుకోవాలి:** ఎందుకంటే ఏదీ కంటికి కనబడేటంత మంచీకాదు, చెడూ కాదు. ఈ విశాలవిశ్వం చాలా క్లిష్టమైంది. అదృష్టము, సాహసము రెండూ యదార్థాలు. కానీ వాటిని కనిపెట్టటం కష్టం. మిమ్మల్నిగురించి గాని, ఇతరులను గురించి గాని తీర్మానించేటప్పుడు ఈ పని చెయ్యండి. అదృష్టం, సాహసాల శక్తిని ఆదరించండి. అప్పుడు మీరు నియంత్రించ గలిగిన అంశాలమీద కేంద్రీకరించ గలుగుతారు. దానికి తోడు అనుసరించదగిన ఆదర్శవ్యక్తులు దర్శనమిస్తారు.

**అహంకారం అల్పం, ఐశ్వర్యం అధికం.** మీ అహంకారానికీ మీ ఆదాయానికీ మధ్య ఉండే ఎడమే పొదుపు. సంపద మీ కంటికి కనబడేది కాదు. భవిష్యత్తులో అధిక సత్తా, అధిక అవకాశాలూ కలగాలంటే, ఇవాళ కొనగలిగిన దానిని అణిచిపెట్టటమే సంపద సృష్టించటానికి బాట. మీరు ఎంత సంపాదించినా సరే, ఆ డబ్బుతో ఈనాటి మీ ఆనందానికి తలుపు వెయ్యకపోతే, మీరు ఎన్నటికీ సంపద సృష్టించలేరు.

**రాత్రిపూట హాయిగా నిద్రపట్టే విధంగా మీ డబ్బుతో వ్యవహరించండి.** ఇది మీరు సాధ్యమైనంత లాభాలు సంపాదించాలనో, మీ ఆదాయంలో ఒక నిర్ణీతమైన మొత్తం పొదుపు చెయ్యాలనో చెప్పటం కాదు. అత్యధిక లాభాలు గడిస్తేనే కాని నిద్రపట్టనివారు కొందరు ఉంటారు. తమ పెట్టుబడులు భద్రంగా ఉంటేనే నిద్రపోగలిగినవారు మరికొందరు. ఎవరి అభిరుచి వారిది. కానీ డబ్బుతోకూడిన అన్నీ వ్యవహారాలకూ "దీనితో నాకు రాత్రి సరిగా నిద్ర పడుతుందా?" అన్న ప్రశ్నకు సమాధానమే పునాది.

**మీరు మేలైన పెట్టుబడిదారులు కాదలుచుకుంటే, ఎక్కువకాలం అందులో గడపటమే మీరు చెయ్యగలిగిన మహోత్తమ కార్యం.** పెట్టుబడి వ్యవహారంలో సమయం అత్యంత బలీయమైన శక్తి. అది చిన్న మొక్కలను మహావృక్షాలుగా పెంచుతుంది. మహాపరాధాలను కూడా మాయం చేస్తుంది. అదృష్టాన్నీ, సాహసాన్నీ అది నిర్వీర్యం చేయలేదు. కానీ ఫలితాలను వారి యోగ్యతకు చేరువగా తీసుకు వస్తుంది.

**ఆశించినట్లు జరగకపోతే, చిరునవ్వుతో స్వీకరించండి.** సగంసేపు మీరు తప్పులు చేయవచ్చు అయినా కావలిసినంత ఐశ్వర్యం సంపాదించవచ్చు. చాలా పెద్ద ఫలితాల మూలకారణం బహు కొద్ది వ్యవహారాలే. మీరు మీ డబ్బుతో ఏమి చేస్తున్నా ఫర్వాలేదు. అందులో చాలాభాగం పనిచెయ్యటంలేదనే వాస్తవంతో మీరు రాజీ పడాలి. ఈ లోకం తీరే అంత. కనుక ఒక్కొక్క పెట్టుబడిమీద కాక, మొత్తం మీద మీ వ్యాపారం ఎలా ఉన్నదో గమనించాలి. అధికభాగం పనికిరాని వనిపించే పెట్టుబడులు, అల్పభాగం అద్భుతంగా పనిచేసే పెట్టుబడులు ఉండటంవల్ల నష్టమేమీలేదు. మామూలుగా అదే అన్నిటినీ మించిన పరిస్తితి. ఒక్కొక్క పెట్టుబడినీ విడివిడిగా పరిశీలిస్తే, లాభాలు తెస్తున్న పెట్టుబడులు అద్భుతమైనవి గాను, నష్టాలు తెస్తున్న పెట్టుబడులు దుఖదాయినులుగాను దర్శనమిస్తాయి.

**సమయాన్ని మీ అధీనంలో ఉంచుకోవటానికి డబ్బు వినియోగించండి.** సమయం మీ చెప్పుచేతలలో లేకపోతే, మీ ఆనందానికి గుదికొయ్య వేసినట్టే. మీరు ఎప్పుడు, ఎవరితో ఎంతకాలం ఏమి చెయ్యదలిచింది చెయ్యగల సామర్ధ్యం ఆర్ధిక రంగంలో అన్నిటినీ మించిన ప్రయోజనం కలిగిస్తుంది.

**మంచిగా ఉండండి. ఆర్భాటం తగ్గించండి.** మీ సొమ్ములు, వస్తువులు చూసుకొని మీరు మురిసి పోవచ్చు. ఎదటి వారికి అవి పట్టవు. ఒక అధునాతనమైన కారు, విలాసవంతమైన చేతిగడియారం కావాలని మీరనుకోవచ్చు. కానీ బహుశా మీకు కావలసింది గౌరవమూ, మెచ్చుకోలు. అవి కొత్త మోడల్, బంగారు పూతల వల్లకాక, కారుణ్యం, నమ్రతలవల్ల లభించే అవకాశాలు మెండు.

**పొదుపు చెయ్యండి. పొదుపు చేయటానికి ప్రత్యేకించి కారణమేమీ అవసరం లేదు.** ఒక కారు, డౌన్ పేమెంట్, అత్యవసర వైద్యఖర్చుల కోసం పొదుపు చెయ్యటం చెప్పుకోదగిన విషయమే. ఊహించటానికి, ఖచ్చితంగా చెప్పటానికి అలవిగాని అవసరాలకోసం పొదుపు చెయ్యటం అన్నిటినీ మించిన మంచి అలవాటు. ప్రతి ఒక్కరి జీవితమూ అంభ్రమాశ్చర్యాల సమాహారం. అతి క్లిష్ట సమయంలో అనుకోకుండా కలిగే అవాంతారాలు అందరికీ కలుగుతాయి. ఏ కారణమూ లేకుండా చేసిన పొదుపు ఆ సమయంలో ఆపద్బాంధవి అవుతుంది.

**సఫలత మూల్యం ఎంతో నిర్ణయించండి.** అది చెల్లించటానికి సిద్ధంగా ఉండండి. విలువైనదేదీ ఉచితంగా దొరకదు. డబ్బుతోకూడిన వ్యవహారాలలో ఖర్చులకు వెలచీటీలు అంటించి ఉండవు. అనిశ్చితి, సంశయము, పొరబాట్లవల్ల కలిగే చింత, ఆర్థిక ప్రపంచంలో ఖర్చులకు మామూలు కారణాలు. సాధారణంగా ఆ ఖర్చులు చెల్లించ దగినవే. కానీ మీరు వాటిని జరిమానాగా (తప్పించుకోవలసిన దండన) కాక ఫీజుగా (ఒక మంచివస్తువుకు చెల్లించ వలసిన మూల్యం) భావించాలి.

**పొరపాటుకు అవకాశాన్ని ఆరాధించండి.** భవిష్యత్తులో ఏమి జరగబోతున్నదో మీకు తెలియదు. ఒక సంఘటన జరగాలని మీరు ఆశిస్తున్నారు. ఈ రెండిటి మధ్య ఉన్న దూరమే మీకు సహనాన్ని ఇస్తుంది. ఆ సహనమే కాలక్రమేణ చక్రవృద్ధి చేసే అద్భుతాలకు పునాది. పొరపాటుకు అవకాశం అంటే భద్రత కోసం వేసిన కంచెలాగా తోచవచ్చు. కానీ అది మిమ్మల్ని ఆటలో నిలబెడుతుంది. అందుకయ్యే ఖర్చుకు ఎన్నోరెట్లు ప్రతిఫలం తెచ్చిపెడుతుంది.

**ఆర్థిక నిర్ణయాలలో 'అతి' వర్జించండి.** సమయానుకూలంగా ప్రతిఒక్కరి లక్ష్యాలు, కోరికలు మారుతూ ఉంటాయి. మీ గతనిర్ణయాలు 'అతి' గా ఉండి ఉంటే తర్వాతి కాలంలో మీరు చింతించవలసి రావచ్చు.

**మీరు రిస్క్ తీసుకోవటానికి సంసిద్ధులుగా ఉండాలి.** కాలం గడుస్తున్నకొద్దీ అది మీకు ప్రయోజనకారి అవుతుంది. ప్రమాద భూయిష్టమైన రిస్క్ తో మీరు మెలకువగా ఉండాలి. లేకపోతే ప్రయోజన కరమైన రిస్క్ లకు అది అడ్డు తగులుతుంది.

**మీరు ఆడుతున్న ఆట స్పష్టంగా తెలిసి ఆడండి.** ఇంకెవరో ఆడుతున్న ఆట అనుకరించకండి. వారు ఆడుతున్న ఆట వేరే ఆట కావచ్చు.

**ఆ కలగాపులగాన్ని ఆదరించండి.** చురుకైనవారు,సమూలంగా తెలిసినవారు, పట్టువిడుపులు ఉన్నవారుకూడా డబ్బు వ్యవహారంలో విభేదించవచ్చు. ప్రజల లక్ష్యాలు, కోరికలు విపరీతంగా విభేదించటమే ఇందుకు కారణం. అన్నిటికీ ఏకైక పరిష్కారం అంటూ ఏమీ లేదు. మీకు సత్ఫలితాలను ప్రసాదించేది మీ పరిష్కారం. అంతే.

నా విషయంలో ఏది పనిచేస్తుందో ఇప్పుడు చెప్తాను.

శాం డీ గాట్స్ మన్ పెట్టుబడిదారులలో బిలియనీర్. ఆయన 'ఫస్ట్ మాన్ హట్టన్' అన్న పేరున ఒక కన్సల్టింగ్ సంస్థ స్థాపించారు. తన సంస్థలో ఉద్యోగాలకోసం వచ్చిన అభ్యర్థులను ఆయన సాధారణంగా అడిగే ప్రశ్న: "మీ సొంతవస్తువులు ఏమి ఉన్నాయ్? వాటిని ఎందుకు సొంతం చేసుకున్నారు?"

"ఏ స్టాక్స్ చవకగా ఉన్నాయి?" లేదా "ఆర్థిక మాంద్యంలో ఆర్థిక వ్యవస్థ అంటే ఏమిటి?" అని కాదు.

మీ డబ్బుతో మీరేం చేస్తారో చెప్పండి అని.

ఇది నాకు చాలా ఇష్టమైన ప్రశ్న. తెలివైన పనికీ (ఇతరులు మీకు ఇచ్చే సలహా), వారికి స్వయంగా తోచిన పనికీ (యదార్ధంగా వారు చేసేపని) మధ్య ఉన్న వ్యత్యాసాన్ని, మైళ్ళ దూరాన్ని స్పష్టంగా చూపిస్తుంది.

---

అమెరికాలో మ్యూచువల్ ఫండ్ మేనేజర్లు ఎవరూ వారి ఫండ్స్ లో సొంత సొమ్ము ఒక్క పైసా కూడా పెట్టుబడి పెట్టరు. ఇది 'మార్నింగ్ స్టార్' పత్రిక కథనం.[69] ఇది దారుణంగా తోచవచ్చు. కానీ సాంఖ్యసమాచారం ఇందులో మిథ్యాచారాన్ని బట్టబయలు చేస్తుంది.

ఇటువంటివి మీరు అనుకున్నదానికంటే చాలా సాధారణంగా జరుగుతూ ఉంటాయి. 'యూనివర్సిటీ ఆఫ్ సదర్న్ కాలిఫోర్నియా' (USC) లో కెన్ మర్రే మెడిసిన్ ప్రొఫెసర్. 2011లో ఆయన 'డాక్టర్లు ఎలా మరణిస్తారు' (How Doctors Die) అన్న శీర్షికతో ఒక వ్యాసం వ్రాశారు. జీవిత చరమదశలో సొంతానికి ఎంచుకునే చికిత్సలకూ, వారు రోగులకు సిఫార్సు చేసే చికిత్సలకూ మధ్య ఎంత వ్యత్యాసం ఉన్నదో ఆ వ్యాసం చెబుతుంది.[70]

"(డాక్టర్లు) మన అందరిలాగా మరణించరు." ఆయన వ్రాశారు. "అందరు అమెరికన్లతో పోలిస్తే వారు ఎంత ఎక్కువ చికిత్స పొందుతారన్నదికాదు, ఎంత

తక్కువ చికిత్స పొందుతారన్నది వారిలో అసాధారణ విషయం. ఇతరుల మరణాన్ని దూరం చెయ్యటానికి వారు ఎంత సమయం వ్యయం చేస్తారో చెప్పలేం. కానీ మరణం వారిని పలకరిస్తున్నప్పుడు వారు చాలా ప్రశాంతంగా ఉంటారు. ఏమి జరగబోతున్నదో వారికి స్పష్టంగా తెలుసు. అప్పుడు అందుబాటులో ఉన్న అవకాశాలేమితో కూడా వారికి బాగా తెలుసు. వారు కోరుకున్న వైద్యచికిత్స ఏదైనా సరే వారికి అందుబాటులో ఉంటుంది. కానీ వారు అప్పుడు చాలా అల్పసంతోషులుగా ప్రవర్తిస్తారు." తన రోగికి క్యాన్సర్ వస్తే డాక్టర్ అందుబాటులో ఉన్న వైద్యమంతా కూడదీస్తారు. కానీ అదే తన విషయంలో ఉపశమనం కలిగించే ఒక మాత్రతో సరిపుచ్చుకుంటారు.

ఎవరైనా మీకు ఏం చెయ్యాలో చెప్పటానికీ, తమ స్వవిషయంలో చేసేదానికీ మధ్య వ్యత్యాసంలో దుర్మార్గ మేమీ లేదు. మీకు, మీ కుటుంబానికీ సమబంధించిన క్లిష్ట సమస్యలు, భావావేశ సమస్యలతో వ్యవహరించేటప్పుడు సరయిన సమాధాన మేమీలేదు. జగమెరిగిన సత్యమేమీలేదు. మీకూ మీకుటుంబానికీ సరిపడే పరిష్కారం ఒకటే ఉంటుంది. ఆ వెతుకులాటలో మీకు రాత్రిపూట సుఖంగా నిద్రపట్టే పరిష్కారం కావాలని కోరుకుంటారు.

విధిపూర్వకంగా అనుసరించి ఆచరించాల్సిన సూత్రాలు కొన్ని ఉన్నాయి. ఈ సత్యం వైద్యరంగానికీ, ఆర్థికరంగానికి కూడా వర్తిస్తుంది. కానీ ముఖ్యమైన ఆర్థిక నిర్ణయాలు స్ప్రెడ్ షీట్స్ మీదా, పాఠ్యపుస్తకాలలోనూ ఉండవు. అవి అన్నీ డిన్నర్ టేబుల్ దగ్గర జరుగుతాయి. ఆ నిర్ణయాలు అత్యధిక రాబడి కోసం చేసేవి కావు. భాగస్వామికి, లేదా బిడ్డకు నిరాశ కలిగించకుండా ఉండే ఉద్దేశ్యంతో జరుగుతాయి. అటువంటి నిర్ణయాలు చార్ట్ లమీదా, సూత్రాలతో జరిగేవి కావు. అదీకాక అవి మనిషిని బట్టి మారుతూ ఉంటాయి. ఒకరి పరిష్కారం మరొకరి పరిష్కారం కాకపోవచ్చు.

మీకు అనుకూలమైన పద్ధతి ఏదో మీరు తెలుసుకోవాలి. నాకు అనుకూలమైన పద్ధతి ఇది.

## పొదుపును గురించి నా కుటుంబం యోచన

చార్లీ మంగర్ ఒకసారి అన్నారు: "సంపన్నుడిని కావాలని నా అభిమతం కాదు. స్వతంత్రుడిగా ఉండాలని నాకోరిక."

సంపద మాట పక్కనపెట్టి, ఆర్థిక స్వాతంత్ర్యమే సదా నా వ్యక్తిగత లక్ష్యం. అత్యధిక లాభాల వెంటపడటం, నా ఆస్తిపాస్తులతో విలాసవంతమైన జీవితం గడపటం నా అభిమతం కాదు. ఈ రెండూ జనం తమ మిత్రుల మెప్పు పొందటానికి ఆడే ఆటలనిపిస్తాయి నాకు. ఆ రెండు మార్గాలలోనూ ప్రమాదాలు పొంచి ఉన్నాయి. నేను ప్రతిరోజూ నేనూ, నా కుటుంబమూ మేము తలుచుకున్నవి మాకునచ్చిన రీతిన చేయ్యగలమనే ఎరుకతో కళ్లుతెరుస్తాను. మా ప్రతిఒక్క ఆర్థిక నిర్ణయమూ ఆ లక్ష్యం చుట్టూ తిరుగుతుంది.

నా తలిదండ్రులు వయోజన జీవితం రెండు స్థాయిలలో–నిరుపేద, మధ్యతరగతికి ఒకమెట్టు పైన – గడిపారు. మా నాన్న డాక్టర్ అయినప్పుడు ఆయన వయసు 40. అప్పటికే ఆయనకు ముగ్గురు పిల్లలు ఉన్నారు. మెడికల్ స్కూల్ లో చదివేటప్పుడు ముగ్గురు పిల్లలను పోషించటానికి మా నాన్న సాధ్యమయినంత పొదుపుగా జీవించవలసి వచ్చింది. డాక్టర్ గా సంపాదించేటప్పుడుకూడా ఆయనకు ఆ పొదుపుచేసే అలవాటు పోలేదు. మా అమ్మా, నాన్నా చాలా సంవత్సరాలు వారి సంపాదనకంటే చాలా నిమ్న స్థాయిలో జీవించారు. పొదుపు ఎక్కువగా చేశారు. మా నాన్న అత్యవసర పరిస్థితులకు చికిత్స చేసే డాక్టర్. ఆ వృత్తిలో ఒత్తిడి విపరీతం. రాత్రీ పగలూ అని లేకుండా, నిద్రకు, తిండికి ఒక టైమ్ అంటూ లేకుండా గడిపారు. రెండు దశాబ్దాలు అలా కష్టపడిన తర్వాత ఆయనకు ఇక చాలుననిపించింది. ఆ ఉద్యోగం విరమించారు. జీవితంలో తర్వాతి దశకు కదిలారు.

అది నాకు అంటుకు పోయింది. పొద్దునే లేచి, దైనందిన కార్యక్రమం మర్చిపోయి, మీరు ఎప్పుడు సిద్ధమైతే అప్పుడు మీరు చెయ్యదలుచుకున్నది చెయ్యగలగటం ఆర్థిక లక్ష్యాలన్నిటికీ అమ్మమ్మ అనుకుంటాను. స్వాతంత్ర్యం అంటే నా ఉద్దేశ్యం మీరు పనిచేయటం ఆపేస్తారనికాదు. మీకు ఇష్టమైన పని, మీకు ఇష్టమైనవారితో కలిసి, మీకు అనువైన సమయంలో మీకు తోచినంత సేపు చెయ్యగలగటం అదీ స్వాతంత్ర్యమంటే.

ఒకస్థాయిలో స్వాతంత్ర్యం సాధించాలంటే డాక్టర్ సంపాదన అవసరంలేదు. మీ ఆశలూ ఆశయాలను అదుపులో ఉంచుకోవటం, మీ ఆదాయంలో

మితవ్యయంతో జీవించటం. మీ ఆదాయం ఎంతైనాసరే, మీ స్వాతంత్ర్యం మీ పొదుపు మీద ఆధార పడిఉంటుంది. ఆదాయం ఒకస్థాయి దాటిన తర్వాత, మీ పొదుపు మీ జీవనశైలిమీద, మీ ఆకాంక్షలమీదా ఆధారపడి ఉంటుంది.

నేను, నా భార్య కాలేజ్ లో కలుసుకున్నాం. పెళ్లి కావటానికి కొన్ని సంవత్సరాల పూర్వమే ఒకే ఇంట్లోకి చేరాము. స్కూల్ అయిన తర్వాత మా ఇద్దరికీ ఆరంభదశ జీతాలతో ఆరంభదశ ఉద్యోగాలు వచ్చాయి. ఒక సగటు జీవన శైలికి అలవాటు పడ్డాం. వర్ణమాలలో అన్నిరకాల జీవనశైలులూ ఉంటాయి. ఒకరికి ఫర్వాలేదనిపించింది మరొకరికి రాజభోగంలాగా కనిపించవచ్చు, ఇంకొకరికి పేదరికంలాగా తోచవచ్చు. కానీ మా జీతాలతో మేము బాగున్నదనిపించే ఎపార్ట్ మెంట్, ఫర్వాలేదనిపించే కారు, బాగానే ఉన్నాయనిపించే దుస్తులు, కడుపునిండా భోజనం సంపాదించగలిగాము. సుఖంగానే ఉన్నది. కానీ విలాస జీవితానికి బహుదూరం.

ఒకదశాబ్దం పాటు మా ఆదాయాలు పెరుగుతూ వచ్చినా – నేను ఆర్థిక రంగంలో, నా శ్రీమతి ఆరోగ్య రక్షణలో – అప్పటినుంచీ మేము ఆ జీవనశైలిలోనే కొనసాగుతున్నాం. అందువల్ల మా పొదుపు నిరంతరం పెరుగుతూనే ఉన్నది. అదనంగా లభించిన ప్రతిఒక్క డాలరూ పొదుపులోకే మా స్వాతంత్ర్య నిధి – పోయిందని చెప్పవచ్చు. ఈనాడు కూడా మేము మా సంపాదన కంటే కొన్నిమెట్లు కింద స్థాయి జీవనశైలి కొనసాగిస్తున్నాం. మా మూడవ దశకం వయసులో ఉన్నప్పుడు చేసిన నిర్ణయం ప్రకారమే, మా జీవనశైలి ఈనాటికీ నడుస్తున్నది. ఆ జీవనశైలి మా ఆదాయాలను ప్రతిఫలించదు.

జీవనశైలి, కోరికల లక్ష్యాలు, కాలంతోబాటు ముందుకు కదలకుండా ఆపటం ఆ వయసులో మేం చేసిన పెద్ద నిర్ణయం. గృహనిర్వహణలో ఆ అంశం తలుచుకుంటే నాకు గర్వంగా ఉంటుంది. మా పొదుపు క్రమం చెప్పుకోదగినదే. కానీ ఆ పొదుపువల్ల మాకేమీ కష్టం అనిపించటం లేదు. కొత్త కొత్త కోరికలు కలగకుండా ఉండటమే అందుకు మూలకారణం. అలా అంటే మాకు కోరికలు ఆశలు లేవని కాదు. సుఖజీవితము, మంచివస్తువులూ మాకూ ఇష్టమే. కాలంతోబాటు లక్ష్యాలు ముందుకు సాగకుండా ఆపటమే మేం సాధించిన విజయం.

ఇది అందరికీ వర్తించదు. మాకు మాత్రమే సరిపడుతుంది. ఎందుకంటే ఆ పథకానికి మేము ఇద్దరమూ సమానంగా ఒప్పుకుంటాము. ఒకరికోసం ఒకరం త్యాగం ఏమీ చెయ్యటంలేదు. కలిసి నడవటం, చదవటం, పోడ్కాస్ట్ ఇవి మా ఆనందానికి మూలస్తంభాలు. అందులో ఖర్చు తక్కువ. కనుక మాకు ఎప్పుడూ ఏమీ లోటు కనిపించదు. అనవసరంగా ఇంత పొదుపు చేస్తున్నామేమోనని ఎప్పుడైనా అనిపిస్తే, మా అమ్మా నాన్నా గుర్తు వస్తారు. సంవత్సరాల తరబడి వాళ్ళు చేసిన పొదుపు వృద్ధాప్యంలో వారికి ప్రసాదించిన స్వాతంత్ర్యం గుర్తుకు వస్తుంది. వెంటనే నేను వెనక్కు మళ్ళుతాను. స్వాతంత్ర్యం మా ప్రథమ లక్ష్యం. జీవనశైలి సాధ్యమయిన దానికంటే తక్కువస్థాయిలో కొనసాగించటంవల్ల, ఇంకొక ప్రయోజనం ఉన్నది. పక్కవారితో పోటీపడే భారం, తలనొప్పి తప్పుతుంది. మీకు అందుబాటులో ఉన్నస్థాయికంటే ఒకమెట్టు కింద సుఖంగా జీవనం కొనసాగించటంవల్ల ఈ ఆధునిక ప్రపంచంలో ఎంతోమందికి కలిగే విపరీతమైన సామాజిక ఒత్తిడి తప్పుతుంది. నస్సిమ్ టాలెబ్ "పొరుగుతో పోటీ పరుగులోనుంచి తప్పుకొని మన కార్యక్రమాలు మనశ్శాంతికి అనుకూలంగా ఏర్పరుచుకోవటమే నిజమైన విజయం." అంటారు. ఆమాట నాకు నచ్చింది.

స్వాతంత్ర్య భావానికి పూర్తిగా కంకణం కట్టుకున్నాం గనుక, చెప్పుకోదగిన మహత్కార్యాలేమీ మేము చేయలేదు. తాకట్టు లేకుండా మాకు సొంత ఇల్లు ఉన్నది. ఆర్థికంగా అది అధమమైన నిర్ణయం కావచ్చు. డబ్బువిషయంలో అదే మా అత్యుత్తమ నిర్ణయం. మేము మా ఇల్లు కొన్నప్పుడు తాకట్టు వడ్డీ రేట్లు నమ్మరానంత తక్కువలో ఉన్నాయి. అంత తక్కువ వడ్డీకి అప్పు దొరుకుతుంటే, ఎవరైనా అప్పుమీద ఇల్లు కొనుక్కుని, చేతఉన్న అదనపు సొమ్ము స్టాక్స్ లాంటి అధిక రాబడి ఇచ్చే వ్యాపారంలో పెట్టుబడి పెట్టుమని చెప్తారు. అనుభూతిలేని తర్కం మా లక్ష్యం కాదు. మానసికంగా సమంజసంగా ఉండటమే ముఖ్యం.

ఏ బాదరబందీ లేని ఇల్లు మా స్వంతం అని తలుచుకుంటే నాకు కలిగే అనుభూతి ఇతర ఏ ఆర్థిక ప్రయోజనం - మా వస్తువులు, సొమ్ములు, చవక వడ్డీరేటుకు తాకట్టు పెట్టటం - వల్లా లభించదు. ఏనాడో మా సొమ్ముకు లభించబోయ్యే విలువకంటే , నెలనెలా వాయిదాలు కట్టే బెడద లేకపోవటమే చాలా మంచి అనుభూతి, స్వాతంత్ర్య అనుభూతి.

ఇందులో లోపాలు చూపేవారూ, ఇలా ఎన్నడూ చెయ్యబోనివారూ ఉండవచ్చు. వారందరికీ నేను సంజాయిషీ చెప్పబోవటంలేదు. అక్షరరూపంలో దానికి మద్దతు లేకపోవచ్చు. కానీ అదే మాకు తగిన పద్ధతి. మాకు నచ్చిన పద్ధతి. కావలసింది అదే. మంచి నిర్ణయాలు సదా సహేతుకంగా కనిపించకపోవచ్చు. ఎప్పుడో ఒకప్పుడు సహేతుకం, సంతోషం ఈ రెండింటిలో మీకు ఏది కావాలో నిర్ణయించుకోవాలి.

మా సొమ్ములో ఎక్కువశాతం డబ్బు రూపంలో – ఇల్లు కాకుండా మిగిలిన వాటిలో సుమారు 20 శాతం – ఉంటుంది. ఆర్థిక సలహాదారులెవ్వరూ దీనిని సమర్థించరు. ఇదికూడా అక్షరరూపంలో వాదనకు నిలవదు. ఇతరులకు ఎవరికీ ఇది నేను సిఫార్సు చెయ్యటంలేదు. ఇది మాకు అనుకూలమైన పద్ధతి. అంతే.

స్వాతంత్ర్యానికి డబ్బే ప్రాణవాయువు. అంతకంటే ముఖ్యంగా మా దగ్గర ఉన్న స్టాక్స్ అమ్మవలసిన అవసరం ఎన్నడూ రాకూడదు. అనుకోని పెద్ద ఖర్చులు ఏవైనా వచ్చినప్పుడు స్టాక్స్ అమ్మి ఆ అవసరం తీర్చుకోవలసిన పరిస్తితి ఏర్పడకూడదని మా ఉద్దేశ్యం. రిస్క్ చేసే సాహసం ఇతరులకంటే బహుశా మాలో తక్కువేమో.

వ్యక్తిగత ఆదాయంలో నాకు తెలిసినంతమటుకు ప్రతిఒక్కరికీ, నువ్వా నేనూ అనే తేడా లేకుండా ప్రతి ఒక్కరికీ, ఎప్పుడో ఒకప్పుడు అనుకోని పెద్దఖర్చు ఎదురవుతుంది. అది అనుకోని ఖర్చు కనుక ప్రత్యేకించి దానికి ఎవరూ సిద్ధపడి ఉండరు. మా ఆర్థిక వ్యవహారాలు తెలిసిన కొద్దిమంది అడుగుతూ ఉంటారు. "ఈ పొదుపంతా దేనికోసం? ఇంటికోసమా? బోట్ కా? కొత్త కారు కొంటారా?" ఏదీ కాదు. మనం ఊహించని సంఘటనలు జరిగే ఈ ప్రపంచంలో ఆ అనూహ్య సంఘటనకోసం పొదుపు చేస్తున్నాం. ఒక ఖర్చు సర్దుకోవటానికి స్టాక్స్ అమ్మకపోవటమంటే, వాటికి సుదీర్ఘ చక్రవృద్ధి కల్పించటమే. చార్లీ మంగర్ ఈ విషయం చక్కగా చెప్పారు, "దానిని మధ్యలో ఎప్పుడూ అడ్డుకోకపోవటమే చక్రవృద్ధిలో మొదటి సూత్రం."

## పెట్టుబడిని గురించి మా కుటుంబం ఆలోచన

నేను 'స్టాక్ పిక్కర్' (స్టాక్స్ లో ఏది మంచిదో, ఎంచి బుట్టలో పెట్టుకోవాలని సలహా ఇవ్వటం) గా వృత్తి ఆరంభించాను. ఆ కాలంలో మాకు స్టాక్స్ వేర్వేరుగా ఉండేవి. ముఖ్యంగా బెర్క్ షైర్ హాతవే, ప్రోక్టర్ & గాంబుల్ వంటి బృహత్ సంస్థలు. వాటితోబాటు విలువైన పెట్టుబడులని నాకనిపించిన చిన్న సంస్థల స్టాక్స్. నా మూడవ దశకంలోకి వెళ్ళి తొంగి చూస్తే, నాదగ్గర సుమారు 25 రకాల వేర్వేరు స్టాక్స్ ఉండేవి.

స్టాక్ పిక్కర్గా నేను ఎలా వ్యవహరించానో నాకు తెలియదు. నేను మార్కెట్ జయించానా? నాకు తెలియదు. మిగిలిన అందరిలాగానే నేనూ చరిత్ర, గణాంకాలు రాసిపెట్టుకోలేదు. అది ఎలాఉన్నా, నా అభిప్రాయాలూ మారాయి. ప్రస్తుతం మా దగ్గర ఉన్న ప్రతిఒక్క స్టాక్ 'లో కాస్ట్ ఇండెక్స్ ఫండ్' కు చెందినదే. (ఇండెక్స్ ఫండ్ అంటే మార్కెట్ లో ఉన్న స్టాక్స్ వ్యవస్థకు అనుకరణ. ఇండెక్స్ ఫండ్స్ కు ఖర్చులూ, ఫీజు తక్కువ. ఇండెక్స్ ఫండ్స్ పెట్టుబడిలో చురుకుగా పాల్గొనవు).

స్టాక్స్ వ్యాపారం చురుకుగా నడపటానికి - స్వయంగా మీరే కాని, లేదా మరొక ఫండ్ మేనేజర్ ద్వారా కానీ - నేను వ్యతిరేకిని కాను. కొందరు మార్కెట్ సగటుకంటే చాలా మేలుగా వ్యవహరించగలరు. అది చాలా కష్టమైన వ్యవహారం. అందులో ఉన్న కష్టం చాలామందికి తెలియదు.

పెట్టుబడిని గురించి నా అభిప్రాయాలు సమీకరించాలంటే: ప్రతి పెట్టుబడిదారుడూ వారి లక్ష్యాలను సాధించే అవకాశాలు మెరుగుపరిచే పథకం ఎంచుకోవాలి.'లో కాస్ట్ ఇండెక్స్ ఫండ్'లో చిరకాల పెట్టుబడులకు విజయావ కాశాలు ఎక్కువగా ఉంటాయని నా ఉద్దేశ్యం. ఇది దాదాపు అందరు పెట్టుబడిదారులకూ వర్తిస్తుంది.

ఇండెక్స్ పెట్టుబడి సర్వకాలసర్వావస్థలలోనూ సఫలమవుతుందని అర్థం కాదు. అందరికీ వర్తిస్తుందని కూడా అర్థం కాదు. చురుకుగా స్టాక్ ఎంపిక చెయ్యటం కూలిపోబోతున్నదని కూడా అర్థంకాదు. సాధారణంగా ఈ పరిశ్రమ అంతా ఏదో ఒకవైపుకు ఒరిగి ఉంటుంది. ముఖ్యంగా చురుకైన స్టాక్ వ్యాపారం వ్యతిరేకించేవారు.

మార్కెట్ జయించటం కష్టతరమైనవిషయం కావాలి. విజయావకాశాలు స్వల్పంగా ఉండాలి. ఆలాలేకపోతే ప్రతిఒక్కరూ సాధించగలరు. ప్రతి ఒక్కరూ సాధించ గలిగితే, అందులో అవకాశానికి చోటు ఉండదు. కనుక మార్కెట్ జయించటానికి ప్రయత్నించేవారిలో అధికశాతం పరాజయం పాలవుతారనటం ఆశ్చర్యమేమీ కాదు. (2009 నుంచి 2019 వరకు ఒక దశాబ్ద కాలంలో సాంఖ్య శాస్త్రానుసారం లార్జ్ క్యాప్ మేనేజర్లలో 85% S&P 500 ను జయించలేకపోయ్యారు).[71]

స్టాక్ మార్కెట్ జయించటానికి ప్రయత్నించటమంటే పిచ్చెక్కినట్లే ననే పెద్దలు కొందరు నాకు తెలుసు. కానీ వారే తమ పిల్లలను చుక్కల నందుకోవాలని, ప్రొఫెషనల్ క్రీడాకారులు కావాలని ప్రోత్సహిస్తూ ఉంటారు. ఎవరి వెర్రి వారికానందం. జీవితమంటే అవకాశాలతో ఆడుకోవటమే. ఆ అవకాశాలను గురించి మనమందరమూ వేరువేరుగా ఆలోచిస్తూ ఉంటాము.

కాలక్రమేణ నాకొక అభిప్రాయమేర్పడింది. డబ్బు 'లో కాస్ట్ ఇండెక్స్ ఫండ్స్' లో పెట్టుబడి పెట్టి అలా దానిని తగినంత కాలం వదిలివేస్తే, మా కుటుంబ లక్ష్యాలన్నీ నెరవేరే అవకాశం ఉంటుందని నా ఉద్దేశ్యం కలిగింది. ఈ అభిప్రాయమంతా మితవ్యయానికి అలవాటు పడిన మా జీవన శైలివల్ల కలిగిన ఫలితం. మార్కెట్ జయించవలసిన అవసరం లేకుండానే మీ లక్ష్యాలన్నీ నెరవేరుతుంటే, ఇక దానికోసం ప్రయత్నించాల్సిన అవసరం కూడా ఏముంది? నేను ప్రపంచంలోకెల్లా ఘనత వహించిన పెట్టుబడిదారుణ్ణి కానక్కర్లేదు. కానీ పనికిమాలిన పెట్టుబడిదారుణ్ణి మాత్రం కాకూడదు. ఆ ఆలోచనవల్ల, ఇండెక్స్ ఫండ్ కొని వాటిని ఒకమూలన దాచిపెట్టటం గురించి ఆలోచించవలసిన శ్రమే లేదు. ఈ తర్కంతో అందరూ – ముఖ్యంగా మార్కెట్ జయించాలని ఆశించే నా మిత్రులు – ఏకీభవించరని నాకు తెలుసు. వారంటే నాకు గౌరవం. కానీ మాకు అనుకూలమైన వ్యవహారం ఇదీ.

మేం ప్రతినెలా జీతంలోనుంచి ఈ ఇండెక్స్ ఫండ్స్ (యునైటెడ్ స్టేట్స్, అంతర్జాతీయస్టాక్స్) లో కొంత పెట్టుబడి పెడతాం. దీనికి ప్రత్యేకించి ఒక లక్ష్యం అంటూ ఏమీ లేదు. మా ఖర్చులు పోను మిగిలినది – అంతే. ఈ ఫండ్స్

తోనే మా రిటైర్మెంట్ ఎకౌంట్లు, మా పిల్లల 529 కాలేజ్ సేవింగ్స్ ప్లాన్ అన్నిటికీ వీలైనంత ఏర్పాటు చేస్తాం.

అదీ విషయం. మొత్తం మీద మా ఆస్తి అంతా ఒక ఇల్లు, చెకింగ్ ఎకౌంట్, వాన్ గార్డ్ ఇండెక్స్ ఫండ్స్.

మా పరిస్తితి అంతకు మించి క్లిష్టం కాకూడదు. సరళత అంటే నాకిష్టం. పెట్టుబడిలో జరిగే ప్రయత్నాలకు, అందులో వచ్చే లాభాలకూ పొంతన లేదు. ఇది నా దృఢ అభిప్రాయం, ప్రగాఢ విశ్వాసం. ఈ ప్రపంచం తోకచుట్టూ తిరుగుతూ ఉండటమే ఇందుకు కారణం. కొద్దిపాటి చరరాశులవల్ల భారీ లాభాలు కలుగుతాయి. మీ పథకంలో ముల్లును కదిలించే ముఖ్య విషయాలు లేకపోతే, మీరు పెట్టుబడిలో ఎంత రెక్కలు విరుచుకున్నా, ప్రయోజనం లేదు. దానికి విపర్యయం సత్యం. పథకం విజయానికి కీలకమైన కొద్ది విషయాలు పట్టుకుంటే చాలా సరళమైన పెట్టుబడి పథకంతో ఘనమైన లాభాలు సాధించవచ్చు. నా పెట్టుబడి, పథకం ఏది, సరయిన వర్గం ఏది, తర్వాతి ఆర్థిక మాంద్యం ఎప్పుడు కలగబోతున్నది అన్న అంశాలమీద ఆధారపడి ఉండదు. సాధ్యమైనంత పొదుపు, సహనం, ప్రపంచ ఆర్థిక వ్యవస్థ విలువ రాబోయ్యే కొన్ని దశాబ్దాలలో వృద్ధిచెందుతుందన్న ఆశావాదం మీద ఆధారపడి ఉంటుంది. నా పెట్టుబడి ప్రయత్నం అంతా ఈ మూడు విషయాలను గురించిన ఆలోచనతోనే జరుగుతుంది. ముఖ్యంగా నా ఆధీనంలో ఉన్న మొదటి రెండు అంశాల మీద.

గతంలో నా పెట్టుబడి పథకం మార్చాను. అలాగే భవిష్యత్తులోకూడా దాన్ని మారుస్తాను.

మనం ఎలా పొదుపు చేస్తాము, ఎలా పెట్టుబడి పెడతాము అనేదానికంటే మన స్వాతంత్ర్యం మన లక్ష్యంగా ఉండాలి. ఆ తర్వాత మనం రాత్రుళ్ళు బాగా నిద్రపోవటానికి అవసరమైన పనులే చేస్తాం.

అదే మన చరమ లక్ష్యమనుకుంటాము. డబ్బు మనస్తత్వాన్ని అధీనంలో ఉంచుకోవటం.

ఇక్కడ ఎవరి ఇష్టం వారిది. ఎవరూ వెర్రివాళ్లుకారు.

## తాజాకలం

# అమెరికా కొనుగోలు దార్ల ఆలోచన - సంక్షిప్త చరిత్ర

ఆధునిక కొనుగోలుదారు మనస్తత్వం అర్థం చేసుకోవటానికీ, ఇక్కడినుంచి వారి తర్వాతి గమ్యం ఏమిటో గ్రహించటానికీ, వారు అక్కడికి ఎలా చేరారో తెలుసుకోవాలి.

మనమందరమూ అక్కడికి ఎలా చేరామో తెలుసుకోవాలి.

మీరు 1945 లో నిద్రకు ఉపక్రమించి 2020 లో కళ్ళు తెరిచి ఉంటే మీ చుట్టూ ఉన్న ప్రపంచాన్ని మీరు గుర్తించలేరు.

ఆ సమయంలో జరిగిన ఆర్థికాభివృద్ధి అపూర్వం. న్యూయార్క్, శాన్ ఫ్రాన్సిస్కో నగరాలలో ఐశ్వర్య స్థాయి చూస్తే మీకు కళ్ళు తిరిగిపోతాయి. దాన్ని డెట్రాయిట్ లో ఉన్న దారిద్ర్యంతో పోల్చితే, మీరు అవాక్కు అవుతారు. ఇళ్ల ధరలు, కాలేజ్ ట్యూషన్ ఫీజ్, ఆరోగ్యరక్షమూల్యం చూస్తే షాక్ అవుతారు. పొదుపును గురించీ, ఖర్చును గురించి సగటు అమెరికన్ ఆలోచనలు తెలిస్తే షాక్ అవుతారు. ఇదంతా ఎలా జరిగిందాలని మీరు ఊహించటానికి ప్రయత్నిస్తే,

నూటికి నూరు పాళ్ళు మీ అంచనా తప్పవుతుందని నా ఊహ. అందులో సద్యః స్ఫురణ ఏమీ లేదు. ఇలా జరుగుతుందని ఎవరికీ ఆలోచనకూడా లేదు.

రెండవ ప్రపంచ యుద్ధానంతరం అమెరికాలో జరిగినదంతా అమెరికన్ వినియోగదారు కథ. డబ్బును గురించి ఈనాటి ప్రజలు ఇలా ఎందుకు ఆలోచిస్తారనటానికి కారణం వివరించే కథ ఇది.

ఆ కథ క్లుప్తంగా ఇది: పరిస్థితులు చాలా అస్థిరంగా ఉండేవి. ఆ తర్వాత చాలా మెరుగయ్యాయి. అప్పుడు మళ్ళీ బాగా దిగజారి పోయ్యాయి. తర్వాత నిజంగా బాగుపడ్డాయి. అక్కడినుంచి విపరీతంగా దిగజారిపోయ్యాయి. అప్పుడు మనం ఇక్కడికి చేరుకున్నాం. ఆ సంఘటనలన్నిటినీ సమకూర్చే కథ ఒకటి ఉన్నదనుకుంటాను. వివరణాత్మకమైన కథనం కాదు. కానీ సంఘటనలు ఒకదానికొకటి ఎలా పొసుగుతాయో చెప్పే కథ.

ఇది పెద్ద సంఘటనలను జతకూర్చే ప్రయత్నం. ఆ సమయంలో జరిగిన అనేక వివరాలు ఇందులో కనిపించక పోవచ్చు. నేను వివరించని సంఘటనలను వేలెత్తి చూపినవారితో నేను అంగీకరిస్తాను. ఇక్కడ ప్రతిఒక్క అంశమూ వివరించటం లక్ష్యం కాదు. ఒక ఆట తర్వాతి దానిని ఎలా ప్రబావితం చేసిందో గమనించటమే లక్ష్యం.

ఈనాటి వినియోగదారు ఇక్కడికి చేరిన మార్గం ఇదీ.

---

## 1. అగస్ట్ 1945. రెండవ ప్రపంచయుద్ధం ముగిసింది.

జపాన్ లొంగుబాటు "అమెరికా చరిత్రలో అత్యంత ఆనందమయమైన రోజు." ఆనాడు న్యూయార్క్ టైమ్స్ వ్రాసింది.

"చరిత్ర అంటే కేవలం ఒక దుర్ఘటన తర్వాత మరొకటి." అని నానుడి.

యుద్ధం ముగిసిందన్న ఆనందాన్ని వెంబడించిన ప్రశ్న: "ఇప్పుడేమవుతుంది?"

పదహారు మిలియన్ అమెరికన్లు - ప్రపంచ జనాభాలో 11% - యుద్ధంలో

పనిచేశారు. చివరికి సుమారు ఎనిమిది మిలియన్ విదేశాలలో ఉన్నారు. వారి సగటు వయసు 23. పద్దెనిమిది నెలలలోపు వారిలో 1.5 మిలియన్ ను వదిలివేస్తే మిగిలిన వారంతా స్వదేశం చేరుతారు. సైనిక దుస్తులలోనుంచి బయట పడతారు.

అప్పుడూ?

తర్వాత వాళ్ళేం చెయ్యబోతున్నారు?

వాళ్లెక్కడ పనిచెయ్యబోతున్నారు?

వాళ్లెక్కడ ఉండబోతున్నారు?

ఆనాడు అవి అత్యంత ముఖ్యమైన ప్రశ్నలు. అందుకు కారణాలు రెండు. ఈ ప్రశ్నలకు జవాబులు ఎవరికీ తెలియవు అన్నదొకటి. వాటికి వెంటనే సమాధానాలు దొరక్కపోతే (జరగబోయేది అదే), ఆర్థిక వ్యవస్థ (అనేక ఆర్థిక నిపుణుల దృష్టిలో) మహాసంక్షోభం (The Great Depression) నాటి అగాధాలకు దిగజారి పోతుంది.

యుద్ధ సమయంలో మూడు శక్తులు వర్ధిల్లాయి:

1. ఇళ్ల నిర్మాణం పూర్తిగా ఆగిపోయింది. అందుబాటులో ఉన్న ఉత్పాదకశక్తి అంతా యుద్ధసామగ్రి తయారు చేయటానికి మళ్లించబడింది. 1943 లో నెలకు 12000కు మించి ఇళ్ల నిర్మాణం జరగలేదు. అంటే ఒక్కొక్క అమెరికన్ నగరానికి ఒక ఇంటికింద లెక్క. యుద్ధం నుంచి తిరిగివచ్చిన సైనికులకు ఇల్లు దొరకటం తీవ్రమైన సమస్య అయికూర్చున్నది.
2. నౌకలు, టాంక్‌లు, విమానాల నిర్మాణం వంటి ప్రత్యేక ఉత్పాదనల కోసం సృష్టి అయిన ఉద్యోగాలన్నీ యుద్ధానంతరం మాయ మయ్యాయి. అదీ కన్నుమూసి తెరిచేలోగా మాయమయ్యాయి. ఆ సైనికులు ఇక ఎక్కడ పనిచేస్తారో ఎవరికీ తెలియదు.
3. యుద్ధసమయంలోను, యుద్ధానంతరమూ కూడా పెళ్లిళ్ల జోరు ఎక్కువయింది. సైనికులు తిరిగి అమ్మా, నాన్నల దగ్గరికి

> వెళ్ళదలుచుకోలేదు. మంచి ఉద్యోగంతో, వారి సొంత ఇంట్లో సొంత కాపురాలు మొదలు పెట్టాలని వారి ఆశ.

చట్ట నిర్మాతలకు ఇది సమస్య అయికూర్చున్నది. మహా సంక్షోభం (The Great Depression) ముగిసి ఇంకా ఐదు సంవత్సరాలు కూడా కాలేదు.

1946 లో ఆర్థిక సలహాదారుల సమితి అమెరికా అధ్యక్షులు ట్రూమన్ కు ఒక నివేదిక సమర్పించింది. "రానున్న నాలుగు సంవత్సరాలలో సంపూర్ణస్థాయి సంక్షోభం ఎప్పుడైనా రావచ్చు" నని దాని సారాంశం.

ట్రూమన్‌తో సమావేశం సంగ్రహంగా నివేదిస్తూ వారు 1947లో ఒక మెమో వ్రాశారు:

> ప్రస్తుతం మనం ఒకవిధమైన ఆర్థిక మాంద్యంలో ఉండి ఉండవచ్చు. పరిస్థితులు మన చెయ్యిదాటి పోతాయా అన్నవిషయం తెలుసుకోవలసిన అవసరం ఎంతైనా ఉన్నది. పరిస్థితులు ఇంతకంటే దిగజారితే, ఆర్థికమాంద్యంలో దిగబడిపోయే ప్రమాదం పొంచి ఉన్నది. ఇది నిర్లక్ష్యం చేయటానికి ఎంత మాత్రమూ వీలులేదు.

ఆ సమయంలో రెండు బృహత్ ఆర్థికవ్యవస్థలు - యూరప్, జపాన్ - శిథిలాల మధ్య చతికిలబడి ఉన్నాయి. కనుక ఎగుమతి వ్యాపారం వెంటనే ఆరంభించే అవకాశాలు పూజ్యం. కనుక అభివృద్ధి అసాధ్యం. ఈ పరిస్తితి ఆర్థికమాంద్య భయాన్ని మరింత ఉధృతం చేసింది. అప్పుడు అమెరికా ఎప్పటికంటే ఎక్కువ అప్పుల్లో మునిగి ఉన్నది. కనుక ప్రభుత్వం ముందుకు వచ్చి ఏమీ చెయ్యలేకపోయింది.

అప్పుడు మనం దానికి కొంత పరిష్కారం చూపించాం.

## 2. తక్కువ వడ్డీరేట్లు - అమెరికన్ వినియోగదారుడి ప్రాదుర్భావం

ఆర్థికవ్యవస్థ ప్రాణంతో ఉండటానికి యుద్ధంతర్వాత మనం చేసిన మొదటిపని వడ్డీరేట్లు తగ్గించటం. అది కనబడినంత సులువైన నిర్ణయమేమీ కాదు. యుద్ధానంతరం సైనికులు తిరిగి వచ్చినప్పుడు కట్టుకునే బట్టల దగ్గరినుంచి కార్లదాకా అన్నీ కొరత అయ్యాయి. దానితో ఆర్థిక సక్షోభం రెండంకెలు అందుకున్నది.

1951 కి పూర్వం ఫెడరల్ రిజర్వ్ కు రాజకీయ స్వాతంత్ర్యం లేదు.[72] పద్ధతిలో ఏదైనా మార్పు రావాలంటే, ఫెడరల్ రిజర్వ్ అమెరికా అధ్యక్షులతో కలిసి చెయ్యాలి. 1942 లో ఫెడరల్ రిజర్వ్ తాత్కాలిక వడ్డీరేట్లు 0.38% అని నిశ్చయించింది. ఇది కేవలం యుద్ధానికి ధనసహాయం చేయటానికి మాత్రమే. ఆ తర్వాత ఏడు సంవత్సరాల వరకూ వడ్డీరేట్లు ఏమాత్రమూ చలించలేదు. 1950 దశాబ్దం మధ్యకాలం వరకూ కోశాగారం లాభాలు 2% లోపు ఉండేవి.

యుద్ధంలో మనం సుమారు 6 ట్రిలియన్ డాలర్లు ఖర్చు చేశాం. ఆ అప్పుకు చెల్లించిన మూల్యం అదుపులో ఉంచటానికే వడ్డీరేట్లు తగ్గించబడ్డాయి.

కానీ ఈ తక్కువ వడ్డీరేటు యుద్ధం నుంచి తిరిగి వచ్చిన యోధులందరికీ మరోవిధంగా ప్రయోజనకారి అయింది. ఇల్లు, కార్లు, పరికరాలు, ఆటవస్తువులు కొనటానికి అవసరమైన అప్పు అంతా బాగాచవక అయింది.

సిద్ధాంతాలు రూపొందించిన పెద్దల మనసుల్లో ఇది ఒక ఆనంద తరంగం. రెండవ ప్రపంచ యుద్ధం తర్వాత వినియోగదారుల కొనుగోలే దేశఆర్థిక పథకం అయింది.

యుద్ధావసరాలకోసం పరిమితవ్యయం పొదుపు ప్రోత్సహించిన యుగం ఇప్పుడు వ్యయాన్ని ప్రోత్సహించే యుగంగా మారింది. ప్రిన్స్టన్ చరిత్రకారులు షెల్డన్ గారన్ వ్రాస్తారు:

1945 తర్వాత, యూరప్, తూర్పు ఆసియాలలో ప్రోత్సహించిన అమెరికా బాట మార్చింది. రాజకీయవేత్తలు, వాణిజ్యవేత్తలు, కార్మిక నాయకులు అందరూ ఆర్థికాభివృద్ధి దృష్టితో అమెరికన్లను ఖర్చు చెయ్యమని ప్రోత్సహించారు.[73]

ఈ ప్రోత్సాహం వెనక రెండు శక్తులు ఉన్నాయి.

మొదటిది GI (ప్రపంచ యుద్ధంలో పాల్గొన్న అమెరికన్ పౌరులు) బిల్లు. ఆ బిల్లువల్ల అంతకు మునుపెన్నడూ లేని తాకట్టు వ్యాపార అవకాశాలు కలిగాయి. దాదాపు 16 మిలియన్ యుద్ధవీరులు ఏ పెట్టుబడీ లేకుండానే ఇళ్ళు కొనగలిగారు. అందులో మొదటి సంవత్సరం వడ్డీ శూన్యం. వడ్డీరేట్లు బాగా తగ్గించారు. అందువల్ల నెలసరి వాయిదాలు మామూలు అద్దెకంటే తక్కువ అయ్యాయి.

రెండవది వినియోగదారులకు విశృంఖలంగా అందుబాటులోకి వచ్చిన ఋణం. మహాసంక్షోభ సమయంలో పొందుపరిచిన నిబంధనలు ఇంకా సడలించారు. క్రెడిట్ కార్డ్ మొదటిసారిగా 1950 లో ప్రవేశం అయింది. స్టోర్ క్రెడిట్, నెలసరి వాయిదాలు క్రెడిట్, వ్యక్తిగత ఋణాలు, జీతాలు ఇచ్చే రోజు క్రెడిట్ - అన్నిటికీ రెక్కలు వచ్చాయి. అప్పుమీద - క్రెడిట్ కార్డ్లతో సహా - చెల్లించవలసిన వడ్డీకి ఆదాయపు పన్ను మినహాయించారు.

అది అంతా మహారుచికరమైన విందు. మనం అందరమూ కావలసిన దానికంటే మించి భుజించాం. ఈ కింది పట్టిక ఆ కథ క్లుప్తంగా చెబుతుంది.

| సంవత్సరం | అమెరికా కుటుంబ ఋణం(డాలర్లలో) |
|---|---|
| 1945 | 29.4 బిలియన్ |
| 1955 | 125.7 బిలియన్ |
| 1965 | 331.2 బిలియన్ |

కుటుంబ ఋణం 1950 లలో 2000 లో కంటే 1.5 రేట్లు వేగంగా పెరిగింది.

## 3.ఋణం అందుబాటు పెరగగానే వస్తువులకోసం అణగారి ఉన్న డిమాండ్ ఒక్కసారిగా విజృంభించింది. 1930 నాటినుంచీ దాగి ఉన్న ఉత్పాదన ఉధృతంతో ఆర్థిక వ్యవస్థ విజృంభించింది.

అమెరికా చరిత్రలో 1930 ప్రాంతాలు అతి కఠినమైన ఆర్థిక దశాబ్దం. కానీ అందులోనే మెరుపు తీగె ఉన్నది. అది తెలుసుకోవటానికి రెండు దశాబ్దాలు పట్టింది: అవసరం కొద్దీ ఆనాటి మహాసంక్షోభంఉపజ్ఞత, ఉత్పాదన, నవకల్పనలకు అపూర్వ జాగృతి కలిగించింది.

30'లలో ఉత్పాదనలో కలిగిన ఉత్పాదన విజృంభణ మనం గమనించలేదు. అప్పుడు అందరికీ ఆర్థిక వ్యవస్థను గురించిన చింత. 40 లలో యుద్ధం కారణంగా మన ధ్యాస అటు పోలేదు.

50లలో ప్రవేశించినప్పుడు హఠాత్తుగా మనకు కనువిప్పు కలిగింది.

"అపూర్వమైన నవకల్పనలు ఉద్భవించాయి. అవి కనుక్కోవటంలో మనం నిజంగా అతి సమర్థులం."

పరికరాలు, కార్లు, ఫోన్లు, ఎయిర్ కండిషనింగ్, ఎలక్ట్రిసిటీ.

కర్మాగారాలన్నీ తుపాకులు, యుద్ధనౌకలు తయారు చేయటంలో నిమగ్నమై ఉండటాని, యుద్ధకాలంలో గృహోపకరణాలు కొనటం దాదాపు అసాధ్యమయింది. యుద్ధం ముగిసేనాటికి అప్పటివరకూ అణగారి ఉన్న డిమాండ్ ఒక్కసారిగా ఒళ్లువిరుచుకుంది. కొత్తగా పెళ్లయి నూతన జీవితం ఆరంభించటానికి సిద్ధంగా ఉన్న జంటలు, చవకగా దొరుకుతున్న వినియోగదారు రుణం, కనీ వినీ ఎరగనంతగా కొనుగోళ్ళు విజృంభించాయి.

'ది బిగ్ ఛేంజ్' (The Big Change) అన్న తన రచనలో ఫ్రెడరిక్ లూయీ అలెన్ వ్రాస్తారు:

> యుద్ధానంతర కాలంలో రైతు కొత్త ట్రాక్టర్, ధాన్యం సమీకరణ పరికరం, పాలు పితకటానికి ఎలక్ట్రిక్ మెషీన్ కొన్నాడు. నిజానికి ఆయన, పొరుగువారు కలిసి బలీయమైన కర్షక పరికరాలు, సాధనాలు కొన్నారు. అవన్నీ వారి సమిష్టి ప్రయోజనానికి. రైతు భార్య మిలమిలమెరిసే తెల్లని ఎలక్ట్రిక్ రిఫ్రిజిరేటర్ సంపాదించింది. మహాసంక్షోభ సమయంలో అశక్తత కారణంగా ఆమె కోరిక తీరలేదు. దానికి తోడు అత్యాధునిక వాషింగ్ మెషీన్, డీప్ ఫ్రీజ్ పరికరం. నగర సరిహద్దు వెలుపల ఉన్నకుటుంబం గిన్నెలు కడిగే సాధనం ఏర్పాటు చేసుకున్నది. ఇంటిముందు గడ్డి కోసే సాధనం మీద కూడా పెట్టుబడి పెట్టింది. నగరంలో కుటుంబం లాన్డ్రోమాట్ వినియోగదారులైనారు. లివింగ్ రూమ్ లో టెలివిజన్ సెట్ సంపాదించారు. శ్రీవారి ఆఫీసు ఎయిర్ కండిషన్ అయి ఉన్నది. అలా, అలా ఆ యంత్రపరికరాలకు అంతే లేదు.

ఈ ఉప్పెన ఎంత ఉధృతమో చెప్పనలవిగాదు.

1942 -1945 మధ్య వాణిజ్యపరమైన కారు, ట్రక్ ఉత్పాదన దాదాపు ఆగిపోయింది. 1945 నుంచి 1949 వరకు 21 మిలియన్ కార్లు అమ్మకం అయ్యాయి. 1955 నాటికి మరొక 37 మిలియన్ కార్లు అమ్మకం అయ్యాయి.

1940 - 1945 మధ్య సుమారు రెండు మిలియన్ ఇళ్ళు నిర్మాణం అయ్యాయి. 1945 -1950 మధ్య ఏడు మిలియన్ ఇళ్ళు నిర్మాణం అయ్యాయి. 1955 నాటికి మరొక ఎనిమిది మిలియన్ ఇళ్ళు నిర్మాణం అయ్యాయి.

వస్తువులకోసం అణిగి మణిగి ఉన్న డిమాండ్, వస్తువులు ఉత్పాదన చేయగల మన నూతన సామర్థ్యం, అన్నీ కలిసి GI కు తిరిగి ఉద్యోగాలిచ్చాయి. అదీ మంచి ఉద్యోగాలు వచ్చాయి. దానికి వినియోగదారుల క్రెడిట్ తోడై అమెరికాలో ఖర్చుచేసే సామర్థ్యం దాదాపు విస్ఫోటనం అయింది.

1951 లో ఫెడరల్ రిజర్వ్ ప్రెసిడెంట్ ట్రూమన్ కు వ్రాసింది: "కొత్త ఇళ్ల నిర్మాణంతో కలిపి 1950 నాటికి వినియోగదారుల ఖర్చులు 203 బిలియన్ డాలర్లకు చేరుకున్నాయి. అంటే 1944 స్థాయితోపోలిస్తే 40 శాతం అభివృద్ధి."[74]

"యుద్ధం ముగిసిన తర్వాత ఈ GI లు అందరూ ఏమి చెయ్యబోతున్నారు?" అన్న ప్రశ్నకు సమాధానం ఇప్పుడు స్పష్టంగా తెలిసింది. కొత్త వస్తువులు తయారుచేసే ఉద్యోగాలలో వచ్చిన సంపాదనతో కొత్త వస్తుసామగ్రి కొంటారు. అప్పు సులభంగాను, చవకగాను దొరుకుతున్నది గనుక ఇంకా ఇంకా ఎక్కువ వస్తుసామగ్రి కొంటారు.

**4. లాభాలు ఎప్పటికంటే సమానంగా పంపకం అవుతున్నాయి.**

పేదవారి పేదరికాన్ని తగ్గించి దేశం సంపన్నం అయింది. 1950 ఆర్థిక వ్యవస్థ సాధించిన ప్రత్యేకత అది.

1940 నుంచి 1948 నాటికి జీతాలు రెట్టింపు అయ్యాయి. 1963 నాటికి మళ్ళీ రెట్టింపు అయ్యాయి.

అంతకు పూర్వం దశాబ్దాల తరబడి వెనకబడి ఉన్నవారిని దృష్టిలో ఉంచుకుని చేసిన మార్పులు అవి. ఉన్నవారికి లేనివారికి మధ్య తేడా విపరీతంగా తగ్గిపోయింది.

1955 లో లూయీ అలెన్ వ్రాశారు:

ఆర్థిక పరుగుపందెంలో కలవారి అగ్రగణ్యత చాలావరకు తగ్గిపోయింది. సామూహికంగా పారిశ్రామిక కార్మికులు అందరికంటే మిన్నగా

ప్రయోజనం పొందారు. ఉక్కు కర్మాగారంలో పనిచేసే కార్మికుడి కుటుంబం ఇంతవరకు 2500 డాలర్ల తో జీవనం కొనసాగించేది. ఇప్పుడు వారికి 4500 డాలర్లు ముట్టుతున్నాయి. యంత్ర సాధనాలు నడపటంలో నిపుణులైన కార్మికుడి కుటుంబం ఇంతకు పూర్వం 3000 డాలర్లు సంపాదించేది. ప్రస్తుతం వారికి సాలీనా 5500 డాలర్లు, అంతకు మించి కూడా ముట్టుతున్నది.

శిఖరాగ్రాన ఉన్న ఒకశాతం సంపన్నులను గమనిస్తే – సుమారుగా వారిని 16000 కు పైబడిన వర్గంలో చేర్చవచ్చు – జాతీయ ఆదాయంలో వారి వాటా 13% నుంచి 1945 నాటికి 7% కి దిగి పోయింది.

ఇది తాత్కాలిక సరళి కాదు. 1950 కి 1980 కి మధ్య కాలంలో సమాజంలో అడుగున ఉన్న 20% జీతగాళ్ళకూ, శిఖరాగ్రాన ఉన్న 5% పెద్దలకూ ఆదాయం పెరుగుదల దాదాపు ఒకటిగానే ఉన్నది.

ఆ సమానత్వం జీతాలను దాటికూడా పోయింది.

బయట ఉద్యోగాలు చేసే స్త్రీల సంఖ్య రికార్డ్ స్థాయి నందుకున్నది. కార్మికవర్గంలో వారి భాగస్వామ్యం యుద్ధం తర్వాత ఉన్న 31% నుంచి 1955 నాటికి 37% చేరింది. 1965 నాటికి 40% అయింది.

అల్పసంఖ్యాక వర్గాలుకూడా లబ్ధి పొందాయి. 1945 ప్రారంభోత్సవం తర్వాత ఒక ఆఫ్రికన్ అమెరికన్ రిపోర్టర్ చెప్పినదానిని ఎలీనార్ రూజ్వెల్ట్ ఇలా వ్రాశారు:

> పన్నెండు సంవత్సరాలలో ఏమి జరిగిందో గ్రహించారా? 1933 లో ఇదే ప్రారంభోత్సవంలో ఈనాటిలాగా ఇంతమంది నల్లవాళ్లు వెళ్ళి అందరితో కలిసిమెలిసి ఉంటే దేశంలో ప్రతిఒక్క పత్రికా ఆ వార్తను ప్రకటించి ఉండేది. ఈనాడు అది వార్త కానేకాదు. మాలో ఎవరమూ ఆ వార్తా ప్రకటించము.

స్త్రీలు, అల్పసంఖ్యాకుల హక్కులు ఈనాటితో పోలిస్తే,ఆనాడు అత్యల్పమనే చెప్పాలి. 40 లలో 50 లలో సమానత్వం దిశగా అభివృద్ధి అసాధారణమని చెప్పాలి.

వర్గ సమానత్వం జరుగుతున్నదంటే జీవనసరళి సమానమవు తున్నదన్న మాట. సాధారణ ప్రజలు చేవీలు నడిపితే, సంపన్నులు క్యాడిలాక్ లు నడిపారు. టెలివిజన్, రేడియోవల్ల వర్గనిమిత్తంలేకుండా వినోదం, సంస్కృతి అందరికీ సమానం అయింది. మెయిల్ ఆర్డర్ క్యాటలాగ్ లవల్ల జనం ధరించే దుస్తులు, కొనే వస్తుసామగ్రి ఒకటే అయ్యాయి – వారి నివాసస్థలంతో నిమిత్తం లేకుండా. 1957 లో హార్పర్స్ మ్యాగజిన్ వ్రాసింది:

> కలవారు కాల్చేవీ, పేదవారు కాల్చేవీ ఒకేరకమైన సిగరెట్లే. కలవారు అదే రకమైన రేజర్ ఉపయోగిస్తారు, అదే రకమైన టెలిఫోన్ వాడుతారు, అదే రకమైన వాక్యూమ్ క్లీనర్, రేడియో, టెలివిజన్ సెట్ ఉపయోగిస్తారు. వారి ఇంట్లో ఉండే ఎలక్ట్రిక్ దీపాలు వీరి ఇంట్లో ఉండే దీపాలు ఒకటే, ఇంటిని వెచ్చగా ఉంచే సాధనాలూ ఒకటే. ఇలా ఎన్నయినా చెప్పుకుంటూ పోవచ్చు. కలవారి కారుకు, లేనివారి కారుకు మధ్య వ్యత్యాసం చాలా అల్పం. ముఖ్యంగా వాటిలో ఇంజన్లు, పరికరాలు ఒకటే. శతాబ్దం మొదట్లో కార్లకు కూడా తరతమ వ్యత్యాసం ఉండేది.

కేవలం మూడు టెలివిజన్ స్టేషన్లు మాత్రమే ఉండటం వల్ల కలిగిన సమానత్వాన్ని గురించి 2016 లో పాల్ గ్రాహం వ్రాశారు:

> ప్రతి రాత్రీ పదుల మిలియన్లలో కుటుంబాలు కలిసి పొరుగింటివారిలా అదే సమయంలో వారి TV ముందర కూర్చొని అదే ప్రదర్శన చూస్తారు. సూపర్ బౌల్ లో ప్రస్తుతం ఏమి జరుగుతున్నదో ఇంతకు మునుపు ప్రతిరాత్రీ అదే జరుగుతూ ఉండేది. మనమందరమూ ఏకమైనాము.[75]

ఇది ముఖ్యం. జనం తమ బాగోగులను పక్కవారితో పోల్చి చూడటం మామూలు. 1945-1980 మధ్యకాలంలో జనానికి పోల్చుకోవటానికి అనేక మంది పొరుగువారు కనబడేవారు. చాలామంది- దాదాపు అందరూ - పక్కవారితో సమానమైన లేదా పోల్చదగిన జీవితాలు జీవించారు. ప్రజల జీతాల

లాగానే వారి జీవితాలు కూడా సమానత్వం చెందాయి అన్నది ముఖ్యమైన విషయం. ఆ విషయం మరొకసారి తర్వాత చూద్దాం.

## 5. రుణం విపరీతంగా పెరిగి పోయింది. ఆదాయాలు కూడా అలాగే పెరిగాయి. కనుక ప్రభావం తెలియలేదు.

కుటుంబాల రుణభారం 1947 నుంచి 1957 నాటికి ఐదింతలు పెరిగింది. కొత్తగా తలెత్తిన వినియోగ సంస్కృతి, అప్పుకు అందుబాటులో ఉన్న కొత్త సాధనాలు, పరికరాలు, ప్రభుత్వ రాయితీతో తగ్గిన వడ్డీరేట్లు (ఫెడరల్ రిజర్వ్ వడ్డీరేట్లు అతి తక్కువలో నిలిపింది) అన్నే కలిసి ఈ రుణానికి తోడ్పడ్డాయి.

ఈ కాలంలోనే ఆదాయం కూడా బాగా పెరిగింది. కనుక రుణభారం కుటుంబాలకు నిజంగా భారం కాలేదు. యుద్ధానంతరం కుటుంబాల రుణభారం చాలా స్వల్పంగా ఉండేది. మహాసంక్షోభం వచ్చి దానినంతటినీ తుడిచిపెట్టింది. కుటుంబంలో ఖర్చుకు చాలా పరిమితులు ఉండేవి. అందువల్ల రుణభారం పెరగటానికి అవకాశం లేకపోయింది. కనుక 1947-1957 మధ్య రుణభారం అదుపులో ఉండేది.

ఈనాడు ఆదాయంతో పోలిస్తే రుణం రెండు నూటికి నూరు పాళ్ళు ఎక్కువ. ఈ నిష్పత్తి పెరుగుతున్న 1950, 1960, 1970 లలో కూడా 60 శాతం కంటే తక్కువ ఉండేది.

రుణభారం ఇలా విశ్రుంఖలంగా పెరగటానికి సొంత ఇళ్ళు ఉప్పెనలా తోసుకు రావటమే కారణం.

1900లో సొంత ఇళ్ళు 47% మాత్రమే ఉండేవి. దాదాపు నాలుగు దశాబ్దాల కాలం ఆ సంఖ్య అలాగే ఉన్నది. ఆ తర్వాత సొంత ఇళ్లకు రెక్కలు వచ్చాయి. 1945 నాటికి సొంత ఇళ్ళు 53% అయ్యాయి. 1970 నాటికి 62% అయ్యాయి. ఇంటి సొంతదారులలో అధికశాతం అప్పుమీదనే ఇళ్ళు కొన్నారు. ఇంతకుముందు తరానికి ఆ అవకాశం లేకపోయింది. అయినా వారంతా బాగానే ఉండేవారు.

'ది ఫిఫ్టీస్' (The Fifties) అన్న తన రచనలో డేవిడ్ హాల్బర్స్టామ్ వ్రాస్తారు:

> తమలోను తమ భవిష్యత్తులోను వారికి పూర్ణ విశ్వాసం. కష్టకాలంలో పెరిగిన ముందుతరానికి ఈ మనస్తత్వం కొట్టవచ్చినట్లుగా తెలిసింది. వారి తలిదండ్రులలాగా ఈ తరం అప్పుచేయ్యటానికి భయపడలేదు. వారి సంపాదన, ఆస్తిపాస్తులలోనే కాదు,భవిష్యత్తు వచ్చేసింది అన్న భావనలోకూడా వారు తలిదండ్రులతో విభేదించారు. వారు ఇంటికి కావలసిన ఉపకరణాలు, సామగ్రి కొనటానికి వచ్చినపుడు మొదటిసారిగా కుటుంబంలో ఇళ్ళు కొన్న వారుగా వారిలో భావోద్రేకం, ఒకవిధమైన గర్వం దర్శన మిచ్చేవి. కొన్నిసార్లు యువదంపతులు తమ మొదటి బిడ్డకు దుస్తులు కొంటున్న అనుభూతి, ఉత్సాహం వారిలో కనిపించేది. సొంత ఇల్లు కొనుక్కోవట మంటే, దానికి ఎంతచేసినా చాలదనిపించే మహత్కార్యంగా అనుభూతి చెందారు.

కొన్ని అంశాల ప్రాముఖ్యత పెరగబోతున్నది. కనుక వాటిని ఒకదానికొకటి జతచెయ్యటానికి ఇది అనువైన తరుణం.

- అమెరికా విజృంభించుతున్నది.
- అన్నివిధాలా అపూర్వంగా విజృంభించుతున్నది.
- రుణంతో విజృంభించుతున్నదన్న విషయం విశేషమేమీ కాదు. కానీ ఆదాయంతో పోలిస్తే అది తక్కువే. అదీకాక అప్పు అన్నది భయపడవలసిన విషయమేమీ కాదన్న సంస్కృతి సమ్మతమయింది. కనుక ప్రస్తుతకాలంలో ఆ రుణభారం పెద్దవిషయమేమీ కాదు.

### 6. ఉత్పాతం మొదలు

1973లో మొట్టమొదటి సారిగా ఆర్థిక వ్యవస్థ కొత్తబాటన నడుస్తున్నదన్న విషయం స్పష్టమయింది.

ఆ సంవత్సరం మొదలయిన ఆర్థికమాంద్యం నిరుద్యోగ సమస్యను శిఖరాగ్రానికి చేర్చింది. 1930 నాటినుంచి నేటివరకూ నిరుద్యోగసమస్య ఎన్నడూ ఇంత విపరీతంగా లేదు.

ధరలు పెరిగిపోయ్యాయి. యుద్ధానంతరం జరిగిన కిందామీదా కాకుండా పైకి వెళ్ళిన ధరలు అక్కడే నిలిచి పోయ్యాయి.

ఒక దశాబ్దం కింద 2.5% ఉండే వడ్డీ రేట్లు 1973 లో 8% చేరాయి.

వియత్నాం యుద్ధం, అల్లర్లు, మార్టిన్ లూథర్ కింగ్, జాన్ కెన్నెడీ, బాబీ కెన్నెడీల హత్యలు ఎంత భయోత్పాతాలు కలిగించాయో ఈ దృశ్యం చెప్పకనే చెబుతుంది.

అంతా చిమ్మచీకటిలాగా తోచింది.

యుద్ధానంతరం రెండు దశాబ్దాల కాలం ప్రపంచ ఆర్థికవ్యవస్థమీద అమెరికా రాజ్యం చేసింది. పెద్ద దేశాలు అనేకం తమ ఉత్పాదన శక్తులు మట్టిపాలవటం చూశాయి. 1970 రావటంతో, పరిస్తితి మారిపోయింది. జపాన్ విజృంభించుతున్నది. చైనా ఆర్థికవ్యవస్థ కళ్ళు తెరుస్తున్నది. మధ్యధరా ప్రాంతం తన ఆయిల్ కండరాలను సడలిస్తున్నది.

అదృష్టవశాత్తు కలిగిన ఆర్థిక ప్రయోజనాలు, ఘనతవహించిన (మహా సంక్షోభ, యుద్ధ) గత తరం సంస్కృతి బేబీ బూమర్స్ ఎదుగుతున్న సమయంలో మారాయి. ఈ నవతరం దృష్టిలో సామాన్యం అంటే అర్థం వేరు. అప్పుడే గత రెండు దశాబ్దాలుగా ఆర్థిక రంగంలో వీస్తున్న వాలుగాలి ఆగిపోయింది.

దేశాదాయం అంతా ఆశల, ఆశయాల పరిధిలోనే ఉంటుంది. ఆర్థిక రంగం గాలివాటం మారినప్పుడు గత శతాబ్దంలో అన్నిటినీ మించిన మార్పు జరిగింది. అప్పటికీ ప్రజల ఊహాగానాలన్నీ యుద్ధానంతరం ప్రవేశించిన సమానత్వ సంస్కృతిలోనే చిక్కుకొని ఉన్నాయి. రాబడిలో సమానత్వం కాదు (అది లేకపోలేదు). జీవనసరళిలో, వస్తువినియోగంలో సమానత్వం. మధ్య తరగతి రాబడి ఉన్నవారి జీవన సరళికి 20% లేదా 10% జీవనశైలిలో జీవిస్తున్నవారి శైలికి విపరీతమైన వ్యత్యాసం ఉండకూడదు. మొదటి ఒకశాతం వర్గంలో ఉన్నవారు మేలైన జీవితం గడుపుతూ ఉండవచ్చు. కానీ అదికూడా మధ్యతరగతి మనిషికి అర్థమయ్యే రీతిలో ఉంటుంది. 1945 నుంచి 1980 వరకూ, అమెరికా దాదాపు ఆ ధోరణిలో నడిచింది. నైతికంగా అది తప్పో ఒప్పో అన్న మీ అభిప్రాయంతో సంబంధం లేదు. అది అలా జరిగింది. అంతే.

ఆశయాలు వాస్తవాలకంటే నిదానంగా కదులుతాయి. 1970 నుంచి 2000 ల వరకూ ఆర్థిక వాస్తవాలు ఏమిటంటే, అభివృద్ధి కొనసాగింది, కానీ ఎగుడుదిగుడుగా సాగింది. కానీ తమ జీవనశైలి తమ పొరుగువారితో ఎలా పోలి ఉండాలనే ఆశయం మాత్రం మారలేదు.

## 7. విజృంభణ కొనసాగింది. మునుపుకంటే ఇది వేరు.

1984లో రోనాల్డ్ రీగన్ 'మార్నింగ్ ఇన్ అమెరికా' (Morning in America) ప్రకటన:

> అమెరికాలో మళ్ళీ శుభోదయం. అమెరికా చరిత్రలో ఈనాడు ఎప్పటికంటే ఎక్కువమంది స్త్రీలు, పురుషులు ఉద్యోగాలకు వెళ్తారు. ఈనాటి వడ్డీ రేట్లు 1980 నాటి రేట్లలో సగమే. కనుక ఈనాడు సుమారు 2000 కుటుంబాలు కొత్త ఇళ్ళు కొంటారు. గతనాలుగేళ్ళలో ఎన్నడూ ఇలా జరగలేదు. నాలుగేళ్ళనాటి ద్రవ్యోల్బణంలో సగంకూడా ఈనాడు లేదు. కనుక ఈరోజు మధ్యాహ్నం సుమారు 6500 మంది స్త్రీలు, పురుషులు వివాహం చేసుకుంటారు. వారంతా ఆశాజనకమైన భవిష్యత్తు ఆశించవచ్చు.

అది అతిశయోక్తి ఎంతమాత్రమూ కాదు. 1950 నుంచీ ఈనాటిదే అత్యున్నతమైన GDP. 1989 నాటికి (1982 నాటికంటే) అదనంగా ఆరు మిలియన్ అమెరికన్లకు ఉద్యోగాలు దొరికాయి. 1982 నుంచి 1990 నాటికి S&P 500 నాలుగింతలు పెరిగింది. GDP పెరుగుదల సుమారుగా 1950 నాటికి సరితూగుతుంది 40% ఈనాడు 42% ఆనాడు.

2000 స్టేట్ ఆఫ్ ది యూనియన్ ప్రసంగం లో అధ్యక్షులు క్లింటన్ స్వోత్కర్ష:

20 మిలియన్ కొత్త ఉద్యోగాలతో నవశతాబ్దానికి మనం స్వాగతం పలుకుతున్నాం. గత 30 సంవత్సరాలలో ఇది అతివేగంగా జరిగిన ఆర్థికాభివృద్ధి. గత ముప్పై సంవత్సరాలతో పోలిస్తే, నిరుద్యోగసమస్య కనిష్టం. పేదరికం గత 20 సంవత్సరాలలోనూ కనిష్టం. ఆఫ్రికన్-అమెరికన్, హిస్పానిక్ ప్రజల నిరుద్యోగం

కనిష్టం. 42 సంవత్సరాలలో రెండవసారి మిగులు బడ్జెట్ మనది. వచ్చే నెల అమెరికా చరిత్రలోనే అతిదీర్ఘమైన ఆర్థికాభివృద్ధి రికార్డ్ అవుతుంది. మనం ఒక నూతన ఆర్థికవ్యవస్థ నిర్మించాము.

ఆయన చివరి వాక్యం చాలా ముఖ్యం. అది ఒక నూతన ఆర్థిక వ్యవస్థ. 1945 -1973 కాలానికీ, 1982 -2000 కాలానికీ వ్యత్యాసం ఏమిటంటే అభివృద్ధి ఒకటిగానే ఉన్నది. కానీ, అది చేరిన గమ్యాలు వేరు.

బహుశా ఈఅంకెలు, సంఖ్యలు మీరు వినే ఉంటారు, లేదా చదివే ఉంటారు. ఇక్కడ పునరుక్తి దోషం లేదు. 'ది అట్లాంటిక్' వ్రాసింది:

> 1993 -2012 మధ్యలో మొదటి ఒకశాతంలో ఉన్నవారి ఆదాయం 86.1% పెరిగింది. మిగిలిన 99 శాతం ప్రజల ఆదాయం 6.6% పెరిగింది.

2011 లో జోసెఫ్ స్టీగ్లిచ్ :

> సమాజంలో పైన ఉన్న ఒక శాతం ప్రజల ఆదాయం గత దశాబ్దంతో పోలిస్తే 18% పెరిగింది. మధ్య తరగతి వారి ఆదాయం పడిపోయింది. హైస్కూల్ చదువులకు మాత్రమే పరిమితమైన వారికి పతనం వాలున జారుతున్నది - గత 25 సంవత్సరాలలో 12% పతనం.
>
> యుద్ధానంతరం జరిగిన పరిణామానికి ఇది వ్యతిరేకం.

ఇలా ఎందుకు జరిగింది అనేది ఆర్థికరంగంలో అతి హేయమైన వాదోపవాదం. ఇప్పుడు ఏం చెయ్యాలి అన్నదే అంతకంటే ముఖ్యమైన వాదోప వాదం. ఈ చర్చకు ఆ రెండింటిలో ఏదైనా ఒకటే.

ఇక్కడ ముఖ్యవిషయమేమిటంటే, గత 35 సంవత్సరాలలో ఈ అసమానత్వం ఒక శక్తి అయి కూర్చున్నది. ఇది ఎప్పుడు జరిగింది? రెండవ ప్రపంచ యుద్ధంతర్వాత అమెరికన్లలో రెండు భావాలు లోతుగా నాటుకున్నాయి. మీ జీవనశైలి మిగతా అమెరికన్లతో పోలి ఉండాలి. ఆ శైలిలో జీవించటం కోసం అప్పు చెయ్యటం సమ్మతమే.

## 8. మహా విస్తరణ

అమెరికన్లలో ఒక చిన్నవర్గానికి ఆదాయాలు పెరగటంతో ఆ వర్గం జీవనశైలి మార్చుకున్నది.

వారు పెద్దఇళ్ళు, మేలైన కార్లు, కొన్నారు. ఖరీదైన విద్యాలయాలకు వెళ్ళారు. విలాసవంతమైన విహారయాత్రలు చేశారు.

మిగిలిన వారంతా ప్రేక్షకులుగా మిగిలిపోయ్యారు - '80 లు '90లలో మాడిసన్ ఎవెన్యూ ద్వారానూ, ఆ తర్వాత ఇంటర్నెట్ ద్వారాను చూస్తూ.

సంపన్నులైన అల్పసంఖ్యాక అమెరికన్ల జీవనశైలి అధిక సంఖ్యాకులైన ఇతర అమరికన్ల ఆకాంక్షలకు ఆజ్యం పోశాయి. కానీ వారి ఆదాయాలు పెరగటంలేదు.

1950-1970 మధ్య వచ్చిన సమానత్వం, ఐక్యత అమాయకంగా పొరుగువారితో సమానంగా పోటీపడే తత్వంగా పరిణమించింది.

ఇప్పుడు తలెత్తిన సమస్య మీరు గమనించగలరు.

జో ఒక పెట్టుబడి బ్యాంక్ ఉద్యోగి. ఆయన జీతం సాలీనా 900,000 డాలర్లు. ఆయన 4000 చదరపు అడుగుల ఇల్లు, రెండు మెర్సిడీస్ కొన్నారు. ఆయన ముగ్గురు పిల్లలను పెప్పర్ డిన్ స్కూల్ లో చదివిస్తారు. ఆయన ఆ ఖర్చు భరించగలరు.

పీటర్ ఒక బ్యాంక్ బ్రాంచ్ మేనేజర్. సాలీనా 80,000 డాలర్లు సంపాదిస్తారు. ఆయన జోను చూస్తారు. తనకూ ఆ జీవనశైలికి యోగ్యత ఉన్నదని భావిస్తారు. అమెరికన్ల ఉద్యోగాలు వేరైనా వారి జీవనశైలిలో ఏమంత వ్యత్యాసం ఉండదు. అది పీటర్ తల్లిదండ్రుల విశ్వాసం. ఆ విశ్వాసాన్నే ఆయనలో పాదుకొల్పారు. ఆనాడు రాబడులు అన్నీ ఒక పరిధిలో ఉండేవి. ఆ కాలాను గుణంగా పీటర్ తలిదండ్రుల ఆలోచనలు సబబే. కానీ అది ఆనాటిమాట. పీటర్ నివసించే లోకం వేరు. వాస్తవాలు మారినా, ఆయన ఆకాంక్షలు మారలేదు.

మరి పీటర్ ఏం చెయ్యాలి?

ఆయన భారీ తాకట్టు తీసుకుంటారు. క్రెడిట్ కార్డ్ మీద ఆయనకు

45,000 డాలర్ల అప్పు ఉన్నది. ఆయన రెండు కార్లు అద్దెకు తీసుకున్నారు. ఆయన పిల్లలు చదువు ముగిసేసరికి విద్యార్థి రుణాలు తడిసి ముప్పందుం అవుతాయి. జో కొనగల వస్తువులు పీటర్ కు అందుబాటులో లేవు. కానీ ఆ జీవనశైలి అందుకోవటానికి ఆయన కాళ్ళు ఎత్తి చేతులు చాస్తారు. అది చాలా భారీ సాగుదల.

1930 లలో ఇదే ఎవరికైనా అసంగతంగా ఉండేది. యుద్ధానంతరం కుటుంబ రుణం సమ్మతించుతూ 75 సంవత్సరాలు గడిపాం.

సగటు జీతాలు దాదాపు సమంగా ఉంటున్న కాలంలో సగటు అమెరికన్ ఇల్లు 50% పెరిగి పెద్దదయింది.

అమెరికాలో కొత్త ఇళ్ల సగటు వైశాల్యం




అమెరికన్ల కొత్త ఇళ్ళలో మనుషులకంటే బాత్ రూములు ఎక్కువ ఉంటాయి. దాదాపు సగం ఇళ్ళలో నాలుగు అంతకు మించి కూడా పడక గదులు ఉంటాయి. 1983 నాటినుంచి ఇది 18% పెరుగుదల. 1975లో కార్లమీద రుణం 12,300 డాలర్లు ఉంటే 2003 నాటికి అది 27,900 డాలర్లు చేరుకున్నది.

కాలేజ్ ధరలు, విద్యార్థి రుణాలు ఎలా మారాయో మీకు బాగా తెలుసు.

1963 నుంచి 1973 వరకూ కుటుంబం రుణం/ ఆదాయం నిష్పత్తి దాదాపు హెచ్చు తగ్గులు లేకుండా ఉండేది. ఆ తర్వాత పైపైకి, ఇంకా పైకి 1973 నాటి 60% నుంచి 2007 నాటికి 130% చేరుకున్నది.

1980 నుంచి 2020 వరకూ వడ్డీరేట్లు తగ్గుతూనే వస్తున్నాయి. అయినాకూడా, అప్పులు తీర్చటానికి ఆదాయంలో పడే గండి పెరుగుతూనే ఉన్నది. ఈ భారం అంతా అల్ప ఆదాయవర్గాలమీద పడింది. భారీ ఆదాయ వర్గాలకు వారి ఆదాయం నిజంగానే భారీగా ఉంటుంది - వారి రాబడిలో సుమారు 8% అప్పులు, లీజ్ చెల్లించటానికి పోతుంది. సగటు ఆదాయంకంటే తక్కువ ఆదాయవర్గాలకు అప్పులు, వాయిదాలు వారి జీతంలో సుమారు 21% తినేస్తాయి.

ఇప్పుడు పెరుగుతున్న రుణానికి 1950-1960 లలో పెరిగిన రుణానికీ తేడా ఏమిటంటే, ఇటీవలి లంఘనం చాలా పెద్ద ఎత్తునుంచి మొదలైంది.

ఆర్థిక శాస్త్రవేత్త హైమన్ మిన్‌స్కీ రుణాల సంక్షోభాన్ని వర్ణించారు: వారి శక్తికి మించిన అప్పు చేసిన క్షణమే ఆ సంక్షోభం మొదలవుతుంది. అది చాలా వికృతమైన, బాధాకరమైన క్షణం. తన పనైపోయిందని తెలిసి, Wile E. Coyote కొండకోన నుంచి అగాధంలోకి దూకినట్లు ఉంటుంది.

2008 లో జరిగింది సరిగ్గా అదే.

## 9. ఒక పద్ధతి స్థాపన అయితే, దానిని తొలగించటం చాలా కష్టం

2008 తర్వాత రుణం చాలావరకు తీరిపోయింది. అప్పుడు వడ్డీరేట్లు పడి పోయాయి. ఇళ్ళకోసం చేసిన అప్పులు తీర్చటానికి చెల్లించే వాయిదాలు ప్రస్తుత ఆదాయంలో అతితక్కువ మొత్తం. గత 35 సంవత్సరాలలో ఆదాయంలో ఇదే కనిష్ట శాతం.

2008లో కలిగిన ప్రతిస్పందన మనలను ఇక్కడికి చేర్చిన కొన్ని ధోరణులను స్థిరంగా స్థాపించింది. పరిణామాత్మకమైన సడలింపు (ద్రవ్య రంగంలోకి అదనంగా ద్రవ్యం జోడించటం -ప్రభుత్వ చర్య) ఆర్థిక వ్యవస్థ

కూలిపోకుండా కాపాడటమేగాక, ఆస్తిపాస్తుల ధరలు పెరుగుదలకు తోడ్పడింది. ఆస్తిపాస్తులు ఉన్నవారందరికీ అది అడగకుండా లభించిన వరం. ఆ వరం అంతా సంపన్నులకే దక్కింది.

2008 లో ఫెడరల్ రిజర్వ్ సంస్థాపరమైన రుణాలను రద్దుచేసింది. ఆ రుణభారం ఉన్నవారికి అది సాయపడింది. మళ్ళీ ఆ లబ్ధి పొందినవారంతాకూడా సంపన్నులే.

గత 20 సంవత్సరాలుగా పన్నులలో మినహాయింపు అంతా పెద్దజీతాలు సంపాదిస్తున్నవారికే లాభించింది. అధిక ఆదాయాలు కలవారు తమ పిల్లలను మంచి కాలేజ్ లకు పంపిస్తారు. ఆ పిల్లలు మంచి ఉద్యోగాలు సంపాదించి పెద్ద జీతాలు సంపాదిస్తారు. ఆ సంపాదన సంస్థారుణంలో పెట్టుబడి పెడతారు. ఆ సంస్థారుణం ఫెడరల్ రిజర్వ్ రద్దుచేస్తుంది. వారికి స్టాక్స్ ఉంటాయి. ఆ స్టాక్స్ కు అనేక ప్రభుత్వ సిద్ధాంతాల మద్దతు ఉంటుంది. అలా అలా ఆకథ కొనసాగుతూనే ఉంటుంది.

ఇవి ఏవీ ఎవరికీ సమస్యలు కావు. కనుకనే అవి అలా కొనసాగుతూ ఉంటాయి.

కాని ఇవన్నీ 1980 నాటినుంచీ నడుస్తున్న మరొక సన్నివేశానికి వ్యాధి లక్షణాలు. ఆర్థిక వ్యవస్థ కొందరికే అనుకూలంగా ప్రవర్తిస్తుంది. అందరికీ కాదు. సఫలత అంటే మునుపటిలాగా ఇప్పుడు తారాపథం అందుకోవటంలేదు. సఫలత కలిగితే అందులో ప్రతిఫలం మునుపటికంటే అధికంగా ఉంటున్నది.

నైతికంగా అది తప్పొ ఒప్పొ అని ఆలోచించవలసిన అవసరం లేదు.

అంతేకాక,అలా ఎందుకు జరిగిందన్నది ఈ కథలో అప్రస్తుతం.

అలా జరిగిందన్న విషయం తెలుసుకోవటం ముఖ్యం. యుద్ధానంతరం ప్రజలలో కొన్ని ఆకాంక్షలు ఏర్పడ్డాయి. అసమానత్వం లేకుండా ఒక విస్తృతమైన మధ్య తరగతి ఉంటుంది. మీ పొరుగింటివారు, కొద్దిమైళ్ళ దూరాన అదే బాటలో ఉన్నవారూ దాదాపు మీస్థాయిలోనే జీవనం కొనసాగిస్తూ ఉంటారు. పైన చెప్పినట్లు జరగటంవల్ల, ఆర్థికవ్యవస్థ జనం ఆకాంక్షలకు దూరమైంది.

35 సంవత్సరాల తర్వాతకూడా, ఈ ఆకాంక్షలు జనాన్ని అంటిపెట్టుకునే ఉన్నాయి. ఆ ఆకాంక్షలు నిజమవుతున్న కాలంలో జనం నిజమైన ఆనందానుభూతి చెందారు. కనుకనే అవి ఈనాటికీ జనాన్ని అంటిపెట్టుకుని ఉన్నాయి. అంత ఆనందానుభూతి కలిగించిన ఆ ఆకాంక్షలు వదులుకోవటం అంత సులభం కాదు.

కనుకనే జనం వాటిని వదిలిపెట్టలేదు. వెనకటి పరిస్థితి తిరిగి రావాలని వారి కోరిక.

## 10. ది టీ పార్టీ, ఆక్యుపై వాల్ స్ట్రీట్, బ్రెక్సిట్, డొనాల్డ్ ట్రంప్ -అన్నీ "బండి ఆపండి. నేను దిగిపోవాలి." అని సామూహికంగా అరిచే వర్గాలకు ప్రతినిధులు.

ఆ నినాదం వివరాలు కొంచెం తేడాగా ఉండవచ్చు. కానీ వారందరూ అరుస్తున్న మాట వాస్తవం. యుద్ధానంతరం పరిస్తితి అందరికీ ఒకేలాగా ఉండాలి అన్న ఆశయం – పూర్తిగా కాకపోయినా, కొంతవరకైనా – ఫలించటంలేదు.

ట్రంప్ ఉన్నతిని అసమానత్వంతో లంకె వేస్తే మీరు పరిహాసం చేయవచ్చు. మీరు చెయ్యాలి కూడా. ఇవన్నీ లోతు తెలియని అగాధాలు. కానీ జనం ఆలోచనలకు మూలం అదే. "నేనాశించిన ప్రపంచంలో నేను జీవించటం లేదు. అది తలుచుకుంటే నాకు తిక్క రేగుతుంది. కనుక దానికీ బే బే, మీకూ బెబ్బే. ప్రస్తుత పరిస్తితి నేనాశించినట్లుగా లేదు. కనుక నేను మరొకదానికోసం పోరాడబోతున్నాను." అన్నది జనం ఆలోచన.

ఆ మనస్తత్వం అలవరుచుకోండి. దానిని ఫేస్ బుక్, ఇంస్టాగ్రామ్, కేబుల్ న్యూస్ –వంటి సాధనాలలో ప్రచారం చెయ్యండి. అక్కడ ఎదటివారి జీవన శైలిని గురించి జనానికి బాగా తెలుసు. ఆ పనిచేస్తే, పెట్రోల్ మీద నిప్పుపుల్ల వేసినట్లే. బెనెడిక్ట్ ఇవాన్స్ అంటారు: "ఇంటర్ నెట్ జనానికి ఇతర దృక్పధాలను తెలియబరుస్తున్నకొద్దీ, ఇతరులకు కూడా అభిప్రాయాలూ ఉన్నాయని తెలిసి జనం మండిపడుతున్నారు." యుద్ధానంతర ఆర్థికవ్యవస్థలో ఆర్థిక అభిప్రాయాల మధ్య వ్యత్యాసాలు తక్కువగా ఉండేవి. ఒకటి ఆనాటి ఫలితాలమధ్య వ్యత్యాసాలు

తక్కువగా ఉండేవి. రెండవది, ఆనాడు ఎదటివారు ఎలా జీవించారో, వారి ఆలోచనలేమితో తెలుసుకోవటం కష్టసాధ్యమైన విషయం.

ఇది నిరాశావాదం కాదు. ఆర్థిక శాస్త్రం ఆవృత్తాలలో నడిచే కథ. సంఘటనలు, పరిస్థితులు వస్తూ ఉంటాయి, పోతూ ఉంటాయి.

గత దశాబ్దాలతో పోలిస్తే, ఈనాటి నిరుద్యోగం కనిష్టం. సంపన్నులకంటే, కాలేజ్, అల్పాదాయం ఉన్న కార్మికుల జీతాలు వేగంగా పెరుగుతున్నాయి.[76] గ్రాంట్లు మొదలైన తర్వాత కాలేజ్ ఖర్చులు పెరగటం దాదాపు ఆగిపోయిందనే చెప్పాలి.[77] ఘనమైన 1950 ల నాటినుంచీ ఆరోగ్యరక్షణ, సంసర్గమార్గం, రవాణా, పౌరహక్కులు మొదలైన రంగాలలో జరిగిన పురోగతి ప్రతిఒక్కరూ గమనిస్తే, వెనక్కు మళ్ళాలని ఎవరికీ అనిపించదని నా ఉద్దేశ్యం.

వాస్తవాలకంటే మనుషుల ఆకాంక్షలు నిదానంగా కదులుతాయన్నది ఈ కథలో ఇతివృత్తం. ఆర్థికవ్యవస్థ 35 సంవత్సరాలుగా మారుతూ ఉంటే, జనం 1950 నాటి ఆకాంక్షలకు అంటిపెట్టుకు ఉన్నారన్నది సత్యం. ఈనాడు మధ్యతరగతి వర్ధిల్లటం మొదలైనా, సమస్యలన్నీ ఉన్నవారికి కాదు, మిగతావారికే అన్న ఆలోచన వెంటాడుతూనే ఉంటుంది.

కనుక "ఇది పనిచేయదు" అన్న యుగం అంటిపెట్టుకునే ఉంటుంది.

"మనం వెంటనే ఏదో ఒక కొత్త మార్గం - అది ఏదైనా సరే - అనుసరించాలి" అన్న యుగం కూడా అంటిపెట్టుకునే ఉంటుంది.

అన్నీ సంఘటనలకూ నాంది అదే. రెండవ ప్రపంచయుద్ధం వంటి సంఘటనలకు కూడా అదే నాంది. ఈ కథ మొదలైంది అక్కడే కదా!

చరిత్ర అంటే ఒక దారుణ సంఘటన తర్వాత మరొకటి.

# వందనాలు

దారిపొడుగునా ఎందరో చేయూతనివ్వక పోయి ఉంటే, డబ్బు –మనస్తత్వం రచన సంభవించేది కాదు. పేరుపేరునా చెబితే చాలామంది ఉన్నారు. కొందరి సహాయం ముఖ్యంగా చెప్పుకోదగింది.

**బ్రియాన్ రిచర్డ్స్,** అందరికంటే ముందు ప్రోత్సహించిన వ్యక్తి

**క్రేయిగ్ షాపీరో,** ఆయనకు అవసరం లేకపోయినా నన్ను ప్రోత్సహించారు

**గ్రేషేన్ హౌసెల్,** అచంచలమైన సహకారం

**జెన్నా అబ్డూ,** ప్రతిఫలం ఆశించకుండా సహాయపడిన వ్యక్తి

**క్రెయిగ్ పియర్స్,** నన్ను ప్రోత్సహించి, దారిచూపి, వాస్తవాలు చూపిన వ్యక్తి

జెమీ క్యాతర్ వుడ్, జోష్ బ్రౌన్, బ్రేన్ట్ బెషోర్, బ్యారీ రితోల్జ్, బెన్ కార్ల్సన్, క్రిస్ హిల్, మైఖేల్ బాత్నిక్, జేమ్స్ ఓసోర్న్ ల ప్రతిపుష్టి అమూల్యం.

ధన్యవాదాలు.

# Endnotes

1 J. Pressler, "Former Merrill Lynch Executive Forced to Declare Bankruptcy Just to Keep a $14 Million Roof Over His Head," *New York* magazine (April 9, 2010).

2 Ibid.

3 L. Thomas Jr., "The Tale of the $8 Million 'Bargain' House in Greenwich," *The New York Times* (January 25, 2014).

4 U. Malmendier, S. Nagel, "Depression Babies: Do Macroeconomic Experiences Affect Risk-Taking?" (August 2007).

5 "How large are 401(k)s?" Investment Company Institute (December 2019).

6 R. Butler, "Retirement Pay Often Is Scanty," *The New York Times* (August 14, 1955).

7 "Higher education in the United States," Wikipedia.

8 K. Bancalari, "Private college tuition is rising faster than inflation .... again," *USA Today* (June 9, 2017).

9 "How Many People Die Rock Climbing?" The Rockulus.

10 A. T. Vanderbilt II, *Fortune's Children: The Fall of the House of Vanderbilt* (William Morrow Paperbacks, 2012).

11 D. McDonald, "Rajat Gupta: Touched by scandal," *Fortune* (October 1, 2010).

12 "Did millionaire Rajat Gupta suffer from billionaire envy?" *The Economic Times* (March 27, 2011).

13 J. Nicas, "Facebook Connected Her to a Tattooed Soldier in Iraq. Or So She Thought," *The New York Times* (July 28, 2019).

14 T. Maloney, "The Best-Paid Hedge Fund Managers Made $7.7 Billion in 2018," Bloomberg (February 15, 2019).

15 S. Weart, "The Discovery of Global Warming," history.aip.org/climate/cycles.htm (January 2020).

16 S. Langlois, "From $6,000 to $73 billion: Warren Buffett's wealth through the ages," MarketWatch (January 6, 2017).

17 D. Boudreaux, "Turnover in the Forbes 400, 2008–2013," Cafe Hayek (May 16, 2014).

18 M. Pabrai, www.youtube.com/watch?time_continue=200&v=YmmIbrKDYbw.

19 "Art Dealers: The Other Vincent van Gogh," Horizon Research Group (June 2010).

20 www.collaborativefund.com/uploads/venture-returns.png

21 "The Agony and the Ecstasy: The Risks and Rewards of a Concentrated Stock Position," Eye on the Market, J.P. Morgan (2014).

22 L. Eadicicco, "Here's Why You Probably Won't Get Hired At Google," Business Insider (October 23, 2014).

23 "What is the offer acceptance rate for Facebook software engineering positions?" Quora.com.
24 W. Fulton, "If You Want to Build a Great Team, Hire Apple Employees," *Forbes* (June 22, 2012).
25 J. Berger, "How to Change Anyone's Mind," *The Wall Street Journal* (February 21, 2020).
26 D. Sivers, "How I got rich on the other hand," sivers.org (October 30, 2019).
27 N. Chokshi, "Americans Are Among the Most Stressed People in the World, Poll Finds," *The New York Times* (April 25, 2019).
28 Russell Sage Foundation—Chartbook of Social Inequality.
29 D. Thompson, "Why White-Collar Workers Spend All Day at the Office," *The Atlantic* (December 4, 2019).
30 "Rihanna's ex-accountant fires back," News24 (March 24, 2014).
31 B. Mann, "Want to Get Rich and Stay Rich?" The Motley Fool (March 7, 2017).
32 "U.S. energy intensity projected to continue its steady decline through 2040," U.S. Energy Information Administration (March 1, 2013).
33 Julius Wagner-Jauregg—Biographical, nobelprize.org.
34 J. M. Cavaillon, "Good and bad fever," *Critical Care* 16:2 (2012).
35 "Fever—Myths Versus Facts," Seattle Children's.
36 J. J. Ray, and C. I. Schulman, "Fever: suppress or let it ride?" *Journal of Thoracic Disease* 7:12 (2015).
37 A. LaFrance, "A Cultural History of the Fever," *The Atlantic* (September 16, 2015).
38 J. Zweig, "What Harry Markowitz Meant," jasonzweig.com (October 2, 2017).
39 L. Pleven, "In Bogle Family, It's Either Passive or Aggressive," *The Wall Street Journal* (November 28, 2013).
40 C. Shapiro and M. Housel, "Disrupting Investors' Own Game," The Collaborative Fund.
41 www.bylo.org
42 Washington State University, "For pundits, it's better to be confident than correct," ScienceDaily (May 28, 2013).
43 "Daniel Kahneman's Favorite Approach For Making Better Decisions," Farnham Street (January 2014).
44 W. Buffett, Letter to the Shareholders of Berkshire Hathaway Inc. (2008).
45 W. Buffett, Letter to the Shareholders of Berkshire Hathaway Inc. (2006).
46 B. Plumer, "Only 27 percent of college grads have a job related to their major," *The Washington Post* (May 20, 2013).
47 G. Livingston, "Stay-at-home moms and dads account for about one-in-five U.S. parents," Pew Research Center (September 24, 2018).
48 D. Gilbert, "The psychology of your future self," TED2014.
49 J. Zweig, "What I Learned From Daniel Kahneman," jasonzweig.com (March 30, 2014).
50 J. Ptak "Tactical Funds Miss Their Chance," Morningstar (February 2, 2012).
51 R. Kinnel, "Mind the Gap 2019," Morningstar (August 15, 2019).
52 M. Desmond. "Accounting Tricks Catch Up With GE," *Forbes* (August 4, 2009).

A. Berenson, "Freddie Mac Says It Understated Profits by Up to $6.9 Billion," *The New York Times* (June 25, 2003).

54 "U.S. Home Flipping Rate Reaches a Nine-Year High in Q1 2019," Attom Data Solutions (June 4, 2019).

55 A. Osborn, "As if Things Weren't Bad Enough, Russian Professor Predicts End of U.S.," *The Wall Street Journal* (December 29, 2008).

56 "Food in the Occupation of Japan," Wikipedia.

57 J. M. Jones, "U.S. Stock Ownership Down Among All but Older, Higher-Income," Gallup (May 27, 2017).

58 E. Rauchway, *The Great Depression and the New Deal: A Very Short Introduction* (Oxford University Press, 2008).

59 L. R. Brown, *Plan B 3.0: Mobilizing to Save Civilization* (W. W. Norton & Company, 2008).

60 FRED, Federal Reserve Bank of St. Louis.

61 "U.S. Crude Oil Production—Historical Chart," Macro Trends.

62 "Thomas Selfridge," Wikipedia.

63 www.nhlbi.nih.gov

64 D. Walsh, "The Tragedy of Saudi Arabia's War," *The New York Times* (October 26, 2018).

65 B. Pisani, "Active fund managers trail the S&P 500 for the ninth year in a row in triumph for indexing," CNBC (March 15, 2019).

66 *2019 Investment Company Factbook*, Investment Company Institute.

67 "Minutes of the Federal Open Market Committee," Federal Reserve (October 30–31, 2007).

68 www.nasa.gov

69 A. Ram, "Portfolio managers shun investing in own funds," *Financial Times* (September 18, 2016).

70 K. Murray "How Doctors Die," Zócalo Public Square (November 30, 2011).

71 B. Pisani, "Active fund managers trail the S&P 500 for the ninth year in a row in triumph for indexing," CNBC (March 15, 2019).

72 "Treasury-Fed Accord," federalreservehistory.org.

73 S. Garon, "Beyond Our Means: Why America Spends While the World Saves," Federal Reserve Bank of St. Louis (July 1, 2012).

74 "Economic Report of the President," FRASER, St. Louis Federal Reserve (1951).

75 P. Graham, "The Refragmentation," paulgraham.com (2016).

76 P. Davidson, "Jobs in high-wage industries are growing fastest," *USA Today* (December 14, 2019).

77 R. Channick, "Average college costs flat nationwide, at just under $15K, as universities increase grants," *Chicago Tribune* (October 16, 2018).

# JAICO PUBLISHING HOUSE

Elevate Your Life. Transform Your World.

జై-కో ప్రచురణ సంస్థ ఇప్పటి వరకూ 2000 పుస్తకాలు ప్రచురించింది. ఇందులో పెద్దవారు, పిల్లల సాహిత్య పుస్తకాలు, చరిత్ర, హాస్యం, ఆటలు, మతం, తత్వశాస్త్రం, ఆరోగ్యం, మనో వైజ్ఞానిక, వ్యక్తిత్వ, నిర్మాణానికి సంబంధించిన పుస్తకాలు ఉన్నాయి. ఈ సంస్థ ప్రముఖ రచయితలైన శ్రీశ్రీపరమహంస యోగానంద (ఒక యోగి ఆత్మకథ), కుస్వంత్ సింగ్, ముల్క్‌రాజ్ ఆనంద్, కమలా మార్కండేయ, ఏకాంత్ ఈశ్వరన్, నిరాద్ చౌదరి, ఎం.వి. కామత్, సర్వేపల్లి రాధాకృష్ణన్, ఓషో, శ్రీశ్రీరవిశంకర్, రాబిన్‌శర్మ వంటి వారి రచనలను ప్రచురించింది.

గత రెండు దశాబ్దాలుగా జై-కో సంస్థ విద్య, బిజినెస్ మేనేజ్‌మెంట్, ఇంజనీరింగ్, టెక్నాలజీ వంటి వత్తి విద్యా పుస్తకాలను ప్రచురించడంలో నెం.1 స్థానంలో ఉంది. కళాశాల విద్యార్థుల కోసం జై-కో ప్రచురించే పుస్తకాలను దేశవ్యాప్తంగా విద్యార్థులు ఆదరిస్తున్నారు. సంస్థకు చెందిన ఎడ్యుకేషన్ అండ్ కార్పొరేట్ సేల్స్ డివిజన్ నిర్వహణ సామర్థ్యం ఇందుకు నిదర్శనం.

జై-కో సంస్థను 1946లో దివంగత జమన్ సింగ్‌పుస్తకపంపిణీ వ్యాపారంగా ప్రారంభించారు. త్వరలోనే దేశానికి స్వాతంత్ర్యం వస్తుందని ముందుగానే ఊహించిన ఆయన తన సంస్థకు జై-కో అని నామకరణం చేశారు (హిందీలో జై అంటే విజయం). అభివృద్ధి చెందుతున్న దేశంలో పుస్తకాల అవసరం గుర్తించిన జమన్‌సింగ్ త్వరలోనే స్వయంగా ప్రచురణ సంస్థను కూడా ప్రారంభించారు. ఇంగ్లీషు భాషకు సంబంధించి భారతదేశంలో పేపర్‌బ్యాక్ పుస్తకాలను ప్రచురించిన తొలి సంస్థ 'జై-కో'.

స్వంతంగా పుస్తకాలు ప్రచురించడం, పంపిణీ చేయడంతోపాటు 'జై-కో' అంతర్జాతీయంగా పేరుపొందిన మెక్‌గ్రోహిల్, పెర్సన్, థామ్సన్, ఎల్సివర్ సైన్స్ వంటి సంస్థల ప్రచురణలను దేశంలో పంపిణీ చేస్తుంది. ముంబైలో ప్రధాన కార్యలయం ఉండగా, ఢిల్లీ, కోల్‌కత్తా, బెంగుళూరు, చెన్నై, హైదరాబాద్, అహ్మదాబాద్, భోపాల్ వంటి ప్రాంతాలలో బ్రాంచిలు ఉన్నాయి. సంస్థ అమ్మకాల విభాగంలోని 40కిపైగా ఎగ్జిక్యూటివ్‌లు, డైరెక్ట్ మెయిల్ డివిజన్, వెబ్‌సైట్ మూలంగా దేశంలోని పట్టణం, గ్రామీణ ప్రాంతాలలో సైతం జై-కో పుస్తకాలు అందుబాటులో ఉండేలా చర్యలు తీసుకుంటున్నారు.



SINCE 1946

# ప్రపంచాన్ని మార్చి వేసిన
# గొప్ప దార్శనికులు

**TOP VISIONARIES**
WHO CHANGED THE WORLD

NOW IN TELUGU



ఎలాన్ మస్క్ బిల్ గేట్స్ స్టీవ్ జాబ్స్
మార్క్ జుకర్‌బర్గ్ జాక్ మా

జార్జ్ ఇలియాస్



"ఆర్థిక విషయాలను గురించి హౌసెల్ వ్రాసినంత చక్కగా వ్రాయగలిగినవారు చాలా తక్కువ."

**— డానియల్ హెచ్ పింక్**

న్యూయార్క్ టైమ్స్ అత్యుత్తమ అమ్మకాల గల 'టు సెల్ ఈజ్ హ్యూమన్ అండ్ డ్రైవ్' రచయిత.

"హౌసెల్ వీక్షణానికి రెండువైపులా పదునే. అవి అంతకు మునుపెప్పుడూ చెప్పని విషయాలు చెప్తాయి. చెప్పినవాటికి ప్రయోజనం ఉంటుంది."

**— హోవార్డు మార్క్స్**

'ఓక్ ట్రీ క్యాపిటల్ మేనేజ్‌మెంట్' సహవ్యవస్థాపకులు, కో ఛైర్మన్

"దురూహ్యమైన భావాలను సులభంగా అర్థమై ఆకట్టుకునే కథనంగా మలచగల అసాధారణ రచయిత."

**— ఆనీ డ్యూక్**

'థింకింగ్ ఇన్ బెట్స్' రచయిత్రి

**డబ్బుతో సవ్యంగా వ్యవహరించటమంటే, మీకు తెలిసింది మాత్రమే కాదు. అది మీ ప్రవర్తనను చెబుతుంది. నిజంగా తెలివైన వారికి కూడా ప్రవర్తన నేర్పటం కష్టమైన పని.**

డబ్బు నిర్వాహణ, పెట్టుబడి, వాణిజ్య నిర్ణయాలు అన్నీ లెక్కలతో కూడిన వ్యవహారమని భావన. అక్కడ మన చేత ఉన్న సమాచారం, సూత్రాలు ఏమి చెయ్యాలో చెబుతాయని ఆలోచన. కానీ వాస్తవ ప్రపంచంలో జనం నిర్ణయాలు కాగితాల మీద చెయ్యరు. ఆ నిర్ణయాలు డైనింగ్ టేబుల్ దగ్గర లేదా సమావేశ మందిరంలో జరుగుతాయి. అక్కడ వ్యక్తిగత చరిత్ర, ఈ ప్రపంచాన్ని గురించిన మీ దృక్పథం, అహంభావం, అతిశయం, మార్కెటింగ్, ప్రతిఫలాలు అన్నీ జమకూడుతాయి.

డబ్బు-మనస్తత్వంలో రచయిత 19 పొట్టికథలతో డబ్బు విషయంలో మనుషుల విచిత్రమైన ఆలోచనలను తడుముతారు. జీవితంలో అతి ముఖ్యమైన మూలకంతో ఎలా వ్యవహరించాలో చెబుతారు.

మోర్గాన్ హౌసెల్ 'ది కొలాబరేటివ్ ఫండ్' భాగస్వామి. 'ద మోట్లీ ఫూల్', 'ద వాల్ స్ట్రీట్ జర్నల్' లో ఒకనాడు వ్యాసరచయిత. 'సొసైటీ ఆఫ్ అమెరికన్ బిజినెస్ ఎడిటర్స్ అండ్ రైటర్స్ వారి 'బెస్ట్ ఇన్ బిజినెస్' పురస్కారం రెండు సార్లు అందుకున్నారు. న్యూయార్క్ టైమ్స్ 'సిడ్నీ అవార్డు' గెలుచుకున్నారు. వాణిజ్యం, ఆర్థికరంగంలో ప్రతిభావంతమైన వ్యాసంగానికి గెరాల్డ్ లోబ్ పురస్కారానికి రెండుసార్లు ఫైనల్స్ చేరుకున్నారు.

JAICO BOOKS
www.jaicobooks.com
Business / Finance

ISBN 978-93-91019-02-0
₹ 250



9 789391 019020
J-3006T